# జీవిత చక్రం

(నవలల సంకలనం)



- రాధిక

పబ్లిషర్స్

'రాకశ్రీశ'

గెద్దాడ బ్రహ్మయ్య మెమోరియల్ ట్రస్ట్, సాహితీ విభాగం,

కాకినాడ.

# జీవిత చక్రం

(నవలల సంకలనం)

---



వెల రు. **120 $10**

ప్రచురణ : 02-12-2001

పబ్లిషర్స్
**'రాకశ్రీశ'**
**గెద్దాడ బ్రహ్మయ్య మెమోరియల్ ట్రస్ట్ సాహితీ విభాగం,**
**బ్రహ్మకృప, 70-3-33, వైద్య నగర్ - 1, రమణయ్యపేట,**
**కాకినాడ - 530 005. ఫోన్ : 350320.**

సోల్ డిస్ట్రిబ్యూటర్లు
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
**విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,**
**హైదరాబాద్-500 001.**
**ఫోన్ : 040-4744580**

ముద్రణ
**రాంషా-శిరీషా పబ్లికేషన్స్,**
**40, ఇండస్ట్రియల్ ఎస్టేట్,**
**సామర్లకోట-533 440.**
**ఫోన్ : 327454.**

# అంకితం



భర్త అంటే ఇలా ఉండాలి అని అనిపించే

శ్రీవారికి అర్పితం

# రాధికా సాంత్వనం

ఉన్నట్టుండి 220 పేజీల పుస్తకం కొరియర్‌లో వచ్చింది. అది అందిన పావుగంటలో "నేను రాధిక నండీ; 1989లో మీరు పెట్టిన ఒక కథల పోటీలో ప్రైయిజ్ తీసుకున్నానండీ. 'ముందు మాట' రాయడం కోసం మీకు కొరియర్ ద్వారా వచ్చిన పుస్తకం నేను రాసిందేనండీ" - అని ఒక ఫోన్ కాల్ వచ్చేసింది.

నా జ్ఞాపక శక్తి ఎంతో పదునైనదని నాకు గర్వం. అయినా సరే, ఈ రాధికగారు పేర్కొన్న 1989 కథల పోటీ ఏమిటో, అసలు ఈ రాధికగారు ఎవరో - గుర్తు రాలేదు. కాని, అలా ఒప్పేసుకోడానికి అభిజాత్యపడి "ఓహో, అలాగా" అనేసి ఊరుకున్నాను.

రాధికగారు గ్రహించేసినట్టున్నారు. ఫోన్ సంభాషణ కొనసాగిస్తూ, ఆ పోటీ "విశాఖ సాహితి" వనభోజన కార్యక్రమంలో పెట్టినదనీ, పోటీలో తనకి గాను నిర్ణయమైన బహుమతిని రావిశాస్త్రిగారి చేతుల మీదుగా అందుకున్నారనీ చెప్పిన తరవాత మొత్తం అంతా జ్ఞాపకం వచ్చింది. కానిఏం చేస్తాను! 1989 నవంబరుకీ 2002 జనవరికీ మధ్య Much Water has flown under the bridge అని సరిపెట్టుకోక over the bridge అని కూడా చెప్పుకోతగినన్ని సంగతులూ సంఘటనలూ - ఉన్నాయి, పోయేయి కూడాను.

ఈ రాధిక గారి అసలు పేరు అది కాదుట. 'రా' అంటే "ఆయన" (రాజేంద్రప్రసాద్!), 'క' అంటే తానే (కస్తూరి!) - అని ఆమె వివరించారు. ('ధి': అంటే ధిషణ అని మనం గ్రహించాలి...) తూర్పుగోదావరి సీమలో పుట్టిన ఈమె పడమటి గ్రేట్ బ్రిటన్ అని చెప్పదగిన ఐర్లాండ్‌లో కొంత కాలం ఉండి ఇటీవలే కాకినాడ వచ్చి స్థిరపడ్డారుట. "ఆయన" గారు నూరోసర్జన్ (మనుష్యులకి!) ఈవిడ బహుశా మనుష్యుల మనస్తత్వాలకి నూట ఒకటో సర్జన్.

పాయింటుకి వస్తే: "జీవిత చక్రం" అని పేరు పెట్టిన ఈ పుస్తకంలో చక్రంతో బాటు మరో ఆరు ఆకులు ఉన్నాయి. వీటిలో ఐర్లాండ్ విశేషాలు, లండన్ మహా నగరం పరిచయాలు, బ్రెయిన్ స్కానింగ్ వివరాలు - పోగా మిగిలిన నాలుగూ పెద్ద పెద్ద కథలకు. ఈ నాలుగు కథలూ రాధికగారు మానవ మనస్తత్వాల నాలుగు చెరుగలనే కాక ప్రాక్పశ్చిమాలకు ఒకనాటి చిహ్నాలైన నేల నాలుగు చెరగుల్నీ స్పృశించి, పరవశించి, రచించినవి.

నాలుగు కథలూ పెద్దపెద్దవి. సాంకేతికంగా చెప్పవలసి వస్తే ఈ నాలుగు కథలూ కూడా "చిన్న నవలలు" అనిగాని, "పెద్ద కథలు" అనిగాని చెప్పుకోవలసి ఉంటుంది. రాధికగారు ఖ్యాతి తెచ్చుకొన్నదీ, బహుమతులు గెలుచుకున్నదీ కథానికల ద్వారానే గాని ఇలాంటి పెద్ద కథల ద్వారా కాదు. అయితే, ఆవిడ ప్రపంచానుభవం లాగానే మానవ ప్రవృత్తుల పరిశీలనా పరిధి కూడా విస్తృత వైశాల్యానికి అనుగుణమైనవి. ఓ బుర్ర కథలో "మేధావి" అనుభవించిన వేదనలూ, సంఘర్షణలూ, అనారోగ్యం,

# రాధికా సాంత్వనం

ఉన్నట్టుండి 220 పేజీల పుస్తకం కొరియర్‌లో వచ్చింది. అది అందిన పావుగంటలో "నేను రాధిక నండీ; 1989లో మీరు పెట్టిన ఒక కథల పోటీలో ప్రైయిజ్ తీసుకున్నానండీ. 'ముందు మాట' రాయడం కోసం మీకు కొరియర్ ద్వారా వచ్చిన పుస్తకం నేను రాసిందేనండీ" - అని ఒక ఫోన్ కాల్ వచ్చేసింది.

నా జ్ఞాపక శక్తి ఎంతో పదునైనదని నాకు గర్వం. అయినా సరే, ఈ రాధికగారు పేర్కొన్న 1989 కథల పోటీ ఏమిటో, అసలు ఈ రాధికగారు ఎవరో - గుర్తు రాలేదు. కాని, అలా ఒప్పేసుకోడానికి అభిజాత్యపడి "ఓహో, అలాగా" అనేసి ఊరుకున్నాను.

రాధికగారు గ్రహించేసినట్టున్నారు. ఫోన్ సంభాషణ కొనసాగిస్తూ, ఆ పోటీ "విశాఖ సాహితి" వనభోజన కార్యక్రమంలో పెట్టినదనీ, పోటీలో తనకి గాను నిర్ణయమైన బహుమతిని రావిశాస్త్రిగారి చేతుల మీదుగా అందుకున్నారనీ చెప్పిన తరవాత మొత్తం అంతా జ్ఞాపకం వచ్చింది. కానిఏం చేస్తాను! 1989 నవంబరుకీ 2002 జనవరికీ మధ్య Much Water has flown under the bridge అని సరిపెట్టుకోక over the bridge అని కూడా చెప్పుకోతగినన్ని సంగతులూ సంఘటనలూ - ఉన్నాయి, పోయేయి కూడాను.

ఈ రాధిక గారి అసలు పేరు అది కాదుట. 'రా' అంటే "ఆయన" (రాజేంద్రప్రసాద్!), 'క' అంటే తానే (కస్తూరి!) - అని ఆమె వివరించారు. ('ధి': అంటే ధిషణ అని మనం గ్రహించాలి...) తూర్పుగోదావరి సీమలో పుట్టిన ఈమె పడమటి గ్రేట్ బ్రిటన్ అని చెప్పదగిన ఐర్లాండ్‌లో కొంత కాలం ఉండి ఇటీవలే కాకినాడ వచ్చి స్థిరపడ్డారుట. "ఆయన" గారు నూరోసర్జన్ (మనుష్యులకి!) ఈవిడ బహుశా మనుష్యుల మనస్తత్వాలకి నూట ఒకటో సర్జన్.

పాయింటుకి వస్తే: "జీవిత చక్రం" అని పేరు పెట్టిన ఈ పుస్తకంలో చక్రంతో బాటు మరో ఆరు ఆకులు ఉన్నాయి. వీటిలో ఐర్లాండ్ విశేషాలు, లండన్ మహా నగరం పరిచయాలు, బ్రెయిన్ స్కానింగ్ వివరాలు - పోగా మిగిలిన నాలుగూ పెద్ద పెద్ద కథలకు. ఈ నాలుగు కథలూ రాధికగారు మానవ మనస్తత్వాల నాలుగు చెరుగులనే కాక ప్రాక్పశ్చిమాలకు ఒకనాటి చిహ్నాలైన నేల నాలుగు చెరగుల్నీ స్పృశించి, పరవశించి, రచించినవి.

నాలుగు కథలూ పెద్దపెద్దవి. సాంకేతికంగా చెప్పవలసి వస్తే ఈ నాలుగు కథలూ కూడా "చిన్న నవలలు" అనిగాని, "పెద్ద కథలు" అనిగాని చెప్పుకోవలసి ఉంటుంది. రాధికగారు ఖ్యాతి తెచ్చుకొన్నదీ, బహుమతులు గెలుచుకున్నదీ కథానికల ద్వారానే గాని ఇలాంటి పెద్ద కథల ద్వారా కాదు. అయితే, ఆవిడ ప్రపంచానుభవం లాగానే మానవ ప్రవృత్తుల పరిశీలనా పరిధి కూడా విస్తృత వైశాల్యానికి అనుగుణమైనవి. ఓ బుర్ర కథలో "మేధావి" అనుభవించిన వేదనలూ, సంఘర్షణలూ, అనారోగ్యం,

స్వజనంతో అతని బంధగాఢతలూ వేటికవి విడదీసి చూస్తే ఒక్కొక్క అవస్థా కనీసం ఐదారు చిన్న కథలకి ఆధారాలు కాగలిగినవి. అన్నీ కలిపి మరికొంచెం వివరంగా చర్చించిరాసుకుంటే ఒక సుదీర్ఘమైన నవలకు ప్రాణం కాగలిగినవి. కథలో కొసమెరుపు ఉంటే బాగుంటుందని కూడా రచయిత్రి భావించుకున్నారు.

"పెళ్ళి మీద పెళ్ళి" అనే కథకు, "జీవితమే నాటకరంగం" అనే కథకు కూడా ఈ లక్షణ విశ్లేషణ వర్తిస్తుంది. (ఆ మాట కొస్తే "జీవిత చక్రం"కి కూడా.) వీటిలో "ఓ బుర్ర కథ", "పెళ్ళి మీద పెళ్ళి" - భారతదేశం కథాస్థానం గానూ మిగిలిన రెండూ ఐర్లాండు కథాస్థానంగానూ చెప్పినవి. రాధికగారి భారతీయ పాత్రలు ఐర్లాండులో కూడా భారత తత్త్వాన్ని వదులుకోలేదు. పైగా, ఈ భారతీయ పాత్రలకు ఆ ఐర్లాండులో తటస్థపడి బంధాలు ఏర్పరచుకున్న ఐరిష్ పాత్రలు భారతీయ తత్త్వాన్ని కొంతకాకపోతే కొంతయినా పుణికి పుచ్చుకొని తమ ప్రవర్తనలకు ప్రాగ్జ్యోతిని చూపించుకోవడం విశేషం. భారతీయులలో మేధావులు జీవికకు ఆర్థిక ఔన్నత్యానికి - పాశ్చాత్య దేశాలవైపు మనోకాయాలను మళ్లించుకుంటున్నట్లే, పాశ్చాత్య దేశాల బుద్ధిమతులు సత్ప్రవర్తన కోసం, సత్ప్రవృత్తికోసం భారతీయ సంస్కృతి పై అభిరుచిని పెంచుకుంటున్నారు - అని చెప్పడం రచయిత్రి ఒక ఉద్యమంలా చేపట్టకపోయినా ఒకానొక అంతఃస్రవంతిగా ప్రవహింపజేయాలని ఉద్దేశించినట్లు ఈ పెద్ద కథలు చెపుతాయి.

ఈ కథలలో రాధికగారు వ్యక్తపరచిన లోక పరిశీలనా సామర్థ్యం కూడా విలక్షణ మైనదే. ఈ సంఘటనలనీ, ఈ పాత్రలనీ, ఈ ప్రదేశాలనీ నేను ఎంత నిశితంగా పరిశీలించానో చూడండహో - అని చుటుకున్నట్లు కాక, ఆ వివరాలన్నీ ఒకానొక నిరపేక్షాకర స్నేహభిలాషి అయిన చెలిమికత్తెలాగా చెప్పినవి ఈ కథలు. ఈ శైలిలో రచయిత్రికి తన పాత్రల పట్ల అనని వార్యమైన సానుభూతి వ్యక్తమైంది. ఐతే, ఆ సానుభూతి నిషేధానికి అతీతమైనదిగా రచయిత్రి తన పాఠకులకు నివేదించగలిగారు. అది ఒక అపురూపధోరణి. రాధికగారు ఈ పుస్తకంలో "ఐర్లాండు విశేషాలు", "బ్రెయిన్ శ్కానింగ్", "లండన్ మహానగరం" - అనే సమాచార దర్శినీ స్థాయి రచనలు మూడింటిని చేర్చుకున్నారు. ఈ మూడు వ్యాసాలలోని పదార్థం ఈ పుస్తకంలో ఉన్న నాలుగు కథలలో అక్కడో అక్కడో సూత్రప్రాయంగా చెప్పినదే అయినా, వ్యాసాల ప్రతేకత వ్యాసాలదే. ఇదంతా Transfer of Knowledge అనే ఉత్తమ సంప్రదాయం పట్ల రచయిత్రికి కలిగిన ప్రలోభం. ఎంత తెలిసిన వారికి అంత చెప్పాలనుంటుంది కదా.

పరిణతితో గమనించిన విషయాలను నిజాయితీతో గ్రంథస్థం చేసిన రాధికగారిని ఆదరించవలసి ఉంది.

భరాగో

1. అర్జున్ ఎపార్ట్‌మెంట్స్
విశాఖపట్నం - 530022

# స్వగతం



1977లో "రాధిక" కలం పేరుతో ఐర్లాండు నుండి రాసి పంపిన 'అమ్మాయిలూ జాగ్రత్త' కథను అచ్చువేసి ఆంధ్రప్రభ నన్ను రచయిత్రిని చేసింది. మొదటి బహుమతీ ఆంధ్రప్రభే యిచ్చింది.

నేను మహా రచయిత్రినని నాసాటివారు ఎవరూ లేరని నా అభిప్రాయం. అది నా ఒక్కదాని అభిప్రాయమే కాదు. ఆంధ్రప్రదేశ్ మొత్తంలో. మా అమ్మది కూడ.

నా రచనలు, కథలు, మినీ కథలు, వ్యాసాలు, పిల్లల కథలు, కవితలు, మినీ నవలలు - ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, పత్రిక, ఆంధ్రజ్యోతి, వనితాజ్యోతి, అమృత్ కిరణ్, జయశ్రీ, కావ్యజ్యోతి, మయూరి, పల్లకి, తరంగిణి, జాగృతి మొదలగు వాటిలో వచ్చాయి. కాకినాడ లోకల్ పేపర్ సర్కార్ ఎక్స్‌ప్రెస్, శ్రీకాకుళం మహోదయలోనూ వచ్చాయి. రేడియోలో దాదాపు 15 కథల వరకూ ప్రసారమయినా నాకు ఒకేసారి ఫెయిర్ తప్పించి, రఫ్ వ్రాయడం అలవాటు లేని చెడ్డగుణం ఉండడం వలన వాటి కాపీలు నా దగ్గర లేవు. (రికార్డు చేసికున్నాను). అప్పట్లో జిరాక్సులు అంతగా లేవు. పైగా నాకు ఆ ఆలోచన రాలేదు కూడ. టి.వి.లో శలవు దొరికింది - 1987లో పెద్ద నాటిక ప్రసారమయింది.

ఇటీవల కాలంలో కథలు వ్రాయడం మానేశాను గాని, తలకు నూనె, మొహానికి పౌడరు వ్రాయడం మానలేదు. (చిన్నప్పుడు డ్రాయింగులోను, ఆటల్లోనూ, బహుమతులు వచ్చాయి).

☆☆☆

# బహుమతులు

**ఆంధ్రప్రభ** : "నలుగురు కలిసి నవ్వే వేళ", 'దీపావళి కథల పోటీలో రెండవ బహుమతి (12-01-1986).

**ఆంధ్రభూమి** : "నవయుగ కుంతి", పేజీ కథల పోటీలో మొదటి బహుమతి (16-02-1989).
"గోల్డ్‌మైన్" సెంటర్ సెన్సేషన్ కథల పోటీలో నాలుగవ బహుమతి (20-10-1988).
"చ్చిపిథక", పిచ్చి కథల పోటీలో 2000 పైసలు బహుమతి పొందిన సెమిపిచ్చి కథ (16-02-1989).

**ఆంధ్రభూమి** (పేపర్) : "యోగ్యత", చిన్న కథల పోటీలో కన్సొలేషన్.

**ఆంధ్రభూమి** (మంత్లీ) : "పెళ్ళి మీద పెళ్ళి", పొట్టి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి (మే 1995)

**వనితా జ్యోతి** : "ఇది మరోరకం శిక్ష", మూడవ బహుమతి (అక్టోబరు 1987).

**అమృత్ కిరణ్** : "ఇన్‌స్టాల్‌మెంట్ డెత్", తృతీయ బహుమతి (10-02-1989).

బెల్లంపల్లి నాగార్జున కల్చరల్ అసోషియేషన్‌వారు నిర్వహించిన కవితల పోటీలో '**రాజకీయ నాయకులు**' కవిత, వ్యాసాల పోటీలో '**మన దేశ సమగ్రత-మనకర్తవ్యం**' అన్నదానికి, విజయవాడ విశ్వహిందూ కళాపరిషత్‌వారు నిర్వహించిన కవితల పోటీలో ప్రథమ బహుమతి.

'షిరసం' విశాఖపట్నం పోర్టుట్రస్టువారు నిర్వహించిన హాస్య కథల పోటీలో 4-10-1993న "**బదిలీ**" కథకు బహుమతి శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావుగారి చేతుల మీదుగా అందుకోవడం, 27-11-1989లో విశాఖ సాహితీ వనభోజనాల్లో నిర్వహించిన తక్షణ కథల (ఇన్‌స్టెంట్) పోటీలో "**సంగీతం**" కథకు మూడవ బహుమతి శ్రీ రావిశాస్త్రిగారి చేతుల మీదుగా అందుకోవడం.

విజయనగరం విజయభావన ప్రతి సంవత్సరం నిర్వహించే ఉగాది కవితలు - ఒకసారి శ్రీమతి మాలతీ చందూర్‌గారి సమక్షంలో, మరో తూరి కరుణశ్రీగారి సమక్షంలో చదవడం అదృష్టంగా భావిస్తున్నాను.

# అవార్డులు

మనోరంజనివారి **కల్యాణి సాహితీ అవార్డు - కథకు**

**మాదిరెడ్డి సులోచన అవార్డు** (సిని హీరో కృష్ణ విజయనిర్మలగార్ల చేతులమీదుగా) - నవలకు

రేపల్లె యునెస్కోవారు (బట్టు హరిబాబు) "**యునెస్కో సాహిత్య శిరోమణి అవార్డు**" ఇచ్చారు.

# కృతజ్ఞతలు

మనవాళ్ళు అంతగా విదేశాలకు వెళ్ళని రోజుల్లోనే నన్ను విదేశాలకు తీసికెళ్ళిన శ్రీవారు డా॥ రాజేంద్రప్రసాద్‌గారికి.

నాలుగు పొట్టి నవలలను వివిధ దశలుగా ప్రచురించి "పెళ్ళి మీద పెళ్ళి" నవలకు బహుమతి ఇచ్చిన అప్పటి ఆంధ్రభూమి ఎడిటర్ శ్రీ కనకాంబరరాజుగారికి.

నేను రాసింది చాల ఓపిగ్గా చదివి దీని గురించి చక్కగా విశదీకరించిన శ్రీ భమిడిపాటి రామగోపాలం గారికి.

పొట్టి నవలలకు అందంగా బొమ్మలు వేసిన ఆర్టిస్టులకు, పుస్తకాన్ని పొందికగా తయారు చేసిన పూషాగారికి.

# ఇందులో...



# జీవిత చక్రం

స్వదేశానికి, జనానికి ఎంతదూరంగా వెళుతుంటే, అంత భద్రత తక్కువ అవుతుందని ఎక్కడో చదివింది శృతి. విమానంలో కూర్చున్నదన్న మాటేగాని ఆ పదాలు శృతి చెవుల్లో పదే పదే మారుమ్రోగుతున్నాయి. ఆ మాటను ఎంత మరచిపోవాలని ప్రయత్నించినా మనసు ఎదురు తిరుగుతుంది. విదేశాలకు వెళుతుంది శృతి తన భర్తతోను, కూతురు శిల్పతోను. అక్కడ తనకి ఉపకారమే జరుగుతుందో అపకారమే జరుగుతుందో తనకే తెలియదు. ఉపకారము జరగకపోయినా అపకారం జరగకుంటే చాలు అనుకొంది.

అనుకోకుండా శృతికి కిటికీ దగ్గర సీటు దొరికింది. మనసుని మరో వైపుకి మరల్చాలన్న ధ్యాసతో తన దృష్టిని కిటికీలో నుండి బయటకు సారించింది. అంతే ఆమె హృదయం ఒక్కసారిగా ఉప్పొంగింది. మనసు ఆమెకు తెలియకుండానే పురివిప్పిన నెమలిలా గంతులు వేయసాగింది. మబ్బులపై నుండి ఎయిరిండియా పయనిస్తుంది. ఆకాశంలో పయనించి, విమానంలో శయనించి అన్నట్లు రిలాక్సింగ్‌గా కుర్చీలో కూర్చుంది.

ఆకాశం అందమైన మబ్బులతో మనోహరంగా ఉంది. చూడడానికి రెండు కళ్ళు చాలవన్నట్లు ఒళ్ళంతా కళ్ళుచేసికొని ఆకాశమంత ఆనందం హృదయంలో నుండి పొంగిరాగా సంబరంగా అంబరం వంక చూసింది శృతి. రంగు రంగుల మబ్బులు చూసి పరవశించిపోయింది. హిమాలయాలు భారతదేశానికి తలమానికమైతే ఆకాశం మొత్తం లోకానికే తలమానికం అనుకొంది. దేవుడు అజ్ఞాతంగా భూదేవి

రక్షణకై కాపలా పెట్టిన అందమైన భటుల్లా ఆ మబ్బులన్నీ నిశ్చలంగా నిలబడి వున్నాయి. వెండి కొండను మరపిస్తూ కొన్ని మబ్బులు మనోహరంగా కనిపిస్తున్నాయి. ఏ ఆధారములేక అలా గాలిలో అందంగా సుందరంగా నిలకడగా ఉన్న ఆ మబ్బులను పోల్చడానికి ఏ ఉపమానాలూ సరిరావు అనిపించింది శృతికి.

ఎయిర్ హోస్టెస్ కాఫీ తీసికొని వస్తేగాని ఈ లోకంలోకి రాలేదు శృతి. ఒడిలోని శిల్ప నిద్రలోనుండి మెల్లగా కదిలింది. ఆమెను మెల్లగా జోకొట్టి మరలా నిద్రపెట్టి ఆ మబ్బులను భర్తకు కూడ చూపించింది నా ఆనందంలో నీవు పాలుపంచుకో అన్నట్లు. శృతి మొహం కిటికీకి అడ్డుగా ఉంది. శృతి మొహం మీదుగా మబ్బుల అందాన్ని చూసాడు డాక్టర్ హరి. ఆ ప్రాణంలేని మబ్బులకంటే ప్రాణమున్న శృతి మొహమే ఎంతో మనోహరంగా కనిపించింది హరికి. శృతి చిరునవ్వుల మేళవింపులోనున్న అందాలు ఆ మేఘాలకెక్కడిది అనుకున్నాడు. అయినప్పటికీ నీ ఆనందమే నా ఆనందము అన్నట్లుగా ఆమెతో పాటుగా బయటికి చూస్తూ పరవశం చెందాడు. ఆకాశాన్ని చూసికాదు ఆకాశమంతటి అందమైన శృతి మనసు తలచుకొని. ఎయిర్ హోస్టెస్ ఎవరికి ఏమికావాలో సర్వ్ చేస్తుంది. ఆరాత్రి డిన్నర్‌లో పెట్టిన కుక్డ్ వెజిటబుల్స్, మష్‌రూమ్ ఆమ్లెట్ అసలు సహించలేదు శృతికి. ఇప్పటినుండి అన్నీ అలవాటు పడాలి సుమా అన్న ధోరణిలో బలవంతంగా తింటున్నాడు హరి. శృతి ఏమీ తినడంలేదని గ్రహించిన ఎయిర్ హోస్టెస్ కొద్దిగా అన్నం కాఫీ కప్పంత ఉంది. తెచ్చి యిచ్చింది. అన్నమైతే యిచ్చిందిగాని అందులోకి కూరలేక అదీ తినబుద్ధికాలేదు శృతికి. ఇంతలో శిల్పలేవటంతో తన ఆకలి సంగతిమరచి పాపకు ఆకలేస్తుందని హేండ్ బేగ్‌లోనున్న సీసాలోని పాలు తీసింది పట్టడానికి. కాని అవి అప్పటికే విరిగిపోయి ఉన్నాయి వారి జీవితం లాగే. ఎయిర్ హోస్టెస్‌ని అడిగి సీసా కడిగి వేరే పాలు పోసి పట్టించింది. కడుపునిండిన శిల్ప కేరింతలు మొదలు పెట్టింది. తాను ఎక్కడనున్నది, ఎక్కడకు వెళుతున్నది ఎందుకు వెళుతున్నది ఆ పసిదానికి తెలియదు. ఆఖరిగా తానుగాలిలోనున్నట్లు కూడ తెలియదు. ఆ పాపకు తెలిసింది పువ్వులాంటి అమ్మ ఒడి మాత్రమే. ఆ ఒడిలోనున్నంతకాలం తాను భద్రమే అనుకుంటుంది. అది నిజమే కూడ, కాని లోకమంతా అమ్మఒడిలాంటిది కాదు అని వయసు పెరిగే కొద్దీ ఎవరికైనా అనుభవం అవుతుంది.

విమానం తనదారి తాను వెతుక్కుంటూ ముందుకి పెద్ద సైజు పక్షిలా సాగిపోతోంది. శృతికి హైజాకింగ్ గుర్తుకి వచ్చి ఒక్కసారి ఒళ్ళుగగుర్పొడిచింది. హైజాకర్సు యిందులో లేరుకదా అని అనుమానం వచ్చి, తన భయానికి తనే నవ్వుకొంది చిన్నగా. ఎవరి ఊహలతోను, ఎవరి జీవితాలతోనూ సంబంధం లేకుండా ఏరోప్లెయిన్ తన గమ్యస్థానాన్ని చేరుకొంది. ప్రయాణంలో పాప ఏమీ విసిగించనందుకు మాత్రం సంతోషించింది శృతి. హీత్రూ ఎయిర్‌పోర్ట్ చూడగానే ఎంత బావుందీ ఎయిర్‌పోర్ట్ అని

అనుకోకుండా ఉండలేకపోయింది. విమానం దిగేటప్పుడు గుమ్మం దగ్గర నిలబడి వీడ్కోలు వందనాలు చెప్పే ఎయిర్ హోస్టెస్ ఆ దంపతులకు ఎటువెళ్ళాలో అంతా గైడెన్స్ యిచ్చింది. లిప్‌స్టిక్ పెదవులు అలవాటు ప్రకారం, డ్యూటీ ప్రకారం శృతిని చూసి అస్తమానం నవ్వుతుంటే ఆ నవ్వు అసహజంగా అనిపించింది శృతికి. కాని ఆమె డ్యూటీ ప్రకారం నవ్వడంలేదని, తన అందాన్ని చూసిపరవశంగా, తనలాంటి అందగత్తె అనే భావంతో నవ్వుతుందని శృతికి తెలియదు.

అన్ని ఫార్మాలిటీస్ పూర్తిచేసికొని ఆ ఎయిర్‌పోర్ట్ నుండి మరొక ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళి అక్కడ మరొక విమానం ఎక్కారు శృతి, హరి, తమ చిన్నారి శిల్పతో. బాబ్డ్ హెయిర్, చిన్న ఫ్రాకులు, నీలికళ్ళతోనున్న శ్వేత జాతీయులను మొదటిసారి పరీక్షగా చూడసాగింది శృతి. ప్రపంచంలో ఎన్నిరకాల మనుషులు, ఎన్నిరకాల దుస్తులు, మరెన్నోరకాల ఆచారాలు, మనస్తత్వాలు కదా, అనుకొంది. కొందరు నీగ్రోలు పిచ్చికగూడు జుట్టుతో, తల్లికడుపునుండి కాక, గనులు తవ్వితే వచ్చిన బొగ్గుతో పాటు వారు పుట్టారేమోనన్నట్లు ఉన్నారు. వారి తెల్లని ఎత్తయినపళ్ళు వారి మొహాల్లో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి, ఎబ్బెట్టుగా అనిపిస్తున్నాయి. కాని వారూ మనుషులే, మనసున్న మనుషులే, ఎటొచ్చీ నల్లటివారు.

విమానం ఎయిర్‌పోర్ట్‌లో ఆగగానే వింత అనుభూతి కలిగింది శృతికి. ఇప్పటినుండి ఈ దేశం నివాసస్థలం కదా అనిపించింది. హరి మాత్రం మనసులో కదలాడే భావాలకు అతీతంగా, ఎవరో చేయిపట్టి నడిపిస్తున్న మరమనిషిలాగ ఎవరో కాదు విధి నడిపిస్తున్న వింత మనిషిలాగ ఎయిర్‌పోర్ట్‌లో అన్ని పనులూ చేస్తున్నాడు. కూలీలు లేని దేశంలో ట్రాలీలో సామానులు వేసికొని యిద్దరు బయటికి వచ్చారు. బయట డాక్టర్ వర్మను చూడగానే మనసులో అమ్మయ్య అనుకున్నారు. వర్మను చూడగానే మనసు సంతోషంలో ఉప్పొంగింది. ఆత్మీయత ఉట్టిపడింది. మనవాడు వచ్చాడు యింక మనకేమీ భయంలేదు అన్న భావం వారి మొహాల్లో తొంగిచూసింది. హలో అంటూ హరిచేతిని అందుకొని ఆప్యాయంగా నొక్కాడు వర్మ.

'ఏమ్మా ప్రయాణం, ఏ ట్రబులూ లేకుండా మంచిగా సాగిందా, ఇండియాలో అందరూ బావున్నారా' అని అడిగాడు.

'అందరూ బావున్నారు. ప్రయాణం కూడా ఏ కష్టము లేకుండా జరిగింది' అని చెప్పి, చుట్టూ ఉన్న పచ్చని, శుభ్రమైన, అందమైన పరిసరాల్ని గమనించసాగింది శృతి. మిత్రులిద్దరూ అప్పుడే కబుర్లలో పడ్డారు.

డబ్లిన్ ఐర్లాండు దేశానికి రాజధాని. ఐరిష్ ప్రజలు ఎంతో మంచివారు. డబ్లిన్‌లో ఎయిర్‌పోర్ట్‌నుండి బయటపడగానే హరి, శృతి, శిల్ప వర్మకారులో బయలుదేరారు. టొయోటో హుందాగా, అందంగా రోడ్డుమీద దూసుకుపోతోంది, ఈదేశం నాది అన్న



ధీమాతో. ఆకారులో కూర్చున్నవారు విదేశస్తులు అనిదానికి తెలియదు. అది తరతమభేదాలు తెలియని ప్రాణంలేని వాహనం కదా! అది అందరినీ ఒకే దృష్టిలో చూస్తుంది. ఎన్నికబుర్లుచెప్పుకున్నా తరగడంలేదు వారికి. కారు వెనుకసీట్లో కూర్చున్న శిల్ప, శృతి చల్లని గాలికి మెల్లగా నిద్రలోకి జారుకున్నారు. అది ఆగస్టునెల. అందుకే అంతచలిలేదు. మనదేశంలో విపరీతమైన చలిఉండే డిశంబరు నెలలా ఉంది అక్కడ. అది వారికి మండువేసవి. ఆ వేడికి తట్టుకోవడమే వాళ్ళకు కష్టం. డాక్టర్ వర్మ వెనక్కి తిరిగి 'చలిగా ఉంటే చెప్పమ్మా! ఓవరుకోటు యిస్తాను' అనగానే నిద్రలోనుండి మెల్లగా

లేచి చలిగా అనిపిస్తే ఆ కోటు వేసుకొంది. శిల్పకు చిన్న బ్లాంకెట్ కప్పింది. హరికి కోటు ఉండబట్టి అంతచలి అనిపించలేదు. స్నేహితునిచూసిన సంతోషంలో అతనికి చలి ఉన్నా తెలియనట్లే ఉంది.

మరికొన్ని గంటల్లో గాల్వే (GALWAY) కి చేరుకున్నారువారు. వర్మభార్య వినోదిని వారి రాకకోసం ఎదురుచూస్తుంది. వారు రాగానే ముందుగా కాఫీ కలిపియిచ్చి, కుశల ప్రశ్నల అనంతరం వంటమొదలు పెట్టింది. శృతి, వినోదిని మాటలు చెప్పుకుంటూనే అరగంటలో వంటముగించారు. అన్ని వస్తువులు మనకు దొరికేవి ఉన్నాయి వారింట్లో. కొత్తిమీర దగ్గర నుండి, కొబ్బరికోరు వరకు ఉన్న ఆ వంటగదిని చూసి ఆశ్చర్యపోయింది శృతి. అన్ని రకాలయిన ఆధునిక పరికరాలతో అధునాతనంగా నున్న ఆవంట యిల్లు వదలి రాబుద్ధికాలేదు శృతికి. కాల్‌గాస్‌తో వంట, మీ శ్రీమతి కనులపంట అనేవారు కాలేజీలో కుర్రవాళ్ళు సరదాగా ప్రొఫెసర్లని. గేస్ స్టౌ ఉంటేనే ఎంతో గొప్ప అనుకునే మన దేశం మరికొంచం ముందుకుకి వెళితే ఆడదానికి ఎంత సౌఖ్యం.

ఆరోజుకి గాల్వేలోనే ఉండి ఆ మర్నాడు అందరూ కలసి హరికి, శృతికి ఉద్యోగం దొరికిన ఊరు కార్క్‌కి వెళ్ళారు. అంతకు ముందే అతనికి తెలిసిన స్నేహితుని ద్వారా ఒక యిల్లు అద్దెకు తీసికొని సిద్ధంగా ఉంచాడు వర్మ. ఆయింట్లో మామూలుగా పాలు పొంగించేసి, బజారుకి వెళ్ళిసామానులన్నీ కొనుక్కొచ్చి, హరికి, శృతికి ఏమేమికావాలో అన్నీచూసి, ఆ మరురోజు హస్పిటల్‌కు తీసికొని వెళ్ళాడు వర్మ. హాస్పిటల్‌లో యిద్దరూ రిజిస్ట్రార్ (ఇక్కడ అసిస్టెంట్) పోస్టులలో జాయిన్ అయ్యారు. మనసులో భయం భయంగా ఉంది. అంతా కొత్త. వారి ఏక్సెంట్ అర్థంచేసికొనడానికి కష్టంగా ఉంది. ఐరిష్ వారికిభాష ఉన్నప్పటికి అందరూ ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటున్నారు. మనం హిందీ అప్పుడప్పుడు అవసరం కొద్దీమాట్లాడినట్లు వారు మాతృభాషను అలా మాట్లాడుకుంటారు.

ఆ ఊరిలో నున్న ఇండియన్స్ అందరి దగ్గరకు తీసికొని వెళ్ళి మూడవ రోజున వారికి ధైర్యం చెప్పి, వినోదిని, వర్మ గాల్వేకి తిరిగి బయలుదేరారు. వారు వెళ్ళిపోతుంటే అంతవరకూ ఏమీ తెలియలేదు. ఫర్నిష్‌డ్ హౌస్ అద్దెకిచ్చారు కాబట్టి సామాను గురించి ప్రాబ్లమ్‌లేదు. బ్లాంకెట్ల దగ్గరనుండి స్పూన్లవరకూ యింట్లో అన్నీ ఉన్నాయి. దుకాణాలు కూడా ఎక్కడ ఉన్నాయో తెలిసాయి.

ఇక ఎటొచ్చి రేపటినుండి ఎలాగ? అనివారి బాధ. శిల్పను చూడడానికి కూడా హౌస్‌కీపర్‌ని వారే చూసిపెట్టారు. వారు వెళ్ళిపోతుంటే అప్రయత్నంగా కన్నీరు తిరిగింది కంటిలో శృతికి. ఆమె బాధ గమనించిన వినోదిని 'మేము మాత్రం మొదట్లో మీలాగ ఈదేశానికి కొత్తవాళ్ళంకాదా! ఇప్పుడు చూడు అన్నీ తెలిసాయి. ఇంకామీకైతే అన్నింటికి

మేమున్నాం. అప్పట్లో మాకెవరూ చిన్న సహాయానికి కూడా లేరు తెలుసా' అని ఓదార్పుగా అనేసరికి, ఆమాటలకు ఎంతో ధైర్యం వచ్చింది శృతికి. చివరికి నవ్వుతూనే వీడ్కోలు చెప్పింది వారికి. ఐరిష్‌వారు చాలామంచివారని, భయపడవలసింది ఏమీలేదని, వారిదగ్గర ఎలా ప్రవర్తించాలో విపులంగా వినోదిని ముందు రోజే శృతికి బోధించింది. స్నేహమేరా జీవితం అన్నదానికి ప్రతిరూపాలు వినోదిని, వర్మ దంపతులు. వారు వెళుతూ వెళుతూ చేతి ఖర్చులికి ఆనెలకి సరిపడా పౌండ్సు యిచ్చివెళ్ళారు, జీతం వచ్చేవరకు వాడుకొమ్మని చెప్పి. స్నేహితులంటే మనకాలాన్ని హరించే దొంగలు. వారున్నంతసేపు కాలమే తెలియలేదు శృతికి. వారు వెళ్ళగానే ఒంటరిగా ఫీల్ అయింది.

దేశంకాని దేశంలో కొత్త మనుషులమధ్య. వారిని వింతగా చూసేవారితో వారి జీవితం ప్రారంభమైంది. ఒకనెల గడిచేసరికి అన్నిటికీ అలవాటుపడిపోయారు. అక్కడివారితో ఎలామెలగాలో అర్థం అయిపోయింది. చీరకట్టుకున్న వారిని వింతగాచూడడం, మనకు తెలిసినా తెలియకపోయినా ప్రతీవారు మనల్ని హలో అని ఆప్యాయంగా పలకరించడం వారికి అలవాటు. ఆ పలకరింపులకు, పరిసరాలకు యిప్పుడు ఆశ్చర్యపోవడం లేదు శృతి. ప్రకృతి మాత్రం ఎప్పుడూ పచ్చగా, నిండు గర్భిణిగా నిగనిగలాడుతూ, పండువెన్నెలలోని ఆహ్లాదాన్ని అందిస్తూ హృదయాలను పరవశింపచేస్తూ ఉంటుంది.

ఆరోజు హాస్పిటల్‌నుండి హరి వచ్చేసరికి చాలా ఆలస్యమైంది. ఆ వీకెండ్ అతని డ్యూటి, ఎక్కువగా కేసులు వచ్చేసరికి, అక్కడే చిక్కుపడిపోయాడు హరి. హరిరాగానే శృతివేడిగా ఓవెన్‌లో నుండి తీసి అన్నం వడ్డించింది. తాను పెట్టుకుంది. అన్నం ఎంతో రుచిగా అనిపించింది హరికి, ఆ చలిలో వేడివేడిగా తింటుంటే మరింత తినాలనిపించింది. రుచిగా వండడం, ఆప్యాయంగా వడ్డించడం శృతికి సొత్తు. కాని వారి జీవితమే చప్పగా తయారయింది. చెరకు తీసిన పిప్పిలా అనిపిస్తుంది. తలంచుకోగానే అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి హరికి. అవి శృతి కంటపడనీయకూడదన్నదే అతని ధ్యేయం. ఆ కంటనీరు చూస్తే శృతి ఎంత మాత్రమూ భరించలేదు. నీ ఆనందమే నా ఆనందం అన్నట్లుంటుంది ఆమె ప్రవర్తన.

భోంచేసి పక్కపాడివేసికొని, వెచ్చనిబ్లాంకెట్‌కింద పడుకున్నారు. ఇద్దరూ ఉన్నది పక్కపక్కనే అయినప్పటికి వారివారి ఆలోచనలు మాత్రం వేలవేల మైళ్ళ దూరంలోనున్నాయి. ఆలోచనలతో అలసి ఎవరికి ఎప్పుడు నిద్రవస్తే అప్పుడే నిద్రపోతారు. వారిద్దరిమధ్య వారధిలా మాత్రం శిల్పహాయిగా నిద్రపోతుంది. వారి బాధలతో సంబంధంలేకుండా.

మర్నాడు ప్రొద్దున్నే ఫోన్ మోగేసరికి హాస్పిటల్‌నుండేమో అనుకొంది శృతి.

తీరాచూస్తే వినోదిని. వినోదిని గొంతువినగానే ప్రాణంలేచి వచ్చింది శృతికి. అవతలనుండి వినోదిని. ఏంమాట్లాడుతుందో తెలియదు. శృతిఫోనులో పకపకా పసిపిల్లలా నవ్వుతుంది. ఆనవ్వులు వెన్నెల తరగలా ఆ గదంతా వ్యాపించి హరిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. శృతి అంతహాయిగా ఎలా నవ్వగలుగుతోంది. ఆమెకు జీవితంగురించి బాధా భయమూలేవా? లేక అన్నీ మరచి నటిస్తుందా? నో అలా నటించే మనస్తత్వం కాదామెది. స్వచ్ఛమైన మనసు. హరికి ఎంతో యిష్టమైన మనసు. అందుకే ఆమెను ఏరికోరి పెళ్ళి చేసుకున్నాడు. హరి ఆలోచనలు గతంలోకి పరుగెత్తసాగాయి అతని ప్రమేయం లేకుండానే. కాని వద్దు వద్దు ఆ ఆలోచనలు వద్దు అనుకుంటూనే మనసు ఆధీనం తప్పి చేతిలోనున్న శిల్పను గమ్మున జారవిడిచేసాడు. కెవ్వుమన్న కేకవిని ఫోన్ వదిలేసి పరుగున వచ్చి శిల్పను గుండెలకు హత్తుకుంది శృతి. ఎందుకు పడేసారు అని నిలదీసి అడగలేదు. ఎదుటివారిని నిందించకపోవడమే ఆమె గొప్పతనం. పైగా హరి మూడ్ మార్చాలని ప్రయత్నిస్తూ "వినోదిని ఏమన్నదో తెలుసా? శిల్ప ఇంగ్లీషులో ఏడుస్తుందా, తెలుగులో ఏడుస్తుందా" అని అడిగింది అని చెప్పి మరలా ఫక్కున నవ్వింది. ఆ నవ్వులో శృతి కలపక తప్పలేదు శృతి భర్త హరికి. నిజమే! మాట్లాడేవారికి భాషా బేధాలు, అన్నిటిలోనూ తారతమ్యాలుగాని భాషకు రంగు, రుచి, వాసనలేదు కదా! భాష ఏదయిన మనిషి భావం ఒకటే, రంగు ఏదైనా మనిషి మనుగడ యొక్క పరమార్థం ఒక్కటే మానవత్వంతో మసలడం. దేశం ఏదయినా ప్రపంచశాంతిని పరిరక్షించడమే ధ్యేయమైతే ప్రపంచంలో మారణహోమాలు ఉండవు.

ఆ వీకెండ్ ఇంట్లోనే ఉంది శృతి. అప్పుడే స్నానం చేసి దేవుడిని ధ్యానంచేసికోని టిఫిన్ తినబోతుండగా ఫోన్ మ్రోగింది. అప్పటికే ఎంతో ఆకలిగా ఉన్నదామెకు. ఆ ఆకలిని పక్కకు పెట్టి ఫోను అందుకుంది. హాస్పిటల్ స్విచ్‌బోర్డు (టెలిఫోన్ ఆపరేటరు) నుండి ఫోను వచ్చింది. 'హల్లో శృతి. హౌ ఆర్ యూ' అని అడిగింది. 'ఫైన్. థాంక్స్ ఏమైనాపని ఉందా, పనిలేక చేసిన ఫోనాయిది' అంది సరదాగా శృతి.

"ఇంట్లో నున్న నీకు పని ఉండదుగాని నాకు పని ఉండదా! నేనిప్పుడు డ్యూటీ నుండి ఫోన్ చేస్తున్నాను. నీకొక గుడ్‌న్యూస్" అంది.

"నాకా! గుడ్‌న్యూసా? ఏమిటో త్వరగా చెబుదూ ఆగలేను" అంది. మనసులో మాత్రం నా జీవితంలో గుడ్‌న్యూస్ అనే అదృష్టం ఉందా అనుకొంది.

"ఇండియా నుండి లెటరు వచ్చింది. అది నీకుగుడ్‌న్యూస్ కాదా! ఎక్కడినుండో చెప్పమంటావా" అని అంటూ "ఆ ప్రొనౌన్‌సియేషన్ పలకలేక వి.ఇ.ఇ.ఎన్.ఎ. (VEENA) ఫ్రం హెచ్.వై.డి.ఇ.ఆర్.ఎ.బి.ఎ.డి (HYDERABAD) అంటూ చివర బేడ్ కూడ ఉంది. కాని ఈ లెటర్ నీకు గుడ్‌న్యూసే సుమా. బేడ్‌న్యూస్ కాదు" అంది. ఆ మాటలు అలా చెప్పడం ఆమెకు సరదా.

వీణ దగ్గరనుండి ఉత్తరం అనేసరికి శృతి మనసుయింక ఆగలేదు. అప్పటివరకూ ఉన్న ఆకలి ఏమయిపోయిందో, వచ్చిన ఉత్తరమే ఆహారంగా ఆమె కడుపంతా నిండిపోయినట్లుంది. ఇండియా నుండి ఉత్తరం అనేసరికి గబగబా ఓవర్‌కోటువేసికొని శిల్పని ఎత్తుకొని హాస్పిటల్‌కు బయలుదేరింది. ఉత్తరం తెచ్చుకోవడానికి. హాస్పిటల్ యింటికి దగ్గరే. వారికి యింకా కారుకొనుక్కోవడానికి డబ్బు సరిపడలేదు. హరి ఆపరేషన్‌లో ఉన్నాడట. రావడానికి లేటవుతుందని తానే బయలుదేరింది. చంకలో నున్న శిల్పను ఎత్తుకొని చలిలో నడవడానికి చాలాకష్టంగా వుంది. తాను యింట్లోనే ఉందికదా అని హౌస్ కీపర్ ఎలిజాని ఇంటికి పంపించివేసింది. అందరూ తనని వింతగా చూస్తున్నారు. ఇండియన్ అనే ఉత్సుకతలో చూస్తున్నారు అనుకొందిగాని శిల్పతో తన తిప్పలుచూసి అని ఆమెకు తెలియలేదు. ఎవరూ పిల్లలని అలా చంకవేసుకొని బయటకు తీసికొని వెళ్ళరన్న సంగతి ఆమెకు తెలియలేదు. ఉత్తరం కోసం ఆతృత అలాపరుగులు తీయించింది. ఆ సాయంకాలమే శృతి శిల్పకు తోపుడు బండి కొంది.

ఒక్క (ప్రామ్) తోపుడు బండేకాక, చిన్న సైకిలు, బాల్స్, కీ యిస్తే మాట్లాడే బొమ్మ ఇంకా కొన్ని; కొంది. ఎందుకంటే అక్కడ పిల్లలు చలిలో బయటకుపోయి ఆడలేరు. అందరు హౌస్ అరెస్ట్ కావలసిందే, వారికి బొమ్మలు, టి.వి.తప్ప వేరే వ్యాపకం ఉండదు. అందుకే ఎన్ని బొమ్మలున్నా సరిపోవు వారికి. ఇంటిలోనే బిల్డింగ్ సెట్స్‌తో ఆడుకుంటూ, కీ టాయిస్‌తో కాలక్షేపం చేస్తూ వారి తెలివితేటల్ని వృద్ధిచేసుకుంటారు. వారిదృష్టి ఆ బొమ్మలు ఎలా తయారుచేసారు. ఇంకా ఎలా తయారుచేస్తే బాగుంటుంది. ఏ యిల్లు ఎలా కడితే బావుంటుంది అన్నట్లే ఉంటుందిగాని, పొరుగువారు ఏం చేస్తున్నారు, ఎలా బ్రతుకుతున్నారు, వారిలోని లోపాలను ఎలా వెలికి తీద్దాము, ఎలా అల్లరిపెడదాము ఆ తలంపే ఉండదు వారికి. చిన్నప్పటినుండి ఎవరిజీవితం వారిదే అన్నట్లు పెరుగుతారు. పెద్దయిన తరువాత కూడా అలాగే బ్రతుకుతారు.

శృతి, వీణ వ్రాసిన ఉత్తరం మరొక్కసారి చదువుకుంది. వీణ ఎదురుగాఉండి మాట్లాడుతున్నట్లే అనిపించింది. చెల్లిని తల్లిదండ్రులను తలంచుకోగానే మనసు ఆర్ద్రతతో నిండిపోయింది. అయినవారికి దూరంగా ఉండడం కష్టమే సుమా అనుకొంది అక్కడ ఎంత డబ్బున్నా, ఎన్ని సదుపాయాలున్నా. కన్నవారిసాటి ఏవీ రావుకదా! వీణ ఉత్తరంలో వ్రాసింది వచ్చేనెల శిల్ప పుట్టినరోజుకదా అని గుర్తుచేస్తూ. అప్పుడే అనుకొంది శృతి శిల్ప పుట్టినరోజునాడు అక్కడ ఉన్న ఇండియన్స్ అందరినీ పిలవాలని. 'అక్కా! నా పెళ్ళి గురించి నాన్న చాల తిరుగుతున్నారు. అయినప్పటికే అవుతుందన్నా ఊరుకోవడం లేదు. ఆడపిల్లల్ని కన్న నాన్న పాట్లు చూస్తుంటే నాకు చాలా బాధగా ఉంది. నీవైనా ధైర్యంగా ఉత్తరం వ్రాయక్కా! నీమాట నాన్నగారు తప్పక వింటారు' అని వ్రాసింది. ఆ వాక్యాలు చదువుతూ అప్రయత్నంగా ఎదురింటి వైపు చూసింది. ఆ



యింట్లో ఉద్యోగం చేసే అమ్మాయిలు నలుగురయిదుగురు ఉన్నారు. వారు ఎంత నిశ్చింతగా ఉంటారో, వారి తల్లిదండ్రులు అంతకంటే నిశ్చింతగాను ఉంటారు. తల్లిదండ్రులు ఏదో దూరపు బంధువులుగా ఎప్పుడైనా వస్తుంటారు. వచ్చినా ఏ హోటల్లోనో ఉండి పిల్లలను పలకరించి వెళ్ళిపోతూ ఉంటారు. కన్న పిల్లలకు ఆప్యాయంగా వండి పెట్టడం, వయసు వచ్చిన వారికి వరుణ్ణి వెతికి పెట్టడం అన్నది వారి జీవితాల్లోనే లేదు.

కాని ఆ కన్నెపిల్లల జీవితాల్లో మరో విధమైన కన్నీటి కథలు. కట్నాలు కోరే దేశం ఒకటైతే, కన్నెలను వేశ్యలుగా మార్చే దేశం మరొకటయితే, ఆ దేశం ఆడపిల్లలకు

మానభంగాల భయంలేకపోయినప్పటికి వైవాహిక జీవితంలో తగినంత సంతోషం ఉండదు. తల్లిదండ్రులు విడిచిపెట్టిన పిల్లలు, ఎప్పటికీ తెగిన గాలిపటాల్లాంటివారే. అదే తల్లిదండ్రులు మంచీ, చెడ్డా వివరించి, వారిని ముళ్లబాట వెంట నడవకుండా చేస్తే వారి జీవితాల్లోనూ నవ్వులు విరుస్తాయి. ఏ దేశంలోనైనా అందుబాటులోనున్న ఆడదాన్ని అనుభవించి మగవాడు పలాయనం చిత్తగించాలనే చూస్తాడు. మనదేశంలోని స్త్రీలు అందుకే మగవాడికి అంత తొందరగా అందరు. కాని అక్కడివారు పెళ్ళిమీద ధ్యాసతో తమ జీవితాన్ని మగవారికి అంకితం చేస్తారు. అలాంటపుడే మోసపోతూ ఉంటారు. అమలాపురంలో పుట్టినా, అమెరికాలో పుట్టినా, అంగారక గ్రహంలో కాలుపెట్టినా మనిషి మనస్తత్వము మనిషిదే. మగవాడు మగవాడే. మరి మోసం చెయ్యడంలో ఒక్కొక్క మనిషి ఒక్కొక్కరకంగా మోసగిస్తాడు. పట్టుబడని వాడొక్కడే నీతిమంతుడు.

శీతాకాలం వచ్చేసింది. బయట వర్షంలాగే మంచు అవిరామంగా కురుస్తుంది. ఎటువంటి బండ హృదయాలయినా ఆ మనోహరమైన సన్నివేశాన్ని చూసి పరవశించవలసిందే. అంత అందంగా కురుస్తుంది మంచు. నేలంతా తెల్లగా, మంచు సముద్రంలాగ, పాల కడలిలాగ ఎంతో అందంగా కనిపిస్తుంది. 'భలేభలే అందాలు సృష్టించావు! యిలా మురిపించావు! అదే ఆనందం అదే అనురాగం! ప్రభూ మాకేల ఈయవు' పాట గుర్తుకి వచ్చింది శృతికి. ఆ అందాల్ని ఆనందించే మనసైతే ఉంది. అది అస్తమానూ ఇదీ నీ జీవితం, ఎందుకిలా అయింది అని నిలదీసి అడుగుతున్నట్లు అనిపిస్తుంది. ఆ తలంపు రాగానే నిలబడలేనట్లు కూలబడిపోతుంది శృతి. 'భగవాన్, ఏజన్మలో ఏం పాపం చేసుకున్నానో; ఈరోజు యిలా అనుభవిస్తున్నాను! అనుకొంది. కంటిలో నీరు చిన్నగా కదలాడింది. నీచేయి తప్ప నీ కన్నీరు తుడిచే సాధనం మరొకటిలేదు అన్నది శృతికి బాగా తెలుసు గబగబా కన్నీరు తుడ్చుకొంది.

'శృతీ! ఏం చేస్తున్నావు' అంటూ వచ్చాడు హరి. కిటికీ దగ్గర నిలబడి ప్రకృతిని చూసి పరవశిస్తున్న శృతి, తన కన్నీరు హరిచూడలేదు కదా అని కంగారు పడింది. ఆ కంగారుని అణచుకోవడానికి మార్గం చిరునవ్వు ఒక్కటే 'హరీ, ఈ మంచుని చూస్తుంటే ఆకులో ఆకునై, పూవులో పూవునై అన్నట్లు, మంచులో మంచునై అంటే ఎంతో బావుంటుంది కదా' అంది. 'మంచులో మంచువైపోతే గడ్డకట్టేస్తావు సుమా! జాగ్రత్త.' అంటూ వెళ్ళి ఆమె ప్రక్కన నిలబడి తన దృష్టిని కూడ కురుస్తున్న మంచువైపు సారించాడు. ఆ చలిలో శృతిని గుండెలకు గాఢంగా హత్తుకోవాలన్న కోరికను బలవంతంగా ఆపుకున్నాడు. ఆ కోరిక కలగగానే కోరికతో పాటు కన్నీరు ముందు వస్తుంది హరికి. కాని శృతి ఎదురుగా మనస్ఫూర్తిగా ఏడవడానికి కూడా మనస్కరించదు. ఇద్దరికీ తెలుసు, ఇద్దరి హృదయాల్లోనూ లావాలు పొంగుతున్నాయని. ఆ పొంగే లావాని అణచిపెట్టేయడం వారికి అలవాటయిపోయింది. శిల్ప నిద్రలేచి పాక్కుంటూ వచ్చి

మీరిద్దరూ ఆ ఆలోచనలనుండి బయటపడండి అంటూ ఇండైరెక్ట్‌గా హెచ్చరించింది. సంవత్సరం నిండబోతున్న శిల్పముద్దుగా బొద్దుగా చాలా ఆకర్షణీయంగా ఉంది.

'హాయ్ డార్లింగ్' అంటూ ఆమెని ఎత్తుకొని ముద్దాడాడు హరి. హరికి శృతి తరువాత పంచప్రాణాలు శిల్ప. తన రక్తం పంచుకుపుట్టిన శిల్ప అంటే చెప్పలేని అనురాగం. తాను ఈ అమ్మాయికి తండ్రిని అనుకోగానే ఎంతో గర్వంగా ఈ జన్మకు ఈ తృప్తి చాలు అన్నట్లుగా చిన్నారి నవ్వులు యిచ్చినంత ఆనందం అతనికి జీవితంలో మరేదీ యివ్వలేదు. శృతి కోసం మనస్ఫూర్తిగా కాకుండా భార్యకోసం అన్నట్లు నవ్వుతాడు. ఆమె సంతోషం కోసం నవ్వుతాడు. కాని శిల్పతో చిన్న పిల్లాడిలా, కన్నతండ్రిలా మనస్ఫూర్తిగా నవ్వుతాడు. ఆమె కోసమే బ్రతుకుతున్నాడేమో కూడా. కొంతవరకైనా ఇతరుల కోసం జీవించనివాడు తనకోసమూ జీవించలేడు అని హరి ఎక్కడో చదివాడు. ఇప్పుడు తనకోసం కాక శృతికోసం, శిల్పకోసం జీవిస్తున్నట్లుంది అతని జీవితం. అతని జీవితంలో అదృష్టం ఎప్పుడు తిరిగిచూస్తుందో అదృష్టవంతుల్ని దేవుడు కూడ చెడ గొట్టలేడు.

ఆ రోజు శిల్ప పుట్టినరోజు. ప్రొద్దునే ఇండియానుండి ఫోను వచ్చింది. వీణ చేసింది. 'అక్కా, శిల్పతో మాట్లాడించవూ' అంది. శిల్పకు యింకా సరిగా మాటలు రావడం లేదు వీణా! అందరం ఉంటే త్వరలో మాటలు వచ్చేసేవేమో, మా హౌస్‌కీపర్ ఇంగ్లీషులో మాట్లాడుతుంది. బావగారు, నేను మాట్లాడుకునేది తక్కువే కదా; నీకు తెలుసుగా అంతా, అది యింకా ఆ, ఇ లే అంటుంది. క, ఖ లు యింకారాలేదు అంది.

కుశల ప్రశ్నల అనంతరం 'బావగారిని పిలువు' అంది. 'హల్లో బావా బావా పన్నీరు. ఎలాగున్నారండీ. మీరు వెళ్ళి పోయిన దగ్గర నుండి ఏ పండగవచ్చినా మా నాన్నగారు నిశ్చింతగా ఉంటున్నారు. ఎందుకో తెలుసా! పండక్కి పెద్దల్లుడుగారు అంత దూరం నుండి రాలేరుగా, మరదళ్ళకి మాకు రెస్ట్‌గానే ఉందిలెండి, పిండివంటలు చెయ్యాల్సిన బాధ తప్పింది' అంది హాస్యంగా.

'నీవూ త్వరగా పెళ్ళిచేసికుంటే మీ ఆయన నేను లేని లోటు తీరుస్తాడుగా! నీ నోటికి కూడా తాళం వేస్తాడు. మీరందరూ నిశ్చింతగా ఉండడం నాకెంతమాత్రం యిష్టంలేదోయి మరదలా, మా మామగారు హాయిగా నిద్రపోతున్నారని తెలిస్తే నాకసలు నిద్రే పట్టడంలేదు. నిద్ర పట్టడంలేదంటే దోమలు, నల్లులు కారణం అనుకునేవు. అలాంటి ప్రాణులు పొరపాటున కూడ కంటికి కనిపించవిక్కడ. ఆఖరికి ఈ దేశంలో సెయింట్ పేట్రిక్ పుణ్యమా అంటూ, పాములు కూడా లేవుతెలుసా. సెయింట్ పేట్రిక్

పుణ్యమా అంటూ,నీ పెళ్ళికి మేము తప్పక సకుటుంబ సపరివారంగా రాముగాని, త్వరగా పెళ్ళి చేసికొని మీ నాన్నగారిని నిద్రలేపు' అన్నాడు.

వెనకనుండి శృతి చిన్నచిన్నమాటలు అందిస్తూనే ఉంది. చివరగా 'ఉంటాను బావగారు, సారీ బావా బావా పన్నీరు' అని ఫోన్ పెట్టేసింది. బావా బావా పన్నీరు కాదు, బావా బావా కన్నీరు అనిపాపం వీణకేం తెలుసు అనుకున్నాడు బాధగా. శృతి తండ్రికి శృతి పెద్దకూతురు. శృతి తండ్రి మహాసంగీత విద్వాంసుడుగాని, పేదవాడు. తన నలుగురు కూతుర్లకి శృతి, వీణ, పల్లవి, కీర్తన అని పేరు పెట్టాడు. ఇంకా ఆడపిల్లలు పుట్టి ఉంటే కల్యాణి, భైరవి, సావేరి అటూ రాగాల పేర్లు కూడా పెట్టి ఉండేవాడిని అనుకునేవాడు ఆ పిల్లలు చిన్నగా ఉన్నప్పుడు. వారు ఎదిగి కట్నపిశాచి భయంకరంగా అతన్ని భయపెట్టినప్పుడు గాని నలుగురిని అయినా ఎందుకు కన్నానురా దేవుడా అని అనుకోకుండా ఉండలేకపోయాడు. నారు పోసినవాడు నీరు పొయ్యలేదు. అదృష్టం కొద్దీ శృతిది లవ్ మేరేజ్ కాబట్టి ప్రాబ్లమ్ లేకపోయింది. ఆమెకు ఎంతో ఖర్చు పెట్టి డాక్టరు చదివించాడు. ఆమె జీవితం ఆయన అనుభవించకుండానే హరితో పంచుకొంది. అతను శృతిపై పెంచుకొన్న ఆశలు బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. అయినా బాధపడలేదు. ఒక పెళ్లి అయినా కట్నంలేకుండా అయిపోయింది కదా అనుకున్నాడు. గెద్ద వచ్చి కోడిపిల్లను తన్నుకుపోయినట్లు తన్నుకుపోయాడు, హరి శృతిని. అయినా వేదాంత శర్మగారు ఒక పిల్ల భారం అయినా తప్పింది చాలు అనుకున్నాడు. ఆడపిల్లలు పుట్టినప్పుడు ఇంటికి లక్ష్మి అనుకున్నాడుగాని గుండెలమీద కుంపటి అని అప్పట్లో తెలియదు. సంవత్సరాలు గడిచేకొద్దీ సామెతలు కూడా వాటి ప్రభావాన్ని పోగొట్టుకుంటాయేమో. ఇప్పుడు మగపిల్లవాడు కట్నం తెస్తాడు అని తలచే తల్లిదండ్రులు ముందుముందు కన్యాశుల్కం వస్తే ఏం చేస్తారో అప్పుడు మగపిల్లవాడు గుండెలమీద కుంపటి అవుతాడేమో.

శిల్ప పుట్టిన ఆ రోజుకి, ఆ ఊరిలోనున్న తెలుగు కుటుంబాలను, వర్మవాళ్ళను పిలిచారు హరిదంపతులు డిన్నర్‌కి. అందరూ వచ్చిన ఆరోజు చాలసంతోషంగా గడిచింది. అందులో ఏ దంపతుల్ని చూసినా హరి మనసు కలుక్కుమనేది. వారందరూ ఎంత సంతోషంగా ఉన్నారు కదా అని పదేపదే అనుకున్నాడు. తమ జీవితంలో విధి వక్రించకపోతే తామూకూడా అంతకంటే వెయ్యిరెట్లు, లక్షరెట్లు, కోటిరెట్లు ఆనందంగా ఉండేవారు కదా అనే తలంపు అతనిని హుషారుగా ఉండనివ్వడం లేదు. కీ యిచ్చిన బొమ్మలాగే అందరితో మాట్లాడుతున్నాడుగాని మనసు మరో విషాద లోకంలో విహరిస్తూనే ఉంది. శృతి మాత్రం సంతోషానికి ప్రతిరూపం అన్నట్లు, చిరునవ్వుకి ప్రతీక అన్నట్లు చిన్నపిల్లలా అందరితో గలగలా తెలుగులో గలగలా గోదారి పొంగినట్లు

మాట్లాడేస్తుంది. కిలకిలా నవ్వుతుంది కిన్నెరసానిలా. హరి హృదయం శృతిని, ఆమె అందాన్ని తాత్కాలికమైన ఆమె ఆనందాన్ని చూస్తుంటే వలవలా ఏడుస్తూంది అతనికి తెలియకుండానే.

వచ్చిన అతిథులందరూ ఇద్దరినీ మేడ్‌ఫర్ ఈచ్ అదర్ అని మరీ మరీ పొగిడి మరీ వెళ్ళారు. కాని ఆ దంపతులలో కదలాడే నీలినీడలు వారికేం తెలుసు. వారికి తెలిసిందల్లా పైకి కనిపించే ఆర్భాటమే. ఆ రోజు శిల్పకు పింక్ ఫ్రాక్ వేసింది శృతి. శృతి కూడ పింక్ శారీ కట్టుకుంది. ఆ చీర ఆమె శరీరపు రంగుతో గులాబిరంగు పెదవులతోను పోటీ పడుతుంది. ఆమె శరీరం కంటే కూడా అందంగాలేదు ఎంతో అందమైన ఆ పట్టుచీర. శృతి ధరించిన ముత్యాలహారం, ఆమె తెల్లని, చక్కని పలువరస ముందు దిష్టిదీసి పారేసినట్లుంది. ఆ ముత్యాలహారంలోని ముత్యాలు మేలిమి ముత్యాలు. కాని ఏం లాభం, పాపం శృతి పలువరస ముందు అవి. సన్నని నడుముపై నల్లని పెద్దజడ, పాములులేని ఐర్లాండు దేశంలోనికి వచ్చిన పెద్దపాములా, ఎవరికీ హానిచెయ్యకుండా, అందరినీ అలరించే విధంగా ఉంది. చీరకు జాకెట్‌కు మధ్యనున్న తెల్లని నడుం, విధాత అత్యంత శ్రద్ధగా మలిచినట్లు తన నైపుణ్యం అంతా ఆమెను తీర్చిదిద్దడంలోనే చూపినట్లు అనిపిస్తుంది ఆమెను చూసిన ఎవరికైనా అన్నీ చేసి అసలైనది మరచిపోయి ప్రాణం పోసినట్లున్నాడు. భగవంతుడు పొరపాటున మరచిపోయిన ఆచిన్న ఆనందం ఆమె జీవితానికి పెద్ద శాపమైపోయింది. ఆ నుదుటి వ్రాతను చెరిపి మరలా వ్రాసుకుంటే ఎంత బావుంటుంది. దేవుడు తనుచేసిన తప్పు దిద్దలేడా? ఆమె బ్రతుకును సరిదిద్దలేడా? ఏమో వేచిచూడాల్సిందేమరి.

ఆరాత్రి హరి మనసు మరీ వికలమైపోయింది. రాజహంసలా మెరసిపోతున్న ఆమెను తను దరిచేరలేక పోతున్నాడు. అంతకంటే తమ జీవితంలో అన్యాయం ఏముంది. శృతి, శిల్ప అందంలో పోలికలలో ఒకరితో ఒకరు పోటీపడుతూ, ఎవరు మనిద్దరిలో అందమైనవారు అన్నట్లు మనకెవరూ సాటిరారు అన్న ధీమాతో ఆదమరచి నిద్రపోతున్నారు. అలసిపోయిన శృతి వెంటనే నిద్రపోయింది. ఆరోజు పనితో శారీరకంగా ఆమె అలిసిపోయింది కాబట్టి వెంటనే నిద్ర పోగలిగింది. మనసులోని ఆలోచనలతో అలసిపోయిన హరికి మాత్రం నిద్ర దూరమయింది. మనశ్శాంతి నిద్ర కవలపిల్లల్లాగ కలసి ఉంటాయికాబోలు. మనసు ప్రశాంతంగా ఉన్నచోటే నిద్ర ఉంటుంది. శృతిమీద చేయివేసి పడుకోవాలన్న కోరికను ఆపుకోలేక చేయిపైకెత్తాడు ఆమె మీద వెయ్యడానికి. కాని ఆ చేయి పెరాల్సిస్ వచ్చినట్లు ముందుకి కదలనని మొరాయించింది. దానికి తెలుసు. అది ముందుకి వెళితే ఆ తరువాత జరిగే పరిణామాల గురించి. ప్రతిరాత్రిలాగే ఆ రాత్రికూడ మధ్యలో శిల్పను పెట్టుకొని ప్రాణమున్న శిల్పాలలాగే పడుకున్నారు వారిద్దరు. త్వరలో E.C.F.M.G పరీక్ష పాసవ్వాలి. స్టేట్స్‌కి వెళ్ళాలి అని దృఢంగా

నిశ్చయించుకున్నాడు హరి. అంతే. వెంటనే లేచి వేరే గదిలోకి వెళ్ళి గేస్ హీటరు ఆన్చేసుకొని పుస్తకం పట్టుకున్నాడు. పుస్తక పఠనంలో పడిన తరువాత మనసు కొంచెం నెమ్మదించి అందులో నిమగ్నమైపోయిడు.

అదే దేశంలోనున్న ఇన్నిస్కార్తి లో డాక్టర్ రావు దంపతులుంటున్నారు. రావుగారు ఆ ఊరిలోనున్న సెయింట్ సెనాన్స్ హాస్పిటల్లో పనిచేస్తారు. అది మెంటల్ హాస్పిటల్. రావుగారి మిసెస్ మృదుల వేరే హాస్పిటల్లో పనిచేస్తుంది. వారికి ఆరుగురు పిల్లలు. అయిదుగురు ఇండియాలోనే పుట్టారు. ఇంక పిల్లలు వద్దు అనుకొని, ఆ సంగతి పక్కకు పెట్టి ఐర్లాండు వచ్చేసారు. కాని అప్పటికే నెలతప్పినట్లు ఆవిడ గ్రహించుకోలేదు. గ్రహించుకొని ఉంటే ఇండియాలోనే అబార్షను, ఆపరేషను కూడా చేసికొని ఉండేది. రావుగారి కుటుంబం చాలా పెద్దది. ఎక్కువ బాధ్యతలు. ఆయన నాయనమ్మ పెంపకంలో పెరిగిన మనిషి. ఆవిడ మాటను తీసివెయ్యలేక అప్పటికే అయిదుగురికి తండ్రి అయ్యాడు. అప్పుడుగాని ప్రభుత్వం ఇద్దరు లేక ముగ్గురు అన్న స్లోగన్ అతని చెవికి పడలేదు. అప్పటికే ఆలస్యమైపోయింది. ఒకప్రక్క తల్లిదండ్రులు, వయసుమళ్ళిన వారైపోయిరు. తమ్ముళ్ళెవరూ అంది రాలేదు. చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు కుదిరే సూచనలు దరిదాపుల్లోలేవు. ఆ ఇద్దరి సంపాదన ఆ యింటి తిండికే సరిపోతుంటే ఆయనకు బ్రతుకు అంటే భయం పట్టుకొంది. అదృష్టంకొద్దీ ఇన్నిస్కార్తి లో ఉద్యోగం దొరకగానే దంపతులిద్దరూ పిల్లలతో వచ్చేసారు.

ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు కాబట్టి ఎస్టేర్ అనే హౌస్కీపర్ని పెట్టుకున్నారు. ఆమెకు విడిగా ఒకగది, ఒక టి.వి. అన్నిరకాలయిన సదుపాయాలు సమకూర్చారు. పిల్లలు ఎక్కువ కాబట్టి పెద్ద యిల్లు తీసికొనక తప్పలేదు. గుడ్డి కంటే మెల్లకన్ను మేలు అన్నట్లు ఇండియాలో పిల్లలు ఎక్కువున్నందుకు బాధపడ్డ రావు, యిప్పుడు సంతోషిస్తున్నారు.

కారణం పిల్లలెక్కువ ఉంటే ఆ దేశంలో ఇన్కంటాక్స్ తక్కువ. తన జీతంలో కొంత ఇండియా పంపించి వేసినా, భార్య జీతంతో ఇల్లు గడచిపోతుంది. అందులోనే కొంత చెల్లెళ్ళ పెళ్ళికి పోస్టులో వేస్తున్నారు. మృదులకు మగపిల్లవాడు పుట్టాడు. మగపిల్లాడు కావాలన్న రావుగారి నాయనమ్మ కోరిక తీరిందిగాని, ఆవిడ అప్పటికే కాలం చేసి నెలదాటి పోయింది. ఆవిడ మనుమడిని కోరికకోరేసి హాయిగా కన్నుమూసింది. రావుగారికి మాత్రం అంతమంది పిల్లలతో ముందు ముందు ఎంత కష్టమో ఆవిడ ఊహించి ఉండదు.

రావుగారు ఆరోజు హాస్పిటల్ నుండి వచ్చేసరికి మృదుల దిగులుగా కూర్చొని ఉంది. ఇల్లంతా దండకారణ్యం లాగ ఉంది. పిల్లాడి ఏడుపుగూడ ఆవిడ పట్టించుకున్నట్లు

లేదు.

"ఎందుకు మృదులా, అలా ఉన్నావు. ఏమైంది. ఇల్లేమిటి ఇలా ఉంది. సర్వెంట్ మెయిడ్ ఏదీ" అని అడిగాడాయన ఆశ్చర్యంగా.

'నేను హాస్పిటల్ నుండి తలనొప్పిగా ఉందని పర్మిషన్ తీసికొని ఇంటికి వచ్చేసరికి ఏం చెప్పమంటారు నేను చూసిన సన్నివేశం' అంది.

'ఏమైంది' ఆతృతగా అడిగాడాయన. ఏమయిందో ఊహించడానికి ఆయనకు ఏమీ ఊహాకందడంలేదు. దొంగలుగాని, మోసగాళ్ళుగాని లేని దేశమది. పని బద్ధకించే మనుషులు అంతకంటే కాదు, పోనీ ఎస్తేరు ఏమైనా ఇంట్లోసామాను ఎత్తుకొని వెళ్ళిపోయిందా అని ఆలోచించడానికి కూడా అతనికి మనస్కరించడంలేదు. అబ్బాయికి ఏమైనా దెబ్బతగిలిందా అంటే బెడ్‌రూమ్‌లో ఉయ్యాలలో నిశ్చింతగా నిద్రపోతున్నాడు.

'నేను వచ్చేసరికి బాబు ఫైర్ దగ్గర కూర్చొని బట్టలు, బొమ్మలు అందులోకి విసిరి ఆడుకుంటున్నాడు. ఫైర్‌ప్లేస్‌లో పెద్ద పెద్ద మంటలు. ఎంత భయమేసిందనుకున్నారు. నిజంగా పిల్లాడికి బ్రతికేయోగం ఉండబట్టే నేను వచ్చేసానేమో' అంది. ప్రమాదం తప్పింది అన్న భావం ఆమె మొహంలో కనబడుతుంది. సాధారణంగా ఇంటికి సెంట్రల్ హీటింగ్‌లేని వారు ఫైర్‌ప్లేస్‌లో రోజంతా ఫైర్ వేసుకుంటారు. ఆ ఫైర్ వల్ల ఇల్లువేడిగా ఉండడమే కాకుండా వేడినీళ్ళు కూడా కాగుతాయి. ఆ పొయ్యికి వేడినీళ్ళ డ్రమ్‌కు గోడలోనే కనెక్షన్ పెట్టేస్తారు. డ్రమ్‌కి ఇంటిలోని అన్ని టేప్‌లకు కనెక్షన్ ఉంటుంది. సెంట్రల్ హీటింగ్ కరెంటుది ఉన్నా కూడా ప్రతీ ఇంటికి ఫైర్‌ప్లేస్ ఉంటుంది. తప్పనిసరిగా సిటింగ్‌రూమ్‌లో కడతారు. సరదాగా అప్పుడప్పుడు మంట వేసుకుంటారు. మంటమీదకు రాకుండా నిప్పురవ్వలు పడకుండా పొయ్యి చుట్టూ ఐరన్ ఫ్రేమ్ ఉంటుంది. కాని ఆ ఇంటికి వారు ఫ్రేమ్ పెట్టించుకోలేదు. ఫైర్ కోసం చిన్న చిన్న పుల్లలు, బొగ్గు, టర్ఫ్ అనే పిడకల లాంటివి ఉంటాయి. అక్కడ అదీ వాడతారు. ఆ టర్ఫ్ నేలను తవ్వితే వస్తుంది కొన్ని చోట్ల. అంటే అంతకుముందెప్పుడో చెట్లు నేలలో కలిసిపోయి నేల ఆ చెట్ల ముక్కలు కలసి ఉన్న స్థలమన్నమాట అది. అది తెచ్చి లారీలలో అమ్ముతుంటారు. వెనుకనున్న ఔట్‌హౌస్‌లో అందరూ పిడకలు పేర్చినట్లు ఆ టర్ఫ్‌ని పేర్చుకొని సంవత్సరమంతా వాడుకుంటారు.

'మరి ఎస్తేరు ఏమయింది, బాబుని ఆడించడం లేదా?' అడిగారాయన ఆశ్చర్యపోతూ. 'ఆ ఎస్తేరు అసలు రంగు ఈ రోజు బయట పడింది. నేను ఇంటికి రాబట్టి చూసాను. ఎంతకాలం నుండి జరుగుతుందో ఈ నాటకం మనకు తెలియదు. నేను వచ్చేసరికి బాబు సిటింగ్‌రూమ్‌లో ఫైర్ దగ్గర, ఎస్తేరు, ఎస్తేరు బోయ్ ఫ్రెండ్ మన బెడ్‌రూమ్‌లో మనబెడ్ మీద... ఇంక నేను చెప్పలేను మీరే ఊహించుకోండి

అన్నట్లు ఆపేసింది మృదుల. అప్పుడే ఆమె వారు పడుకున్నదుప్పటి బయట తగలబెట్టేసింది.

'ఇంత పనిచేసిందా ఇంకా నయం ఇప్పటికైనా గమనించుకున్నాం. ఇంతకీ ఏం చేసావామెను' అడిగాడు ఆయన 'ఏం చేస్తాను. జీతం మొహాన కొట్టి ఇంటికి పంపేసాను. ఏమండి నేను ఒక నెల్లాళ్ళు శలవు పెడతాను. మీరు ఎలాగూ ఇండియా వెళ తానంటున్నారు కదా! అక్కడినుండి ఒక పిల్లను తెచ్చుకుంటే మనకు ఈ తిప్పలు ఉండవుకదా" అంది. ఆయనకూ నిజమేననిపించింది. కాని ఇండియాకి ప్రయాణమంటే వేలమైళ్ళ దూరం ప్రయాణంతోపాటు వేలకొద్ది డబ్బులు ఖర్చుకూడా ఉంటుంది. ఆ డబ్బులు వాళ్ళకు పంపిస్తే లక్షణంగా ఇద్దరి ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేయవచ్చు. కాని తండ్రికి ఒంట్లో బావుండలేదని రావుకి ఉత్తరం వచ్చింది. వెళ్ళక తప్పతన్నట్లుగా ఉంది పరిస్థితి. వారు ఆలోచించుకోవడం ఆయన ఇండియాకు వెళ్ళి ఎవరూలేని అనాధ 16 సంవత్సరాల భారతిని తీసుకొని రావడమూ ఎలా ఉన్నావు అన్నదానికంటే ఏం తెచ్చావు అన్నట్లున్న బంధువుల పరామర్శలతో విసిగిపోవడం అన్నీ అయిపోయాయి. భారతిని చూసి కొండంత బరువు దిగినట్లు అనిపించింది మృదులకు. కాని భారతి త్వరలో తన గుండెల మీద కుంపటిలా అవుతుందని ఆమె గ్రహించలేదు. జరగబోయేది ముందుగా మనకు తెలిస్తే ఇంక జీవితంలో థ్రిల్ ఏముంది. అందరూ కష్టాలు రాకుండా గడిచిపోయినా సుఖం యొక్క విలువ తెలియదు మనిషికి. కష్టాలు కలిగినప్పుడే సుఖం విలువ తెలుస్తుంది ఎవరికైనా అసలు బ్రతుకే మంచిచెడుల కష్టసుఖాల కలయిక కదా!

చుట్టూ చీకటి ఆవరించినప్పుడు వాడవలసిన సమయంలో కొవ్వొత్తి వాడిన వాడే మేధావట. కష్టాలు తలచుకుని కుమిలిపోయేవాడు, చీకటిని చూసి భయపడేవాడు పిరికివాడు. ఎందుకు పనికిరానివాడు.

ఆ రోజు వచ్చిన పోస్టు చూసుకుంది శృతి. కవరులో ఏదో గ్రీటింగులా ఉంది. ఏమిటని తెరచిచూసి ఆశ్చర్యపోయింది. వీణ పెళ్ళి కార్డు అది. ఆశ్చర్యము, ఆనందం ఒకేసారి కలిగాయి శృతికి. వెంటనే ఆ సంగతి హరికి చెప్పేవరకూ మనసు ఆగలేదు. హరికి కూడా ఆ శుభవార్త చాలా సంతోషాన్ని కలిగించింది. అందులో ఉత్తరం కూడా ఉంది. అప్పటికే అది పోస్టు చేసి వారం రోజులైంది. తండ్రి, వీణ కూడా ఉత్తరం వ్రాసారు.

చిరంజీవి కుమార్తె శృతిని, అల్లుడు హరిని వేదాంతశర్మ దీవించి వ్రాయుట. ఇక్కడ అందరము క్షేమము. అక్కడ మీరును మాకంటే వేయి రెట్లు సంతోషంగా ఉండాలని సదాభగవంతుని కోరి నా ప్రార్థన.

అమ్మా, శృతీ! అనుకోకుండా చెల్లి పెళ్ళి కుదిరింది. సాంప్రదాయకమైన కుటుంబమని అబ్బాయిది పెద్ద ఉద్యోగం కాకపోయినా ఈ సంబంధానికి ఒప్పుకున్నాను.

అప్పటినుండి మీ ఫోను కొరకుప్రయత్నిస్తుంటే దొరకడంలేదు. ఫోనుకంటే ముందు ఈ ఉత్తరమే మీకు చేరుతుందేమో. ఈ పెళ్ళికి మీరిద్దరూ శిల్పను తీసికొని వస్తే చాలా సంతోషిస్తాము. ప్రయాణమంటే చాలా ఖర్చుతో కూడిన పని అని తెలుసు. దానితో ఇండియాలో ఒక ఆడపిల్ల పెళ్ళి చెయ్యవచ్చు. ఇంకా ఇంట్లో చాలా పనులున్నాయి. పెళ్ళి వారిది చాలా పెద్ద కుటుంబము. మన కుటుంబములాగే పల్లెటూరు అయినా ఫరవాలేదని వీణ ఒప్పుకొంది. పెళ్ళికొడుకు త్వరలో పెళ్ళికావాలని తరువాత ఇప్పట్లో ముహూర్తాలులేవని పట్టుబడితే అర్జంటుగా పెట్టేసాము. కక్కువచ్చినా, కల్యాణం వచ్చినా ఆగదన్నారు కదా! మన పెద్దలు.

అక్కడ మీ ఉద్యోగాలు ఇళ్ళు ఎలా ఉన్నాయి. నీవి బంగారు కళ్ళు తల్లీ. అందుకే విదేశాలు చూసే అదృష్టం నీకు పట్టింది. చలిలో జాగ్రత్త. శిల్ప జాగ్రత్త. శిల్పకు మా అందరి తియ్యటి ముద్దులు పంపుతున్నాము. దాన్ని చూడాలని ఉంది. మొట్టమొదట మనుమరాలు. మా ఆశ తీరకుండానే అంతదూరం వెళ్ళిపోయింది. అసలు కంటే వడ్డీ తీపంటారు ఇదే కాబోలు. శిల్పను చూడాలని ఆమెతో ఆడాలని ఈ తాతయ్య మనసు ఎంత పరితపిస్తుందో మీకు తెలియదు. పెళ్ళికి తప్పకవస్తే ఆ ఆశ తీరుతుంది. మూడు నెలల క్రితం వెళ్ళిన మిమ్మల్ని అప్పుడే రమ్మని అనలేను రావద్దని అనలేను. ఆ ఛాయిస్ మీదే. ఉంటానిక. ఆశీర్వాదములతో తండ్రి శర్మ.

ఉత్తరంలోని భావాలు హరికి అర్థం కాకపోయినా శృతికి అర్థమయ్యాయి. మీకు ఫోను కనెక్షన్ దొరకలేదంటే కారణం కనెక్షను దొరకకకాదు. ఆ ఫోనుకి అయ్యే ఖర్చుతో వీణకు మరో చీర అయినా కొనవచ్చుని తండ్రి ఉద్దేశ్యం. మీరు వచ్చేదారి ఖర్చులతో ఒక ఆడపిల్ల పెళ్ళి చెయ్యవచ్చు అంటే మీరు వచ్చే కంటే డబ్బు పంపిస్తే అన్నివిధాల ఆదుకున్నవారు అవుతారు అని ఇండైరెక్టు హిట్ తనకి. తండ్రి మనస్తత్వమే అంత. చెప్పవలసింది సూటిగా కాక, వేరే విధంగా చెబుతాడు. ఆయన కూతురిగా తను గ్రహించగలదు. కాని హరికి తెలియదుగా ఆ సంగతి.

హరితో వీణ పెళ్ళికి డబ్బు పంపుదామని చెబుతామనుకుంటూనే ఉంది శృతి.

శృతి చెప్పకముందే పదివేలకి డ్రాఫ్టు తెచ్చేసాడు. తన గుండెల బరువు దించేసాడు. థాంక్యూ హరీ అని అతన్ని పెనవేసుకుని గుండెల్లో తలపెట్టుకొని పెదవులతో పెదవులను కలిసి కృతజ్ఞత చెప్పాలనిపించింది. కాని శరీరంలోని కోరికలతో పాటు మనసులోని కోరికలు కూడా అణచుకోవడం అలవాటైపోయిందామెకు. ఆ పదివేల డ్రాఫ్టు చూసి పదివేల కృతజ్ఞతలు మనసులోనే హరికి చెప్పుకొంది శృతి. శృతి మొహంలోని సంతోషం చూసి హరికి ఆ డబ్బుకంటే కూడా ఆ ఆనందం ఎంతో విలువైనదిగా అనిపించింది. డబ్బు ఎలాగైనా సంపాదించవచ్చు. కాని ఆనందం ఎక్కడినుండి ఎలా వస్తుంది. అది అందరికీ అందుబాటులో వుండదు కదా!

ఆ రోజు వీణ పెళ్ళిరోజు. అసలు శృతి మనసు మనసులో లేదు. అన్నిటికంటే వేగంగా పయనించేది మనసే అన్నదానికి తార్కాణంగా ఆమె మనసు నిమిషానికోసారి ఇండియా వెళ్ళి వచ్చేస్తుంది. ఖర్చులతోనూ కాలంతోనూ పనిలేకుండా ఈ సమయానికి పెళ్ళి కూతుర్ని చేస్తారు. ఈ సమయానికి గౌరిపూజ, ఈ సమయానికి బెల్లం, జీలకర్ర అనుకుంటూ ఇండియా టైమ్ ప్రకారంగా అక్కడ ఉన్న టైమ్‌కి అనుకూలంగా ఆలోచిస్తుంది. హరి శృతిలో చెలరేగే భావాలు కనిపెడుతూనే ఉన్నాడు ప్రొద్దుటినుండి. తాను తన జీవితాన్ని తలచుకొని నిద్రపోలేదు. శృతి ఇండియాలో జరుగుతున్న చెల్లెలి పెళ్ళి తలచుకొని అంతకుముందు రాత్రి నిద్రపోలేదు. ఇద్దరూ మంచంమీద అటూ ఇటూ రాత్రంతా కదులుతూనే ఉన్నారు. ఒకరికి తెలియకుండా ఒకరు. శిల్ప ఒక్కతే సుఖదుఃఖాలకు అతీతంగా ప్రశాంతంగా నిద్రపోయింది ఆ ఇంట్లో ఆ రాత్రి. శృతి చెల్లెలి పెళ్ళిగురించి సంతోషిస్తుంటే హరి దానికి భిన్నంగా విచారిస్తున్నాడు. కారణం వీణ పెళ్ళి గురించి కాదు. తమ పెళ్ళి తలంచుకొని. తమ పెళ్ళిక్కూడా అలాగే మంచి ముహూర్తంతో మంచి గంధం వాసనలో, మంగళ వాయిద్యాల మధ్య మరపురాని విధంగానే అయింది. అందరూ రతీమన్మధులని తమని పొగిడారు. పై నుండి దేవతలు ఎందుకు కోపించారో తెలియదు. తాము శాపగ్రస్తులైపోయారు. అంగట్లో అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని అన్నట్లయిపోయింది తన బ్రతుకు. ఒక్కొక్క సన్నివేశం తలచుకొనే కొద్దీ గుండెల్లో బాధ కొండంతై రాయిలాగ కదలనంటుంది. నన్ను జరపడం నీకు సాధ్యం కాదు అని భయపెడుతుంది. అలా భయపెట్టినప్పుడల్లా ముందు భగవద్గీత తరువాత తన పరీక్ష పుస్తకాలు తీస్తాడు హరి. అవే నిప్పులాంటి అతని మనసుకి నీరులా పనిచేస్తాయి.

వీణ పెళ్ళి రోజుని ఎదురింటి అమ్మాయిలను డిన్నర్‌కి పిలిచింది శృతి. వాళ్ళకి ఎప్పటినుండో ఇండియన్ ఫుడ్ తినాలని ఉబలాటంగా ఉంది. ఆఖరుకి వీణ పుణ్యమా అంటూ వారికి ఆ ఆశ తీరింది. ఎదురింట్లోనున్న నలుగురు లారా, కేతలిన్, మేరి, కిజి ఏవేవో చిన్నచిన్న ఉద్యోగాలు చేస్తారు. నలుగురూ కలసి వండుకొని తింటారు. వారానికి ఒకరు చొప్పున స్నానాలు చేస్తారు. ఎప్పుడు వీలైతే అప్పుడు తలస్నానం సింక్‌లో చేసేస్తూంటారు. వారికి స్నానం చెయ్యాలంటే పెద్ద హడావిడి. టబ్‌నిండా వేడి నీళ్ళుండాలి. స్నానానికి చాలా టైమ్ కావాలి. చలిదేశం వలన, చెమటపట్టని వలన బహుశా వారికి అలవాటు అలా అయిందేమో. సెంట్స్ మాత్రం విపరీతంగా వాడతారు. సెంట్ రాసుకుంటే స్నానం చేసినట్లు లెక్కే వారికి.

డిన్నర్‌కి వస్తూ శిల్పకి కాడ్‌బరీస్ ఒకరు బొమ్మ ఒకరు, ఫ్రాక్ ఒకరు అలా తెచ్చారు. వాటిని చూసి మెచ్చుకొని థేంక్స్ చెప్పింది శృతి. వారికి శృతిని పేరు పెట్టి పిలవడం కష్టంగా ఉంది. శురితి అంటారు. దానికంటే మిసెస్ హరి అనడం వారికి ఎంతో తేలిక. వర్మను కూడా చాలామంది మిస్టర్ వరమ అంటారు. వరము కాదు



శాపము అంటుంది వినోదిని సరదాగా. ఆ అమ్మాయిలను చూస్తుంటే తన చెల్లెళ్ళను చూసినట్లే అనిపించింది శృతికి. వంటలో హరి చాలా సహాయం చేసాడు.

శృతి చేసిన వంటను చాలా మెచ్చుకుంటూ నోరు కారానికి వగర్చుకుంటూ ఫోర్క్‌కి అన్నం సరిగారాక చేతితో తినడం చేతగాక క్రిందా మీద అన్నం మెతుకులని జల్లుకుంటూ నవ్వులతో సరదాగ ఎంజాయ్ చేస్తూ తిన్నారు. భోం చెయ్యడం కాగానే టీ చేసిచ్చింది శృతి. భోజనానంతరం టీ తాగడం వారి అలవాటు.

'మిసెస్ హరి మీరు పొద్దుటి నుండి శ్రమపడ్డారు. గిన్నెలు మేము కడుగుతాం' అంటూ గబగబ సింక్ దగ్గరకు వెళ్ళి గిన్నెలు కడగడం మొదలుపెట్టింది లారా. శృతి 'అది మా దేశ పద్ధతి కాదు' అని ఎంత చెప్పినా వినలేదు. సింక్ నిండా నీరుపట్టి సింక్ కన్నానికి మూతపెట్టేసింది. ఈ నీటిలో సోప్‌లిక్విడ్ వేసి గిన్నెలన్నీ అందులో తొలిచి

ఒక ప్రక్కను లారా పెడుతుంటూ మేరీ గబగబా బట్ట పెట్టి తుడిచేసి స్టేండ్‌లో అమర్చేసింది. సబ్బు నీళ్ళతో తప్ప మరలా ఫ్రెష్ వాటర్‌తో కడగరువారు. స్నానమైనా అంతా టబ్‌నిండా నీరుపట్టి అందులోనే జలకాలాడుతూ రుద్దుకొని అలాగే లేచి ఒంటికి అంటుకున్న సబ్బు నురగతోపాటు తడిని కూడా టవల్‌తో తుడుచుకుంటారు. మనుషుల మనస్తత్వాలతోపాటు స్నానాల్లో కూడా రకరకాలు అనుకుంటుంది శృతి. ఇంతలో పొయ్యి మీద పాలు పొంగుతుంటే పాలు కాగబెడుతున్నందుకు ఆశ్చర్యంగా చూసారు వాళ్ళు.

'మీరు పాలు మరగబెడతారా' నోరు తెరుచుకొని అడిగింది కేతలిన్. (అక్కడ దోమలుండవు కాబట్టి నోరు తెరచినా ప్రమాదం లేదు)

'అవును శిల్ప కోసం మరగబెడతాను. మేము కాచినవే తాగుతాం' అని చెప్పింది శృతి. అక్కడ కల్తీ దేనిలోనూ ఉండదు కాబట్టి పాలు మరగబెట్టరు. పచ్చివే తాగుతారు. టీ, కాఫీలలో కూడా పచ్చిపాలే వేసుకుంటారు. అక్కడ ఎవరూ వెజిటేరియన్స్ ఉండరు. నాన్‌వెజిటేరియన్ ప్రిపరేషన్ అంతా హరి చేస్తాడు. ఇప్పుడిప్పుడే ఆ వాసనకు అలవాటు పడుతోంది శృతి. హరి కోసం వండడం కూడ నేర్చుకోవాలని అనుకొంది.

'మా ఆఫీసులో రెండురోజుల క్రితం ఒక ఇండియన్ వచ్చాడు. ఇక్కడ ఉన్న ఇండియన్స్‌ని ఎవరినైనా పరిచయం చెయ్యమన్నాడు. మాకు, మీరు తప్ప ఎవరూ తెలియరు. మీకేమీ అభ్యంతరం లేకపోతే తీసుకొని వస్తాను' అంటూ అనుమతి కోసం హరివైపు చూసింది లారా. 'అలాగే తప్పకుండా తీసుకొనిరా. మాకు సంతోషమే' అన్నాడు హరి. ఆ అమ్మాయిలు అక్కడ కూర్చుని టివి చూస్తున్నారు గాని వారి కళ్ళు ఉండుండి శృతి అందాన్ని పరిశీలిస్తూనే ఉన్నాయి.

'మీ ఇండియన్స్ చీర, జాకెట్‌లో చాలా సెక్సీగా కనిపిస్తారు సుమా!' అంది మేరీ. సన్నని తూనీగలాంటి శృతి నడుంవైపు ఆశక్తిగా చూస్తూ. ఆ మాటలకు శృతి, హరి కూడా ఆశ్చర్యపోయారు. పాశ్చాత్యులు, పైటలేని గౌనులలో సెక్సీగా ఉంటారు అని మనం అనుకుంటే తిరిగి మన ఇండియన్ లేడీస్‌నే సెక్సీగా వర్ణించారేమిటి అనుకున్నారు. తిరిగి లూరా అంది.

మీ నడుము భాగం అంతా కనిపిస్తుంది కదా! మీరు కవర్ చేసుకోరు కదా అందుకే మీరు సెక్సీగా కనిపిస్తారు' అంది. ఇంతలో నిద్రపోయిన శిల్ప లేవడంతో గబగబా వెళ్ళి శిల్పను తీసుకొని వచ్చింది శృతి. నిద్దట్లో గౌను తడిపేసుకొంది. వేరు గౌను మారుస్తూ సేఫ్టీపిన్ కోసం మెడలోనున్న గొలుసుకున్న పిన్ తీసిపెట్టడం ఆశ్చర్యంగా చూస్తున్నారు వారు.

'మీ ఇండియన్స్‌కి మెడలో వస్తువులు, వస్తువులతోపాటు ఆ సేఫ్టీ పిన్స్ పెట్టుకోవడం

కంపల్సరీనా' అడిగింది. ఆ మాటలకు శృతి, హరి ఒక్కసారే ఫక్కుననవ్వారు. 'ఇంతకు ముందు ఒక ఇండియన్ ఫామిలీ తెలుసు నాకు. ఆవిడ కూడా అలాగే మెడలో గొలుసుకి సేఫ్టీపిన్ పెట్టుకునేది' అంది. వారు ఎందుకు నవ్వుతున్నారో అర్థం కాక తరువాత కేథలిన్ అడిగింది 'మీరు మాకు చీరలు కట్టుకోవడం నేర్పుతారా' అని.

'తప్పకుండా మీకు ఇష్టమైతే' అంది శృతి. శృతిని ఒకపాట పాడమని బలవంతం చేసారు వారు. ఎక్కువ బ్రతిమాలించుకోకుండానే ఒక పాట పాడింది శృతి. చిన్నప్పటి నుండి తండ్రితోపాటు సాధన చేసిన గొంతు అది. మెడిసిన్ చదువుతూ కూడా అక్కడక్కడ ప్రోగ్రామ్స్ ఇచ్చేది శృతి. కొన్ని లక్షలమందిలో ఏ ఒక్కరికో తప్ప ఉండదు అంతటి మధురమైన గొంతు. మొదట 'నీవేరా నా మదిలో దేవా' అన్నపాట పాడింది. తరువాత పాట అంత గుర్తులేదుగాని అందులో భావం మాత్రం గుర్తుంది ఆమెకు. అందుకే అది పాడింది 'నింగిసాక్షి, నేలసాక్షి, నిను వలచిన నా మనసే సాక్షి. వేదనలోను, వేడుకలోనూ' అని పాడుతుంటే ఆమె గొంతు వణికింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

చాలాకాలం తరువాత పాడిన ఆ పాటవింటూ ఆ పాటలోని భావంలో లీనమై పోయాడు హరి. పాటలోని భావం తెలియకపోయినా గొంతులోని మాధుర్యం, ఆ ఐరిష్ వనితలను వింతలోకాలకు తీసుకొనిపోయింది. ఆ ఇంటిలోని ప్రాణం లేని వస్తువులు గోడలూ కూడా పరవశం చెందాయా అన్నట్లుందామె కంఠం. వారు ఆమె గొంతులోని ముధుర్యాన్ని ఎంతో మెచ్చుకున్నారు.

'మిసెస్ హరి! మీరు చాలా అందంగా ఉన్నారు. అసలు పెళ్ళయి పిల్ల ఉన్న తల్లిలాగనే లేరు' అంది మేరి. మా మాటలకు శృతి బాధగానే చిరునవ్వు నవ్వినా హరి మనసుకి ములుకులులాగ తగిలాయి అవి. హరి మొహంలోని భావాలు మారిపోవడం వెంటనే గ్రహించింది శృతి. భర్త ఏ మాత్రం అశాంతిగా కనిపించినా ఆమె భరించలేదు. అందుకే అంది.

'నేనొక జోక్ చెప్పనా? అని 'ఒక ఫారినర్ ఇండియా వెళ్ళాడట దేశం చూడడానికి. ప్రతి ఊరులోను ఉన్న విగ్రహాల గురించి తెలుసుకోవాలని ఆయన ఎవరు అని అడిగారట. ఒక ఊరిలో మాలూమ్ నహీ సాబ్ అన్నాడట అతను. అలాగే మరో ఊరిలోకూడా ఇంకొక విగ్రహం గురించి అడిగితే మాలూమ్ నహీ సాబ్ అన్నాడట. అతను కూడా అలాగే నాలుగయిదు ఊర్లలో అడిగాడట. అందరూ ఒకటే జవాబు చెప్పారట. ఒకరోజో ఒక మనిషి చనిపోతే చనిపోయిన ఆయన ఎవరు అని ఇంకొక అతన్ని అడిగాడట. మాలూమ్‌నహీ సాబ్ అన్నాడట. ఆ రోజు ఆ ఫారినర్ ఆయన డైరీలో ఇలా వ్రాసుకున్నాడట. ఈ దేశంలో మాలూమ్ నహీసాబ్ విగ్రహాలు చాలా ఉన్నాయి. నేను ఆయన చావుని కళ్ళారా చూసాను' అని ఆ జోక్‌ని ఆ అమ్మాయిలకు కూడా వివరించి చెప్పేసరికి వారు విరగబడి నవ్వారు.

వారు హరి ఇంటినుండి వీడ్కోలు తీసుకుంటూ - ఈ వీకెండ్‌కి అందరం మా ఊర్లకు వెళ్ళిపోతున్నాము. క్రిస్మస్ దగ్గరకు వస్తుంది కదా - అని చెప్పారు. వారు వాళ్ళ ఇళ్ళకి వెళ్ళాలనుకుంటే బస్ కోసమో ట్రైన్ కోసమో చూడరు. టాక్సీ కావాలంటే చాలా ఖరీదు. ఎవరికీ కార్లు లేవు. తిరగడానికి కార్లు, స్కూటర్లు, బస్‌లు, ట్రైన్‌లు తప్ప మరో రకం అయిన వాహనాలుండవు. వాళ్ళు రోడ్డుమీద నిలబడి వాళ్ళ ఊరి రూట్‌వైపు వెళ్ళే వారందరిని బొటనవేలు (థమ్స్ అప్ లాగ) చూపిస్తూ లిఫ్ట్ అడుగుతారు. సాధారణంగా కార్లు ఎక్కువగా ఖాళీగా ఉంటాయి కాబట్టి ఎవరైనా లిఫ్ట్ ఇచ్చేస్తారు. ఆడపిల్ల ఎవరైనా పరాయి మగవాడితో అలావెళ్ళడానికి భయపడదు. వారిని ఎవరూ రేప్ చెయ్యడానికి ప్రయత్నించరు. ఆ స్త్రీ పర్మిషన్ లేనిదే స్త్రీ ఒంటిమీద చెయ్యివెయ్యరు వారు. నూటికి కోటికి తాగినమైకంలో రేప్ జరిగినా వారంతగా బాధపడరు. పెళ్ళికాక ముందు ఎంతమందితో తిరిగినా శారీరకంగా ఒకటి అయినా పెళ్ళయిన స్త్రీలు చాలావరకూ నిజాయితీగానే ఉంటారక్కడ.

ఆ అమ్మాయిలు హరి, శృతిలకు 'థాంక్స్' 'గుడ్‌నైట్' చెప్పి వెళ్లిపోయారు. వారికే కాదు. బంధువుల్లోగాని స్నేహితులలోగాని ఎవరికీ తెలియదు. ఆ దంపతుల జీవితంలో గుడ్‌నైట్ అనేదే లేదని అన్నీ బేడ్ గానే మిగిలాయని. ఆ రహస్యం వారిద్దరి మధ్యనే ఉంది. అతి రహస్యంగా ఇంతవరకూ సంతృప్తిని మించిన సుఖం లేదన్నట్లు శారీరక సుఖం లేకపోయినా సంసారాన్ని చూసుకొని సంతృప్తిగా జీవించడం అలవాటు చేసుకొంది శృతి.

డాక్టర్ పద్మనాభరావు తీసికొచ్చిన అనాథ అమ్మాయి భారతి బాగానే సెటిల్ అయిపోయిందక్కడ. చాలా త్వరగా ఇంగ్లీషు నేర్చుకొంది. మెట్రిక్‌వరకూ చదువుకొంది. ఆమె ఉండే అనాథాశ్రమంలో నర్స్‌లు ఉండేవారు. అందుకే అంతకుముందే ఇంగ్లీషు ఫ్యూయంట్‌గా రాకపోయినా చాలావరకూ వచ్చు. స్వతహాగా తెలివైన పిల్ల కాబట్టి ఐరిష్ ఏక్సెంట్‌ని కూడా త్వరగా పట్టేసింది. ఇంటి పని బ్రహ్మాండంగా చేసేస్తుంది. మృదుల పుట్టింట్లో ఎంత సుఖపడిందో అంత సుఖంగానూ ఉంది ఆమెకు, భారతి వచ్చిన తరువాత. ఆ అమ్మాయి అంత అందగత్తె కాదు కాని చురుకైన పిల్ల. చిరునవ్వే వెలలేని ఆభరణాలు, అందచందాలు అన్నట్లుంటుంది. పళ్ళు కొద్దిగా పెద్దగా ఉన్నా ఆమె సదానవ్వుతో ఉండే ఆ మొహంలో ఆలోటు కనిపించదు. ఎవరినైనా ఇట్టే పరిచయం చేసేసుకుంటుంది. ఎప్పుడు టూత్‌పేస్ట్ ఎడ్వర్‌టైజ్‌మెంట్‌లాగే కనిపిస్తుంది తెల్లని పళ్ళతో. వయసువస్తే వంకర కాళ్ళు తిన్నన అంటారు. ఆమె టీనేజ్‌లో ఉంది. వయసు తెచ్చిన మార్పులలో శరీరం నల్లగా ఉన్నా నిగనిగలాడుతూ ఉంటుంది. ప్రొద్దున్న రావుగారు మృదుల పిల్లలను తీసుకొని వెళ్ళిపోతారు. ఇంక భారతి చూడవలసింది ఆఖరు బాబునే. ఆమె పనిలో చాలా ప్రవీణురాలు. గబగబా ఇంటిపని, వంటపని ముగించేసుకొని

బజారు పని కూడా తనే చేస్తుంది. అందుకే మరీ హాయిగా ఉంది భారతి రాక మృదులకు. భారతి ఒక తల్లిలాగే కనబడుతుందిగాని మృదులకు, వయసులోనున్న పిల్లలాగ అనిపించదు.

ఆ రోజు కూడా అలవాటు ప్రకారంగా చిన్నబాబుని ప్రామ్‌లో కూర్చోబెట్టి ఇంటికి తాళంవేసి బజారుకి బయలుదేరింది. తీరా తాళం వేసిన తరువాత గుర్తుకి వచ్చింది. ఆ రోజు లక్ష్మివారం, చెత్తతీసికెళ్ళే లారీ వస్తుందని. మరలా గబగబా తాళం తీసి చెత్త డబ్బా బయట రోడ్డు ప్రక్క పుట్‌పాత్ మీద పెట్టేసి తిరిగి ఇల్లు లాక్ చేసేసింది. ఆ రోజుగాని చెత్తడబ్బా బయటపెట్టడం మరచిపోతే మరలా వారం వరకూ లారీ రాదు. బాబుని తీసుకొని షాప్‌కి వెళ్ళింది. ఆ షాప్‌లో పనిచేస్తున్న శేఖర్‌ని చూస్తుంటే ఒళ్ళు తెలియదు భారతికి. అతనూ అంతే మన ఇండియన్ కదా అన్న దృష్టితోపాటు ఫరవాలేదు వయసులో ఉన్న పిల్ల బుట్టలో వేయవచ్చునన్నట్లు చూస్తాడు. ఆ చూపులు తిన్నగా ఆమె గుండెనే తాకుతాయి.

గబగబా షాపింగ్ ముగించుకుని ఇంటికి వచ్చేసింది కాని భారతి మనసుని మాత్రం శేఖర్ దగ్గరే వదిలేసింది. ఆ షాప్‌లో భారతి ఏరోజు డబ్బు ఆ రోజు ఇవ్వదు. డాక్టర్ రావ్‌గారు నెలకొకసారి అంతా లెక్కచూసి ఇచ్చేస్తారు. అక్కడివారు మోసం చెయ్యరు కదా అన్నది ఆయన ధ్యాస. కాని సామానులు తెచ్చేది మన జాతి అమ్మాయి, మోసమంటే వెన్నతోపెట్టిన విద్య ఆమెకు - అని గమనించలేదాయన. భారతి శేఖర్‌ని ఆ షాప్‌లోని వారిని ఎలా టేకిల్ చేసిందోగాని పదిపౌండులు ఖర్చు అయితే పన్నెండు పౌండ్సు అని డాక్టరుగారి దగ్గర షాపువారితో వసూలు చేయించి మిగిలిన రెండు పౌండ్సు ఆమె సీక్రెట్‌గా తీసుకొనేది. ఆ డబ్బును పోస్టాఫీసుకి తీసుకొని వెళ్లి పోస్టల్ ఆర్డర్ తీసుకొని ఇండియాకి తనకు తెలిసిన వారికి పంపించేది. తన ఇంట్లో జరుగుతున్న మోసాలు మృదులకు కూడా తెలియదు. ఆమెను అంతగా నమ్మింది. నమ్మకం మనిషికి ఎంతో మంచిదేగాని కొంచెం మోసం చేసే మనస్తత్వం గలవారిని ఒక కంట కనిపెట్టి ఉండాలి.

క్రిస్‌మస్‌తో ఊరంతా హడావిడిగా ఉంది. ఎక్కడ చూసినా సంతోషం వెల్లివిరుస్తుంది. రంగురంగుల బట్టలు, రకరకాల బొమ్మలు, స్వీట్లు, డ్రింక్స్ - ఒకటేమిటి ఎవరికి తోచింది వారు ఎవరి తాహతుకి తగినట్లు వారు ఆత్మీయులకు, స్నేహితులకు సన్నిహితులకు ప్రెజంటేషన్స్ ఇచ్చుకుంటున్నారు. హాస్పిటల్ ప్రతీవార్డులోను అందంగా క్రిస్‌మస్ ట్రేలను అమర్చారు. ఎవరి క్రిస్‌మస్ ట్రే బావుంటుందోనని వారికే ఆశగా ఉంది. మాది బావుండాలంటే మాది బావుండాలని అందరూ ఆత్రపడుతూ మరీ డెకరేట్ చేసారు. ట్రేనిండా బల్బులు, పువ్వులు, క్రిస్‌మస్ గ్రీటింగ్స్‌తోనూ అలంకరించారు. శృతి, హరి అందరి వార్డులలోని సిస్టర్స్‌కు హాట్ డ్రింక్స్‌కొని ఇచ్చారు. వారు శృతికి

స్ప్రేను, హరికి టైలను ప్రజెంట్‌చేసారు. హాస్పిటల్‌లోని వార్డులన్నీ ఖాళీగానే ఉన్నాయి. క్రిస్మస్‌కి ముందురోజే చాలా మందిని డిస్‌చార్జ్ చేసేసారు. సీరియస్ కేసులను మాత్రమే ఉంచారు హాస్పిటల్‌లో. శృతికి కొంచెం విశ్రాంతిగానే ఉంది క్రిస్మస్ పేరు చెప్పి. ఇంటి దగ్గర చీరకు ఎంబ్రాయిడరీ మొదలుపెట్టింది. శృతి తాను వచ్చేటప్పుడు కొన్ని చీరలే తెచ్చుకొంది కాని అక్కడకు వచ్చి చవకలో ప్లెయిన్ నైలెక్స్ చాలా కొనింది. ఆ చీరలను చూడగానే ఆమెలోని చేతి కళ గెంతుకుంటూ బయటకు వచ్చింది. ఎంబ్రాయిడరీ బుక్‌కొని ఎంబ్రాయిడరీ మొదలుపెట్టింది. హరి ఆమె చీర మీద ఎంబ్రాయిడరీ డిజైన్ వెయ్యడం రంగుదారాలు కొన్ని తెచ్చిపెట్టడం లాంటి సహాయం చేస్తున్నాడు.

శిల్ప మాత్రం పనిజరగకుండా అల్లరిచేస్తూ పనికి ఆటంకం కలిగిస్తోంది. శిల్పని ముద్దుగా కసురుతూనే పనిచేస్తుంది శృతి. చీరకు ఎంబ్రాయిడరీ ఫ్లవర్స్ కార్బన్ పేపర్‌తో కాపీ చేస్తూ 'ఈ చీర శృతి శరీరం మీద లేనప్పుడు మాత్రమే ముట్టుకోగలను. ఆమె శరీరం మీదను చేరిన తరువాత శృతితోపాటు చీర కూడా దూరమవుతుంది' అనుకున్నాడు హరి. ఆ చీరను పట్టుకొని అందులో శృతి అందాల్నీ హొయల్లనీ ఊహించుకుంటూ ఊహాలోకంలో విహరించసాగాడు. శిల్పకు స్నానం చేయిస్తుంది శృతి. ఇంటిపని ఇద్దరూ కలసి చేసుకుంటారు. ఈపని నీది ఆపని నాది అనే భేదం లేదు. ఇది మన ఇద్దరి ఇల్లు అన్నట్లుగా ఉంటుంది వారి ప్రవర్తన. నిజానికి అంతేకదా మరి. ఇద్దరూ కలసి హాస్పిటల్‌కు వెళ్ళడం కలసి పనిచేసుకోవడం అంతా చూస్తుంటే చూసేవారికి అందమైన జంట, అన్యోన్యమైన దాంపత్యం అనిపిస్తుంది. వారి దాంపత్యం నివురుగప్పిన నిప్పు అని ఎవరికీ తెలియదు.

గాల్వే వెళ్ళడానికి ట్రాన్స్‌పోర్ట్ ప్రాబ్లమ్ ఎలాగ అన్న సమస్య వచ్చింది వారికి. ఇంతలో హాస్పిటల్‌లోని ఒక డాక్టరుగారు గాల్వే వెళుతున్నాను అంటే వారితో కూడా వెళ్ళిపోయారు. త్వరలోనే కారు కొనుక్కోవాలి అనికున్నారు. అప్పటికి వచ్చి నాలుగు నెలలైంది. ఈ నాలుగు నెలలోనే వీణ పెళ్ళికి కొంత, ప్రయాణానికి చేసిన అప్పుకి కొంత కట్టవలసి వచ్చింది. శిల్ప ఒక్కతే కాబట్టి ఇన్‌కంటాక్స్ ఎక్కువ. చిన్న కుటుంబమే చింతలు లేని కుటుంబం అని ఒక దేశంపాట పాడుతుంటే ఎక్కువ సంతానం మిక్కిలి సంతోషం అని మరో దేశం చాటి చెబుతుంది. దారిపొడుగునా మంచుపడుతూనే ఉంది. చలిలోనే ప్రయాణం చేసారు వారు. ఆ దేశం వాళ్ళకు మంచులో డ్రైవింగ్ అలవాటే కాబట్టి ఆ డాక్టరుగారు చాలా సునాయాసంగా కారు డ్రైవ్‌చేసారు. మంచుపడిన చోట అక్కడక్కడా జారకుండా కంకరవేసారు రోడ్డుమీద. శృతి, హరి వెళ్ళేసరికి వర్మకొడుకు శశాంక ఇల్లు కడుగుతున్నాడు మంచుతో. మొహంలోని ముక్కు, కళ్ళు, నోరు తప్పించి శరీరంలో ఏ భాగమూ కనిపించడంలేదు. ఆ అబ్బాయికి. ఎస్కిమోలాగ ఉన్నాడు. ఓవర్‌కోటు, టోపి, మోకాళ్ళ వరకూ ఉన్న బూట్లు, గ్లవ్స్‌తో చలి బాధ నుండి

తప్పించుకుంటూ ఇండియాలో ఇసక గూళ్ళు కట్టినట్లుగా మంచుతో మనిషిని తయారుచేస్తున్నాడు. ఆ అబ్బాయికి ఇరుగుపొరుగు అబ్బాయిలు కూడా సహాయం చేస్తున్నారు. ఆ దృశ్యం చూడడానికి చాలా మనోజ్ఞంగాను, ఉల్లాసంగాను ఉంది. ఎవరు పెద్ద మంచు మనిషిని తయారుచేస్తే వారికంత గొప్ప. ఆ మనిషికి ముక్కు, చెవులు, టోపీ పెడతారు. సరదాగా ఆ స్నోమేన్‌లనన్నిటిని మర్నాడు టివిలో చూపిస్తారు. కాని అంతటి చలిలో ఒక్కోసారి చేతులు గడ్డకట్టి రక్తాలు కూడా వస్తాయి కొందరికి. అక్కడ ఉన్న రెండు రోజులు శృతికి హరికి రోజులు నిమిషాల్లాగ గడచిపోయాయి. ఈ సంతోషకరమైన రోజుల్ని కాలగతిలో కలిసిపోనీయకుండా పట్టుకొని ఆపగలిగితే ఎంత బావుణ్ను అనుకొంది శృతి. తిరుగు ప్రయాణంలో టాక్సీలో వారి ఊరికి వచ్చారు. వచ్చిన దగ్గరనుండి ఇంక అంతా రొటీనే; నిరాశ, నిస్పృహలతో సహా - వారికి.

ఆ రోజు సాయంకాలం ఎదురింటి అమ్మాయి గిరిష్‌ని వెంట బెట్టుకొని వచ్చింది. గిరీష్ మహారాష్ట్రియన్. వయసు 25 సంవత్సరాలు. ఇంకా పెళ్లికాలేదు. ఇండియాలో కొన్ని లక్షలకట్నానికి చాలా సులువుగా అమ్ముడుపోయే అన్ని లక్షణాలు ఉన్నాయతనికి. ఎన్ని అవలక్షణాలూన్న మగవాడిగా పుట్టిన వారందరూ కట్నాలకు ఎగబడుతుంటే ఎన్నో ప్లస్ పాయింటున్న మగవాడు భారతదేశంలో తల్లిదండ్రులకు ఒక బంగారుకొండ. అంతే కాదు ధనవంతులైన అత్తమామలకు కొండమీది కోతికూడా.

గిరీష్, శృతికి 'హల్లో' అని విష్‌చేసి సిటింగ్ రూమ్‌లో కూర్చున్నాడు. అప్పుడే హాస్పిటల్ నుండి వచ్చిన హరికి కూడా తనని తాను పరిచయం చేసుకున్నాడు. గిరీష్ ఎమ్‌బిఎ ఇంగ్లాండ్‌లో చేసి ఐర్లాండులో ఆ ఊరికి మొదటి పోస్టింగ్‌లో వచ్చాడు. ప్రస్తుతం కంపెనీ ఖర్చులతో హోటల్లోనే ఉంటున్నాడట. 'మీకు అభ్యంతరం లేకపోతే ఇల్లు అద్దెకి దొరకేవరకూ మీ ఇంట్లో ఉంటాను' అన్నాడు. ఆ మాటతో వారికి చాలా సంతోషం కలిగింది. అన్నదమ్ములు లేని శృతికి ఆ అబ్బాయి దేవుడు పంపించిన తమ్ముడిలాగ అనిపించాడు. అప్పటినుండి గిరీష్ కూడా ఆ ఇంట్లో ఒక మెంబరైపోయాడు. కదలికలేని సరస్సులా ఉన్న ఆ మనసులకు ఆ అబ్బాయి రాకతో కొంచం చలనం సంచలనం కూడా వచ్చాయి. రాగానే శిల్పకు మరీ దగ్గరైపోయాడు గిరీష్.

గిరీష్ శృతిలాగే ప్యూర్ వెజిటేరియన్. పేద కుటుంబంలో పుట్టిన గిరీష్ ఎవరో స్నేహితుని ద్వారా అప్పు తీసుకుని ఇంగ్లాండ్ వచ్చి చదివాడట. డబ్బు దగ్గర చాలా జాగ్రత్త. ఒక రూపాయి సంపాదనలో 90 పైసలు మాత్రమే ఖర్చుపెట్టాలనే ఖచ్చితమైన అభిప్రాయం అతనిది. అతను వెజిటేరియన్ అయినప్పటికి హోటల్లో సర్వర్‌లా పనిచేసాడట. అక్కడ అన్ని మాంసాహారపు హోటళ్ళే మరి. అవి తప్పని పరిస్థితులలో తప్పని పని తప్పుకాని పని అయిపోయింది అతనికి. నేను ఎవరినీ హత్య చెయ్యలేదు, ఎవరినీ దోచుకోలేదు నా కాళ్ళమీద నేను నిలబడడం కోసం సర్వర్‌గా చేసాను, తప్పా?

అంటాడు. మెడమీద తల; తల్లో మెదడు ఉన్న వాడెవడూ అది తప్పని అనడు. ముందుగా అప్పులు తీర్చాలి. అప్పుడుగాని అసలు జీవితంలోకి ప్రవేశించకూడదు అంటాడు.

మర్నాడు సాయంకాలం గిరీష్, హరి, శృతి సిట్టింగ్ రూమ్‌లో కూర్చుని టీవీ చూస్తున్నారు. శిల్ప కార్పెట్ మీద బొమ్మలను విసురుతూ శబ్దం చేస్తూ ఆడుకుంటుంది. క్రింద అంతా చెక్కవేసి దానిమీద కార్పెట్ వేస్తారు చలి తగ్గాలని. దానితో చాలా శబ్దం వస్తుంది ఆ ఆట. శృతివెళ్ళి ఆ బొమ్మలను చేతిలోనుండి తీసికోగానే బేర్ మంది శిల్ప. వెంటనే వెళ్ళి గిరీష్ ఎత్తుకొని నిముషంలో ఊరుకోబెట్టేసాడు. తనను మామా అని పిలవమని కూడా నేర్పడం మొదలుపెట్టేసాడప్పుడే. అక్కడకు వచ్చిన తరువాత అంగా, ఉంగా తరువాత మొదట పలికిన మాట శిల్ప నో అన్నమాట. అది చెప్పగానే నవ్వేసాడు గిరీష్. 'చిట్టి తల్లీ దేనికీ నో అనకూడదమ్మా ప్రతీదానికీ నో అంటే ఎన్నో మిస్ అయిపోతావు జీవితంలో' అన్నాడు సరదాగా. ఏదో అర్థం అయినట్లే కిలకిలా నవ్వింది శిల్ప. శిల్ప నవ్వితే శృతినవ్వినట్లే ఉంటుంది అచ్చంగా. తిరిగి అన్నాడు 'ఆ చిన్న పిల్లకు ఏమీ అర్థం కాదని తెలిసినా, పెద్దదైన తరువాత పరాయి మగవాడు దరిచేరబోతే మాత్రం నోటితోనే కాదు. కరాటే ఫైట్‌లో కూడా నో అని చెప్పాలి తెలిసిందా' అన్నాడు. ఒక మూర్ఖుడైన మగవాడి పశుత్వానికి బలి అయి ఇంక బ్రతకలేక ఆత్మహత్య చేసుకున్న తన చెల్లెలి రూపం గిరీష్ కళ్ళల్లో మెదలాడింది. ఆ రూపం కన్నీళ్ళతో కళ్ళల్లోనే కరగిపోయి బయటకు రానావద్దా. ఈ గదిలో వేరేవాళ్ళు ఉన్నారు అని అక్కడే ఆగిపోయింది. కాని కళ్ళల్లో ఉండలేకపోయింది ఆ రూపం. కన్నీళ్ళతో కలసి బయటకు వచ్చేసింది, రహస్యంగా. చెల్లెలి మరణం తరువాత ప్రతీ స్త్రీలోనూ చెల్లెలినే వెతుక్కుంటాడు గిరీష్. కాని ఆ సంగతి తెలియని ఆ పాశ్చాత్య వనితలు అతని కోసం ఆ ఇంటికి రాకపోకలు ఎక్కువ చేసారని వారికి తెలియదు. పెళ్ళికాని యువకుడనే సరికి వారికీ నోరూరుతుంది మరి. భాగస్వామి అయితే బావుండుననే తలంపులో గిరీష్‌కి వివాహమనే లాటరీలో ఏ ఆడపిల్ల దొరుకుతుందో మరి.

భారతి, ఆ రోజు కూడా ఎప్పటిలాగే బజారుకి బయలుదేరింది, చిన్నబాబుని తీసుకొని. ఆమెకు వయసు తెచ్చిన అల్లరిని కంట్రోల్ చేసుకోవడం కష్టంగా ఉంది. భారతి ఆ దేశానికి వచ్చేసరికి సెప్టెంబర్ నెల అది. అదింకా వేసవి కాలం. దేశమంతా ఒకేసారి స్ట్రయిక్ చేస్తున్నట్లు దేశంలోని ప్రజలంతా ఒకేసారి స్ట్రీకింగ్ చేస్తున్నట్లుగా అనిపించింది ఆమెకు. ఎక్కడ చూసినా అతిచిన్న బాడీలతోను, మరీ చిన్న పేంటీలతోనూ అమ్మాయిలు వట్టి కట్ డ్రాయరులో అబ్బాయిలు ఎండలో వెల్లకిలాపడుకొని సూర్యరశ్మిని ఒంటికి పట్టించుకునేవారు. తెల్లటివారి శరీరంపై ఆ చిన్న బట్టలు ఎంతో అందంగా అనిపించేవి. ఆ పావుగజం బట్టలు ఉన్నా లేకపోయినా



ఒకటే అన్నట్లు ఆకులు మొలకు చనుమొనలకు చుట్టుకున్నట్లు అనిపించేది. అందుకే స్ట్రీకింగ్‌కి, సన్‌బాతింగ్‌కి పెద్దతేడా లేదనిపించింది భారతి. ఆ సన్నివేశాలు అమ్మాయిలు అబ్బాయిలు కలిసి అక్కడక్కడ ముద్దు పెట్టుకునే దృశ్యాలు భారతిలో చాలా అలజడిని రేపాయి. సముద్రంలో సుడిలా ఆమె ఆలోచనలను అటువైపే లాక్కుని వెళ్ళేవి.

మృదుల హౌస్‌కీపర్ ఆ మంచం మీద బోయ్ ఫ్రెండ్‌తో శృంగార క్రీడలు సాగించిందని తెలిసి ఆ దుప్పట్లు కాల్చేసింది. మరి ఈ సారి భారతి విషయంలో ఏం చేస్తుందో. శేఖర్‌నేరుగా ఇంటికే వచ్చేస్తున్నాడు. షాప్‌లో పనికాగానే అతనికి షాప్‌లో కాలునిలపడంలేదు. పోస్టల్ ఆర్డర్స్ తీసుకొని ఆమెకు తెలిసిన వారికి ఇండియాకు పోస్టు చేసి పెడుతున్నాడు కూడా.

'హాయ్' అన్న పిలుపు విని వెనక్కి తిరిగి చూసింది శృతి. ఎదురుగా ఆ

ఊరిలోనున్న మరో భారతీయ స్త్రీ, కళిక. ఆవిడ జాబ్ చెయ్యరు. భర్త బెనర్జి హాస్పటల్‌లో పనిచేస్తారు. శిల్ప పుట్టిన రోజు తరువాత మరలా కలవలేదు వారు. ఆరోజు డిసెంబర్ 31. మర్నాడు న్యూ ఇయర్‌కి పాపకు ఫ్రాక్ కొనాలని వచ్చింది శృతి.

'బావున్నారా' అని శృతి అంది.

'బాగానే ఉన్నాము. మీరు మా యింటికి ఒకసారి రండి' అంది. ఆవిడ, తిరిగి అంది. 'అప్పుడెప్పుడో మీ చెల్లెలుకి పెళ్ళి అని ఫోన్ చేసినప్పుడు చెప్పారు కదా! ఎలా ఉంది ఆవిడ. బావున్నారటనా? పెళ్ళికి మీరు వెళ్ళలేదు కదూ'

'వెళ్ళలేదండి. మేము వచ్చి యింకా నాలుగు నెలలేగా అయింది. అప్పుడే ప్రయాణమంటే ఎలాగ మీకు తెలుసుకదా'

'వీణ అత్తవారి ఊరు ఏ ఊరు'

అమలాపురం దగ్గర ఏదో పల్లెటూరు. అందుకే భర్తకు అక్కడే ఉద్యోగమైనా అక్కడే ఉంటూఉంటుంది.

'అబ్బ పల్లెటూర్లో బోరండి బాబు. ఈ రోజుల్లో ఎవరుంటున్నారు. మీ వీణ కాబట్టి ఉంటుంది గాని. నేనైతే సంసారమూ వద్దూ, మొగుడూ వద్దని మూడో రోజుకే పరిగెత్తుకు వద్దును' అంది, అదేదో పెద్ద గొప్పగా.

'అసలు మీరైతే పల్లెటూరి సంబంధానికే ఒప్పుకునేవారు కాదేమో కదా' అంది శృతి.

'నిజమే. చాల కరెక్టుగా ఊహించారు. నేను సిటీలోనే పుట్టాను, సిటీలోనే పెరిగాను, సిటీలోనే మెట్టాను' అంది.

పల్లెటూరి గురించి అక్కడ బ్రతికే వారి గురించి చీదరింపుగా కళిక మాట్లాడు తోంటే పెరిగేదేమొ పట్టణవాసం, మేసేదేమో పల్లెల గ్రాసం అన్న మాటలు గుర్తుకి వచ్చాయి శృతికి.

పల్లెటూరి వారంటే అంటరానివారు అన్నట్లు మాట్లాడుతుంది కళిక. అసలు లోకంలో అంటరానివారు మాత్రం ఎవరున్నారు. మనిషి ఆలోచనలో తేడాలు కాని, అవి మనిషి పుట్టుకలో కదా. సృష్టి, వాన, వరదలు, ఎండ, గాలి, నీరు అందరికీ సమానమే. ప్రకృతి అందరిదీ, గాలి అందరిది. అది ఏ కొందరిదో కాదు, కులాల లాగ. శ్వేతజాతీయులకు నీగ్రోలు అంటరాని వారు, భారతదేశంలో అగ్రకులాల వారికి హరిజనులు అంటరానివారు. ఇప్పుడు క్రొత్త సంగతి. పట్నవాసం వారికి పల్లెలవారు అంటరానివారు. అందరూ మనుషులైనా, అందరిలోనూ రక్తం, దాహం, కోరికలు, సుఖరోగాలు ఉన్నా అందరూ రకరకాల వారు. రంగురంగులవారు.

వారిసంభాషణ చాలాసేపు వీణ సంసారంమీద, తమ సంసారాల మీద జరిగింది. కళిక సంభాషణ ఏమీ రుచించలేదు శృతికి.

కళికతో మాట్లాడుతుంటే, ఎదుటివారి గురించి ఆరాతియ్యడం, ఎదుట వారిలో ఉన్న లోపాలు ఎత్తిచూపడం, తనకు నచ్చని వారిని నిందించడం తప్ప ఆమెకు యింకా మాట్లాడే టాపిక్స్ లేవనిపించింది శృతికి. కొందరితో మాట్లాడుతుంటే ఎన్ని గంటలయినా కాలం తెలియదు. కొందరు పోట్లాడినట్లు మాట్లాడుతుంటే వాచీ చూసుకోక తప్పదుమరి.

ఈ ఐరిష్ వాళ్ళని, వీళ్ళబోయ్ ఫ్రెండ్స్‌ని, విచ్చలవిడి తనాన్ని దుయ్యబట్టింది కొంతసేపు. ఆ అమ్మాయి చాలాకాలం ఆంధ్రలో వుంది. తెలుగు అనర్గళంగా మాట్లాడేస్తుంది. చక్కటి తెలుగు నేర్చుకొని అందులోని తిట్లకు మాత్రమే ఆ భాషను ఉపయోగిస్తున్నట్లనిపించింది శృతికి. ఆమె సంభాషణ అసహజంగాను, అసహనంగాను ఉంది.

"ఇక్కడ కొందరి స్త్రీలకు తనపిల్లలకు తండ్రెవరో తెలియదు. మీకు తెలుసా ఈ సంగతి'' అంది. చంద్రమండలంలో కాలు పెట్టినంత గొప్పగా.

"అవును. మరి ఏం చేస్తారు. వారి సాంఘిక విధానాలు అటువంటివి. తల్లిదండ్రులు పదమూడేళ్ళు వచ్చేసరికి యింక పిల్లల గురించి అంతగా పట్టించుకోరు. వారి భాగస్వాములను, స్త్రీలు వారే చూసుకోవాలి. వారికాళ్ళ మీద వారే నిలబడడానికి ప్రయత్నించాలి. రెక్కలు రాని పక్షులు వారు అప్పటికి. జీవన పోరాటంలో శీలాన్ని కోల్పోవడం ఆ వయసులోనే వారికి అలవాటయిపోతుంది.''

'ఆ మీరెన్నయినా చెప్పండి. ఆడదానికి శీలం లేకపోయిన తరువాత బ్రతికి ఉన్నా, చచ్చినా ఒక్కటే' అంది విసురుగా.

"నిజమే అది మన భారత స్త్రీలకు. కాని ఇక్కడి పరిస్థితులకు అనుకూలంగా వారు ప్రవర్తిస్తున్నారు. దానికి మనం తప్పుపట్టకూడదు. శీలం పోయినవారు చావాలని మనం అనుకుంటే అసలు పాశ్చాత్య దేశాల్లో ఆడపురుగు అన్నదే మిగలదు. మన దేశంలో మాత్రం ఎంతమంది లేరు యిలాంటి వారు మనదేశంలోని వారు కావాలని కాలు జారకపోయినా కాలం పగబట్టి కొందరిని కాటువేస్తుంది కదా, మగవాడి రూపంలో. ఎందరి జీవితాలు నాశనం కావడం లేదు'' అంది శృతి. ఆ షాప్‌లో మాటలు పెంచడం ఆమెకు ఇష్టంలేదు. కాని ఆమెకు అన్ని సంగతులు అర్థం అయ్యేలా చెప్పాలన్నది ఆమె ఆరాటం. ఎదుటివారిని ఊరికే నిందించకూడదు అన్న సంగతి బోధించాలని తాపత్రయం. అక్కడ మనుషులు మనలాగ డబ్బాలో రాళ్ళువేసి గలగలలాడించినట్లు, ఊరికే మాట్లాడరు. రోడ్డుమీద వెళుతున్నా, చాలావరకు మాటలు రాని మనుషులు నడుస్తున్నట్లే అనిపిస్తుంది. తక్కువ మాట్లాడినవారు ఎప్పటికి ఉన్నతులే అన్నట్లుంటారు వారు.

షాప్‌లోని వారు ఇండియన్స్ అన్న క్యూరియాసిటీలోనూ, వారు మాట్లాడుకునే విధానానికి, భాష అర్థం కాకపోయినా వింతగా చూస్తున్నారు.

కళికకు శృతి అక్కడి స్త్రీలను వెనవేసుకొని రావడం తనతో ఏకీభవించకుండా వాదించడం నచ్చలేదు. మొహం నిప్పుమీదపడకుండానే ఉప్పు పటపటలాడినట్లు చిరాకుపడింది. కళికను చూస్తే 'మనుషులతోనే' మాట్లాడడం అలవాటుచేసుకో తల్లీ అన్న తండ్రి మాటలు గుర్తుకి వచ్చాయి శృతికి.

మనిషి అన్న తరువాత మంచిగా మాట్లాడడం, మానవత్వంతో మెలగడం, మానవ సేవయే మాధవ సేవ అని తలపోయడం చెయ్యాలి అని ఆయన ఎప్పుడూ చెప్పేవారు. రాక్షసత్వంగా ప్రవర్తించేవారికి దూరంగా ఉండమనేవారు. మంచి స్నేహితులు మంచి పుస్తకాలలాంటివారు. వారితో ఎంత సమయం గడిపినా జీవితం వృధా కాదు. ఎక్కువ పుస్తకాలను చదవడం అలవాటు చేసుకోమని చెప్పేవారు శర్మగారు. ఉత్తమ వ్యక్తిని రూపొందింపజేయడమే విద్య పరమార్థం. మనిషికి సంస్కారం కొంతయినా విద్య వలన వస్తుంది. కళికలాంటి వారు చదువుకున్న మూఢులు. ఎప్పుడూ తమ తప్పులు దాచిపెడుతూ నీతులెప్పుడు ఎదుటివారికే అనే తత్వం వారిది. అందుకే ఎదుటి వారిని నిందిస్తూ విమర్శిస్తూ ఉంటారు. తామొక గురివింద అని వారికి తెలియదు.

వారు మాటల్లోపడి షాప్‌లో ఒక పేకెట్ మరచిపోయారు. అది శృతిదే. ఆ మర్నాడు ఆదివారం కావడంతో, సోమవారం శృతికి షాప్ నుండి ఫోన్ వచ్చింది. మాషాప్‌లో ఎవరో పేకెట్ మరిచిపోయారు. అది మీ ఇండియన్స్‌దే. మీలో ఎవరిదో మాకు తెలియదు. వేరే వాళ్ళఫోన్ నెంబరు తెలియదు. మీదైతే వచ్చి తీసికొని వెళ్ళండి, ఆవిడదైతే ఆవిడకు ఫోన్‌చేసి చెప్పండి ఈ సంగతి' అని.

వాళ్ళ నిజాయితీకి ఆశ్చర్యం వేసింది శృతికి. ఏ వస్తువయినా, ఎన్ని రోజులయినా పరాయివాళ్ళ వస్తువులు వాళ్ళు ముట్టుకోరు. పరాయివాళ్ళ జీవిత కథల గురించి పట్టించుకోరు. ఒక్కో మనిషిలో ఒక్కోమంచి సుగుణం ఉన్నట్లే ఒక్కోదేశంలో ఒక్కోమంచి పద్ధతి.

హాస్పిటల్‌కి వెళ్ళిందిగాని శృతి మనసు చాలా అసహనంగా ఉంది. తను అన్నిటికీ అతీతంగా హరి, శిల్పల సంతోషమే తన సంతోషంగా బ్రతకడం అలవాటు చేసేసుకుంది. కాని హరిమాత్రం తమ నిస్సారమైన, నిస్త్రాణమైన జీవితాన్ని మరచిపోలేకపోతున్నాడు. అంతకుముందు రోజు వాళ్ళ కన్సల్టెంట్ (చీఫ్) జనవరి ఫస్ట్ అని భోజనానికి పిలిచాడు. భోజనానికి ఇద్దరు సరదాగా వెళ్ళారు, శిల్పను తీసికొని వెళ్ళలేదు.

ఇప్పుడిప్పుడే అక్కడి పద్ధతులకు అలవాటు పడుతున్నారు. ఎక్కడికైనా ఫంక్షన్స్‌కి

వెళ్లినప్పుడు పిల్లలను తీసికొని వెళ్ళరువారు. అన్నీ, నాన్ వెజిటేరియన్ డిష్లే. వెళ్ళగానే ముందుగా ఇంటిపెద్ద వచ్చి వారు వేసికున్న ఓవర్ కోట్ తీసికొని జాగ్రత్తగా స్టేండ్కి తగిలించడం వారి మర్యాద. ఆయన అలాగే చేసారు. అదేమీ ఎబ్బెట్టుగా అనిపించడం లేదు.

మొదట్లో మగవారికి షేక్హేండ్ యివ్వడానికి గాబరా పడేది శృతి. ఇప్పుడు అది అలవాటయింది. కాని టేబుల్ మీద అన్నీ నాన్ వెజిటేరియన్ ప్రిపరేషన్స్, చికెన్ చికెన్లాగ, ఫిష్ ఫిష్లాగ, బీఫ్ని ఎద్దులాగ: అన్నీ చూసేసరికి ఒక్కసారిగా కడుపులో తిప్పినట్లయి వాంతి చేసేసుకొంది. ఆమె వెజిటేరియన్ అని వారికి తెలియదు. అసలు లోకంలో వెజిటేరియన్స్ ఉంటారనే తెలియదు వారికి. ఆమె వికారాన్ని మరో విధంగా అర్థం చేసుకొని కన్సల్టెంట్ భార్య లిండా 'మోర్నింగ్ సిక్నెస్సా' అని అడిగింది. ఆ మాటకు తానైతే తమాయించుకొందిగాని హరిముఖం మాత్రం బొగ్గుకంటే అన్యాయంగా నల్లగా మాడిపోయింది. ఆ విషయం శృతి మాత్రమే గమనించింది. మిగిలిన వారికి అది మామూలు మాటే. కాని ఆ దంపతుల కది వేయి శూలాలపోటు.

డిన్నర్లో అతని మూడ్ని ఎంత మార్చాలని ప్రయత్నించినా శృతి వశం కాలేదు. అతనిది ఆవేశంతో కూడిన కోపం. తన బ్రతుకుని, తన నిరర్థకమైన జీవితాన్ని చూసి తనమీద తనకే కసి. మర్యాదకోసం మౌనంగా ఉండి, మనసు రగులుతున్నా పైకి నవ్వుతూనే వారి దగ్గర మర్యాద దక్కించాడు.

కాని ఇంటికి వచ్చి 'నీకన్యాయం చేస్తున్నాను కదూ' - అంటూ చిన్నపిల్లాడిలా ఏడుస్తుంటే ఎలా ఓదార్చాలో కూడా అర్థం కాలేదు శృతికి. దగ్గరకు వెళ్ళి ఆప్యాయంగా కన్నీరుతుడిచే భాగ్యాన్నికూడా ప్రసాదించలేదు భగవంతుడు. ఎన్ని మనస్తాపాలున్నా పరాయివారిలాగే పాలుపంచుకొంటున్నారు. ఒకరి ఒడిలో ఒకరు ఒకరి స్పర్శతో ఒకరు మనసుని సమాధానపరుచుకునే అవకాశం లేదు తమకి. ఆ రాత్రంతా కన్నీళ్ళతోనే కాలక్షేపం చేసారు యిద్దరూ. దేవుడా! ఈరోజు ఫస్ట్ తారీఖు. ఆఖరుకి వచ్చే జనవరి ఫస్ట్కయినా మా బ్రతుకులను కొంచెం బాగుచెయ్యి తండ్రీ. జీవితంలో యింకేమీ వరమడగను నిన్ను అనుకుంటూ రాత్రంతా జాగరణ చేసింది శృతి. మరలా హరి ముఖంలో నవ్వుచూసేవరకు ఆమె హృదయానికి శాంతి ఉండదు. అతని సంతోషమే ఆమెకు ప్రాణం.

ఆరోగ్యమైన దేహం పటిష్టమైన మేధస్సుకి పునాది లాంటిదట. హరి తన సంసారంలోని అనారోగ్యంతో తన మనసుని, మేధని కూడా వృధాచేసుకుంటున్నాడు. అది అతని తప్పుకాదు. పరిస్థితుల ప్రభావం.

భర్తను ఆ బాధ నుండి ఎలా దూరం చెయ్యాలన్నది రోజురోజుకి శృతికి పెద్ద

సమస్యలా కనబడుతుంది. తను ఎన్ని ఓదార్పు మాటలు చెప్పినా, తను సంతోషంగానే ఉన్నాను అని ఎన్ని విధాల చెప్పినా అర్థం చేసికోడు. ఏంచేస్తే హరి మనసు నెమ్మది చేసుకుంటాడో అర్థం కావడం లేదు. స్వరాజ్యాన్ని కోల్పోయిన రాజులా భర్త దిగులుగా ఉంటుంటే శృతి ఎంతో వ్యాకుల పడుతుంది. వ్యాధికి అయితే మందువేసి బాగు చెయ్యవచ్చు. మనోవ్యాధికి మందులేదన్నారు అందుకే కాబోలు. యద్దనపూడి హీరో రాజశేఖరంల్లాగ ఉన్న హరి బ్రతుకు పెద్ద జీరోగా అయిపోతుంది.

ఆ బ్రతుకులో తానొక్కడే ఉంటే అంత బాధపడేవాడు కాదేమో, కాని శృతి, శిల్ప అతనికి మరీ ఆవేదన కలిగిస్తున్నారు, కళ్ళుఎదురుగా ఉండి నేను వీరిని సుఖపెట్టలేకపోతున్నాను అన్న భావన అతన్ని నిలువునా కాల్చేస్తుంది. ఒక్కొక్కసారి చచ్చిపోదామా అన్నంత ఆవేశం కలుగుతుంది. కాని శృతి చిరునవ్వుల ముఖము, శిల్ప అమాయకమైన ముఖము అతనిని ఆ పనికి పురిగొల్పడంలేదు.

ఆ జీవితాలకి పరమార్థము లేదు. బ్రతుకులోనున్న గతుకుల్ని జాగ్రత్తగా చూసికుంటూ వెళితే ముందు ముందు మంచి దారి కనబడవచ్చు. గతుకు గతుకని ఆగిపోయి కుంటినడకనడుస్తే జీవితము కూడా కుంటినడక లాగే ఉంటుంది. అందుకే తన సమస్యకు కాలానికి వదిలేయాలని నిశ్చయించుకొంది శృతి. కాలానికి మహత్తరమైన శక్తి ఉంది. శరీరంలో ఎలాంటి గాయాలనయినా మందు మాన్పినట్లే, హృదయాలకు తగిన గాయాల్ని, కాలం తప్పకుండా మాన్పుతుంది. అలా మాన్పకపోతే ప్రతిమనిషి నిరాశ, నిస్పృహలతో కృంగి ఎప్పుడో కృశించిపోయేవాడు.

కోటిసమస్యలకు శతకోటి పరిష్కారమార్గాలుంటాయి.

ఈలోకంలో ఒక్కొక్కరికి ఒక్కొక్క రకమయిన సమస్య. సమస్యల వలయంలో చిక్కుకొని మనిషి అసలు ఉండడు. సమస్యలను సహనంతో ఎదుర్కోవాలి గాని బెదిరిపోకూడదు. అలా ఎదుర్కొనేటప్పుడు సముద్రాన్ని ఎదురీదినంత కష్టంగా కూడా అనిపించవచ్చు. అయినా ఈ జీవన పోరాటంలో ఎదురీతలు, మనసుకోతలు తప్పవు, మనిషి అయిపుట్టినవారికి. అందరి జీవితాలు వడ్డించిన విస్తరులు కాదు. అందరూ పట్టు భోగులు కారు.

అడ్డదిడ్డంగా నున్న బ్రతుకును, అస్తవ్యస్తంగా నున్న జీవితాన్ని మనిషి సక్రమమైన మార్గంలో పెట్టుకొనడానికి చాలా శ్రమపడవలసి వస్తుంది. శ్రమపడిన వారికి తప్పక శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. కృషితో నాస్తి దుర్భిక్షం.

పిచ్చి పిచ్చి ఆలోచనలతో తనకు తనే ధైర్యం చెప్పుకుంటూ హాస్పిటల్‌లో పనిచేస్తుంది శృతి. వీణ వ్రాసిన ఉత్తరం ఆరోజు పోస్ట్‌లో వచ్చింది. అది చూసి మనసు తాత్కాలికంగా శాంతించింది. మండుతున్న గుండెపై చన్నీరు చిలకరించినట్లయింది. కొంచెంసేపు తన బాధను పక్కకు పెట్టి ఉత్తరాన్ని చదవసాగింది శృతి.

అక్కా! నాపెళ్ళి సంగతులన్నీ ఇదివరకే వ్రాసాను కదూ! పెళ్ళిఫోటోలన్నీ కూడా చేరే ఉంటాయి. అక్కా, బావగారి రుణం ఎలా తీర్చుకోవాలో తెలియడం లేదు. ఆడపిల్లల్ని కన్న తండ్రికి అంతమంచి అల్లుడు దొరకడం కంటే తృప్తి ఏముంది. డబ్బు పుణ్యమా అంటూ పెళ్ళి ఏ గొడవలూ లేకుండా జరిగింది గాని, మాది ఉమ్మడి కుటుంబం. తోడి కోడళ్ళు, మరుదులు, మరదళ్ళు, మా అత్తగారి తరఫు ముసలమ్మలు, మా మామగారి తరఫు ముసలమ్మలు అందరికీ నేనొక నేరస్థురాలిలా కనబడుతుంటా ననుకుంటాను.

ఎప్పుడూ నామీద నేరాలు మోపుతూ, వారందరూ ఒకటై నన్ను వేరు చేస్తూ పరిహసిస్తూ ఉంటారు. ఆ పరిహాసాలు సరదాగా ఉండవు. నాకు ప్రాణాంతకంగా ఉంటాయి. పోనీ అందరూ అన్నారంటే అది వేరేవిషయం. మాతోడి కోడళ్ళు కూడ నాలాగా పరాయి ఇంటినుండి వచ్చిన వారేకదా! వారయినా నన్ను ఆప్యాయంగా చూడవచ్చుకదా! వారికంటే నేను ధనవంతురాలిని కాకపోయినా, అందంగా ఉంటానని అసూయ. ఎలా ప్రవర్తించినా తప్పు పడుతుంటే నాకు చాల ఏడుపు వస్తుంది.

చిన్నప్పటినుండి నాన్నగారు మనల్ని ఎంతో క్రమశిక్షణలో పెంచారు. కాని ఆ క్రమశిక్షణకు వీసమంత విలువ కూడాలేదు యిక్కడ. నాకు రోజురోజుకి దినదిన గండంలా ఉంటుంది. మీ మరిదిగారు చాలా ప్రేమగా చూసుకుంటారు గాని, ఇంట్లో పరిస్థితులు అర్థంచేసికోరు. ఆయన దృష్టిలో అందరూ మంచివారే. నిజమే మరి తనవరకూ అందరూ ఎంతో మంచిగా ప్రవర్తిస్తారు. ఎటొచ్చీ నా విషయమే ఆయనకు పట్టదు. నీకేం లోటు యిక్కడ అన్నట్లుంటాయి ఆయన చూపులు.

అసలే పల్లెటూరు కదా! ఏ చిన్నసంగతి జరిగినా రేడియోలా బ్రాడ్ కాస్ట్ కావలసిందే. నేను ఏరోజయినా ఒక చపాతి ఎక్కువచేసినా ఆన్యూస్ ఊరంతా నిమిషంలో పాకి పోతుంది. దుబారా మనిషి అని ప్రచారం అవుతుంది. అలా అన్నారని తెలియక ఒక చపాతి తక్కువచేస్తే ఇంట్లోవారికి సరిగా తిండిపెట్టదు అన్న వార్త ప్రయాణం చేస్తుంది పనిగట్టుకొని. నేను వచ్చిన తరువాత మాతోడి కోడళ్ళకు అంతారెస్టే. కొత్తకోడలు అలాగే కష్టపడి పనిచెయ్యాలట. నేను వారికంటే ఎక్కువ చదువు కొన్నానని వారికి అక్కసు. వరసకు అక్కలుగాని, నన్ను చాల యిల్‌ట్రీట్ చేస్తున్నారు.

అక్కా, ఒక్కొక్కసారి చాలా ఏడుపువస్తోంది. జీవితమంటే యింత బాధాకరంగా ఉంటుందా అనిపిస్తుంది. పాపపుణ్యాలు అనేవి నిజంగా ఉన్నాయేమో. అందుకే కొందరి జీవితాలు సుఖమయంగాను, కొందరి జీవితాలు అయోమయంగాను ఉంటాయి. అన్నీ చిన్నచిన్న మనస్తాపాలే. అవి ఎవరికైనా చెప్పుకుంటే ఒస్ యింతేనా అన్నట్లు అనిపిస్తాయి. కాని అనుభవించేవారికి నరకాన్ని చూపిస్తాయి. కోల్డ్ కిల్లింగ్ అంటే ఏమిటో నాకు ఇప్పుడు అర్థం అయింది మనిషిని కత్తితోనే పొడవనక్కరలేదు, మాటలతో కూడా పొడవవచ్చు, మనసుని నరకవచ్చు. జీవితాన్ని నరకం చెయ్యవచ్చు.

అక్కా! ఏదేదో వ్రాసి నిన్ను బాధపెట్టానేమో, నాకు చెప్పుకోడానికి ఎవరున్నారు చెప్పు. మా ఆయనకు చెప్పి ఆయన్ని బాధపెట్టి, ఆయన దగ్గర నా విలువ తగ్గించుకోలేను. ఎంతయినా వారు ఆయన రక్తసంబంధీకులు. వారు తప్పుగా ప్రవర్తించినా ఒప్పుగానే అర్థం చేసికుంటారాయన. నీకు ఈ ఉత్తరం రాసిన తరువాత నా మనసు తేలిక పడింది. శిల్పకు తియ్యటిముద్దులు. బావగారిని అడిగినట్లు చెప్పు.

ఉంటానిక.

ప్రేమతో... వీణ.

చెల్లెలి బ్రతుకులో చికాకుల గురించి చదివిన తరువాత తన బ్రతుకులో చికాకులను మరచిపోయింది. తనకు జీవితంలో అన్నీ ఉన్నాయి సంసార సుఖం తప్పించి. వీణకు సంసార సుఖం తప్పించి జీవితంలో మరే సుఖమూ లేదు.

ఏమిటో విచిత్రమైన జీవితాలు. వింతయిన బ్రతుకులు. ఇంటికి వచ్చి వెంటనే ఉత్తరం వ్రాసింది. ఎందుకంటే తన ఉత్తరమే వీణకు టానిక్‌లా పనిచేస్తుందని తెలుసు. పనంతా ప్రక్కకు పెట్టి పెన్ను పట్టుకొంది. శిల్ప వచ్చి పెన్‌లాగడం గీతలు గీయడం చేస్తుంది. శిల్పమీద ముద్దుగా విసుక్కొని హరికి శిల్పను అప్పజెప్పి వ్రాయడం మొదలుపెట్టింది.

ప్రియాతి ప్రియమైన వీణ!

నీవు వ్రాసిన ఉత్తరం అందింది. కొత్తగా పెళ్ళయినదానివి నీ సంసారంలో లోటుపాట్లు సరళంగా దిద్దుకొనిపోవడం అలవాటు చేసికో. నాన్నగారి పెంపకానికి మచ్చతేవద్దు. ఈ సంగతులు ఎందుకు వ్రాస్తున్నానంటే నీకు అత్తింట్లో ఎలా ఉండాలో నాన్నగారు చెప్పి ఉండవచ్చు. కాని నీ అక్కగా నీకు నేను చెప్పడం నా బాధ్యతగా వ్రాస్తున్నాను.

ప్రతి ఇంట్లోను లోటుపాట్లు ఉంటాయి. తప్పులు చేయని మనిషి ఉండనట్లే ఏవో లోటు లేని సంసారం ఉండదు లోకంలో. ఎటొచ్చి వాటిలో తేడాలుండవచ్చు. అభిప్రాయాల్లో భేదాలుండవచ్చు. మనింట్లో మనం కీచులాడుకునే వాళ్ళం కాదా. అలాగే ఆ యింట్లోనూ అనుకో, నిన్నెవరైనా పొరపాటున వారికి తెలియకుండా నొప్పిస్తే. కోడలు విద్యావంతురాలయితే ఇల్లంతా విద్యావంతులైనట్లే లెక్క. నీ చదువుని ఇంటిని దిద్దిదిద్దడంలో వినియోగించుకో. తెలివితేటలు ప్రదర్శించుకోడానికి ఉద్యోగమే చెయ్యనక్కరలేదు. ఏపనిచేసినా, ఇది నా యిల్లు నాపని అని అనుకుంటే నీకు శారీరక శ్రమ తెలియదు. ఏపనిచేసినా ఇది నా డ్యూటీ అన్నట్లుండాలి. గాని విసుగుకి, విరక్తికి జీవితంలో చోటివ్వకూడదు.

అంతకంటే ముఖ్యవిషయం. అది నీమెట్టినిల్లు అయినప్పటికి ఆ యిల్లు నీ పిల్లలకు పుట్టినిల్లు అవుతుందని, కొంతకాలానికి మీ అత్తగారిలాగే నీవూ ఆ యింటికి అధికారిణివవుతావని మరచిపోవద్దు. మీ అత్తగారుకూడా ఒకప్పుడు నీలాగ వచ్చినావిడే కదా! అందుకే అత్తా ఒకింటికి కోడలే అన్నారు. ఆవిడ నిన్ను అర్థం చేసుకుంటారనే అనుకుంటాను. ఏమైనా చిన్న పొరపాట్లు జరిగినా, ఆవిడ సహజంగా పెద్ద దాన్ని అనే హోదాలో నిన్ను ఏమైనా అన్నా పట్టించుకోవద్దు. అమ్మ మనల్ని సక్రమంగా పెంచడానికి ఎన్ని అవస్థలు పడిందో గుర్తుతెచ్చుకో.

చిన్నప్పుడు అమ్మ తిట్టిందని అమ్మను ప్రేమించడం మానేసామా మనం. సహనంతో ఎన్ని సమస్యలయినా పరిష్కరించుకోవచ్చు. మౌనంతో ఎన్ని గొడవలనైనా రూపుమాపవచ్చు. ఇవన్నీ తెలుసుకొని సంసారం చక్కగా చేసుకో. నీ సంసారం చూసి నలుగురు మెచ్చుకొని నీ అడుగు జాడలలో నడవాలిగాని, నీ జీవితం నవ్వులపాలు కాకుండా చూసుకో. నా చిన్నారి చెల్లి సంతోషంగా ఉంటే నాకు అంతకంటే కావలసిందే ముంది. నీ జీవిత వీణలో అపశృతికి గాని, తెగిన తీగకు కాని చోటివ్వకు.

ఇంతకంటే వ్రాయలేను. మరిదిగారిని, మీ యింట్లోని వారినందరినీ అడిగినట్లు చెప్పు.

ప్రేమతో అక్క.

ఆ ఉత్తరం ఆ యింట్లో ఎవరు చదివినా ఫరవాలేదన్నట్లు, వీణ వ్రాసిన ఉత్తరానికి జవాబుగా కాక, అక్క చేసే హిత బోధలు లాగ వ్రాసింది శృతి ఉత్తరం.

ఆరోజు సాయంకాలం ఎదురింటి లారా, కిజి వచ్చారు. లారాకి ఎంగేజ్‌మెంట్ అయిందట. రింగ్ చూపించింది శృతికి. కిజి కళ్ళు మాత్రం గిరీష్ మీదే ఉన్నాయి. కన్యావరయతే రూపం అన్నట్లు కళ్ళంత చేసుకొని గిరీష్‌ని చూస్తుంది. గిరీష్‌కి మాత్రం ఆ ధ్యాసేలేదు. ఏదో ఎదురింటి అమ్మాయి అన్నట్లే మాట్లాడుతున్నాడు. లారా ఇప్పుడే పెళ్ళి చేసికోనని చెప్పింది.

'ఇప్పుడే ఎంగేజ్‌మెంట్ చేసికున్నావు. ఇంకా ఎంతకాలం ఆగుతావు పెళ్ళికి' అడిగింది శృతి లారాని ఆశ్చర్యంగా.

'మేము ముందు ఇల్లు సంపాదించుకోవాలి. ఆ తరువాత ఫర్నిచర్ అంతా కొనుక్కొని బాగా సెటిల్ అయిన తరువాత చేసికుంటాము... పెళ్ళి ముహూర్తం ఇప్పుడే నిర్ణయం చేసికున్నాము. 8.8.88న చేసికుంటాము. ఆ రోజంటే మాకెంతో ఇష్టం' అంది. వాళ్ళ అక్క పెళ్ళి 7.7.77న జరిగిందట. 11 సంవత్సరాలకు ఒకసారి వచ్చే ఆ తారీఖుల రోజున చాలామంది పెళ్ళిళ్ళు చేసికుంటారు. అది శుభలగ్నంగా భావిస్తారు వారు. నాలుగు అంకెలు ఒకే అంకె ఉండడం సరదాగాను, గుర్తుగాను అనిపిస్తుందట వారికి.



'మా పెళ్ళికి చాల డబ్బు కావాలి మిసెస్ హరీ. పెళ్ళి గ్రాండ్‌గా జరగాలని లూథర్ ఆశ. ఇద్దరం ముందు పెళ్ళికి డబ్బు కూడబెట్టుకోవాలి కదా' అంది. వారు ఎంగేజ్‌మెంట్ చేసికున్నాక ఫ్రీగానే తిరుగుతారు. పెళ్ళి ఇల్లు మాత్రం ఉండదు అంతే! మిగిలినవన్నీ మామూలే. పైగా పెళ్ళయిన ఐరిష్ స్త్రీకి సెక్స్ విషయంలో ఇంక స్వేచ్ఛ ఉండదు. జీవితం బందిఖానాలాగనే ఉంటుంది. అందుకే సాధ్యమైనంత వరకూ పెళ్ళిని పోస్టుపోన్ చేస్తారు. పెళ్ళికి పేరెంట్స్ కూడా గెస్ట్‌ల లాగే వస్తారు. పిల్లల పెళ్ళిళ్ళ విషయంలో తల్లిదండ్రుల బాధ్యత ఎంతమాత్రమూ ఉండదు.

'రాత్రికి క్లబ్‌కి డాన్స్‌కి వస్తావా' అని అడిగింది కిజి గిరీష్‌ని. గిరీష్ అప్పుడప్పుడు వెళ్ళి డాన్స్ చేస్తుంటాడు అమ్మాయిలతో సరదాగా. వస్తానని చెప్పాడు గిరీష్. 'మిసెస్ హరి మీరుకూడ రండి. మీరు మా క్లబ్ ఎప్పుడూ చూడలేదుగా. చూద్దురుగాని' అంది కిజి శృతిని. 'ఈ రోజు కుదరదు మరో రోజు వస్తాములే. ఈ రోజు నాకు డ్యూటీ' అంది శృతి. డ్యూటీలో నైట్ కాల్స్ చాల వస్తాయి సాధారణంగా.

పెళ్ళికాని అమ్మాయిలు, అబ్బాయిలు క్లబ్‌కి వెళ్ళి అక్కడ డాన్స్ చేస్తూ తమ జీవిత భాగస్వాములను అక్కడే ఎన్నుకుంటారు. అమ్మాయిలందరూ కుర్చీల్లో కూర్చుంటే అబ్బాయిలు తమకు నచ్చిన అమ్మాయిని తనతో డాన్స్ చెయ్యమని ఆహ్వానిస్తాడు. అలా అహ్వానిస్తే ఆ అమ్మాయి అంటే ఇష్టపడినట్టే లెఖ్ఖ. ఆ విధంగా వారి పరిచయం పెరిగి, వివరాలు తెలుసుకుంటారు. డాన్స్‌కి పెళ్ళయిన వాళ్ళుకూడ వెళతారు.

స్టేజ్‌మీద సింగర్ పాట పాడుతుంటే అన్ని జంటలు ఆ పాటకు అనుగుణంగా స్టెప్స్‌వేస్తూ డాన్స్ చేస్తారు. అబ్బాయి, అమ్మాయి ఒకరికొకరు ఇష్టపడిన తరువాత వీకెండ్స్‌కి ఏవైనా వేరే ఊర్లు వెళుతుంటారు. ఈ వీకెండ్స్ వంకన అబ్బాయికి చాల ఖర్చుఅవుతుంది. అమ్మాయిని మురిపించడానికి మనసు నాకట్టుకోడానికి ప్రేమ ఒక్కటే చాలదు, గిఫ్ట్‌లు చాల ముఖ్యం.

ఈ వీకెండ్స్ ప్రోగ్రాములలో చాలమంది అమ్మాయిలు మోసపోతూ ఉంటారు. అందరి జీవితాలు చివరి వరకూ సరిగా సాగవు, పెళ్ళివరకూ వెళ్ళరు. మధ్యలో బోయ్ ఫ్రెండ్ అమ్మాయిని వదిలేస్తే కథ మరలా మొదటికి వస్తుంది. మరో బోయ్ ఫ్రెండ్‌ని వెతుక్కోవడం మొదలు పెడుతుంది ఆ యువతి.

'మీరు ఎంతమంది బ్రదర్స్, సిస్టర్స్' అని అడిగింది లారా, శృతిని సహజమైన ఆతృతతో. ఎందుకంటే ఇండియన్ ఫామిలీస్ గురించి తెలుసుకోవడం ఆమెకు ఇష్టం. మేము మొదట ట్విన్స్‌మి. నా పేరు శృతి. నా చెల్లెలిపేరు కృతి. కాని కృతి జబ్బు చేసి చనిపోయింది. ఇంకా ముగ్గురున్నారు. వీణ, పల్లవి, కీర్తన' అని చెప్పింది. వాటి మీనింగ్ అడిగి తెలుసుకొనింది లారా. కవల పిల్లల మీద ఒక జోక్ చెప్పింది కిజి. అక్కడ కెర్రీమేన్ జోక్స్ చాల పాపులర్. కెర్రీ అనే ఊరిలోని అమాయకుల లాంటి మనుషులమీద అందరూ జోక్స్‌వేసి కుంటారు. ఒకతని భార్యకు కవలలు పుడితే ఒకపిల్లకు తండ్రిని నేను, మరో పిల్ల తండ్రి ఎవరో ఇంకా రాలేదేమిటి అని బయటకు చూస్తున్నాడట ఆ కవల పిల్లల తండ్రి! ఆ జోక్ విని అందరూ నవ్వారు శిల్పతోపాటు. శిల్పకు అర్థంకాకపోయినా అందరూ నవ్వితే తాను నవ్వుతుంది. వీరు మాటల్లో ఉండగా గిరీష్ వెళ్ళి టీచేసి టీ బిస్కట్స్ తెచ్చాడు. 'గిరీష్ మంచికుక్. భార్య సుఖ పడుతుంది' అంది శృతి.

గిరీష్, శృతి, హరి కూడా ఇంగ్లీషులో మాట్లాడుకోవడం వారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. మీ భాష మీకుండగా అందరూ ఇంగ్లీషులో మాట్లాడుకుంటా రెందుకు. మీరు ఇంగ్లీషు రావడానికి ట్రైనింగ్ పొందారా' అని అడిగింది కిజి. మన దేశంలోని భాషల గురించి, మనం చదువుకున్న ఇంగ్లీషు చదువుల గురించి వారికి అర్థమయ్యేలా వివరించాడు హరి.

'మీరు న్యూస్‌ఫర్ ది డెఫ్‌ని బాగా ఫాలో అవుతారనుకుంటాను' అంది లారా. టివిలో చెవిటివారికి న్యూస్‌ఫర్ ది డెఫ్‌ని అనివస్తుంది. న్యూస్ రీడర్ న్యూస్ చదువుతుంటే టి.విలో న్యూస్ ప్రింటు చేసిన మేటర్ చూపిస్తుంటాడు. అది చెవిటి వారికి బాగా ఉపయోగపడుతుంది. ఇంగ్లీషు సరిగా అర్థం చేసుకోలేరు ఇండియన్స్ కాబట్టి వారికి కూడ ఉపయోగపడుతుందని వారి ఊహ.

మీతో మేము కరెక్టుగా మాట్లాడడంలేదా? మీ మాటలు ఫాలో అవడంలేదా. మేము ఇంగ్లీషు బాగానే నేర్చుకున్నాము' అన్నాడు గిరీష్. యూరప్‌లో చాల దేశాల జనాలకు వారి మాతృభాష తప్ప మరో భాషగాని ఇంగ్లీషుగాని రాదు.

వారు ఏ విదేశానికెళ్ళినా కానీకి చెల్లరు. వారితో చాల అవస్థ. ఇంగ్లీషు మాతృభాష కానివారు ఎవరూ ఇంగ్లీషు నేర్చుకోరు. ఇంగ్లీషువారు మన దేశాన్ని పరిపాలించారు కాబట్టి ఇండియన్స్ బాగానే మాట్లాడుతారు ఇంగ్లీషు. అందుకే వారికంత ఆశ్చర్యం. ఎడ్వాన్స్‌డ్ కంట్రీస్‌లోనే చాలమందికి ఇంగ్లీషురాదు. ఎక్కడో దూరంనున్న దేశం వెనుకబడిన దేశం ఇండియాని, వారి అభిప్రాయం. అంతేకాదు అడుక్కుతినే దేశం అని కూడ వారనుకుంటారు. హిందీలో ఇండియా అంతా తిరగవచ్చు. ఇంగ్లీషులో ప్రపంచం అంతా తిరగవచ్చు. మూడు భాషలు నేర్చుకున్న ఇండియన్స్ ఎక్కడైనా నెగ్గుకురాగలరు.

వారి సంభాషణ అటూఇటూ తిరిగి ఇంక వెళ్ళివస్తాము అంటూ లేచారు వాళ్ళు. కిజి మాత్రం గిరీష్‌ని తప్పక క్లబ్‌కి రమ్మని చెప్పింది. వారు అటు వెళ్ళారు అటు అంబులెన్స్ వచ్చింది శృతికోసం. గబగబా కోటూ షూసూ వేసుకొని బయలుదేరింది శృతి. గిరీష్ అన్నాడు 'వెళ్ళేముందు ఒక జోక్ వినండి' అని. ఏమిటన్నట్లు చూసింది శృతి. 'మన దేశంలో పేరుమోసిన ఒక డాక్టరుగారు తన కూతురిపెళ్ళికి పెళ్ళివారిని తీసికొని రావడానికి విడిదింటికి ఏంబులెన్స్ పంపాడట. పెళ్ళివారికి కోపం వచ్చిందట' అని. ఆ మాటలకి శృతితో హరి కూడా నవ్వకుండా ఉండలేకపోయాడు. గిరీష్ ఎప్పుడూ సంతోషంగా నవ్వునవ్వించి నవ్వులు పండించు అన్నట్లుంటాడు.

మనసుకూడ స్వచ్ఛమైనది. పైకి మామిడిపండులా కనబడుతూ లోపల మేడిపండు మనస్తత్వం కాదతనిది. స్వతహాగా పిసినారి అయిన గిరీష్ ఎప్పుడూ నవ్వుతూ ఉంటాడు.

నవ్వులకు ఏమీ ఖర్చుకాదుకాబట్టి పిసినారి పైకి నిరుపేదగా కనిపిస్తూ సంపన్నుడవుతాడు. విలాస పురుషుడు పైకి ఆడంబరంగా కనిపిస్తూనే పేదవాడౌతాడు.

రేపటి గురించి ఆలోచించని ఆ దేశస్తులను చూసి చాల ముచ్చటేస్తుంది శృతికి. పాశ్చాత్యులు అంతా అంతే. అది వారి గొప్పతనంకాదు. పరిపాలనలోని గొప్పతనం కావచ్చు. ముసలివారిని, ఉద్యోగం లేనివారిని ఏవిధమైన సంపాదన లేనివారిని కూడ ప్రభుత్వమే పెన్షన్ ఇచ్చి పోషిస్తుంది. ఉద్యోగాలు చేసేవారికి ఎవరి జీతం వారికుంటుంది. అందుకే విదేశాలలో స్వార్థం, డబ్బు ఇంకా పోగుచేసుకోవాలనే ధనదాహం వారిలో ఉండదు. అందుకే అక్కడ మన దేశంలో ఉన్నన్ని మోసాలు, దొంగతనాలు, దౌర్జన్యాలు తక్కువ. అసలు మనిషికి ఏదో విధంగా తిండిదొరికితే అన్యాయంగా బ్రతకాలనే తలపు అతడికి ఎందుకు వస్తుంది.

ఐర్లాండు దేశం చాల చిన్నది. ఆంధ్ర రాష్ట్రమంత ఉండవచ్చు. దేశంలో చాలమంది విదేశాల్లో స్థిర పడిపోయారు. పాలు, చీజ్, గుడ్లు, బీఫ్ వారికి ఎక్కువగా దొరుకుతాయి. దేశంలో ఎక్కువమంది వ్యవసాయదారులు. ఎక్కువగా మోకాలి వరకూ ఉన్న బూట్లతో పొలాల్లో పనిచేసుకుంటూ దర్శనమిస్తారు వారు. పొలం వెళ్ళడానికి కారుంటుంది. పొలం దున్నడానికి ట్రాక్టరుంటుంది. అందుకే వారి శరీరాలు మన దేశంలోని కూలీల శరీరాలలాగ ఎముకల గూళ్ళలా ఉండవు. ఈ దేశం ఐరిష్ సముద్రానికి, అట్లాంటిక్ సముద్రానికి మధ్య వుంది.

అక్టోబర్ నుండి మార్చివరకూ శీతాకాలం. జూలై, ఆగస్టు వేసవి కాలం. పిల్లలకు ఆ రెండు నెలలు శలవులు అక్కడ. వేసవి కాలంలో రాత్రి పదకొండు గంటలవరకూ వెలుతురు ఉంటుంది. శీతాకాలం సాయంకాలం అయిదుగంటలకే చీకటిపడి పోతుంది. ఉదయం ఏడు, ఎనిమిది గంటల వరకూ చీకటి ఉంటుంది. ప్రతి సంవత్సరం అక్టోబరులో శీతాకాలం వస్తుందని గడియారంలో ఒక గంట వెనక్కి వేసవి కాలం వస్తుందని మార్చిలో ఒకగంట ముందుకి ఇలా సంవత్సరంలో గడియారాన్ని రెండుసార్లు మారుస్తారు. ఈ దేశంలో వెస్ట్‌పోర్టు అనే ఊరిలో సెయింట్ పేట్రిక్ గుడి ఉంది. ఇది వారికి మన తిరుపతి లాంటిది.

జూలై ఆఖరువారంలో ఆ కొండ మీద జరిగే పూజలకు జోడులేని కాళ్ళతో కొండ ఎక్కుతారు భక్తులు. బైబిలు కథ ప్రకారం ఆదాము అవ్వ పాము మాటవిని ఏపిల్ తిని కోరికలతో కష్టాలపాలైనారని సెయింట్ పేట్రిక్ ఆ కోపంతో పాములనన్నింటిని అట్లాంటిక్ సముద్రంలోనికి తోలివేసాడని. అప్పటినుండి ఈ దేశంలో పాములుగాని మరే జంతువులుగాని ఉండవని, నమ్మకం.

డేటింగ్స్ పేరుతో చాలమంది కన్నెపిల్లలు మోసపోతూ ఉంటారు. ఒకవేళ వారికి

పెళ్ళి కాకుండానే పిల్లలు పుడితే, వారిని దత్తత ఇచ్చేస్తారు. ప్రతి బిడ్డలకు ప్రభుత్వం అలవెన్సు ఇస్తుంది. అందుకే పిల్లలు ఎక్కువైనా వారికి బాధలేదు. పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యాలనే బాధ్యత అసలే లేదు అక్కడి తల్లిదండ్రులకి. పది సంవత్సరాల అబ్బాయికి గర్ల్‌ఫ్రెండ్ లేదంటే విచిత్రం వారికి. సెక్స్‌కి చాల ఇంపార్టెన్స్ ఇస్తారు, శీలానికి ఇవ్వరు. బహుశా అందుకే కాబోలు పాశ్చాత్య స్త్రీలు మగవాడి చేతిలో కీలుబొమ్మలు కారు. మానభంగాలకు గురికారు. ఆడ మగ ఇద్దరూ కష్టపడతారు, తమ సంసారాల్ని చక్కగా దిద్దుకుంటారు. కాని ఆ స్త్రీలు చాల సంతోషంగా కాలం గడుపుతున్నారంటే మనం పప్పులో కాలు వేసినట్లే. అక్కడి వారి సంసారాలు తుమ్మితే ఊడే ముక్కుతంతు అంతా. ఒకే మగవాడితో కాపురం చేసిన స్త్రీలు వలవేసి వెతికినా దొరకరు. ఎవరి జీవితం ఎప్పుడు ఏవిధంగా తెల్లవారేదీ తెలియదు. ఆ రాత్రి కలసి కాపురం చేసినవారు తెల్లవారేసరికి విడిపోయినా అదేమీ వింతకాదు. అందుకే స్త్రీకి తన జీవితంలో ఎక్కువ భాగం మరో బోయ్ ఫ్రెండ్స్‌ని వెతుక్కోవడంతోనే సరిపోతుంది కాని, ఏ దేశమేగినా ఎందుకాలిడినా భారత స్త్రీ భారత స్త్రీయే!

☆ ☆ ☆

సెయింట్ సెనాన్స్‌మెంటల్ హాస్పిటల్లో పనిచేసే రావుగారికి ఒక్కొక్కసారి వారి ప్రవర్తన చూస్తుంటే ఆయనకు కూడ పిచ్చిపడుతుందేమో అనిపిస్తుంది. ఒకప్రక్క ఇండియాలోని పరిస్థితులు. తాను ఎవరికోసమైతే ఇంత దూరంవచ్చి ఎముకలుకొరికే చలిలో కష్టపడి ఎన్నో లగ్జరీస్ ఉన్న దేశంలో ఎంతో పొదుపుగా ఉంటూ కూడ బెడుతున్నాడో వారు తనని అర్థంచేసికొనడంలేదు. తాను సంపాదిస్తున్న అర్థానికి ప్రాముఖ్యత నిస్తున్నారు. ఇదివరకు వంద ఖర్చయ్యేదగ్గర ఇప్పుడు వేయి ఖర్చు పెడుతున్నారు. తాను ఎంత జాగ్రత్తగా పెన్నీ, పెన్నీ కూడ పెడుతున్నది వారికి తెలియడంలేదు. ఇద్దరూ సంపాదిస్తున్నారు వేలకు వేలు, ఆ వేలకు వేలిచ్చి ఎక్కువ కట్నంతో పెళ్ళి చెయ్యకూడదా అన్న పద్ధతిలో చెల్లెళ్ళు డొనేషన్లుకట్టి చదివించమనే తమ్ముళ్ళు ఇల్లు పడగొట్టి కొత్తది కట్టమనే తల్లిదండ్రులూ అందరూ డబ్బు చెట్టుకి కాస్తుంది అనుకునే వారేగాని చెమటోడ్చి (అక్కడ చెమటపట్టదు) సంపాదిస్తున్న డబ్బుని భావించడంలేదు. ఎంత డబ్బు పంపినా అక్కడ మంచినీళ్లలా ఖర్చయిపోతూనే ఉంది. ఇండియాకి చాల డబ్బు పంపానుకదా అని రావు తలుస్తుంటే వాడి దగ్గర ఇంకా చాల ఉంటుందిలే అవసరమైతే తానే పంపుతాడు అని తల్లిదండ్రులు తలుస్తున్నారు. ఎముకలు కొరికే చలిలో కొడుకు ఎంత కష్టపడుతున్నాడో వారికి అర్థంకాదు. అతని శరీరంలో వచ్చేది చెమటకాదు రక్తం అని వారు తలిస్తే ఎంత బావుండును.

మరొక ప్రక్క మెంటల్ పేషెంట్స్ చాల చికాకు కలిగిస్తున్నారు. అక్కడి నర్సులు చాల శాంతమంతులు కాబట్టి పేషెంటుని ఎంత మురికివాడైనా మల్లెపువ్వులా

తయారుచేస్తారు. చిరాకులు ఉండవు శాంతంతో కూడిన చిరునవ్వులు తప్ప. ఎంత జాగ్రత్తగా ఉన్నా ఆడవారికి, మగవారికి వేరువేరు వార్డులున్నా, మధ్యలో గోడ ఉన్నా కొందరు పేషెంట్సు గర్భం ధరిస్తున్నారు. ఒక మెంటల్ పేషెంటు మరో పేషెంటుని పీకనొక్కి చంపేసాడు. ఒకడు వేరొకడిని వేడి వేడి నీళ్ళ టబ్‌లో ముంచి చంపేసాడు.

మరో పేషెంటు మరో అడుగు ముందుకి వేసి రావుమీదికి అతనికి తినడానికి ఇచ్చిన బ్రెడ్ నైఫ్‌తో పొడవడానికి వచ్చాడు. ఈ సంగతులన్నీ మతిలేని వారి మధ్యనున్న రావుగారికి నిజంగానే మతిపోగొడుతున్నాయి. దానికి తోడు వాళ్ళ కన్సలెంటుకి ఇండియన్ డాక్టర్సంటే చిన్నచూపు. చిన్నపొరపాటుని కూడ భూతద్దంలో చూడడం ఇల్ ట్రీట్ చెయ్యడం ఆయనకు అలవాటు. ఆ డబ్బుకోసం ఇంతదూరంవచ్చి పనిచేస్తున్నారు, ఏమన్నా పడి ఉంటారు అనుకుంటారాయన. ఇండియన్స్‌కి ఏమి తెలుసు, వారు వెనకబడినవారు అని భావిస్తాడాయన. నిజానికి రావుగారి కంటే కూడ ఆయనకేమీ ఎక్కువ తెలియదు. కాని ఆ సంగతి ఆయన ఒప్పుకోరు.

ఆ హాస్పిటల్ మెంటల్ పేషెంట్స్‌తోపాటు వృద్ధులు కూడా ఉంటారు. పెద్దలమాట పెరుగన్నం మూట అని మనం అనుకుంటాం. పెద్దలు తిండికి దండుగ అని వారు తలుస్తారు. వారిని విశ్రాంతి గృహాలకు అప్పజెప్పేస్తారు. అప్పుడప్పుడు సోషల్ వర్కర్స్ హాస్పిటల్‌కువచ్చి ఆ పేషెంట్స్‌తోను, ముసలివారితోను సరదాగా డాన్స్ చేయించి కాడ్‌బరీ, చాక్‌లెట్లు, కూల్‌డ్రింక్స్ పంచిపెడతారు. అదే వారికి పరమానందం. పరమాన్నంతో సమానం. అదే వీరి మనసులకు ఎంతో రిక్రియేషన్. కొంచం మంచిగా నున్న పేషెంట్స్‌ని సమ్మర్‌లో బయటకు వదులుతారు. వీరితో అంత ప్రాబ్లమ్ ఉండదు. చలికాలంలో మామూలువాళ్ళే బయట ఫ్రీగా తిరగలేరు. క్లోజ్డ్ డోర్స్‌తో నున్న ఇళ్ళలో అందరూ బందీలే. అద్దాల కిటికీలే వారి ప్రపంచమంతా అక్కడ.

☆ ☆ ☆

భారతి ఆ రోజు పనిమరీ త్వరగా చెయ్యడం మొదలుపెట్టింది. కారణం శేఖర్ ఇంటికి వస్తానన్నాడు. గబగబా వంట ముగించేసింది. వంట గది అంతా శుభ్రం చేసింది. భారతి రాకముందు మృదుల మూడు రోజులకొకసారి అన్నం కూరలు చేసి పెట్టేది. ఇప్పుడు ఆ బాధ తప్పింది. ఏ రోజుకారోజు వెరైటీ వంటలు చేస్తోంది భారతి. పిల్లలు కూడా ఆ వంటలు ఎంతగానో ఇష్టపడుతున్నారు.

హూవర్ పెట్టి ఇళ్ళంతా క్లీన్ (తుడవడం) చేసేసింది. స్పాంజి తడిపి కార్పెట్‌లేని చోటల్లా తుడిచేసింది. ఆ వీధిలో దగ్గరనున్న వాషింగ్ మెషీన్‌లో బట్టలువేసి అక్కడే డ్రయర్‌లో కూడావేసి చక్కగా ఇస్త్రీచేసినట్టు మడతపెట్టి ఎవరి బీరువాల్లో వారివి సర్దేసింది. పుస్తకాలు, బొమ్మలు కూడ చక్కగా సర్దేసింది. వంట చేస్తుంటే గేస్ అయిపోవచ్చింది.

మెయిన్ స్విచ్ దగ్గర ఒక పౌండు కోయిన్ వేసింది. (పబ్లిక్ టెలిఫోన్‌లాగే) గేస్ ఫ్రీగా రావడం మొదలు పెట్టింది. గేస్ కూడ కరెంటులాగే వస్తుంది పైపుల గుండా. వీరిది కరెంటు స్టౌకాదు. కరెంటు స్టౌ అయితే గొడవలేదు. కరెంటు పోవడం నీళ్ళు ఆగిపోవడం అన్నది ఉండదు. కాబట్టి పని తేలికే. షాప్‌కి వెళ్ళి ఒక బస్తా బియ్యానికి మినప్పప్పు కందిపప్పులాంటి వాటికి ఆర్డరు పెట్టింది. వారు డబ్లిన్ నుండిరప్పిస్తారు వాటిని. ఏ సామానులోను కల్తీ ఉండదు. కళ్ళు మూసుకొని వండుకోవచ్చు, శుభ్రం చేసికోనక్కర లేకుండా.

గబగబా స్నానంచేసి మంచి చీరకట్టుకొని సెంటుస్ప్రే చేసికొని అతని గురించి ఎదురు చూడసాగింది. శేఖర్ వచ్చాడు. అంతే ఇద్దరూకలిసి సరదాగా ముతక జోక్స్‌వేసి కుంటూ కాఫీ తాగి, బిస్కట్లు తిన్నారు. ఆ తరువాత ప్రోగ్రాము యధావిధి. ఈ లోకంలో వారిద్దరే ఉన్నట్లు ఒకరిబట్టలు ఒకరు ఊడపీక్కుని మంచంమీదకు చేరారు. వారు మరో లోకంలోనున్నారు. ఆ ఇంట్లో ఏమి జరుగుతుందో కూడ గ్రహించే స్థితిలో లేరు వారు. అంత మైమరచి హద్దులు మరచి ప్రవర్తిస్తున్నారు.

డాక్టర్ రావుగారు ఇంటిదగ్గర పని ఉండి ఎందుకో వచ్చారు. ఇంట్లో భారతి ఉన్నప్పటికి ఆయన కారు తాళాల్లో ఇంటి తాళంకూడా ఉంది. కీతో తాళంతీసి భారతిని ఎందుకు డిస్టర్బ్ చెయ్యాలిలే అన్నట్లు ఆయనే లోపలికి ప్రవేశించారు. ముందుగా ఆయనకు కనబడింది సిటింగ్ రూమ్‌లో కాఫీ తాగిన కప్పులు, ఆ ప్రక్కన ఒక పోస్టల్ ఆర్డర్. ఆ పోస్టల్ ఆర్డర్ ఇండియాకు పంపితే అది చూపించినవారికి ఆ డబ్బు ఇస్తారు.

ఆయనకు మతిపోయింది. పోస్టల్ ఆర్డర్ తియ్యవలసిన పని మృదులకు ఎందుకు వచ్చింది అని. అనుమానం మృదులమీదికి పోయిందిగాని భారతిమీదికి పోనేలేదు. ఏదో పేపర్ కావలసివచ్చి బెడ్‌రూమ్‌లోనికి వెళ్ళినాయన ఆ నగ్నదేహాల రాసలీలల సన్నివేశం చూసి షాక్ తిన్నారు. నోటమాట రాలేదు. అప్రయత్నంగా కళ్ళుమూసుకొని తల తిరుగుతున్నట్లనిపిస్తే తూలుతూవచ్చి నిస్త్రాణంగా కుర్చీలో కూలబడ్డారు. వారు మాత్రం రావుగారిని గమనించలేదు.

తాను చూసింది కలో, నిజమో అర్థం కావడం లేదు ఆయనకు... గన్ ఉంటే వెంటనే ఇద్దరినీ షూట్‌చేసి పారేద్దామన్నంత కోపం ఆవేశం ఆయనకు. వెంటనే ఏం చెయ్యాలో అర్థం కాలేదు. మెదడంతా చీమలు పాకుతున్నాట్లు ఫీల్ అయ్యారు. భారతి ఎంతటి మోసగత్తె అని మొదటిసారి అనుకున్నారు. భారతి వారం రోజుల నుండి తరచుగా వాంతులు చేసికొనడానికి కారణం మెల్లగా బోధపడిందాయనకు. ఆయనకు ఏంచెయ్యాలో తోచక మృదులకు ఫోన్ చేసారు. మృదుల వచ్చేవరకు ఆయన మనస్థితి వర్ణించనలవి కానంత గందరగోళమైపోయింది. తాను వచ్చిన పనిమరచిపోయి

తానుచూసిన ఆ అసహ్యాకరమైన సన్నివేశాన్ని మరల మరల గుర్తుతెచ్చుకొని బాధపడుతున్నారు.

మృదుల వచ్చేసరికి శేఖర్ వెళ్ళిపోయాడు. భారతి మోకాళ్ళమీద తల పెట్టుకొని ఏడుస్తోంది. ఆ తల పగలగొట్టాలన్నంత ఆవేశం వచ్చింది మృదులకు. అంతలోనే ఆమె తల బదులు తన తలే పగలగొట్టు కోవాలనిపించింది. ఎందుకు తమ ఇంట్లో ఇలా జరుగుతోంది. లోపం ఎక్కడ, తాను ఉద్యోగం చేస్తూ పనుష్యులను నమ్మడమేనా చేసిన తప్పు. తలంచుకొని తలంచుకొని కుమిలి పోయిందామె మనసు.

ఇప్పుడు ఈ ప్రేమాయణం సంగతి ఎలా ఉన్నా భారతి గర్భవతి అన్న నిజం ఆమెను నిలువనీయడం లేదు. ఇప్పుడు ఆ అమ్మాయిని ఏం చెయ్యాలి. ఇండియాకు పంపించే అవకాశం లేదు. వారి దగ్గర రావుగారి పరువుపోతుంది. పైగా ఆ నన్స్ దగ్గర నుండి పూర్తిగా తమ పిల్లేనన్నట్లు తీసికొని వచ్చేసారు. శేఖర్‌కిచ్చి పెళ్ళి చేద్దామంటే శేఖర్‌కి పిల్లలు, భార్య ఉన్నారట. భగవాన్! ఏమిటీ పరీక్ష అనుకొని రోదించసాగింది మృదుల, హృదయంలో బాధ తగ్గేవరకు. వెంటనే ఆ మంచాన్ని ముక్కలు చేయించి ఫైర్‌ప్లేస్‌లో పడేసింది. అప్పుడుగాని ఆమె ఆవేశం చల్లారలేదు.

నెత్తిమీదకు తెచ్చుకున్న శని తప్పదన్నట్లు భారతిని రావుగారు, మృదుల కలసి ఇంగ్లండు తీసికొని వెళ్లారు ఎబార్షన్ చేయించడానికి. ఎందుకంటే ఐర్లాండు దేశం కేథలిక్ దేశం. అక్కడ ఫామిలీ ప్లానింగ్ లేదు. వారు మేరీమాతను పూజిస్తారు. ఇంగ్లండు వెళుతూ పిల్లలను ఇన్నీస్‌కార్తిలోనే ఉన్న మరో ఇండియన్ డాక్టర్ సంజయ్ దగ్గరపెట్టి వెళ్ళారు. సంజయ్ భార్య ఇంట్లోనే ఉంటుంది. ప్రస్తుతం సంజయ్ ఇండియా వెళ్ళారు. మరో పదిహేను రోజులవరకూ రారు. అందుకే తోడుగ కూడ ఉంటారని సంజయ్ భార్య స్వాతి రావుగారి పిల్లలను దగ్గర పెట్టుకొంది. షిప్‌లో వెళితే ఖర్చులు తక్కువ అవుతాయిగాని కాలం ఎక్కువ పడుతుంది. ప్లెయిన్‌లో అయితే గంటన్నరా, రెండుగంటలు ప్రయాణం ఇంగ్లాండుకి. ఖర్చుకి వెనుకాడకుండా ఇంగ్లండు తీసికొనివెళ్ళి ఎబార్షన్ చేయించి తీసికొనివచ్చారు. ఇది రావుగారికి దెబ్బమీద దెబ్బ.

భారతిని ఏం చెయ్యాలా అని ఆలోచించి చివరికి కొన్ని రోజులు ఏదో ఉపాయం ఆలోచించే వరకూ స్వాతి దగ్గర పెట్టుకోమన్నారు. డాక్టర్ సంజయ్ ఎలాగూ ఊరిలో లేరు కాబట్టి ఆవిడ ఒప్పుకొంది. ఆవిడ ఒప్పుకోడానికి వేరే కారణం ఉంది. పెళ్ళయి పది సంవత్సరాలయినా పిల్లలు లేరు తనకు. ఒంటరి జీవితంలో విసిగెత్తిపోయింది. అందుకే భారతి తోడుగా ఉంటుందని తలచింది. పైగా ఈ మధ్య టింకర్సు (అక్కడ అడుక్కునేవాళ్ళు) అస్తమానూ వచ్చి పిల్లలకు పాలు లేవని డబ్బులు అడుగుతున్నారు. ఒకరికిస్తే ఒకరు అలా వచ్చి సతాయిస్తున్నారు. వాళ్ళు హానికరమైన మనుషులు

కాకపోయినప్పటికీ స్వాతికి ఎందుకో భయంగా ఉంది. వారికి స్వంత ఇళ్ళు లేక అద్దె ఇంట్లో ఉండలేక కారవాన్స్‌లో ఊరూరు తిరిగి అడుక్కుంటారు. సాధారణంగా అక్కడివారు భిక్షం వెయ్యరు. ఇండియన్స్ వేస్తారు కదా అన్న ధీమాతో స్వాతిని చాలా విసిగిస్తున్నారు. భారతి రావుగారికి పెద్ద సమస్య అయి కూర్చుంటే స్వాతి పెద్ద సమస్య తీర్చినట్లనిపించింది. కాని భారతి రాకతో ఆమె జీవితం అనుకోని పెద్ద మలుపు తిరుగుతుందని స్వాతి ఊహించలేదు. జరగబోయేది తెలియక పోవడమే జీవితంలోని సస్పెన్స్!

☆ ☆ ☆

ఆదివారమే కదా అని బద్ధకంగా లేచిన హరికి ఫోను మ్రోగడంతో బద్ధకమంతా ఎగిరిపోయింది. అది తప్పకుండా వర్మ దగ్గరనుండే అయి ఉంటుందని ఊహించాడు. ఆ ఊహ నిజమయింది. క్షేమ సమాచారాల అనంతరం వచ్చేనెలలో నీవు ఉద్యోగంలో చేరి ఆరు నెలలవుతుంది కదా! మీ కన్సల్టెంటు ఏమంటున్నాడు. అక్కడే కంటిన్యూ చెయ్యమంటున్నాడా లేక వేరే ట్రైచేసుకో మంటున్నాడా' అని అడిగాడు.

"నేను ముందే అడిగాను. ఎక్కడైనా వేరే ఊరిలో చూసుకొమ్మంటారా? ఇక్కడ ఉండిపొమ్మంటారా అని. ఇక్కడే ఉండి పొమ్మన్నారు. మా ఇద్దరినీ మీ ఇష్టము వచ్చినంత కాలం అదే హాస్పిటల్‌లో పనిచెయ్యమన్నారు" అని చెప్పాడు హరి.



"గుడ్. అయితే ఫరవాలేదు. నీకు ఇటుపై ప్రతి ఆరునెలలకి ఉద్యోగం వెతుక్కోవలసిన శ్రమే లేదన్నమాట. అదృష్టవంతుడివి. కన్సల్టెంటుకి ఏ మాత్రం ఇండియన్ డాక్టర్సు నచ్చకపోయినా ఆరునెలలు కాగానే ఉద్వాసన చెప్పేస్తారు. నీకు అలా కానందుకు చాల సంతోషంగా ఉంది. మీ ఇద్దరి మీద మంచి ఇంప్రెషన్ పడిందన్నమాట వారికి" అన్నాడు.

"ఒకసారి కార్క్ రండి మీ కుటుంబమంతా. వేము

రావాలంటే మాకు కారులేక కష్టంగా ఉంది. మీకు రావడం సులువుకదా'' అన్నాడు హరి.

"అలాగే తప్పకుండా వస్తాము. వచ్చేనెలలో మా ఫ్రెండ్ ఒకాయన అమెరికా వెళ్ళిపోతున్నాడు. షానన్ ఎయిర్‌పోర్టుకి వస్తాము. అప్పుడు వస్తాములే పిల్లలను తీసికొని అన్నాడు. తిరిగి తనే అన్నాడు 'చలి ఎలా ఉంది. తట్టుకోగలుగుతున్నారా? అన్నట్లు గిరీష్ అన్న అబ్బాయి మీ ఇంట్లో ఉన్నాడన్నావుగా ఎలా ఉన్నాడు' అని అడిగాడు.

'ఆ అబ్బాయి బాగానే ఉన్నాడు మాతో బాగా కలిసిపోయాడు. కాని మా ఇంటి ఓనరు వచ్చి మా ఇంట్లోవున్న ఎక్స్‌ట్రా గదిని గిరీష్‌కి మేము వేరే అద్దెకిచ్చినట్లు భావించాడు. అతనికి సర్దిచెప్పే సరికి తాతలు దిగివచ్చారనుకో. మనం పిల్లలను విడిగా పడుకోబెట్టం కదా. అది అతనికి తెలియక ఆ గది మీపాపది కదా. గిరీష్‌కి ఎందుకిచ్చారు అని అడిగాడు.''

"మరి ఊరుకున్నాడా తరువాత, ఏమైనా అన్నాడా''

"ఏమనలేదు. గిరీష్ ఇంటి ఓనరుకి ప్రెజెంటేషన్ అంటూ ఒక బోటిల్ చేతిలో పెట్టేసరికి కిమ్మనలేదు. కామ్‌గా వెళ్ళిపోయాడు.''

ఆ మాటలకు నవ్వాడు వర్మ. ఇండైరెక్టు లంచగొండితనం అది. హరి వర్మ సంభాషణ పూర్తయిన తరువాత ఫోన్ శృతికి ఇచ్చాడు హరి.

"హలో వినోదిని గారు సుప్రభాతం'' అంది శృతి. "గారూ ఏమిటి కొత్తగా. కొంపతీసి మీ బ్రేక్‌ఫాస్టు గారెలా ఏమిటి. నోరూరుతుంది మరి.''

"అబ్బ ఆశ దోశ. కావాలా గారెలు... తింటారా''

"అయ్యో ఖర్చు గారెలకే నోరూరుతుంటే మరలా దోశలంటారేమిటి? రెండూ నాకు పంచప్రాణాలే. ప్రొద్దున్నే వాటి పేరు చెప్పి నా ప్రాణాలు తీయకండి. ఇంక ఈ బ్రెడ్ నా గొంతు దిగదు. ఈ రోజుకి వాటిని తలంచుకొని'' సరదాగా అంది. తిరిగి వినోదిని అంది. "ఇక్కడకు మన తెలుగువార పత్రికలు వస్తాయి తెలుసా'' అని. "తెలియదుగాని నాకు కూడ రప్పించి పెట్టండి'' అంది శృతి. 'ఈ రోజే వచ్చిన పత్రికలో ఒక పొడుపు కథ ఉంది. చెబుతాను విప్పగలవా అంది'' భార్యలో భర్త తప్ప అందరూ చూడగలిగేది ఏమిటి అని అడిగింది. శృతి ఆలోచించింది గాని అర్థం కాలేదు. చెప్పేయమని బ్రతిమాలింది వినోదిని. 'వైధవ్యం' అంది వినోదిని నవ్వుతూ.

'నిజమే కదా' అనిపించింది శృతికి. 'నేను భర్త ఉండి వైధవ్యాన్ని అనుభవిస్తున్నాను' అనుకొంది శృతి నిరాశగా.

అన్నట్లు ఈ మధ్య మరో ఇండియన్ ఫామిలీ వచ్చింది గాల్వేకి. విజయవాడ వారిది. భార్య భర్త ఇద్దరే ఉన్నారు. పిల్లలున్నట్లు లేదు. ఆవిడకూడ డాక్టరే. ఆవిడను హాస్పిటల్‌కు చీరకట్టుకొని రావద్దు. పాంటు షర్టుగాని, ఫ్రాక్‌గాని వేసికొని రమ్మన్నారట. వారి డ్రెస్‌లాగే. అందుకు ఆవిడ సమ్మతించక ఉద్యోగానికి రానని చెప్పేసింది. దానితో వారు దిగివచ్చి మీ ఇష్టం ఎలాగైనా రండి అని డ్యూటీలో జాయిన్ చేసుకున్నారు'' అని చెప్పింది.

"వాళ్ళ పేర్లేమిటి. బహుశా మనకు తెలిసిన వారయ్యుండచ్చుకదా!'' అంది "ఆయన పేరు విజయేందరరెడ్డి ఆవిడపేరు సుమతి.''

'విజయేందర్‌రెడ్డి అయితే నాకుతెలుసు. ఆవిడ కూడా తెలుసు. పేరు తెలియదనుకో. ఆవిడను ఒకసారి ఏదో ఫంక్షనులో చూసాను. చాల ఆప్యాయంగా మాట్లాడారు. ఆ ఆత్మీయతను ఇప్పటివరకూ నేను మరచిపోలేదనుకో.

"ఏమో నీతో చాల బాగా మాట్లాడారేమోగాని నాతో మాత్రం అసలు మాట్లాడనే లేదు. ఏదో మొహమాటంగా ఫీల్ అయినట్లనిపించింది. మొహం చాటు చేసికొన్నట్లనిపించింది. లేక ఆవిడొక్కరే లోకంలో డాక్టరని గర్వమేమో''

"డాక్టరని గర్వం కాకపోయినా కొందరి మనస్తత్వమే అంత. అందరూ ఒకలాగే ఉండరు కదా! అన్నట్టు ఆవిడ లెక్చరర్ అని చెప్పినట్లు గుర్తు. మీరు డాక్టరంటున్నారు'' అంది శృతి తను మరచిపోయానేమోనని గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ.

"లెక్చరర్ కాదు. డాక్టరే. హాస్పిటల్‌లో జాయిన్ అయిపోయారు కూడ''

"ఒకవేళ నాదే పొరపాటేమోలే. చాల సంవత్సరాలయింది ఆవిడను చూసి. అప్పటికి ఒక పాప ఉంది వారికి'' అంది శృతి.

"బహుశా పిల్లలతో కష్టమని పిల్లలను ఇండియాలో వదిలి వచ్చేసారేమో ఇద్దరే ఉంటున్నారు. ఇల్లు మేమే చూసి పెట్టాము. ఈ దేశంలో మేము చాల సీనియర్స్‌మయి పోయాము కదా! సాధారణంగా ఎవరికి ఏ హెల్ప్ కావలసి వచ్చినా మమ్మల్ని అడుగుతారు. ఇండియన్స్‌ని చూడగానే చాలాహాయిగా అనిపిస్తుంది నాకు'' అంది వినోదిని.

"నిజమే. మీరు ఇక్కడ ఉండబట్టే మేము ఏ కష్టమూ లేకుండా వడ్డించిన విస్తరి ముందు కూర్చున్నట్లుగా ఈ ఉద్యోగంలో జాయిన్ అయ్యాము'' అంది శృతి. వర్మ స్నేహానికి ప్రాణం పెడతాడు. ఇతరులకు సహాయం చెయ్యడంలో ఎంతకష్టమైనా వెనుకాడడు. మానవసేవ మాధవసేవ అని అతను పబ్లిగ్గా చెప్పుకోకపోయినా అతని ప్రవర్తన బట్టి దానిని అతను అనుసరిస్తున్నాడని చెప్పవచ్చు. విజయాన్ని పెద్ద మనిషిలాగ

విపత్తుని మనిషిలాగా ఎదుర్కో అని అందరికీ చెబుతాడు. ఎంతకష్టం వచ్చినా చలించని మనస్తత్వం. కష్టాలు మనుషులకుకాక మరెవ్వరికి వస్తాయి అంటాడు.

వినోదిని, ప్రియాంక, శశాంక చాల అల్లరి చేస్తున్నారని చెప్పింది ఫోన్‌లో. ఆమె చెప్పనే అక్కరలేదు. వాళ్ల అల్లరి అరుపులు, సామాను విసరికొనే శబ్దాలు అన్నీ ఫోన్‌లో వినోదిని మాటలతోపాటు వింత శబ్దాలు చేసి వినిపిస్తూనే ఉన్నాయి. 'ఇల్లు పీకి పందిరేసి పకపకలాడితే. పిల్లలున్న లోగిలని దేవుడే మెచ్చేను' అన్న భానుమతి పాట మనసులో మెదిలింది శృతికి. అంతలోనే మరలా నిరాశ. ఈ జన్మలో తనకు శిల్ప ఒక్కతే సంతానమేమో. ఆమె ఒంటరిదై పోతుందేమోనని.

☆ ☆ ☆

ఫిబ్రవరి నెల విపరీతంగా మంచుపడి చెట్లు, ఇళ్ళు చాల వరకూ మంచుతో కప్పేసాయి. ఊరంతా మంచుతోను, కొంచం కనిపిస్తున్న ఇళ్ళతోను పాల సముద్రంలో పడవలు తేలుతున్నట్లని పిస్తుంది. చెట్లు పూలభారంతోకాక మంచు భారంతో నేలమీదకు ఒరిగిపోతున్నాయి. ఎక్కడ చూసినా తెల్లదనం తెల్లదనం. ఎవరింట్లో చూసినా విపరీతమైన చల్లదనం. ఎన్ని హీటర్లున్నా చలికి తట్టుకోవడం కష్టంగా ఉంది. దానికితోడు ఈదురుగాలి. చెవుల్లో హోరుమని శబ్దం. శీతాకాలం అంతా మంచుతోపాటు ఈదురుగాలి ఎప్పుడూ శబ్దంచేస్తూ వీస్తూనే ఉంటుంది. అందరినీ చలి ఒణికిస్తూనే ఉంటుంది. అందుకే స్కూల్సన్నింటికీ శలవులు ఇచ్చేస్తారు. ఆ రోజు ఆదివారం. అంతేకాదు శృతి, హరిల పెళ్ళిరోజు. ఎంత చలిలోకూడా వారు స్నానం చెయ్యడం మానరు. అది మన పద్ధతి.

'వందమందిలో ఉన్నా వేళకు భోం చెయ్యాలి. వేయిమందిలో ఉన్నా రోజూ స్నానం చెయ్యాలి. లక్ష మందిలోనున్నా ప్రొద్దున్నే దేవుని ధ్యానం చెయ్యాలి' అని వేదాంతశర్మగారు పిల్లలకు చిన్నప్పటినుండే బోధించేవారు. అది ఎప్పుడూ మరచిపోదు శృతి.

శృతి స్నానంచేసి వచ్చి దేవుని దగ్గర దీపం పెట్టింది. ప్రొద్దుటినుండి హరిని లేపుతుంది. ఇద్దరం కలిసి దేవుని గుడికి వెళ్ళలేకపోయినా దేవునిదగ్గర దీపం పెట్టి ప్రార్దిద్దాము రమ్మని. అతను ప్రొద్దుటనుండి మొహం మీదనుండి కాళ్ళవరకూ ఉన్న బ్లాంకెట్‌ను కొంచమైనా కదల్చలేదు. అది నిద్రకాదని లోపల హరి మనసులో అగ్ని పర్వతాలు రగులుతున్నాయని వాటిని ఆర్పడం తలవల్లకాదని ఆమెకు తెలుసు. దేవుని దగ్గర కళ్ళుమూసుకున్న శృతికి అప్రయత్నంగా కన్నీరు బుగ్గలమీదనుండి జాలువారింది. ఆ దీపంలో నూనెకు బదులు తన కన్నీరువేసి వెలిగించాలనే భావన కలిగింది శృతికి. ఆ దేవుని కాళ్ళు తన కన్నీళ్ళతో కడిగి తన జీవితంలో వసంతాన్ని

వారి మొహంలో సంతోషాన్ని ప్రసాదించమని వేడుకోవాలనిపించింది. తామిద్దరూ పెళ్ళిబట్టలతో పీటలమీద కూర్చున్న దృశ్యం, పెళ్ళికాగానే గుడికివెళ్ళి దేవుని దర్శించుకొని వచ్చిన దృశ్యం ఆమె కనులముందు కదలాడింది. మూసుకున్న ఆ కనుల వెనుక కన్నీటితోపాటు ఎన్నో కమనీయ దృశ్యాలు తాను హరి జంటగా అడుగులు వేసిన దృశ్యాలు. అన్ని ఒకదాని తరువాత ఒకటి సినిమారీళ్ళులాగ తిరగసాగాయి. ఆ రోజులు ఎంత ఆనందమైనవి. జీవితమంతా పూలతోటలాగే అనిపించేది. చివరికి తామిద్దరూ ముళ్ళబాటలో చిక్కుకొని ఆశాంతితో అలమటిస్తున్నారు.

విధి వక్రించకపోతే తామిద్దరూ ఈ సమయంలో ఎంత సంతోషంగా ఉండేవారు. ఒకరి ఒడిలో ఒకరు, ఒకరి కౌగిలిలో ఒకరు. ఇక ఆపై ఆలోచించ లేకపోయింది. పరుగులు పెడుతున్న మనసుకి కళ్ళెం వెయ్యకపోతే చాల ప్రమాదం అని ఆమెకు తెలుసు. బలవంతంగా మనసుని స్వాధీనపరచుకొని మనస్ఫూర్తిగా దేవుని ప్రార్థించింది తనకు మంచి జీవితం ప్రసాదించమని.

కిటికీ దగ్గర నిలబడి బయట కురుస్తున్న మంచుని చూస్తుంది శృతి. ఇళ్ళన్నీ మంచుతో కప్పబడి తెల్ల ముసుగు వేసుకొన్న దొంగల్లా కనిపిస్తున్నాయి. అందుకే కాబోలు ఇక్కడ ఇళ్ళు డాబాల మోడల్లో ఉండకుండా ఎంత ఇంద్రభవనానికైనా పైన పెంకులు వేస్తారు, మంచు త్వరగా జారిపోవడానికి - అనుకొంది.

డాబాల మోడల్‌లో ఇళ్ళయితే మంచు బరువుకి ఇళ్ళు కూలిపోతాయి మరి. ఆమె ఆ రోజు తన తలంపులను ఎంత మరచిపోదామన్నా మరువలేక పోయింది. 'జీవితాన మరువలేము ఒకేరోజు. ఇరు జీవితాలు ఒకటిగా పెనవేసే రోజు. అదే పెళ్ళిరోజు. పెళ్ళిరోజు.' అప్రయత్నంగా ఆమె పెదవులు ఆ పాటను ఉచ్ఛరించాయి. చల్లటి మంచు ఆమె మనసుని ఏమీ చల్లబరచలేక పోతుంది. హృదయంలోనుండి వేడి ఆవిర్లు తన్నుకొని వస్తున్నాయి. చెమటపట్టినట్లుగా ఫీలయింది అంత చలిలోను శృతి.

ఇంతలోనే మరలా అనుకొంది. రెండు సంవత్సరాలనుండి అలవాటయిన జీవితం. ఇంకా బాధపడకూడదు అనుకొంది. ఆమెకు ఒక జోక్ గుర్తుకి వచ్చింది. మనసుని ఉత్సాహంగా ఉంచుకోడానికి అప్పుడప్పుడు తాను చదివిన జోక్స్ గుర్తుతెచ్చుకోవడం ఆమెకి అలవాటు అది గ్రహించిన గిరీష్ కూడ తమాషాగా కొన్ని జోక్స్ చెబుతుంటాడు.

కొత్తగా పెళ్ళయిన ఒకతను జ్యోతిష్కుని దగ్గరకు వెళ్ళి నాకు కష్టాలు ఎంతకాలముంటాయి అని అడిగితే జ్యోతిష్కుడు ఆరునెల లుంటాయి అని చెబుతాడు. ఆ తరువాత అన్నీ సుఖాలేనా! అని ప్రశ్నిస్తాడతను. దానికి సమాధానంగా ఆరునెలల

తరువాత కష్టాలకు అలవాటు పడిపోయి ఇంక కష్టమనిపించదు' అని ఇప్పుడు శృతి బ్రతుకు కూడా అలాగే ఉంది. తను అలవాటు పడిపోతుందిగాని హరిని మరిపించ లేకపోతుంది. ఏ అజ్ఞాతశక్తి అయినా ఏ కనిపించని దేవతలయినా లేక ఏ మెజిషియన్ అయినా సరే వచ్చి తమ జీవితంలో ఉన్న ఆగాధాన్ని అవలీలగా తీసి పారేస్తే ఎంత బావుణ్ణు అనిపించింది. మనసుని గట్టిపరచుకొని బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది. హరి ఇంకా బ్లాంకెట్ కింద విధి చేతిలోని వింతబొమ్మలా కదులుతున్నాడు. అతన్ని ఆ స్థితిలో చూడగానే కన్నీళ్ళతోబాటు జాలికూడ పొంగివచ్చింది శృతికి. వెళ్ళి పక్కన కూర్చొని బ్లాంకెట్‌ని తొలగించింది. తలగడంతా తడిసిముద్దయి ఉంది. హరి శరీరం ఆవేశంతోనూ, చెమటతోనూ ఉంది మొహమంతా. చాలసేపటినుండి ఏడుస్తున్నాడు అన్న దానికి నిదర్శనంగా ఎర్రగా కందిపోయి మరింత ఎర్రగా వాచిపోయి ఉంది. కళ్ళు జపనీస్ వాళ్ళ కళ్ళలాగా లోతుకిపోయి ఉన్నాయి. ఆమె మొహం చూడలేను అన్నట్లు మోచేతితో కళ్ళమీద చేయివేసేసుకున్నాడు. ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా వెక్కిళ్ళు మెల్లగావస్తూనే ఉన్నాయి. 'విష్ యూ హేపీ మేరీడ్ లైఫ్' అన్న మాటలు ఆమె గొంతులో శంకరుని గొంతులోని గరళంలా చిక్కుబడిపోయాయి.

అతని చేతిని మొహంమీదనుండి తీసి ఆ కన్నీళ్ళను తన పెదవులతో తుడవాలనే గాఢమైన కోరికను అతి కష్టంమీద అరికట్టుకుంది. అతనిని తాకే యోగ్యత తనకులేదు. అది భగవంతుడు ఎప్పటికి అనుగ్రహిస్తే అప్పుడే. హరి బ్లాంకెట్ తిరిగి మొహంమీదికి లాక్కొని అటు తిరిగి పడుకున్నాడు. అది అలక అయితే ఎలాగో తీర్చగలిగేది. కాని అలకకాదు. బాధ. గుండెలను పిండివేసే బాధ. సూదులతో ఒళ్ళంతా గుచ్చుతున్న తలంపు. రాళ్ళతోను ఎవరో మీదకు వరుసగా విసరుతున్నంత వేదన. బ్లేడుపెట్టి శరీరాన్ని చీల్చుతున్నట్లు వినిపించేటంతటి వ్యధ. ఆ బాధను తట్టుకోడానికి అతనికి శక్తి చాలడంలేదు. రోజు రోజుకి మనసుతోపాటు శరీరంకూడ బలహీనమైపోతుంది.

ఆ గది ఎంతో అందంగా ఉన్నప్పటికీ ఆ గదిలో ఒంటరిగానున్న ఆ భార్యా భర్తలు అదీ తమ పెళ్లి రోజున విపరీతంగా రోదిస్తున్నారు. వారి శరీరాలు దూరంగా ఉన్నా మనసులు ఒకరితో ఒకరిని పెనవేసికొని తిరిగి రానంటున్నాయి. ఇద్దరి మనసుల్లోను ఒకటే భావాలు, ఒకే విధమైన బాధ. ఒకే అనుభూతి. ఒకే ఆవేదన, ఆక్రందన. ఎవరికీ చెప్పుకోలేని ఒకరికొకరు ఓదార్చుకోలేని నిస్సహాయత.

అతని మనసులోని అశాంతి తొలగించాలంటే అప్పటికి ఒకటే ఐడియా స్ఫురించింది శృతికి. వెంటనే వెళ్ళి కేసెట్ ఆన్ చేసింది. ఘంటసాల మృదు మధురమైన గొంతు ఆ గదిలో తెలుగురాని ఆ ఊరిలో ఐరిష్ వారి సొత్తయిన ఆ దేశంలో తేనెలూరుతూ, సెలయేటి నుండి జాలువారుతున్నట్లు సాగరంలో కొట్టుకుపోతున్న మనిషికి చేయూతలా భగవద్గీత పాడుతుంది.

అమృతం ఎవరూ తాగి ఉండరుగాని ఆ గొంతు అమృతం తాగిన గొంతేమో అందుకే అంత మృదువుగా మకరందం గ్రోలిన అనుభూతితో అంతరంగాన్ని కదిలించి వేస్తుంది. పాట పాడేవాళ్ళు చాలమంది ఉండవచ్చు. పాట విన్నప్పుడు మనసు స్పందన విచిత్రమైన అనుభూతి కలిగితే పాడిన వాడి బ్రతుకు ఎంత ధన్యమైనట్లో కదా. ఆ పాటలోని గాన మాధుర్యానికి శృతి హరిలతోపాటు, శృతికి పెళ్ళిలో పల్లవి ఇచ్చిన రాధాకృష్ణుల విగ్రహము, తండ్రి ఇచ్చిన చెడు వినవద్దు, చెడు కనవద్దు, చెడు అనవద్దు అంటున్న మూడుకోతుల బొమ్మలు, పెంబర్తి నుండి తెచ్చుకున్న నెమలి బొమ్మ, గోడనున్న మనోహరమైన వాల్ పెయింట్స్ (నిర్మల్‌వి) అన్నీ అనుభూతి చెందుతున్నాయి. ఆ గానంలో లీనమైపోయాయి. ఆఖరుకి గదికి వెచ్చదనాన్ని కలిగించే గేస్ హీటర్ కూడ పరవశించినట్లు అనిపించింది శృతికి. ఘంటసాల తన ఆరోగ్యం క్షీణించిందని తెలుసుకొని సినిమాపాటలతో విసిగెత్తి చివరగా సంతృప్తిగా గానం చేసిన 'భగవద్గీత' అది. అందరికీ అర్థమయ్యేటట్లు శ్లోకాన్ని, భావాన్ని కూడా శ్రావ్యంగా గానం చేసారాయన. ఆయన పోయారు. ఆ గాన మాధుర్యం మిగిలిపోయింది. అసలు ఆయన చనిపోయారని ఎందుకనుకోవాలి. ఆ గొంతురూపంలో మన మధ్యేఉన్నారని తలంచాలి. మనసుకి సేదతీర్చే విధంగా కర్మ సిద్ధాంతాల్ని భగవద్గీత ద్వారా చెబుతుంటే ఎంతటి కష్టంలో ఉన్న మనిషికైనా కొండంత ఉపశాంతి. మనిషి చేతిలో ఏమీలేదని విధినడిపించి నట్లు నడవడమేనని కర్మ ఫలితాన్ని తప్పక అనుభవించాలని బోధిస్తున్న ఆ భగవద్గీత వినేసరికి హరి మనసు చాలవరకు ఉపశాంతి నొందింది. కాని మనిషి నిత్యము కర్మసిద్ధాంతాన్ని తలచుకుంటూ బ్రతక లేడుకదా! బ్రతుకుపై ఆశలు పెంచుకోకుండా ఉండలేడుకదా! తన జీవితం సుఖమయం కావాలని ఆరాటపడుతూనే ఉంటాడు. అందుకు శ్రమిస్తాడు కూడా.

తాత్కాలికంగా బాధమరచి లేచి స్నానం చేసి వచ్చాడు హరి. శృతి చిరునవ్వుల మోము శిల్ప అందమైన మోము చూడగానే కొద్దిసేపు తన మనోభావాల్ని బాధలను పక్కకునెట్టాడు హరి. శృతి మొహంలో మోహంపెట్టి చూడలేక పోతున్నాడు. వారిద్దరి మధ్య గిరీష్ ఉన్నా గిరీష్ కోసమైనా లేచి తిరిగేవాడు. కాని గిరీష్ ఆ వీకెండ్‌కి ఇంకో ఊరు వెళ్ళాడు.

సాయంకాలం ఏదో స్వీట్ చేసింది శృతి, జీవితాలలో తీపిలేకపోయినా నోటికైనా తీపితగలాలనే ఉద్దేశ్యంతో అతని మనసుని మరోవైపు తిప్పాలని ఆమె ప్రయత్నిస్తూనే ఉంది. దానికి అతను మరింత బిగుసుకుపోతున్నాడు. అయినప్పటికీ పట్టువదలని విక్రమార్కుడిలా మాటల్లోకి లాగుతూనే ఉంది. వంటలో సహాయం చెయ్యమని కోరింది. ఆ మాత్రం వంట ఆమె చెయ్యలేకకాదు. అతని మనసు మార్చడంకోసం. సోఫాలు సరిగ్గాలేవు అంటూ సరిగా అమర్చే పని అప్పజెప్పింది. ఫ్లవర్‌వాజులను సర్దమంది. ఆ

రోజుకి పాపకు స్నానం చేయించమంది. గంగలో స్నానంచేస్తే శరీర మలినాలు పోతాయిగాని మనసులో మలినాలు పోవన్నట్లు. ఆ పనులవల్ల శారీరక శ్రమ తప్పించి మనసుకి శాంతి మాత్రంలేదు. ఆ రోజు యధాలాపంగా భోంచేసారు. అన్నం కలిపి హరికి ఆప్యాయంగా తినిపించాలనిపించింది శృతికి. కాని అలాచేస్తే అతని కన్నుల్లో కన్నీరు తాను చూడలేదు. చూసి భరించలేదు.

అందుకే మౌనంగా భోంచేసింది. వారు భోంచేస్తున్న తీరు తప్పదన్నట్లుగా తింటున్న ఆహారంలా ఉంది. ఇద్దరు దోషులు పక్కపక్కన కూర్చున్నట్టుందిగాని పెళ్ళిరోజున పెళ్ళయిన దంపతులు కలసి ఉన్నట్లుగా లేదు. ఏ సమయంలోనైనా పోలీసువచ్చి పట్టుకుపోతాడేమోనన్నంత భయంగా బాధగా తింటున్నారు వారు.

భోంచేయడమైన తరువాత టి.వి దగ్గర కూర్చున్నారు కొంతసేపు. మంచంమీద పడుకొని పిచ్చి ఆలోచనలతో నిద్రలేకుండా గడపడం కంటే టి.వియే మంచిదని రాత్రిచాలాసేపు టి.విలో కార్యక్రమాలు అయ్యేవరకూ అక్కడే కూర్చుంటున్నారు ఈ మధ్య. ఇద్దరి మనసులు టి.వి మీద లగ్నం కావడంలేదు. తప్పని సరిగా కళ్ళు మాత్రం సినిమాని చూస్తున్నాయి. మనసులు ఎక్కడెక్కడో బాధగా విహరిస్తున్నాయి.

హరి సోఫాలో కూర్చున్నాడు. శృతి అతని పక్కనున్న కుర్చీలో కూచుంది. శిల్ప నిద్రపోయింది. హరి పదిరోజులు లంఖణాలు చేసిన మనిషిలా ఆస్తంతా దివాలా తీసిన వాడిలా తన శరీరంలోని రక్తాన్ని ఎవరో పిండేసినంత బాధగా కూర్చొని చూస్తున్నాడు టి.వి. ఆ దృశ్యం శృతికి హృదయాన్ని మెలి తిప్పినంత వ్యధగా ఉంది. ఆ సోఫాలో అతని ప్రక్కన కూర్చొని అతని ఒడిలో తలపెట్టుకొని హరి కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తూ పెదవులతో పెదవులను కలిపి తీయదనం అనుభవించాలని అనిపిస్తుంది. అలా ఊహించుకుంటుంది ఆమె మనసు. ఆమె భర్తతో మానసిక వ్యభిచారం చేస్తునే ఉంది. నిత్యం అతని కౌగిలిలోనే ఉన్నట్లు ఊహించుకుంటుంది. ఆ ఊహల్లోనే జీవిస్తుంది. అందుకే హరికంటే ప్రశాంతంగా ఉండగలుగుతుంది. భర్త పక్కన ఉండి ఆమె అతడితో మానసిక వ్యభిచారం చేస్తుందంటే వారి జీవితం ఎంతటి విషాదకరమైనది. ఎంతటి దయనీయమైనది.

హరి మనసు మరో విధంగా ఆలోచిస్తుంది. శృతి మరబొమ్మలా తిరుగుతుంది గాని, ఆమె మనిషి కాదా. తనవల్ల చాల నష్టపోయింది, ఏ స్త్రీ నష్టపోనంతగా. తాను ఆమె దగ్గరికి చేరలేక పోతున్నాడు. అది తన అశక్తత. తనతోపాటు ఆమె జీవితాన్ని నరకం చేస్తున్నాడు. ఎప్పటికి తీరేను ఈ సమస్య. తాము తక్కువ నోములు నోచి ఎక్కువ ఫలితాన్ని ఆశిస్తున్నారా. ఏలుకులు విత్తనాలు నాటి ఏపిల్ పండ్లను ఆశిస్తున్నారా? ఎందుకు జరిగింది జీవితంలో ఈ పొరపాటు.

పొరపాటో గ్రహపాటో శాంతి గృహం కాస్తా అశాంతి గృహం అయిపోయింది. తాను లేకపోతే శృతి హాయిగా ఉంటుందేమో. ఎదురుగా ఉండి తనని చేరదీయని భర్త గురించి ఎలా ఆలోచిస్తుంది. ఏమని అంచనా వేసుకొంటుంది. ఆమె మనసులో బాధలేదా? ఆ శరీరానికి కోరికలు లేవా? ఆమె వయసు ఆమెను అల్లరి పెట్టడం లేదా? అన్నీ అనుమానాలే. దుర్బలమైన ఆలోచనలే. ఆమె మెడలో తాను వేసింది మూడు ముడులు కాదేమో మూడు ముల్లులేమో. ఏ విధి తమని శపించిందో. అందుకే జీవితం ఎడారిలో కాచిన వెన్నెల లాగ అయిపోయింది.

టి.విలో శృంగార సన్నివేశం వచ్చేసరికి ఇంకా అక్కడ నిలవలేక పోయాడు హరి. శృతిని అక్కడే ఒంటరిగా వదిలేసి వెళ్ళి పడుకున్నాడు. శృతి టి.వి ఆఫ్ చేసి తలుపులన్నీ సరిగా ఉన్నాయో లేదో చూసి బెడ్ రూమ్‌లోకి వెళ్ళింది. అతను మరలా బ్లాంకెట్ ముసుగు వేసుకున్నాడు. మెత్తని పరుపు మీద పడుకున్నట్లనిపించడంలేదు. ముళ్ళ మీద పడుకున్నట్లు అసహనంగా కదులుతూన్నడు.

మెల్లగా 'హరి హరి' అని పిలిచింది అతన్ని ఊరడించాలనే ఉద్దేశ్యంతో. కాని అతను విననట్లు తన లోకంలో తానున్నాడు. అతని ఆలోచనలు అతన్ని తినేస్తున్నాయి. పక్కన రంభలాంటి భార్య. తనను అమితంగా ప్రేమించే సహధర్మచారిణి ఉంది. కౌగిలి వీడడానికి ఇష్టపడనంతటి చలితో ఉంది వాతావరణం కూడా. ఇంట్లో ఉన్నది తామిద్దరే.

శిల్ప ఉన్నా లేనట్లే లెక్క. అయినా తమ బ్రతుకుల్లో ఒకరి చెంతకు ఒకరు చేరనంతటి వెలితి. తమిద్దరి మధ్య అంతులేని అగాధం. మనసుల్లో అనంతమైన ఆవేదన. పైగా ఆ రోజు తమ పెళ్ళిరోజు. వారిద్దరూ ఎవరో చనిపోయినట్లుగా దుఃఖిస్తున్నారుగాని పెళ్ళిరోజనే ఆనందం వారి దరిదాపుల్లోనే లేదు. తన పెళ్ళి సీతారాముల కళ్యాణం లాగానే అయింది.

ఆ మేలిమి ముత్యాలు రతనాల రాశులు ఆనాటి ఆభరణాలు లేకపోవచ్చు. కాని వారి అందం సీతారాముల్ని మించిపోయినదిగా ఉంది. ఆనాడు వారికి ఇలాగే వియోగం. ఇప్పుడు అంతే తమకి దగ్గరుండి వియోగం. తలచుకొని తలచుకొని పెళ్ళి సంగతులు, సన్నివేశాలు గుర్తు తెచ్చుకొని తెచ్చుకొని విలపిస్తున్నాడు హరి. మనసు కంట్రోలు తప్పిపోయింది. తలను మంచానికి వేసి బాదుకోనారంభించాడు వేదనగా.

మౌనంగా రోదిస్తున్న శృతి ఒక్కసారి ఉలిక్కిపడి జరిగిన దేమిటో గ్రహించి 'హరీ' అంటూ అతని బ్లాంకెట్ లాగేసి శిల్పను ప్రక్కకు జరిపి అమాంతం అతనిని కౌగిలించుకొని అతని వేడి పెదవులను తన అధరాలతో ముడి వేసింది. ఆ సమయంలో పిచ్చిదానిలా తానేమిచేస్తున్నదీ తనకే తెలియలేదు.



హరి కూడా అంతే. 'శృతీ. నాడియర్' అంటూ ఆమెను పెనవేసుకుపోయాడు. వారిద్దరి మధ్య గాలి కూడా చొరబడనంతగా దగ్గరైపోయారు. పెళ్ళయిన రెండు సంవత్సరాల తరువాత అది వారి మొదటి ముద్దు, మొదటి స్పర్శ, మొదటి కౌగిలింత.

ఆ క్షణం జారిపోతే జీవితంలో మరి దొరకదన్నంతగా ఆమెను తన గుండెలలో బంధించేస్తున్నాడు హరి. ఈ స్పర్శ కోసమే రెండు సంవత్సరాలు నుండి నరకం అనుభవిస్తున్నాడు. బ్రతికుండీ చచ్చినవాడిలా తన రక్తాన్ని పంచుకు పుట్టిన శిల్పకోసం బ్రతుకుతున్నాడు. తన ప్రాణంలో ప్రాణమైన భార్య కోసం నవ్వుతున్నాడు. అదీయిష్టం లేనట్టు. ఆస్థితిలో తానేం చేస్తున్నాడో ఏం చెయ్యకూడదో కూడా గ్రహించుకోలేని ఉన్మాద స్థితికి చేరిపోయాడు. తన ప్రమేయం లేకుండానే శృతి జాకెట్ హుక్స్ విప్పేసాయి అతని చేతులు. ఆమె ఆ వెచ్చని బ్లాంకెట్ క్రింద భర్త చేతి స్పర్శ యొక్క సుఖాన్ని స్వర్గాన్ని చవిచూస్తూనే పరిస్థితులు విషమిస్తున్నాయనీ తెలిసి పెనుగులాడ సాగింది.

ఆమె పెనుగులాట అతని బలం ముందు ఎందుకూ పనికి రావడంలేదు. ఆమెకు దుఃఖం వస్తుంది. పరాయి పురుషుడు తాకుతుంటే తనను తాను రక్షించుకోవడానికి చేసే పోరాటంలా ఆమె భర్తను వెనక్కి తొయ్యాలని ప్రయత్నిస్తోంది. అప్పటికే ఆమె శరీరంపై బట్టలన్నీ లాగేశాడు హరకి. శృతిని ఆమె శరీరాన్ని అన్ని చోట్ల తాకుతూ విపరీతమైన ఆనందాన్ని అనుభవించసాగాడు.

శృతి శరీరం తియ్యగా మూలిగింది. ఆమె మనసు భయంతో బిగుసుకు పోయింది. ఆపాలి. ఆపాలి. ఆ అకృత్యాన్ని ఆపాలి అన్న తలంపురాగానే వెయ్యి ఏనుగుల బలం వచ్చిందామెకు. అతనిని ఆప్యాయంగానే బలంగా పక్కకు నెట్టి తాను గబుక్కున మంచం దిగి గబ గబా బట్టలు వేసుకుంది.

హరి మంచంమీద అలాగే పడుకొని ఆవేశంతో రొప్పుతున్నాడు. అతని గుండెలు బాధతోను, దుఃఖంతోను ఎగిసి ఎగిసి పడుతున్నాయి.

'శృతీ నన్ను క్షమించు క్షమించు శృతీ' అంటూ చేతులతో ముఖాన్ని కప్పుకొని బావురమన్నాడు పసి పిల్లవాడిలాగ. అతన్ని అలాగే వదిలేసి గబ గబ బాత్‌రూమ్‌లోనికి వెళ్ళి టబ్ నిండా నీళ్ళు పెట్టి అందులో మునిగితేనేగాని ఆ రాత్రి ఆమె శరీరం శాంతించలేదు. తాను ఎంత దూరంగా భర్త నుండి పారిపోయినా ఆ సుఖంకావాలి కావాలి అని మనసు ఆరాట పడుతుంది. అది అందని చందమామా అని ఆమెకు తెలుసు. అందుకే అతనిని ఎప్పుడూ ముట్టుకోడానికి కూడా భయపడుతుంది.

తనకు ఆత్మస్థయిర్యాన్ని ఇమ్మని ఆ అర్ధరాత్రి కనబడని దేవుడికి ఎంతగానో విన్నవించుకొంది శృతి. మెల్లగా వెళ్ళి మధ్యలో శిల్పను పడుకోబెట్టి మంచం మీద ఒరిగింది, బరువైన మనసుతో తాపం ఆపలేని శరీరంతో. ఆమె శరీరం మనసుకి ఎదురు తిరిగి మెల్లగా కంపించసాగింది. అతను ఆమెను రెచ్చగొట్టి వదిలేశాడు. ఆమె మనస్థితి ఎలా ఉంటుందో మగవాడిగా ఆమె భర్తగా అర్ధం చేసి కొనగలడు. కాని తన అసహాయస్థితికి తనమీదే తనకి విపరీతమైన కోపం వచ్చింది హరికి.

శృతి ఏంచేస్తుందో ఎలా రియాక్ట్‌వవుతుందోనని మెల్లగా కళ్ళు తెరచి ఆమె వైపు చూశాడు. అష్టవిధ నాయికలందరూ ఆమె అందంలో నిగూఢంగా దాగున్నారా అనిపించింది. శృతి విరహోత్కంఠితలా అనిపించింది. అనురాగ చంద్రికలా కనిపించింది. విరహంతో శరీరంలోని కోరికల భారంతో అలవోకగా అందంగా పడుకొని ఉంది. పాపం శృతి శరీరంపై ఎన్ని అగ్ని గుండాలు మండుతున్నాయోనని అతనికి చాల వ్యధగా ఉంది.

ఆమెను అలాగే నిస్సహాయంగా గమనిస్తున్న అతను ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు.

నిటారుగా అయ్యాడు. కంగారుగా మంచం దిగి శృతి పడుకున్న వైపు ఒక్క అంగలో చేరాడు. ఆమెకు ఫిట్స్ వస్తున్నాయి. కాళ్ళు చేతులు వంకర్లు తిరుగుతున్నాయి. తాను చేసిన పనికి ఆమె శిక్ష అనుభవిస్తుంది. ఆ నిమిషంలో అతనికి అరేబియా సముద్రంలో దూకాలన్నంత ఆవేశం కలిగింది.

తాను డాక్టరుగా ఎంతో మందికి ఎన్నో వ్యాధులు నయంచేశాడు. ఇప్పుడు భార్య ఫిట్స్‌తో మెలి తిరిగి పోతుంటే ఏం చెయ్యాలో తెలియక మతి పోయిందతనికి. మొదట ఆమెను పక్కకు తిప్పి పడుకోబెట్టాడు. పళ్ళ మధ్యన నాలిక బిగిసి పోతుంటే దగ్గరలోనున్న చెక్క పేపర్ వెయిట్ పళ్ళ మధ్య పెట్టాడు. పళ్ళ మధ్య నున్న నాలికలా అతని హృదయం నలిగిపోసాగింది. ముక్కలు కావడానికి సిద్ధంగా ఉంది.

కొంచం సేపటికి ఆమె స్థిమితపడింది. తన దగ్గర నిద్రపట్టడానికి దాచుకున్న గార్డినల్ వేసి ఆమెను తన ఒడిలో పెట్టుకొని నిద్రపుచ్చాడు. ఆ టాబ్లెట్ ఆమె మీద పని చెయ్యగానే గాఢ నిద్రలోకి చేరుకుందామె. ఆ రాత్రంతా ఆమెను అలా ఒడిలో పడుకోబెట్టుకొని పసిపాపను లాలించినట్లు లాలిస్తూ ముంగురులు సవరిస్తూ తనివి తీరా ఆమెను చూసుకుంటూ అలాగే కూర్చుని ఉన్నాడు.

తెల్లవార్లూ అతను జాగరణ చేసినట్లు ఆమెకు తెలియదు. అంతమత్తునిద్దట్లో కూడా ఆమె హరి గురించే అసహాయతను గురించే ఆలోచిస్తుందని అతనికి తెలియదు. పరిపూర్ణ ఆరోగ్యవంతురాలయిన శృతి ఆరోగ్యం ఆ రోజునుండి పక్కదారులు తొక్కడం మొదలుపెట్టింది. దానికి కారణం తానేనని హరి మరింత కృంగిపోతున్నాడు. అతనికి గోరుచుట్టుమీద రోకటిపోటులా అనిపించింది శృతివ్యాధి.

ఆ మర్నాడు హాస్పిటల్‌కి తీసికొని వెళ్ళాడు శృతిని. అక్కడ మామూలుగా మెడికల్ షాపులో ఏమందడిగితే ఆ మందివ్వరు. డాక్టరు ప్రిస్కిప్షను ఉండాలి. అందుకే తను ఫామిలీ డాక్టరుని కన్సల్ట్‌చేసి మందులు రాయించి తీసికొని వచ్చాడు. రెండు రోజుల తరువాత నీర్సం తగ్గి మామూలుగానే డ్యూటీకి వెళ్ళడం మొదలు పెట్టింది శృతి. ఆమెను డ్యూటీలో చూసిన తరువాతగాని హరి మనసు శాంతించలేదు. ఇక పై శృతికోసమైన బాధ మరచి నటించాలనుకున్నాడు. ఆపై దిగులుగా ఉండడం శృతి ఎప్పుడూ అతన్ని చూడలేదు. అతని హృదయం లోపల ముక్క ముక్కలుగా అయిపోతూనే వుంది.

☆ ☆ ☆

ఆ మర్నాడు గిరీష్ వచ్చిన తరువాత ఇంటిలో కొంచెం బాధను మరచిపోయారు వారిద్దరు. శృతికి ఫిట్స్ వచ్చాయని తెలిసి ఎంతో బాధపడిపోయాడు గిరీష్. ఆ రోజునుండి వంట డ్యూటీ తానే తీసుకున్నాడు.

'గిరీష్ నీ పేరు మార్చేసుకో. నలుడో, భీముడో అని పెట్టుకో. వారిని తలదన్నేసావు కదయ్యా వంటలో' అన్నాడు హరి.

'నేను తలదన్న లేదండోయ్. వాళ్ళే చాల కాలం క్రితం బాల్చీ తన్నేసారు. అందుకే వారి తరువాత నేను పుట్టానని మా అమ్మకూడ అనేది. ఒక్కొక్కసారి ఒక్కొక్క దేవుడు ఆరాధ్య దైవమైతే ఆ ఆరాధ్య దైవాలు నలుడు, భీముడు' అన్నాడు గిరీష్. గిరీష్ ఏంచేసినా చేతివంట బ్రహ్మానందంగా ఉంటుంది. వంట చెయ్యడం కూడ కళే అన్నట్లుంటుంది. నిమిషాలమీద వంటచేసేస్తాడు అతి రుచిగా! పైగా అందరి కంటే ముందు తయారయి వెళ్ళిపోతాడు ఆఫీసుకి. 'నాకు ఒంట్లో బాగానే ఉంది. నేను చేస్తాను వంట, నీవు తప్పుకో' అనేది శృతి.

"వద్దు మిసెస్ శృతి. మా ఆవిడ వస్తే ఎలాగు నన్ను చెయ్యనియ్యదు. ఒక వేళ నాకు వంట వచ్చునని తెలిసిందనుకో; ఇంక నన్ను వంటిల్లు కదలనివ్వదు, మన కార్టూనిస్టుల అప్పడాలకర్ర కార్టూనులన్నీ నిజం చేసేస్తుంది సుమా. అసలే నా బుర్రమీద వెంట్రుకలు తక్కువ. అప్పడాలకర్ర దెబ్బలకు నాతల తీసికొని వెళ్ళి ఏ న్యూరో సర్జన్ చేతిలోనో పెట్టాలి" అన్నాడు. శృతి నవ్వింది అతని మాటలకు. జీవితంలో పైకి వచ్చే కుర్రాడు అనుకొంది.

గిరీష్ ఫ్రెండ్ ఒకతను అన్నీ అప్పడాల కర్ర కార్టూన్‌లు వేసేవాడట. ఆ కార్టూన్‌లతో విసిగిపోయిన ఆ ఫ్రెండ్సందరూ ఆ కార్టూనిస్టు పెళ్ళికి అతని భార్యకు పెద్ద అప్పడాల కర్ర ప్రెజెంట్ చేసారట. అప్పటినుండి అప్పడాల కర్ర జోక్స్ కట్టిపెట్టి మరోరకం కార్టూన్స్ వేసే వాడని గిరీష్ చెప్పాడు హరితో.

గిరీష్‌ని చూస్తే హాస్పిటల్‌లో వార్డుబోయ్ గుర్తుకి వచ్చాడు శృతికి. ఆ వార్డ్‌బాయ్ చాల పొలైట్‌గా కనిపించేవాడు. కన్సల్టెంటుతో చాల ఫ్రీగా ఉండేవాడు. పనిమాత్రం చాల కష్టపడి చేసేవాడు. అతను శలవు అయ్యి వెళ్ళిపోయిన తరువాతగాని తెలియలేదు, ఆ అబ్బాయి ఆ కన్సల్టెంటుగారి అబ్బాయి అని ఫైనల్ ఎమ్.బి.బి.ఎస్ చదువుతున్నాడని, హాలీడేస్‌లో డబ్బు సంపాదించుకోవడం కోసం వార్డుబోయ్ పనిచేస్తున్నాడని. ఆ సంగతి విని ఎంతో ఆశ్చర్యపోయింది శృతి. హాస్పిటల్‌కు వెళ్ళడానికి తయారయింది. ఓవర్ కోటు కోసం వెతుక్కుంటుంటే ఐరిష్ పద్ధతి ప్రకారం అది పట్టుకొని నిలబడ్డాడు గిరీష్. ఇంటికి వచ్చిన అతిధులు వెళ్ళిపోయే ముందు ఆ ఇంటి యజమాని స్త్రీలకు మర్యాద సూచకంగా కోటు తొడుగుతాడు.

గిరీష్ నిలబడ్డ తీరుకి చిన్నగా నవ్వుకొంది శృతి. ఆ కోటు ఆమెకు వేసి అన్నాడు. 'ఒక కెర్రీ ఉమన్ తన కొడుకుకి కోటు పార్శిల్ చేస్తుందట. కోటు వెయిట్ ఎక్కువైందని బటన్స్ అన్నీ కట్ చేసేసి తిరిగి ఆ ఓవర్ కోటు జేబులోనే వేసి కొడుక్కి ఉత్తరం

వ్రాసిందట. వెయిట్ ఎక్కువయిందని బటన్స్ కట్ చేసేసాను. వాటికోసం ఎక్కడా వెతుక్కోవద్దనీ కోటు జేబులోనే ఉన్నాయని' హరికూడ మనస్ఫూర్తిగా నవ్వాడు ఆ జోక్‌కి. ప్రొద్దున్నే నవ్వుతూ హాస్పిటల్‌కి వెళ్ళిన శృతి ఆ రోజంతా ఆనందంగానే ఉంది. ఒక్కోరోజు వేళా విశేషం అంతేనేమో, నవ్వితే నవ్వడం, ఏడిస్తే ఏడ్వడం.

☆ ☆ ☆

ఇప్పుడు మృదుల చిన్నబాబుని క్రెష్ (చిన్నపిల్లలను చూసే స్కూలు)లో వదిలి, పిల్లలందరికి వండిపెట్టి వెళుతున్నది. కొత్తగా భర్తను సాధించడం నేర్చుకొంది. నీ కుటుంబం గురించే ఇంతదూరం వచ్చి ఇన్ని అవస్థలు పడుతున్నామని, ఆ సాధింపులు రావు జీవితంలో ఊహించని మార్పులు. ఆయన అన్ని బాధలకు అలవాటు పడిపోయినట్లు అన్నింటికి అతీతంగా నిర్లిప్తంగా ప్రవర్తిస్తున్నాడు. మౌనంగా ఉండే భర్తను మరింత సాధిస్తుంది మృదుల. అతనికి అసహనంగా ఉన్నా ఇంటి వాతావరణం అతను అసహాయుడు.

అప్పుడప్పుడు రావుగారు భారతిని చూసి వస్తున్నారు. కారణం ఆమెను తీసికొని వచ్చినతను అతను. అందుకే బాధ్యతారాహితంగా వదిలివేయలేకపోతున్నాడు. తాను వెళ్ళాడు ఒకరోజు. అప్పుడే స్వాతి సంజయ్ వాళ్ళకు తెలిసిన స్టాఫ్‌నర్స్ పెళ్ళికి వెళుతున్నారు. ఇప్పుడు భారతిని ఏం చెయ్యాలో వారికి తెలియలేదు. ఇంట్లో ఒంటరిగా ఉంచడానికి భయం. పెళ్ళికూతురికి భారతిని తీసికొని వస్తామని ఫోన్ చేసారు. 'సారీ అలా కుదరదు స్వాతి. మీరిద్దరే వస్తున్నట్లు ముందుగా ఇన్‌ఫామ్ చేసారు. ఫుడ్ మీ ఇద్దరికే ఉంటుంది. మరో మనిసికి అరేంజ్ చెయ్యాలంటే ఇప్పుడు కష్టం' అంది ఆ నర్స్.

అందుకే భారతిని 'ఈ రోజుకి మీ ఇంట్లో పెట్టుకొండి' అని రావుగారిని అడిగింది. అలాగేనని ఇంటికి తీసికొని వెళ్ళారు. భారతిని చూసిన మృదుల చిందులు తొక్కడం ప్రారంభించింది. 'వారు దయదలచి భారతిని చూస్తున్నారు. ఒక్కరోజు మనం చూడలేమా, మనం తెచ్చిన అమ్మాయిని' అని అన్నారు. ఆ మాటలకు తోక తొక్కిన తాచులా రావుగారిమీద విరుచుకుపడింది మృదుల. ఈ మధ్య ఆమెకు పనితోను, భారతిచేసిన పని తలంచుకొని అసలు శరీరానికి మనసుకి కూడ విశ్రాంతి ఉండడంలేదు. స్వాతి వాళ్ళు పెళ్ళినుండి రాగానే భారతిని తమ పిల్లను తీసికెళ్ళినంత భద్రంగా తీసికెళ్ళి పోయ్యారు.

ఆ గొడవ సద్దుమణిగింది అనుకునేసరికి మరొక పెద్ద గొడవ అతని ముందు ప్రత్యక్షమయింది. హాస్పిటల్ అడ్రసుకి ఒక ఉత్తరం వచ్చింది. అది అతనిని బెదిరిస్తూ వ్రాసిన ఉత్తరం. ఒక ఐరిష్ వనిత వ్రాసింది.

మిస్టర్ రావ్, మీరు పదినెలల క్రితం డబ్లిన్ వెళుతూ నాకు లిఫ్ట్ ఇచ్చారు. దారిలోన కారు ఆపి ఆ రాత్రి ఒకచోట బెడ్ అండ్ బ్రేక్ ఫాస్ట్ దగ్గర ఆపి నన్ను అనుభవించారు. ఆఫ్‌కోర్స్ నేను ఇష్టపడ్డాననుకో. ఆ ఫలితంగా నాకు కొడుకు పుట్టాడు. మీరు నాకు రెండు వేల డాలర్లు ఇచ్చినాసరే, పిల్లాడిని నన్ను స్వీకరించినా సరే. లేదంటే మీమీద కోర్టులో కేసు పెడతాను అని ఉంది. ఆ ఉత్తరం అతనికేమీ అర్థం కాలేదు.

తను కోర్టు కేసుకి డబ్లిన్ వెళ్లినమాట వాస్తవమే. కాని ఎవరికీ లిఫ్ట్ ఇవ్వలేదే. ఇదేమి ఉత్తరం అని ఆశ్చర్యపోయాడు. ఆ ఉత్తరం మృదుల చదివి అపర కాళిలా అతనిమీదకు దండెత్తింది. నేను ఏ పాపం ఎరుగను మొర్రో అన్నా వినిపించుకోలేదు. అనరాని మాటలు అంది భర్తను.

ఆ ఉత్తరం ఒక ప్రక్క, భార్య ప్రవర్తన ఒక ప్రక్క అతనికి అయోమయంగాను, భయంగాను అనిపించింది. ఇదెక్కడి కొరివిరాతండ్రి అనుకున్నాడు. నిజంగా రావుగారు ఏ పాపం ఎరుగరు. అంతేకాదు ఆమెను అలా అనుభవించింది మరో ఇండియన్ అని అతను అమెరికా వెళ్ళిపోయాడని ఇంక ఐర్లాండుకి తిరిగిరాడని తామిద్దరి పోలికలూ ఒకలాగే ఉండడంలో ఆ అమ్మాయి పొరబడిందని రావుగారికి తెలియదు. తెలిసే అవకాశం కూడాలేదు. రావుగారి పరిస్థితి ఏ ఆధారమూ లేక గాలిలో నిలబడినట్లుంది. తన జీవితం ఎటువైపుకి పడిపోతుందో ఆయనకే అర్థం కావడంలేదు. అన్ని సమస్యలు అతని మనసుని చిందరవందర చేస్తున్నాయి. కష్టాలు కట్ట కట్టుకొని సుఖాలు వంటిగా వస్తాయన్నారందుకే. కొందరికి కష్టాలను తట్టుకునే శక్తి ఉంటుంది. కొందరు కష్టాలను తలచుకొని  బలహీనులైపోతారు. అసలు జీవితమే కష్ట సుఖాల మేలు కలయిక. అందుకే ఉగాది పచ్చడిలో వేపపూతలా ఒగరు, మామిపిందెల పులుపు, చెరకు ముక్కల తీపి, మనుగడయే మకరందం - అన్నట్లు మనిషికి జీవితంలోని అన్ని రుచులను చాటి చెప్పడానికి మన పూర్వులు ఆ పచ్చడిని అలా తయారుచేసారు. అది ఇప్పటికీ మనం అనుసరిస్తూ రుచి చూస్తున్నాం.

గిరీష్ కోసం ఒకరోజు కిజి ఒకబ్బాయిని పంపించింది. నాలుగేళ్ళుంటాయి. తండ్రెవరో తెలియని ఆ అబ్బాయిని తల్లి వదిలేసి వెళ్ళిపోయింది. అలా గాలికి అందరిళ్ళకు తిరుగుతుంటాడు. అప్పుడప్పుడు వాళ్ళ అమ్మమ్మ దగ్గర వెళుతుంటాడు. ఆ అబ్బాయి వచ్చి 'మిసెస్ శరితి. ఈ ఉత్తరం మిస్ కిజి మిస్టర్ గిరీష్‌కి ఇమ్మంది' అని చెప్పి ఒక ఉత్తరం ఇచ్చి వెళ్ళిపోయాడు. సాయంకాలం క్లబ్‌కి డాన్స్‌కి రమ్మని ఆ ఉత్తరం.

డాక్టర్ రావుగారికి ఐరిష్ అమ్మాయి ఆ బెదిరింపు ఉత్తరం వ్రాసిన దగ్గరనుండి

అందరికీ భయం పట్టుకొంది. ఐరిష్ వాళ్ళు ప్రపంచంలో అందరికంటే మంచివారే. కాని ఇండియన్స్ అంటే ఉన్న క్రేజ్‌తో అక్కడక్కడ అలా ప్రవర్తిస్తుంటారు. డాక్టర్ సంజయ్ కూడ ఇంకా స్వాతిని ఇండియా నుండి తీసికొని రాకముందు హాస్పిటల్‌లో ఏ నర్సుతో నవ్వుతూ మామూలుగా మాట్లాడినా హెడ్‌నర్స్ వెళ్ళి కన్సల్టెంటుకి చెప్పేసేదట. ఆఖరికి ఆ కన్సల్టెంటే మీ భార్యను త్వరగా ఇండియానుండి రప్పించేసుకో అని వార్నింగ్ ఇచ్చేసరికి స్వాతిని వెంటనే రప్పించేసాడు సంజయ్.

కిజి ఉత్తరం చూసి గిరీష్‌కి ఏమిచెయ్యాలో పాలు పోలేదు. గిరీష్‌కి జ్వరం, రాడు క్లబ్‌కి అని శృతి కబురు చేసింది. తరువాత ఒకగంటకి కిజియే బయలుదేరి వస్తున్న దృశ్యం కిటికీలో నుండి చూసిన శృతి గిరీష్‌తో ముసుగుతన్ని పడుకో మని చెప్పింది. కిజి వచ్చి నిరాశగా వెళ్ళిపోయింది. గిరీష్‌కి నిజంగానే జ్వరం అన్న ఉద్దేశ్యం. ఆ రోజు ఆదివారం అందరూ సరదాగా ఏ చిన్న పార్కులోనికైనా వెళదామనుకున్నారు. కిజి పుణ్యమా అంటూ కాలింగ్ బెల్ మ్రోగినప్పుడల్లా గిరీష్ బెడ్‌రూమ్‌లోకి పరుగుపెట్టి పడుకుంటూనే ఉన్నాడు శృతి మాట ప్రకారంగా. ఆ రోజంతా హౌస్ అరెస్టు అయిపోతుంది గిరీష్‌కి. ఈ మధ్య డేటింగ్స్ అంటూ కిజి గొడవ చేస్తుంది గిరిష్‌ని. గిరిష్‌ని వదిలే ఉద్దేశ్యం అమెకున్నట్లు లేదు. ఇండియన్స్ అంటే ఎక్కువ తాగరని సెక్స్ విషయంలో ఆడవారిని బాగా సుఖపెడతారని పొదుపుగా ఉండి డబ్బు ఆదా చేస్తారని వాళ్ళకు ఇండియన్స్ అంటే ఇష్టం.

అప్పుడు చెప్పాడు గిరీష్ శృతితో తనకి మేనత్త కూతురు ఉందని, ఆమెని పెళ్ళి చేసికుంటానని. కాని ఇప్పుడే జాబ్‌లో జాయిన్ అయిన కారణంగా ఒక సంవత్సరం వరకూ శలవు ఇవ్వరట ఇండియా వెళ్ళడానికి. అందుకే హరి ఒక ఉపాయం చెప్పాడు గిరీష్‌కి. మేనత్త కూతురు స్రవంతిని ఇక్కడికే రప్పించి వేయమని. గిరీష్ వెంటనే అది ఆచరణలో పెట్టి వారి పెద్ద వాళ్ళకు ఉత్తరం వ్రాసాడు. స్రవంతిని పంపడానికి వాళ్ళు ఒప్పుకున్న తరువాత శృతి కూడ తండ్రికి ఉత్తరం వ్రాసింది. మంచి ముహూర్తం చూసి వ్రాయమని, దానితోపాటు పెళ్ళి మంత్రాలతో ఒక కేసెట్ పంపమని. ఉత్తరాలు వ్రాయడమే ఆలస్యం; పదిహేను రోజులలో స్రవంతి, కేసెట్‌తో సహా వచ్చేసింది.

స్రవంతిని లండన్ ఎయిర్‌పోర్టుకి వెళ్ళి తీసికొని వచ్చాడు గిరీష్. అంతకుముందే ఇల్లు అద్దెకు తీసికొని పాలు పొంగించేసాడు, శృతి హరిల సహకారంతో. శ్రవణా నందకరంగా నున్న వేదాంతశర్మగారి వేద మంత్రాలతో. ఆ చుట్టుప్రక్కన ఉన్న ఇండియన్స్‌రాగా బాజాలు బజంత్రీలు, నాదస్వరం ఉన్న కేసెట్ల సహకారంతో ఇండియాలో పుట్టిన స్రవంతి గిరీష్‌లు ఐర్లాండ్ దేశంలో ఆలుమగలయ్యారు. మాట వచ్చిన మనుషులే దేనికైనా అడ్డులు, ఆంక్షలు పెడతారుగాని మాటలు చేతగాని దేశం మౌనంగా ఆనందంగా ఆ దంపతులను ఆశీర్వదించింది. పెళ్ళికాగానే స్రవంతి

తెచ్చిన పట్టుబట్టలు హరికి, శృతికి ఇచ్చి కాళ్ళకు నమస్కరించి ఆ ఇంటినుండి వారి ఇంటికి ఆనందంగా వెళ్ళిపోయారు స్రవంతి, గిరిష్.

గిరిష్ పెళ్ళి టైముకి కిజి వాళ్ళ అమ్మగారింటికి వెళ్ళింది. బహుశా వారికి చెప్పే ఉంటుంది. తాను ఇండియన్‌ని పెళ్ళి చేసుకోబోతున్నానని. ఏదేశం వాడైనా ఏ రంగువాడైనా ఎలాంటి వాడైనా తల్లిదండ్రులకు ఏమీ అభ్యంతరం ఉండదు కూతురి పెళ్ళి విషయంలో. హేండ్ బేగ్ కొనుక్కోడానికి ఆడపిల్లను ఎంత ఫ్రీగా వదులుతారో హజ్బండ్‌ను సెలక్ట్ చేసికోడానికి కూడ అంతకంటే ఫ్రీగా వదిలేస్తారు తల్లిదండ్రులు. ఊరినుండి వచ్చిన కిజి మొహం గిరిష్ పెళ్ళి సంగతి వినగానే అసలే తెల్లటి మొహం మరింత తెల్లగా పాలిపోయింది. అదీ ఒక్క నిమిషం మాత్రమే. మరో గంటకల్లా మామూలు మనిషి అయిపోయింది కిజి, గిరీష్ అంటే ఎవరో కూడ తెలియనట్లు.

☆ ☆ ☆

ఆ రోజు ఒ.పిలో పేషెంట్స్‌ని చూస్తున్నాడు హరి. హరి హాస్పిటల్‌లో ఉన్నాడుగాని మనసంతా ఇంటిమీదే వుంది. కారణం ఆ రోజు వినోదిని, వర్మ దంపతులతోపాటు విజయేందర్‌రెడ్డి అతని భార్య కూడ కార్క్‌కి వస్తున్నారు. వారి ఫ్రెండెవరో అమెరికా వెళ్ళిపోతున్నాడట షావన్ ఎయిర్ పోర్టులో వీడ్కోలు ఇచ్చి వస్తున్నారు. సాధారణంగా ఇండియన్స్ అందరూ అమెరికా వెళ్ళడానికి ముందుగా ఐర్లాండు వెళతారు. అక్కడ కొంతకాలం ఉద్యోగం చేసి ఇ.సి.ఎఫ్.ఎమ్.జి అమెరికా పరీక్ష పాసై అక్కడ నుండి అమెరికా వెళ్ళిపోతుంటారు. హరి కూడ అదే ఉద్దేశ్యంతో ఐర్లాండు వచ్చాడు. పరీక్ష త్వరగా పాసౌదామంటే ఏకాగ్రత కుదరడంలేదు హరికి, తన దాంపత్యంలోని లోపాలవలన తాపాలవలన.

ముందుగా ఒక పేషెంటుని చూసాడు హరి. ఆవిడకు నెల్లాళ్ళ క్రితం పొట్టమీద చిన్నగా పెన్‌తో ఒకమార్క్ పెట్టాడు. నెల తరువాత కూడ ఆ మార్క్ చెడలేదంటే ఈ నెల్లాళ్ళు స్నానం లేదన్నమాట. సెంటుతోనే కాలక్షేపం చేస్తున్నదన్నమాట. ఆవిడమీద చాల చికాకు కలిగింది హరికి. అయినా తాను చిరాకులు పరాకులు ప్రదర్శించకూడదు. ఉద్యోగ ధర్మం నోరు మూసికొని నిర్వర్తించాలి. తరువాత ఒక పిల్లవాడిని చూసాడు. ఆ పిల్లవాడికి తొడల దగ్గర అంతా ఒరిసిపోయి పుండై పోయింది. ప్లేస్టిక్ చెడ్డీలో కాటన్ పేడ్స్ పెట్టేసి పిల్లలను వేసేస్తారు. రోజుకి రెండు లేక మూడుసార్లు మాత్రమే మారుస్తారు ఆ చెడ్డీని. ఈ లోపుగా ఎన్నిసార్లు యూరినల్స్‌కిగాని, లేవేటరీకిగాని వెళ్ళినా పిల్లలు అలా మగ్గి పోవలసిందేగాని టైమ్‌కి ముందు ఆ చెడ్డీ తీయరు. దానిలో ఆ స్థలంలో అంతా పుండయి పోయింది. పైగా చిన్నప్పటి నుండి పిల్లలను వేరే గదిలో పడుకోబెడ తారు తల్లిదండ్రుల దగ్గర పడుకోనివ్వరు. అందుకే కాబోలు వారికి తల్లిదండ్రులంటే

అంతగా ఎఫెక్షన్ ఉండదు. ఆ పిల్లాడిని పరీక్ష చేస్తుండగానే 'హలో డాక్టర్ హరీ' అంటూ ఒక ఐరిష్ అతను పలకరించాడు.

'హల్లో పేడీ' (అంటే పెద్దకాపుగారు అన్నట్టు) అని హరి విష్ చేసాడు. నెలల తరబడి పొలాలలో పేడలో పనిచేసే ఆ దుస్తులు మార్చేసారు గాని స్నానాలు చేయని బట్టలు నెలల తరబడి ఉతకని వారి దగ్గర ఎంత సెంటు రాసుకున్నా పేడకంపురాక తప్పదు. క్రొత్తలో హరికి వాంతొచ్చినంత పనయ్యేది. ఇప్పుడు మెల్లగా అలవాటు పడ్డాడు. లేవటరీకి వెళ్ళి నీళ్ళకు బదులు టిస్యూపేపర్ ఉపయోగించే వారి దగ్గర తట్టుకోలేనంత కంపుకొడుతుంది. కనీసం వారానికి ఒకసారి స్నానం చేసినా బావుండును. టి.వి.లో రోజుకి కనీసం ఒకసారి అయినా బ్రష్ చేయండి అన్న అడ్వర్‌టైజ్‌మెంట్ గుర్తుకి వచ్చింది హరికి. పళ్ళు తోముకోవడం కూడ అరుదేనన్నమాట వారు.

శృతి వినోదిని వాళ్ళు వస్తున్నారని సెలవు పెట్టేసింది. అన్యమనస్కంగానే పేషెంట్సుని చూసి ఇంక ఇంటికి వెళ్ళిపోదామని ఓవర్ కోటు వేస్కోబోతుండగా మరో ఏక్సిడెంట్ కేసు వచ్చింది. హరికి చెప్పలేని చిరాకు కలిగింది. ఇప్పుడు అందులో చిక్కుకుపోతే ఇక అంతే తన పని. వర్మతో ఎక్కువసేపు మాట్లాడే అవకాశమే ఉండదు. మరలా ఆ రాత్రికే వెళ్ళి పోతామన్నారు వారు. కోపాన్ని పెదవుల మధ్య అణచిపెట్టుకొని పేషెంట్సు దగ్గరకు వెళ్ళిన హరినోట మాటరాక తాను చూస్తున్నది కలో నిజమో గ్రహించుకోలేక రాయిలా ప్రాణం పోయిన బొమ్మలా నిలబడిపోయాడు.

ఎదురుగా తన ఊహకు వ్యతిరేకంగా మూడు శవాలు. ప్రియాంకది, శశాంకది, రెడ్డిగారి భార్యది. స్థాణువులా నిలబడిపోయాడు. వినోదిని, వర్మ, రెడ్డిగారు స్పృహతప్పి ఉన్నారు. వెంటనే ఏం చెయ్యాలో అర్థం కాలేదు హరికి. అందరినీ పట్టుకొని బావురుమన్నాడు ముందు. వారికి ట్రీట్‌మెంట్ ఇవ్వడానికి చేతులు రావడంలేదు. చాలనెర్వస్‌గా ఫీల్ అవుతున్నాడు. ఆ శవాన్ని చూడడానికి కనులు రావడంలేదు.

ఒక్కసారి కనులు మూసుకున్నాడు. తాను ఇలాంటి ఎన్నో చావులను, ఏక్సిడెంట్లను చూసి ఉండవచ్చు. కాని వారు ఐరిష్ వారు. వీరు తన వారు. 'శశాంక, ప్రియాంక, వర్మ అంటూ వెర్రివాడిలా అరుస్తూ వారికి మరో డాక్టర్ సహాయంతో తప్పనిసరిగా ఫస్ట్ ఎయిడ్ మొదలు పెట్టాడు. ఏడుస్తున్న హరిని వింతగా చూసారు హాస్పిటల్‌లోని వారు. వారు ఎవరు చనిపోయినా విపరీతంగా ఏడవరు.

ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరు అన్నట్లు సంతోషంగా బయలు దేరిన ఆ కుటుంబము చావుని చూసింది. ఫోన్ అందుకొని వచ్చిన శృతి పరిస్థితి అసలు చెప్పనక్కరలేదు. తన కాలి క్రింద భూమి కదులుతున్నట్లు తాను మంచులో కూరుకుపోతున్నట్లు అనిపించింది. బ్రతికినంత కాలం ఎంత అపురూపంగా

చూసుకున్నా మనుషులను చనిపోయిన తరువాత ఇంక వాళ్ళను ఎంత త్వరగా భూమికి అప్పగిద్దామా అన్నట్లుంటుంది. ఎంతటి మహారాజుకైనా కూడా ఆ పరిస్థితి తప్పదు.

ప్రియాంక, శశాంక, సుగుణ - లకు వీరి దేశపద్ధతి ప్రకారం రోమన్‌కేతలిక్ మతం ఇచ్చి భూస్థాపితం చేసారు. డాక్టరు రెడ్డిగారికి చిన్న ఫ్రాక్చరు అయింది. వర్మకు, వినోదినికి స్వల్పమైన గాయాలు తగిలాయి. కాని వారి జీవితానికే పెద్ద గాయం అయింది. ఆ దంపతులు తమ సంతోషాన్ని, సౌభాగ్యాన్ని, నవ్వుని తమ జీవితంలో ఉండే ఆనందాన్నంతటిని ప్రియాంక, శశాంకతోపాటే ఆ భూమాతకే వదిలేసారు. జీవచ్ఛవాల్లా మిగిలారు. వారి దుఃఖం అంతులేనిది. ఎవరూ తీర్చలేనిది. ఉన్న ఇద్దరు పిల్లలు పోయారు. ఇంక ప్రపంచంలో బంగారు కొండను వారికి ఎవరైనా ఇచ్చినాకూడా వారి బాధ తీరదు. అంతులేని ఆవేదనతో, ఆక్రోశించే మనసుతో ఇంటికి చేరారు వర్మ వినోదిని దంపతులు. వారిని ఎలా ఓదార్చాలో కూడ హరికి, శృతికి అర్థం కాలేదు.

అంతటి బాధలోను ముఖర్జీ భార్య కళిక రెడ్డిగారి భార్యను ఏవో మాటలు అంటుంటేగాని శృతికి అసలు సంగతి తెలియలేదు. శృతి ఊహించినట్టుగానే రెడ్డిగారి భార్య లెక్చరర్ ఉద్యోగం చేస్తుంది ఇండియాలో. ఆయన మాత్రం తన ప్రేయసిని భార్య అని చెప్పి ఇక్కడకు తీసికొని వచ్చాడు. ఇక్కడ ఎవరు గుర్తిస్తారులే అనుకున్నాడు. ఇక్కడ ప్రేయసితో కులుకుతూ అక్కడ ఉన్న భార్యాబిడ్డలకు ప్రేమను కురిపిస్తూ ఉత్తరాలు వ్రాసేవాడు. ఆ ఉత్తరాలకి ఖర్చయ్యేది పెన్‌లోని ఇంకేకదా! పాపం ఆ అమాయకురాలికేం తెలుసు భర్తగారి మోసపుపనులు, రాసలీలలు. ప్రేయసి పేరు మాత్రం సుమతి. పతివ్రత పేరు. ఆమె మరొకరి భర్తను తన భర్తగా చేసికొని ఈ దేశానికి వచ్చింది. మగవాడు పరాయి ఆడదాని మోజులో పడితే భార్యను ఎంత చక్కగా మోసం చెయ్యగలడోన్న దానికి విజయేందర్‌రెడ్డి ఒక ఉదాహరణ. భారత స్త్రీ భర్త చేతిలో ఎన్నో విధాలుగా మోసపోతూనే ఉంది. ఇది మరొక పద్ధతి.

చనిపోయిన సుమతి గురించి కళిక చాలా అసహ్యంగా మాట్లాడడం మొదలు పెట్టింది. ఆమె నోరే అంత. చెప్పే విషయాన్ని మంచి మాటలతో కూడ చెప్పవచ్చు. అసభ్యకరమైన పదజాలాన్ని ఉపయోగించనక్కరలేదు. మనం మాట్లాడే మాటలవల్ల మన సంస్కారం బయటపడుతుందని కళిక తలంచదు. సూటిగా మాట్లాడుతున్నాను అనుకొంటుంది. ఆకాశంమీద ఉమ్మివేయాలని ఉద్యమిస్తుంది. అది తిరిగి తన మొహం మీదే పడుతుందని తెలియదు. ఎదుటివారికి బురద జల్లాలని శ్రమపడుతుంది. ఎదుటి వారికి బురద వ్రాయాలంటే ముందు మనచేతికి పూసుకోవాలని గుర్తించదు. ఆమె చెప్పిన మాటలు నిజమే కావచ్చు, సుమతి విషయంలో కాని ఆమె చెప్పిన తీరుకి అందరికీ ఆమె అంటే చులకన భావం ఏర్పడింది. చనిపోయినవారు ఎంత శత్రువైనా వారిగురించి నీచంగా మాట్లాడకూడదు.



కళిక చెప్పిన సంగతి విన్న తరువాత శృతికి సుమతి చావు గురించిన బాధ తగ్గింది. ఒకరి సొమ్మును అపహరించిన స్త్రీ ఆమె. ఒకరి జీవితంలో చిచ్చుపెట్టిన ఆడది. ఆడదానికే ఆడదే శత్రువు అన్న మాటను నిజం చేసిన నకిలీ ఇల్లాలు సుమతి. శృతికి ఐరిష్ డాన్స్ చేస్తున్న ప్రియాంక, స్నోమేన్‌ని కడుతూ అందులో ఆడుతున్న శశాంక అస్తమాను గుర్తుకి వచ్చి తీరని దుఃఖం కలుగుతోంది. ఆంటీ, మిస్ వరల్డ్ కాంపిటీషన్‌కి వెళితే మీరు ఫస్ట్ వస్తారు అనేది ప్రియాంక శృతి శరీరనిర్మాణాన్ని గమనిస్తూ. ఆమె పలికిన మాటలు, ఆడిన ఆటలు తలంచుకొని కుమిలి కుమిలి ఏడ్చింది శృతి. ఇది జరిగిన పదిహేను రోజులకే ఎంతో ఆశతో, ఎన్నో ఆశయాలతో, అమెరికా వెళ్ళాలనే ఉద్దేశ్యంతో ఐర్లాండుకి వచ్చిన వర్మ, వినోదిని దంపతులు తమ జీవితాల్లో తీరని వెలితిని, అంతులేని అగాధాన్ని, కడుపుశోకాన్ని, అపరిమితమైన దుఃఖాన్ని వెంటబెట్టుకొని ఇండియా వెళ్ళిపోయారు. వారు వెళ్ళిపోతుంటే తమ

శరీరంలోని సగభాగాన్ని ఎవరో తీసికొని వెళ్ళిపోతున్నట్లుగా ఫీల్ అయ్యారు హరి, శృతి.

రెడ్డిగారు రెండు నెలలు హాస్పిటల్‌లో ఉన్నారు. ఆయనకు ఫ్రాక్చర్ అయినందుకు డ్రైవింగ్‌లో ఆయన ఫాల్ట్‌లేనందుకు ఆ దేశం నుండి కొన్ని లక్షలు ముట్టాయి ఆయనకు నష్టపరిహారంగా. తన ప్రేయసిని ఆ దేశానికి అప్పగించి అనుకోని సంపదను చేతపట్టుకొని అసలు భార్య దగ్గరికి వెళ్ళిపోయారు రెడ్డిగారు. ఆ రెండు కుటుంబాలకి ఆ దేశంతో రుణం తీరిపోయింది. ఎన్నో ఆశలతో, కలలతో వచ్చినవారు పుట్టెడు దుఃఖంతో తిరిగి స్వదేశానికి చేరుకున్నారు. ఎవరికీ, ఎప్పుడు ఎక్కడ ఆయువు తీరిపోతుందో అన్నది మనిషికి ఎప్పటికీ అర్థంకాని సమస్యే.

☆ ☆ ☆

భారతిని స్వాతి తన ఇంటికి తీసికొని వచ్చి రెండు నెలలయింది. ఈ రెండునెలల నుండి హాయిగాను నిశ్చింతగాను ఉంది స్వాతికి, ఇంట్లో మరో తోడు ఉండడంతో. డాక్టర్ సంజయ్‌కి ఇన్నిస్‌కార్తిలో ఉద్యోగం వదిలేసి హరి, శృతి ఉన్న ఊరు కార్క్‌లో జాబ్ దొరికింది. భారతితోసహా వారు కార్క్‌కి మకాం మార్చేసారు. తీరా ఆ ఊరు రాగానే సంజయ్ తల్లిదండ్రులు పడవ ప్రమాదంలో మునిగి చనిపోయారన్న వార్త వచ్చింది. వెంటనే భారతిని శృతి దగ్గర పెట్టి వారిద్దరూ ఇండియా వెళ్ళారు.

ఇండియాలో నెల ఉండి వచ్చేసరికి వారు ఎదురుచూడని వార్త వారికొరకు ఎదురు చూస్తుంది. భారతి మరలా గర్భవతి అని విన్న స్వాతి హతాశురాలయింది. ఆ గర్భం డాక్టర్ హరి వల్లనే వచ్చిందని వాదించసాగింది. హరికి, శృతికి ఆ మాటలకు నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు. నీరు పల్లమెరుగు నిజం దేవుడెరుగు అని ఆమె వాదన తప్పని తెలిసినా కూడ శృతి నోరెత్తలేదు.

స్వాతికి, తన భర్త హాస్పిటల్‌లో ఆరేళ్ళ అమ్మాయినుండి అరవై ఏళ్ళ ముసలమ్మ వరకూ ఎవరు 'పడితే' వారిని అనుభవిస్తాడని తను ఓవర్ టైమ్ చేసి సంపాదించిన డబ్బంతా వారి అబార్షన్‌ల కొరకు ఖర్చుపెడతాడని తెలియదు. తన భర్త శ్రీరామచంద్రుడే అనుకుంటుంది. పైగా నేను ఎప్పుడూ ఇంట్లోనే ఉంటాను కదా, వారిద్దరూ కలవడానికి అవకాశం లేదు అని ఆమె నమ్మకం. కాని ఆమె స్నానానికి బాత్‌రూమ్‌కి వెళ్ళిన సమయం, వారిద్దరూ కలవడానికి చాలని ఆమెకు తెలియదు. అందుకే ఆ ప్రెగ్నెన్సీ హరిద్వారానే వచ్చిందని బల్లగుద్ది చెప్పసాగింది.

అయిందేదో అయింది కాబట్టి, తనకు ఎలాగూ పిల్లలు పుట్టరు కాబట్టి ఆ పురుడేదో తానే పోసి ఆ పుట్టిన బిడ్డను తానే పెంచుకోవాలని నిర్ణయించుకొంది శృతి. ఆ దేశంలో పెళ్ళి కాకుండా తల్లికావడం విచిత్రమేమీ కాదు. అలా పెళ్ళి కాకుండా

పుట్టిన పిల్లలను దత్తత ఇచ్చేస్తారు. కాని భారతదేశంలో పుట్టిన భారతి పెళ్ళికాకుండానే తల్లి కాబోవడం ఆ దేశంలోని భారతీయులందరినీ కలవర పెట్టింది. కలకలం సృష్టించింది ఆ వార్త.

మరో ఏడు నెలకాలం, ఏ విశేషాలూ లేకుండానే గడచిపోయింది. ఈ ఏడు నెలల్లోనూ శృతికి ఫిట్స్ అప్పుడప్పుడు వస్తుండేవి. హరి మొహంలోనికి సూటిగా చూడలేకపోయేది. అలా చూస్తే ఆమె శరీరం పెళ్ళిరోజున జరిగిన సన్నివేశం తలచుకొని ఆ సుఖం కావాలని కోరుకునేది. టి.విలో ఏ ప్రేయసీ ప్రియులు ఆలింగనాలు ముద్దులు చూసినా ఫిట్స్ వచ్చేవి. హరి ఆమె శరీరానికి ఆరోజు కీ ఇచ్చి వదిలేసాడు. ఆమె శరీరం ఎంత కంట్రోలు చేసుకుందామన్నా ఆగడంలేదు. అతి ప్రయత్నంమీద కంట్రోల్ చేసికుంటుందిగాని ఫిట్స్ బారినుండి తప్పించుకోలేకపోతుంది. ఆమె ఫిట్స్‌తో మెలికలు తిరుగుతుంటే అది చూసిన హరి హృదయం చెప్పలేనన్ని మెలికలు తిరుగుతుంది. ఇప్పుడు ఇద్దరి పరిస్థితి తారుమారయింది. ఇదివరకు శృతి, హరిని నవ్వించాలని బాధనుండి మరిపించాలని ప్రయత్నించేది. ఇప్పుడు ఆ పని హరి చేస్తున్నాడు.

ఒకరోజు ధైర్యంచేసి భోజనాల దగ్గర తన మనసులోనున్న మాటను బయట పెట్టాలనే ఉద్దేశ్యంతో 'శృతీ! నేనొక మాట చెబుతాను వింటావా' అన్నాడు.

"ఓ! తప్పకుండా మీరేదయినా చెబితే కాదన్నానా నేను. మీ సంతోషం కోసం ఏమైనా చేస్తాను'' అంది. అతను కోరే కోరిక ఆమెకి తెలియదు. తెలిస్తే అంత ధైర్యంగా అలా అనేదికాదు. భర్త సంతోషమే తన సంతోషం అనుకుంటుంది ఎప్పుడూ.

"నీవు... నీవు మరో పెళ్ళి చేసుకో'' అన్నాడు కంఠం వణుకుతుండగా.

ఒక్కసారి కస్సుమని లేచింది శృతి. 'ఏం పెళ్ళికొడుకుని చూసిపెట్టారా? మరి నాతోపాటు నాకు పుట్టిన పిల్లని కూడా స్వీకరించాలి కదా!' అంది.

"అలాంటి వాడు దొరికితే పెళ్ళిచేసుకుంటావా? నీకు మాత్రం కోరికలు లేవు. నీవూ మనిషివే కదా. ఎంత కాలం నీ అందాన్ని అడవిగాచిన వెన్నెల చేస్తావు.''

"అయితే నేను మీతో కలసి ఉండడం మీకు ఇష్టం లేదన్నమాట. అందుకే మీనోటి నుండి అలాంటి మాటలు వచ్చాయి'' అంది కసిగా. శృతితో హరికి చాల సంవత్సరాలనుండి పరిచయం ఉంది. అన్ని సంవత్సరాల పరిచయంలో ఆమె మొహం మీద కోపం చూడడం మొదటిసారి హరికి.

"అది కాదు శృతీ; నాకు నువ్వన్నా, నీకు నేనన్నా ప్రాణమే. అందులో సందేహంలేదు. కాని సంసార జీవితానికి ప్రేమ ఒకటే సరిపోదు కదా! సెక్స్ కూడా కావాలి కదా?'' అన్నాడు.

"సెక్స్ కోసం అలా వెర్రి పరుగులు తీస్తే మనకు పశువులకూ తేడా ఏమిటి హరి" అంది కొంచెం శాంతంగా. హరి అలా మాట్లాడడం ఆమెకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు.

"నాకు ఈ వాదాలన్నీ ఒద్దు. నీవు మరలా పెళ్ళిచేసికొని సుఖంగా ఉండాలి."

"మిస్టర్ హరి. ఇంక చాల నీ ఉపదేశం. నేను వేదాంత శర్మ కూతురిని. చిన్నప్పటినుండి నరనరాల్లోను నారీ ధర్మాన్ని ఒంటబట్టించుకున్న దాన్ని. మనదేశంలో పూర్వం 'పెద్దమనిషి' కాకుండానే విధవలైన వారు చాలామంది ఉండేవారు. సతీసహగమనాన్ని పాటించినవారు ఉన్నారు. ముసలి మొగుడుతో కాపురం చేసి మంచి వయసులోనే భర్తను కోల్పోయినవారున్నారు. అలాంటి దేశంలో పుట్టిన నేను ఈ దేశానికి అణుగుణంగా మరో భర్తను, అతను మంచివాడు కాకపోతే మరో భర్తను బట్టలు మారుస్తున్నట్లు మార్చలేను. దయయుంచి ఈ టాపిక్ నా దగ్గర ఎప్పుడూ ఎత్తవద్దు" అంది.

హరికి ఏం మాట్లాడాలో తెలియలేదు. తిరిగి శృతి అంది.

"యమధర్మరాజు కనబడి నీ కోరిక ఏమిటి అని అడిగితే ఏం చెబుతానో తెలుసా సతీసావిత్రిలా పుత్రభిక్ష పెట్టమని అడుగుతాను" అంది.

హరి మొహం చిన్నబోయింది. అనునయంగా హరి దగ్గరకు వెళ్ళి హరిగెడ్డాన్ని చేతులతో పట్టుకొని లాలనగా అంది. "పిచ్చి హరీ, మనది ఏడుజన్మల అనుబంధం. అది త్రుంచడానికి ఆ దేవుడికే అధికారం లేదు. మామూలు మనిషివైన నీకు హక్కు ఎక్కడిది. నా జీవితంలో నాకు సంసార సుఖంలేకపోయినా ఫరవాలేదు. మీరిద్దరు నా కళ్ళముందు కలకలలాడుతూ ఉంటే చాలు అదే పదివేలు నాకు" అంది. ఆమె అలా అనునయిస్తుంటే హరి కళ్ళల్లో కన్నీరు ధారావాహికంగా శృతి అరచేతిలో పడి అమె చేయి నిండిపోయింది.

ఆ అరచేతిలోని నీటిని అలాగే పట్టుకొని ఆ చేయికింద మరో చేయిపెట్టి ప్రసాదం తీసికుంటున్న ఫోజులో పెట్టి ఆ చేతిని పైకి ఆకాశంవైపు ఎత్తి పట్టుకొని "ముక్కోటి దేవతల్లారా మీరు ఎక్కడున్నారో తెలియదు. కాని అజ్ఞాతంగా మానవుల్ని పాల ముంచుతారో లేక ఈ కన్నీట ముంచుతారో మీ ఇష్టం. ఏది జరిగినా మీ నిర్ణయాన్ని సంతోషంగా స్వీకరించే బలము మాకివ్వండి. జన్మజన్మలకు మా జంటను వేరు చేయకండి. నేను నా జీవితంలో కోరుకునేది ఇదే" అంటూ ఆ కన్నీటిని ప్రసాదంలా గటగటా త్రాగేసింది. శృతి చేసిన ఆ పనికి హరి నిటారుగా అయ్యాడు. ఆ కన్నీళ్ళు త్రాగడంలో అర్థం హరిని ఆ టాపిక్ జీవితంలో ఎప్పుడూ తేవద్దని అన్యాపదేశంగా చేసిన సూచన అన్నమాట. అయినప్పటికీ హరి పట్టువదలని విక్రమార్కుడిలా ఒకటి

రెండుసార్లు ఆ టాపిక్ ఎత్తి శృతి కన్నీటిని చూడలేక ఆ ప్రయత్నంకూడా విరమించుకున్నాడు. ఏమైనా అంటే శిల్పకు సవతి తండ్రి కావాలా అని ఎదురు ప్రశ్నవేస్తుంది శృతి. ఏ తండ్రి మాత్రం తను బ్రతికుండి కూడా భార్యను మరో పెళ్ళి చేసుకోమని అడుగుతాడు. హరికి అలాంటి పరిస్థితి వచ్చింది పాపం.

ఏ మగవాడికి అలాంటి పరిస్థితి రాకూడదు. కురూపిని అయినా, అవిటివాడినైనా దుర్మార్గుడినైనా స్త్రీ భరిస్తుంది. కారణం అతనినుండి సెక్స్, రక్షణకూడ లభిస్తుంది కాబట్టి. కాని సంసార సుఖం లభించని భర్త దగ్గర భార్య ఉంటే నిరుపయోగము అని అతని వాదన.

☆ ☆ ☆

భారతికి డెలివరీ సమయంలో చాల కష్టమైంది. ఆఖరుకి సిజైరిన్ చేయవలసి వచ్చింది. అప్పుడుగాని తెలియలేదు ఆమెకు హార్టు ఎన్‌లార్ట్ అయిందని, ఎక్కువకాలం బ్రతకదని. చక్కటి మగపిల్లవాడు పుట్టాడు. భారతి కోరిక ప్రకారం అజయ్ అని పేరు పెట్టారు ఆ అబ్బాయికి. సంజయ్, స్వాతి వచ్చి మొక్కుబడిగా ఒకసారి చూసి వెళ్ళిపోయారు. సంజయ్ మాత్రం తన రక్తం పంచుకొని పుట్టిన ఆ అబ్బాయిని చూసి విడవలేక విడవలేక వెళ్ళాడు. అప్పటినుండి స్వాతి మరలా రాలేదుగాని, సంజయ్ హాస్పిటల్‌నుండి దొంగచాటుగా వచ్చి అజయ్‌ని చూసి వెళ్ళిపోతున్నాడు.

స్వాతికి ఆ అబ్బాయిని చూస్తే భయం, ఎక్కడ సంజయ్ కొడుకంటారోనని. పిల్లవాడి గురించి కాదు బెంగ. తనకి ఎలాగూ పిల్లలు పుట్టరు. పిల్లాడితోపాటు భారతిని కూడ ఇంట్లోకి తెచ్చి పెడతాడేమో భర్త అని ఆమె అసలు భయం. ఆ భయం తీరే రోజు ఆ సమస్య పరిష్కారమయ్యే రోజు త్వరలో వస్తుందని ఆమెకి తెలియదు. తెలిస్తే వారిద్దరినీ అంత దూరంగా ఉంచేదికాదు. తనతోనే తీసికొని వెళ్ళిపోయేది. అజయ్ మెల్లగా శిల్పకు మాలిమి అయ్యాడు. అస్తమానూ తమ్ము, తమ్ము అంటూ అజయ్ చుట్టూ తిరుగుతోంది శిల్ప. ఆ అమాయక హృదయానికి తెలియదు. ఆ పసివాడు పెళ్ళికాని తల్లికి పుట్టిన బిడ్డ అని. మెడలో పెళ్ళి జరిగిందన్న లైసెన్సు బిళ్ళ లేకపోవచ్చు. కాని స్త్రీకి పుట్టిన బిడ్డ ఒక వరం. రాణీవాసంలో స్త్రీ అయినా, రాళ్ళు మోసుకొని బ్రతికే స్త్రీ అయినా తన కడుపున పుట్టిన బిడ్డ అంటే పంచ ప్రాణాలూ పెడుతుంది. అందుకే తల్లి అమృతవల్లి, కల్పవల్లి అయింది. అజయ్‌ని చూసినప్పుడల్లా తనలాగే అనాధలా పెరుగుతాడేమోనని భారతి మనసు విలవిలలాడేది. భగవంతుడా రూపంలో నా పోలికయి వచ్చినా ఫరవాలేదు. జాతకంలో మాత్రం నా పోలిక నివ్వవద్దు తండ్రీ అనుకునేది ఆవేదనగా భారతి.

భారతి కొడుక్కి మూడవనెల వచ్చింది. బొద్దుగా అందంగా తయారయ్యాడు.

ఒకరోజు భారతి శృతిని అడిగింది స్వాతిగారి ఇంటికి ఒకసారి వెళతానని. కాని భారతి వెళితే స్వాతి ఎలా రియాక్టవుతుందో శృతికి తెలుసు. అందుకే వద్దన్నది. శృతికి భారతిని చూస్తుంటే ఎందుకో చెప్పలేనంత జాలి పొంగుకొస్తుంది. భారతి తన పట్టు విడువకుండా శృతిని మరలా మరలా బ్రతిమాలింది. శృతి సరేనని చెప్పి ముందు స్వాతికి ఫోన్ చేసింది. 'భారతి అక్కడకు వచ్చి ఒక్కరోజు ఉంటుందట' అని.

'ఎందుకట' అని మొహం చిట్లించింది స్వాతి. ఆమె అన్నతీరుకే ఆమె మొహంలో భావాలు ఎలా ఉండి ఉంటాయో ఆ సమయంలో శృతి ఇట్టే పసిగట్టింది.

అయినా భారతి కోరికను తీసివేయలేక 'ఒక్కరోజు స్వాతి; ఒకే ఒక్క రోజుంటుం దట మీ ఇంట్లో - మర్నాడే నేను వచ్చి తీసికొని వచ్చేస్తాను' అంది.

అన్యమనస్కంగానే సరే అంది స్వాతి. మనసులో మాత్రం - ఇదెక్కడి తద్దినంరా బాబు - అని అనుకోకుండా వుండలేకపోయింది.

భారతి కోరికపై ఆ రోజు భారతిని, అజయ్‌ని తీసికొని స్వాతి వాళ్ళింటికి వెళ్ళింది శృతి. మొహం చిటపట లాడించుకుంటూనే హరిని రిసీవ్ చేసికొంది స్వాతి. అజయ్‌ని చూడగానే గతుక్కుమంది స్వాతి మనసు. అచ్చు సంజయ్ నోటినుండి ఊడిపడినట్లుగా ఉన్నాడు. తన మనసులోని భావాన్ని మొహంలో కనిపించకుండా చాల ప్రయత్నం చేసింది స్వాతి. కాని శృతి వెంటనే అర్థం చేసికొంది ఆమె మనోభావాలను. అందుకే అంటారు కాబోలు మొహం మనసులోని భావాలకు ప్రతిబింబం అని. భారతికి 'నేను రేపు వచ్చి తీసికొని వెళతాను' అని చెప్పి బయలుదేరింది శృతి. ఈ లోపుగా స్వాతి గబగబా కాఫీ కలుపుకొని వచ్చింది. కాఫీ త్రాగి అజయ్‌ని ఒకసారి ఎత్తుకొని దించి బయటకు రాబోతుండగా భారతి కళ్ళల్లో నీళ్ళు తిరగడం గమనించింది శృతి.

కాని స్వాతి ఎదురుగా ఆమెను ఎలా ఓదార్చాలో తెలియలేదు శృతికి. భారతి నిండుగా మాతృమూర్తిలా కొంగ్రొత్త అందాలతో కనిపించింది శృతికి. ఆమె ఎంత పనిపిల్లలా ఆ దేశానికి వచ్చినా ఆమెను ఎవరూ పనిపిల్లలా ట్రీట్ చెయ్యలేదు. ఇంట్లో మనిషిలాగనే భావించారు. ఏమైనా ఇప్పుడు మాతృమూర్తి. స్త్రీ జీవితానికి పరిపూర్ణతనిచ్చే పిల్లకు తల్లి ఆమె. ఆడదానికి తల్లి కావడం ఎంతో గర్వకారణం. 'మగవానికేమో ఒకనాటి సుఖము. కులకాంతకేమో కల కాలం ధనము' అన్న ఆత్రేయ మాటలు గుర్తుకి వచ్చాయి శృతికి. ఎందుకో భారతిని వీడలేక వీడలేక ఆ ఇంటినుండి బయలుదేరింది శృతి. శృతి బయటకు రాగానే ఒక్క పరుగున భారతి వచ్చి శృతి కాళ్ళకు కన్నీళ్ళతో నమస్కరించి ఆ కన్నీళ్ళు శృతి కళ్ళపడకూడదనే తలంపుతో వెంటనే లోపలికి వెళ్ళిపోయింది.

★ ★ ★

అన్ని రోజులలాగే ఆ రోజు కూడ చీకటి పడింది. తెల్లవారితే ఎవరి రోజు ఎలా ఉంటుందో ఏ రోజు ఎలా గడుస్తుందో ఎవరికీ తెలియదు. మరు నిమషంలో ఏం జరుగబోతుందో ఎవరూ చెప్పలేరు. దానినే విధి అంటారు. విధి చేయు వింతలకు మనిషి తల ఒగ్గడమే చేయవలసిన పని. ఎంతటి వారు కూడ విధిని ఎదిరించలేరు. మనిషి ఎంతటి విజ్ఞానాన్ని సంపాదించినా, ఎంతటి డబ్బుని గడించినా సెక్సుని ఎంత వృద్ధి చేసినా విధి ముందు అతడు పసిపిల్లవాడే. మరునిమిషం ఏం జరుగుతుందో చెప్పలేడు. ఎవరి భవిష్యత్తు ఎలా ఉంటుందో ఊహించలేడు. ఎవరు ఎంతకాలం బ్రతుకుతారు, ఎలా చనిపోతారు అన్నది ఇప్పటికీ మనిషికి సమాధానంలేని ప్రశ్నే. చావు, పుట్టుకలను సైన్సు ద్వారా తెలుసుకున్నా సృష్టి రహస్యాన్ని ఛేదించడం అన్నది మానవతరం కాదు. అది భగవంతుని సొంతం మాత్రమే.

ఆ రాత్రి అంతా అస్థిమితంగానే గడచింది రావుగారికి. ఒకప్రక్క తల్లిదండ్రుల దగ్గరినుండి డబ్బు డబ్బు డబ్బు అన్న పదం తప్పించి మరో మాట రావడంలేదు. హాస్పిటల్లో కన్సల్టెంట్‌కి తనకీ పడక మరికొన్ని కలతలు. అటువంటి సమయంలో అసలు భార్య భర్తను అన్నివిధాలా ఊరడించి అనునయిస్తే ఏ మగవాడైనా ఎటువంటి కలతలనైనా మరిచిపోగలడు. ధైర్యంగా ఎదురీదగలడు. సముద్రాన్నయినా సరే. కానీ దురదృష్టవశాత్తూ రావుగారిమీద విధి పగబట్టినట్లు మృదుల ఆయన్ని మాటల్తో చంపేస్తుంది. ఇంటిపని చాలావరకు ఆయనకే అప్పజెప్పేసింది. ఆరుగురి పిల్లలను సంబాళించలేక సతమతమయిపోతున్నారు రావుగారు.

అస్తమాను రావుగారి తల్లిదండ్రులను దుమ్మెత్తిపోస్తూ ఉంటుంది మృదుల. వారి గురించే తన బ్రతుకు అలా అయిందని, మృదులకు భారతి గుర్తుకి వచ్చినప్పుడల్లా రావుగారిపై మరలా రాళ్ల వర్షమే. అవన్నీ అలా ఉంచి ఆ ఐరిష్ వనిత వ్రాసిన ఉత్తరం ఆయన మెడకు ఉరిత్రాడులా కనిపిస్తుంది. ఐరిష్ స్త్రీ కొడుకు చనిపోయాడు. ఆవిడ బెదిరింపు ఉత్తరాలు వ్రాయడం మానేసిందికానీ ఆ సంగతి మనసులో పెట్టుకున్న మృదుల రావుగారిని అపర రాక్షసుడిని చూసినట్లు చూస్తుంది. తాను చెయ్యని తప్పుకు శిక్ష అనుభవిస్తూ ఎన్నోవిధాల సతమతమై పోతున్నారాయన. తన ఇల్లే తనకు సింహగృహంలా కనిపించసాగింది.

ఆ రాత్రి అంతా ఆయన స్థిమితం లేకుండా గడపిన ఆయన తలనొప్పిగా ఉండి నాలుగు గంటలకు కాఫీ పెట్టుకుందామని అనుకున్నారు. ఫ్రిజ్‌లో పాలు లేవు. మిల్క్‌మేన్ ఒక్కోసారి నాలుగు గంటలకే పాలు గుమ్మం దగ్గర పెట్టేసి వెళ్ళిపోతాడు. బయట మంచు కురిసి చాలా చల్లగా వుంది. పాలు వచ్చాయోలేదో చూద్దామని, బయట లైటువేసి తలుపు మెల్లగా తెరిచాడాయన. అప్పటికే చల్లనిగాలి రయ్‌మని ఆయన మొహానికి చెంపదెబ్బ కొట్టినట్లుగా తగిలింది. కానీ అంతకంటే పెద్ద దెబ్బ

తన జీవితానికి తగలబోతుందని తెలియని రావుగారు తలుపు పూర్తిగా తెరిచి పాలసీసా అందుకోబోతూ ఎదురుగావున్న దృశ్యాన్ని చూసి కెవ్వున కేక వేశారు.

అసలే బలహీనంగావున్న ఆయన మెదడు ఆ దృశ్యానికి తట్టుకోలేక పోయింది. అలాగే కెవ్వుకెవ్వున కేకలు పెడుతూ పాల సీసాలు విసిరికొడుతూ ఇల్లంతా పిచ్చివాడిలా జుట్టు పీక్కుంటూ పరుగు పెట్టం ప్రారంభించాడు. పిచ్చివాడి - లా - కాదు ఆయన ఇప్పుడు పిచ్చివాడే. పసిస్థితుల ఒత్తిడికి తట్టుకోలేక అన్ని ప్రక్కలనుండి అపజయాలను ఎదుర్కోలేక పిచ్చివాళ్ళ స్థానంలోకి చేరిపోయారాయన. మొదట ఆ కేకలు మృదులకు కలయేమో అనిపించింది. తరువాత అరుపులు పెద్దవైనాక మృదులతో సహా పిల్లలందరూ లేచి రావుగారి పరిస్థితి చూసి బిత్తరపోయారు. ఆ తరువాత వీధిలో మంచులో చచ్చిపడివున్న భారతి శవాన్ని చూసేసరికి వారికి కూడా మతి పోయింది.

సాధారణంగా అక్కడి వారు తమ జీవితాల్లో తాము ఏ మాత్రం అప్‌సెట్ అయినా ముందుగానే సైకియాట్రిస్ట్‌కు చూపించుకుని రోగ నివారణ పొందుతారు. ప్రివెన్షన్ ఈజ్ బెటర్ దాన్ క్యూర్' ని వారు చాలా నమ్ముతారు. మనమైతే జబ్బు ముదిరితేగానీ డాక్టరునే తలవము. మనదేశంలో మనిషికున్న జబ్బేమిటో తెలియకుండానే కొందరు ప్రాణాలు విడుస్తారు. ప్రతి మనిషి ప్రతినెల జనరల్ చెకప్ చేయించుకుంటే రాబోయే జబ్బులను కొంతవరకు అరికట్టవచ్చు. జబ్బు ముదిరినా హాస్పిటల్‌కు వెళ్ళని మనవారికి జనరల్ చెకప్ అంటే కలలోని మాటే.

మృదుల తేరుకున్న తరువాత మొద్దు బారుతున్న మెదడును కూడదీసుకుని ముందుగా కార్క్‌లోనున్న వారికీ సంజయ్‌కీ ఫోన్ చేసింది. మృదుల దగ్గరనుండి ఫోన్ వచ్చేవరకు స్వాతికిగానీ, సంజయ్‌కి గానీ తెలియదు భారతి తమ ఇంట్లో లేదని.

భారతి చనిపోయిందన్న వార్త భూకంపం వచ్చిందన్న వార్తకన్నా భయంకరంగా వారిని కృంగదీసింది. స్వాతి గబగబా వెళ్ళి భారతి రాత్రి పడుకున్న గదిలో చూసింది. తన తల్లి చనిపోయిందని తెలియని ఆ పసివాడు నిర్మలంగా, నిశ్చలంగా నిద్ర పోతున్నాడు. నవ మాసాలు మోసి మూడు నెలలు పాలిచ్చి పెంచిన అజయ్ కన్న తల్లి అమరలోకాలకు వెళ్లిపోయింది ఒంటరిగా, చిన్న వయసులోనే తన పిల్లవాడిని తండ్రి చెంత వదలి.

స్వాతి - తాను విన్న వార్త అబద్ధమేమో, ఇంకా భారతి ఆ గదిలోనే ఎక్కడైనా ఉందేమో ననుకుంటూ ఆతృతగా మంచం చుట్టూ, బీరువా వెనకాల భారతికోసం వెతికింది. భారతి స్థానంలో భారతి వ్రాసిపెట్టిన ఉత్తరం ఆమెను వెక్కిరించింది. నేను ఇక లేను సుమా అని స్వాతికి తట్టిచెప్పింది. ఆ ఉత్తరాన్ని పట్టుకున్న స్వాతి చేతులు మంచులో తడిపినట్లు గజగజ వణకసాగాయి. వణుకుతున్న చేతులను, చెదిరిన



మనసును అతికష్టం మీద కూడతీసుకుని ఉత్తరం విప్పింది. ముత్యాల్లాంటి అక్షరాలు స్వాతి కన్నీళ్ళతో కలసి అలుక్కుపోయినట్లు కనబడసాగాయి. కన్నీళ్ళు చీరచెంగుతో తుడుచుకుని అక్షరాల వెంట కన్నులు సారించింది.

పూజ్యులు, గౌరవనీయులైన స్వాతిగారికి, మృదుల గారికి, శృతిగారికి వేల నమస్కారములతో భారతి వ్రాయుట. ఈ ఉత్తరం మీ చేతికి చేరేసరికి నేను ఎవరికీ అందనంత దూరంగా వెళ్లిపోతాను. దయయుంచి ఈ ఉత్తరం పూర్తిగా చదివి నన్ను అర్థం చేసుకుని, మంచి మనసుతో మన్నిస్తారని ఆశిస్తున్నారు. నేనొక అనాధనని మీకు తెలుసు. అసలు భగవంతుడు అనాధలను ఎందుకు సృష్టిస్తాడో తెలియదు. బహుశా తన ఆటకూ వింత నాటకానికీ వారు పనికి వస్తారని భావించి ఈ భూమిమీదకు తెస్తాడనుకుంటాను.

అందరి అనాథలలాగే నేనూ పుట్టాను. ఏ పెళ్ళికాని తల్లి పాప ఫలితాన్నో తెలియదు నాకు. లేదా ఏ మగవాడి రాక్షసత్వానికి బలయిపోయి నా తల్లి నన్ను అనాథ శరణాలయానికి అప్పగించిందో అంతకన్నా తెలియదు. నేను నన్స్ నడిపే అనాథ శరణాలయంలో పెరిగాను. ఎన్నో కులాలున్న మనదేశంలో నేను ఏ కులానికి చెందినదాన్నో తెలియదు. ఎందరో తల్లిదండ్రులున్న భూమిపై నా తల్లిదండ్రులెవరో నాకు తెలియదు. నాకు తెలియనంతలో నాకు తల్లిదండ్రులు లేరని కాదు. వారు ఎక్కడో నన్ను మరిచో, మరవకో, సుఖంగానో, దుఃఖంతోనో బ్రతికే ఉంటారు. కానీ నేను మాత్రం ఎవరూ లేనిదాన్నయ్యాను. నీతికి, నిజాయితీకి మారుపేరయిన నన్స్ దగ్గర పెరిగిన నేను ఆ నీతిని ఒంటబట్టించుకోలేకపోయాను. కాకిపిల్ల కోకిల అవుతుందా?

వయసు వచ్చినకొద్దీ అంత చిన్నవయసులోనే నాలో సెక్స్ కోరికలు అధికం కాజొచ్చాయి. ఆ సెక్స్ సంగతి అలా ఉంచి నా శరీరంలో ఏదో వెలితి ఉన్నట్లు, నా ఆరోగ్యం సరిగా లేనట్లు అనిపించేది నాకు. ఏమిటో సరిగా అర్థం అయ్యేది కాదు. నేను ఎక్కువకాలం బ్రతకనని నా మనసు నన్ను పదేపదే హెచ్చరించేది. నా సిక్స్‌సెన్స్ నన్ను విపరీతంగా అదే మాటను అస్తమాను నొక్కి చెబుతున్నట్లు అనిపించేది. అందుకే నేను బ్రతికినంత కాలంలోనే నా తీరని కోరికలు తీర్చుకోవాలనుకున్నాను. అదృష్టమో, దురదృష్టమో డాక్టర్ రావుగారు మా నన్‌సిస్టర్‌ని అడిగి నన్ను ఈ దేశానికి తీసుకుని వచ్చారు. నా స్నేహితులందరూ నా అదృష్టానికి ఈర్ష్య చెందారు. నేను కూడా చాలా గర్వించాను. ఏ గొప్పవారికో తప్ప అదృష్టవంతులకో తప్ప అందరికీ విదేశాలు చూసే అవకాశం రాదు. నాలాంటి పేదవారికి అందులో అనాథకు విదేశ అవకాశం అంటే చందమామను అందుకోవడం లాంటిదే. ఎలాగైతే ఈ దేశంలో కాలుపెట్టాను. శేఖర్‌ని చూసి నా కోరికలు చంపుకోలేక కాలుజారాను. మొదట్లో శారీరక కోరికల కోసం అతన్ని వాడుకున్నాను. నేను నెల తప్పిన తర్వాత అనిపించింది. నేనే మాతృమూర్తిని కూడా కావాలని.

నేను ఎలాగూ త్వరలో చనిపోతాను. నేను చనిపోయినా నా బిడ్డ రూపంలో బ్రతికే ఉండాలి నేను. నా రక్తం పంచుకుని పుట్టిన బిడ్డ నా తరువాత ఈ భూమిమీద ప్రాణంతో తిరగాలి. అదీ నా వాంఛ. అది విపరీతమైనదే కావచ్చు. కానీ ఆ కోరిక నా మనసుని నిలువ నిచ్చేది కాదు. రావుగారు అబార్షన్ చేయిస్తానన్నప్పుడు నాకు అబార్షన్ వద్దు అని కోటి గొంతుకలతో అరవాలనిపించింది. వేయి చేతులతో అడ్డు పెట్టాలని పించింది. కానీ ఆ సమయంలో ఏమీ చెయ్యలేని నిస్సహాయురాలినైనాను. జరగవలసింది జరిగిపోయింది. అందుకే సంజయ్‌గారిని రెచ్చగొట్టాను. ఇందులో ఆయన తప్పు ఎంత మాత్రమూ లేదు. నూటికి నూరుపాళ్ళు తప్పంతా నాదే.

నేను అనుకొన్నట్లు తిరిగి గర్భవతినయ్యాను. ఎవరూ నా ఎబార్షన్ గురించి మాట్లాడక పోవడంతో నాకు ఎవరెస్టు శిఖరం ఎక్కినంత సంతోషం కలిగింది. నేను గర్భవతిగా ఉండగానే నా ఆరోగ్యం క్షీణించడం మొదలు పెట్టింది. అతి ప్రయాసతో అజయ్‌ని ఈ భూమిమీదకు తెచ్చాను. అజయ్‌ను చూసిన తర్వాత ఆ క్షణమే నేను చనిపోయినా ఫరవాలేదనిపించింది. ఎందుకంటే నా వారసుడు నా అజయ్ ఉన్నాడు చాలు. నాకదే పదివేలు.

రోజురోజుకి నేను మృత్యుదేవతకు దగ్గర అవుతున్నాను. అందుకే ఎంత త్వరగా అజయ్‌ని తన తండ్రికి అప్పగిస్తే అంత మనశ్శాంతి నాకు. అదే ఉద్దేశంలో ఆ రోజు ఇంటినుండి బయలుదేరాను. స్వాతిగారూ! ఆ తరువాత అంతా మీకు తెలిసిందే. రాత్రి మీరందరూ పడుకున్న తర్వాత నేను మెల్లగా బయటికి వెళ్లిపోయాను. ఎవరైనా లిఫ్ట ఇస్తారు ఇన్స్పెక్టర్ కార్తికి. నా ప్రాణం రావుగారి ఇంటిదగ్గరే పోవాలి. ఆయనే నన్ను ఈ దేశానికి తీసుకొని వచ్చారు. ఆ గుడి దగ్గరే నా ప్రాణాలు పోవాలి. నేను ఎలా చనిపోతానో ఈ ఉత్తరం వ్రాసేసరికి నాకు తెలియదు. కానీ చనిపోతానని బాగా తెలుసు.

నేను చేసిన తప్పుకు నా కొడుకుని (సారీ, ఇకపై మీ కొడుకును) శిక్షించకండి. మీకు పిల్లలు పుట్టరని నాకు తెలుసు. మీ భర్తకు పుట్టిన ఈ కొడుకు మీకు ఇష్టమైతే చేరదియ్యండి. మీకు కష్టమైనచో శృతిగారికి ఇచ్చెయ్యండి. అక్కడా వీలులేకుంటే తల్లి జాతకాన్నే పుట్టాడనుకుంటాను. అనాధ శరణాలయానికి అప్పగించండి. కన్నతల్లిగా నేను వాడు మీ దగ్గర పెరగాలని నేను కోరుకోవచ్చు. కానీ వాడి నుదిటివ్రాత ఎలా ఉందో నాకు తెలియదు కదా! అది చెరిపి నేను వేరుగా వ్రాయలేను కదా! వాడిని మీరు స్వీకరించిన యెడల మరుజన్మలో మీ ఇంటి కుక్కగా పుట్టయినా మీ ఋణం తీర్చుకుంటాను. అభాగ్యురాలను, అనాధను, చిన్నవయసులోనే మృత్యువును చేరినదానను. అంతకంటే ఏం చెయ్యలేను.

రావుగారి డబ్బును కూడా అపహరించాను నేను. దీనికి నన్ను ఆయన్ని క్షమించమని వేడుకుంటున్నాను. చివరగా నేను మరలా అదే కోరిక కోరుతున్నాను. నేను చేసిన తప్పులకు నా బిడ్డను శిక్షించవద్దు. చిన్నచూపు చూడవద్దు. నావలన మూడు కుటుంబాలు అశాంతిపాలు అయ్యాయి. ఇకపై ఎప్పుడైనా భారతి అనే యువతి గుర్తుకువస్తే గుప్పెడు జాలి చూపించండి చాలు. మీ అందరినీ క్షమించమని మరీ మరీ కోరుతూ మీనుండి దూరంగా వెళ్లిపోతున్న 'భారతి'.

ఆ ఉత్తరం చదివిన స్వాతికి దుఃఖం పెల్లుబికింది. పిల్లాడిని తీసికొని గుండెలకు హత్తుకుంది. ఇకపై వీడు నా కొడుకు. నా సర్వస్వం అనుకుంది. అంత దుఃఖంలోనూ

'చాలా థాంక్స్ భారతి. నీవు పోతూపోతూ నాకు పెద్ద వరాన్ని ఇచ్చిపోయావు. మా ఇంట్లో దీపం వెలిగించి మరీ వెళ్లావు. కాని నా దీపాన్ని వెలిగిస్తూ నీ దీపాన్ని ఆర్పేసుకున్నావు. నీ రుణం నేను తీర్చుకోలేను' అనుకుంటూ ఉత్తరం సంజయ్‌కి ఇచ్చింది.

సంజయ్ కుటుంబము, హరి కుటుంబము అందరూ కలిసి హరి కారులో ఇన్వీన్స్‌కార్తి కి బయలుదేరారు. భారతి శవాన్ని చూసేసరికి ఎవరికీ దుఃఖం ఆగలేదు. ఎక్కడో పుట్టింది ఎవరికో పుట్టింది. ఎక్కడో పెరిగింది. ఇక్కడకు వచ్చి ఆ మూడు కుటుంబాలను ఒక ఊపుఊపి తన ప్రతిరూపాన్ని భూమిపై వదిలి తాను మరో లోకానికి చేరుకొంది. వారితో ఆ అమ్మాయికి ఏనాటి రుణానుబంధమో అది.

సుమతి, ప్రియాంక, శశాంక, భారతి వరుసగా ఆ దేశం మట్టిలో కలిసిపోయారు. భగవంతుడా ఇప్పటికైనా ఈ దేశంలో భారతీయుల చావులకు ఫుల్‌స్టాప్ పెట్టు. ఈ కామాలతో మమ్మల్ని మరింత బాధ పెట్టకు అని మనసులోనే దేవుడ్ని ప్రార్థించింది శృతి. భారతి అంతకు ముందే హార్ట్ పేషెంటు కాబట్టి పోలీసు గొడవలు, పోస్టుమార్టమ్‌లు లేకుండానే ఏడడుగుల నేలను వెతుక్కుంటూ వెళ్లిపోయింది.

జరిగినదంతా ఒక ఎత్తు అయితే డాక్టర్ రావుగారిది మరింత పెద్ద సమస్య అయికూర్చుంది. ఎత్తయిన కొండమీద అందంగా భారతదేశపు ప్లాన్ ప్రకారం కట్టిన ఆ సెయింట్ సెనాన్స్ హాస్పిటల్‌లో ఎంతోమంది మెంటల్ పేషంట్స్‌ని బాగు చేసి పంపించిన డాక్టర్ రావుగారు ఇప్పుడు ఆయనే ఒక పెద్ద పేషంటయి ఒక గదిలో బంధింపబడి వచ్చేపోయే వారినందరినీ వింతగా చూస్తున్నారు. ఆ సన్నివేశం ఎంతటి కరుకురాతి గుండె కలవారికైనా హృదాయాన్ని కదిలించేటంతటి విదారకంగా ఉంది.

ఇంతకాలం తమ మధ్య తిరిగిన డాక్టరు ఇప్పుడు పేషంటు రూపంలో ఆ హాస్పిటల్‌లో ఉండడం ఆ హాస్పిటల్ స్టాఫ్‌కి, అందులోనున్న వృద్ధులకు ఎంతో మనస్తాపాన్ని కలిగించింది. ఆ హాస్పిటల్‌లో పేషంట్సేకాక వృద్ధులు కూడా ఉంటారు. దానిని హోమ్ ఫర్ ది ఏజ్డ్ అన్నా ఫరవాలేదు. ఆ వృద్ధులు తమ ప్రియమైన డాక్టరుని ఆ స్థితిలో చూడలేకఎంతో విలపించారు. డాక్టర్ హరి, సంజయ్ వెళ్ళి ఆ హాస్పిటల్ కన్సల్టెంట్‌ని రావుగారిని జాగ్రత్తగా చూసికొమ్మని రిక్వెస్ట్ చేశారు. ఆ కన్సల్టెంట్‌కి అంతకు ముందు రావుగారిమీద ఎంత కోపమున్నా ఇప్పటి పరిస్థితిని బట్టి ఆయనంటే ఎంతో జాలి కలిగింది. తప్పక త్వరలో నయం చేస్తానని, తొందరగా బాగయ్యే అవకాశాలున్నాయని భయపడవలసిన పని లేదని హరికి, సంజయ్‌కి ధైర్యం చెప్పారాయన.

ఆ మర్నాడే హరి, శృతి, సంజయ్ మృదులకు ధైర్యం చెప్పి బయలుదేరి కార్క్

వచ్చేశారు. స్వాతి మాత్రం అజయ్‌తో మృదులకు తోడుగా ఉండిపోయింది. మృదుల ఇండియా నుండి వాళ్ళ అమ్మగార్ని రప్పించుకునే వరకూ స్వాతి అక్కడే ఉండిపోయింది. ఎంతయినా మనం మనం ఒకటి అన్న భావం, భారతీయులం అందరం అన్న బంధం ఆమెను ఆ ఇంటినుండి వెంటనే కదలనీయలేదు.

☆ ☆ ☆

కాలచక్రం ఎవరి బాధలతోనూ, వేదనలతోనూ, సంతోషాలతోనూ, చావులతోనూ సంబంధం లేనట్లు తన పని తాను చేసుకుంటూ గిర్రున తిరుగుతూనే ఉంది. కాలగతిలో కొన్ని గాయాలు వాటంతటనే మానిపోయాయి అందరి హృదయాల్లోనూ. బహుశా మనసుకి తగిలిన గాయాలు మాన్పే శక్తి ఒక్క కాలానికి మాత్రమే ఉన్నట్లుంది.

హరి. శృతి ఇటీవల జరిగిన సన్నిహితుల చావులతో చాలా అప్‌సెట్ అయ్యారు. ఆ బాధల్లో తమ బాధ తాత్కాలికంగా మరిచిపోయి నప్పటికీ, ఎప్పటికీ ఆ లోటు మనసుల్లో ముల్లులా గుచ్చుకుంటూ కదిలినా మెదిలినా బాధ పెడెతూనే ఉంది. రాత్రి అయ్యేసరికి ఇద్దరికీ సమస్యే. ఎలా తెల్లవారుతుందా ఈ రాత్రి ఎలాగ గడుస్తుందా అని. మరలా పగలు రావడం, హాస్పిటల్‌కు పరుగులు పెట్టడం అంతా యధావిధీ, యాంత్రికమూను.

శృతికి ఫిట్స్ వస్తున్న దగ్గర్నుండి హరి మరీ కుమిలికుమిలి కృశించి పోతున్నాడు. తన గురించి శృతి జీవితం, ఆరోగ్యం కూడా నాశనమైందని ఎంతగానో బాధ పడిపోతున్నాడు. తను ఏమీ చేయలేని నిస్సహాయుడన్నని నిరాశ పెంచుకుంటున్నాడు రోజురోజుకీ. అప్పుడప్పుడు తాను చనిపోతే శృతి మరలా పెళ్ళి చేసుకుంటుందేమో తను బ్రతికి వుండి ఆమె జీవితానికి ఫనిష్మెంటులా అవుతున్నానేమో అనే తలంపు అతని మెదడును తినేస్తుంది. ఆ ఆలోచన రాగానే స్తిమితం కోల్పోతాడు హరి. శృతి చాలావరకు గార్డినల్ టేబ్లెట్స్‌తో కాలం గడిపేస్తుంది. ఆ టేబ్లెట్ పుణ్యమా అంటూ ఎక్కువసేపు నిద్రలోనే గడిపేస్తుంది. అలా నిద్రపోతున్న శృతిని తెల్లవార్లు మేల్కొని చూస్తూంటాడు హరి నిస్సహాయంగా, నిర్జీవంగా భర్త ఉండీ లేనట్లుగా శృతిని తలచుకుంటూ ఆమె జీవితం తనవలన నాశనమైనట్లుగా భావిస్తున్నాడు హరి. భర్త ఉండి వైధవ్యాన్ని అనుభవిస్తున్న స్త్రీగా కనిపిస్తుంది శృతి. కానీ శృతి అలా భావించడం లేదు. భర్త బ్రతికేవున్నాడు. అంతేచాలు, తనకు సంసారసుఖం లేకపోయినా ఫరవాలేదు అనుకుంటుంది. మనసుల కలయిక ముఖ్యంగానీ శారీరక కలయిక ముఖ్యంకాదు అని ఆమె తన మనసును మెల్లిగా జోకొడుతూ ఉంటుంది. ఆమె శరీరం మాత్రం పెళ్లిరోజు సంఘటన దగ్గరనుండి ఎదురు తిరగడం మొదలుపెట్టింది. నీ మాట విననని మారాం చేస్తుంది.

ఒకరోజు టేబ్లెట్ వేసుకోవడం మరిచిపోయి పడుకుంది శృతి. కలత నిద్రలో ఉంది. ఇంతలో హరి కలవరింతలు వినిపించాయి. 'శృతీ! ప్లీజ్. నాకోసం నీవు మరలా పెళ్లి చేసుకో శృతీ. నిన్ను అలా ఏ అచ్చటా ముచ్చటా లేకుండా చూడలేను శృతీ. నీ జీవితం నావలన నాశనమయ్యింది. నీకు జీవితంలో భర్తగా ఏ సంతోషాన్ని ఇవ్వలేక పోతున్నాను నన్ను క్షమించి... నన్ను క్షమించు. నీవు మరలా పెళ్లి చేసికో' అంటూ కలవరిస్తున్నాడు. ఉలిక్కిపడి లేచింది శృతి. ఆ బెడ్‌లైట్ వెలుగులో హరి మొహం చూడగానే ఆమె హృదయాన్ని ఎవరో ముక్కలుముక్కలుగా చేస్తున్నట్లు రోట్లో వేసి దంచుతున్నట్లు అనిపించింది.

హరి ముఖం బాధలో ఎంతో స్ట్రగుల్ అవుతున్నట్లు, నలిగిపోయి ఉంది. ఆ బాధను భరించలేనన్నట్లు అంత నిద్దురలోనూ కూడా ముఖాన్ని చిట్లించుకుని యమయాతన అనుభవిస్తున్నట్లు ఫీల్ అవుతున్నాడు. శృతికి అప్రయత్నంగా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. హరి జుట్టులోనికి వేళ్లుపోనిచ్చి మెల్లగా అతన్ని జోకొట్టింది. ఏ చల్లని దేవత హస్తమో తనని నిమురుతున్నట్లు ఫీల్ అయి, ఆ తరువాత హాయిగా నిద్రపోయాడు హరి. శృతి నిద్రను కూడా తనే కలుపుకుని.

లండన్‌లో ఒకనెల లీవ్ వేకెన్సీ పోస్ట్‌కి అడ్వర్టయిజ్‌మెంట్ పడింది. రెండు పోస్టులు అని. శృతి, హరి అప్లయ్ చేశారు. వారికి దొరికింది ఆ పోస్ట్. (దానిని అక్కడ లోకమ్ అంటారు!) హరి, శృతి ఒక నెలపాటు ఇంగ్లాండు వెళుతున్నారని తెలిసి బెల్‌ఫాస్ట్‌లోవున్న మరో డాక్టరుగారు, ఆయన భార్య హరి, శృతిల పోస్ట్‌కి లోకమ్‌కి అప్లయ్ చేశారు. అది వారికి దొరికింది. ఆ డాక్టరుగారు విజయ్‌చందర్‌గారు హరికి ఫోన్ చేసి - మీరు ఈ నెలంతా ఎలాగూ ఉండరు కదా మీ ఇల్లు మాకు ఒక నెల ఇవ్వగలరా - అని అడిగారు. హరి అందుకు ఒప్పుకున్నాడు.

హరివాళ్ళు ఉండగానే విజయ్‌చందర్ ఫామిలీ వచ్చింది. బెల్‌ఫాస్ట్‌లో గొడవలు ఎక్కువ. అది నార్తరన్ ఐర్లాండు. ఎప్పుడూ మతకలహాలు, మారణహోమాలు అక్కడ. బ్రిటిష్‌వారు ఇండియాలాగే ఐర్లాండ్‌ని పరిపాలించినప్పుడు, పూర్తిగా స్వరాజ్యం ఇవ్వకుండా నార్తరన్ ఐర్లాండ్‌ని తమ ఆధీనంలో అట్టే పెట్టుకున్నారు.

సదరన్ ఐర్లాండ్ అంతా రోమన్ కేథలిక్స్‌ది. నార్తరన్ ఐర్లాండ్ అంతా ప్రొటెస్టెంటులది. అస్తమాను నార్తరన్ ఐర్లాండ్‌కు, సదరన్ ఐర్లాండ్‌కి గొడవలు, చావులు, కలహాలు. అందుకే విజయచందర్‌కి అక్కడ ఉండడం ఇష్టంలేక సదరన్ ఐర్లాండ్‌కి వచ్చేయాలని అనుకుంటున్నాడు. అక్కడ గొడవల్లో తమ బ్రతుకులు ఎప్పుడు ఎలా ఉంటాయో తమకే తెలియదు. ముందుగా లోమ్ పోస్ట్ ట్రైచేసికొని తరువాత మెల్లగా అక్కడే ఉద్యోగం సంపాదించాలని ఆయన ఊహ.

విజయ్‌చందర్‌కి ఇల్లు అప్పగించి ఆ మార్నాడే షిప్‌లో బయలుదేరారు. హరి, శృతి. షిప్ ప్రయాణం చెయ్యాలని సరదాకొద్దీ బయలుదేరారుగానీ వాంతులతో ఇద్దరికీ ఎందుకొచ్చిన ప్రయాణంరా బాబూ అనిపించింది. సీ సిక్‌నెస్ అంత భయంకరంగా ఉంది. ఇంగ్లాండ్‌కి, ఐర్లాండుకి మధ్యనున్న ఐరిష్ సీలో ప్రయాణం. ఆరు గంటలలో ఇంగ్లాండ్ చేరుకున్నారు నీరసించిన శరీరాలతో.

ఆ మర్నాడే ఇద్దరూ ఉద్యోగంలో జాయినయ్యారు. ఐర్లాండు నుండి ఇంగ్లాండ్ వచ్చేసరికి పల్లెటూరి నుండి పట్నం వచ్చినట్లుగా అనిపించింది హరికి. విశాలమైన శుభ్రమైన రోడ్లు, చీమలబారుల్లాంటి కార్లు, ఆకాశాన్నంటే భవనాలు: ఎంత చూసినా తనివితీరని అందం ఆ నగరానిది.

ఉద్యోగంలో చేరిన మొదటి వారమే సిటీ చూడడానికి వెళ్ళారు. శృతికి అండర్‌గ్రవుండ్ ట్రయిన్ ఎక్కగానే వింత అనుభూతి కలిగింది. మానవుడు ఎంతటి శక్తిశాలో ఆ అండర్‌గ్రవుండ్ ట్రైన్స్ (ట్యూబ్‌ట్రయిన్స్) ఒక ఉదాహరణ. భూమిలోపల మరో ప్రపంచాన్ని నిర్మించడం అంత తేలికైన విషయం కాదు. లండన్ జూ, పోస్టాఫీస్ టవర్, బ్రిటీష్ మ్యూజియమ్, మేడమ్ తుస్సాద్ మ్యూజియంలో విగ్రహాలు, లండన్ బ్రిడ్జి, ప్లానిటోరియమ్, ఇంకా ఎన్నింటినో చూశారు హరి, శృతి అక్కడ. బ్రిటిష్ మ్యూజియంలో కోహినూర్ వజ్రాన్ని కూడా చూశారు.

అన్నీ చూసి, అన్నిటి దగ్గర ఫోటోలు తీసికొన్నారు హరి, శృతి. తాము ప్రస్తుతం ఒక నెలపాటు లండన్‌లో ఉంటామని, అక్కడి అడ్రస్ ఇస్తూ తల్లిదండ్రులకు, అత్తమామలకు ఉత్తరాలు వ్రాసింది శృతి. ఇక్కడ దొరికిన హౌస్‌కీపర్‌తో శిల్ప అడ్జస్ట్ కాలేకపోతుంది. కొత్తగా ఫీల్ అవుతుంది. అప్పుడప్పుడు పేచీ పెడుతుంది. నాలుగు రోజుల తర్వాత ఫోటోలు తెచ్చుకున్నాడు హరి. అన్నీ చాలా బాగా వచ్చాయి. ముగ్గురు ముగ్ధమనోహరంగా అందమైన కుటుంబంగా ఉన్నారు ఫోటోలలో.

ఫోటోలు చూస్తున్న హరి, శృతి ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. తమ ఫోటోల్లో పొరపాటున ఎవరివో కలిసి పోయినట్లున్నాయి. ఆ ఫోటోలోని మనిషిని చూసి ఇద్దరూ ఆశ్చర్యంగా ఆనందంగా నవ్వుకున్నారు. అది రవి ఫోటో. రవి కూడా వారితోపాటే చదివాడు. ఇద్దరికీ కూడా ఆత్మీయుడు. హరికి రవి అంటే ఎంతో ఇష్టం. ఈ మధ్య కుటుంబంలోని చికాకువలన రవికి ఉత్తరాలు వ్రాయడం తగ్గించేశాడు హరి. రవి కూడా అదే సిటీలో తమకు దగ్గర్లో ఉన్నాడని తెలియగానే ఇద్దరికీ పట్టరాని ఆనందం కలిగింది. వారి ఫోటోలు రెండు తక్కువయ్యాయి. బహుశా ఆ రెండు ఫోటోలు రవి ఫోటోస్‌లో కలిసిపోయి ఉండవచ్చు. రవికి కూడా తెలుస్తుంది తామిక్కడ ఉన్నట్లు అనుకున్నారిద్దరూ అంతులేని సంతోషంతో.

వెంటనే ఆ షాప్‌కి వెళ్ళి ఫోటోలు మారిపోయాయని చెప్పి రవి అడ్రస్‌కోసం అడిగాడు హరి. అడ్రసు తమ దగ్గర లేదని డాక్టర్ రవి వస్తే మీ అడ్రస్ ఇస్తామని షాప్‌వాళ్లు చెప్పారు. తప్పకుండా రవి అడ్రసు కూడా తీసికొనమని వారికి మరీమరీ చెప్పి ఇంటికి వచ్చేశాడు హరి. ఇంటికి వచ్చాడుగానీ ఎప్పుడు రవిని చూస్తానా అన్న ఆతృత అతన్ని నిలువనీయడంలేదు. ఇద్దరూ తమ కాలేజీ సంగతులు, తమ ఫ్రెండ్స్ గురించి మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

మరో గంటలో కాలింగ్‌బెల్ మోగింది. ఎవరై ఉంటారబ్బా అనుకుంటూ తలుపు తెరచిన హరి గుమ్మంలో రవిని చూసి అమాంతంగా వాటేసుకున్నాడు. స్నేహితుని చూసిన ఆనందంలో అతని కళ్ళల్లో ఆనంద భాష్పాలు రాలాయి. శృతికి కూడా ఆ సన్నివేశం ఎంతో సంతోషాన్ని కలిగించింది. 'ఏరా నన్ను లోపలికి రానీయవా?' అంటూ బలవంతంగా హరిని నెట్టుకుంటూ చేతిని విడువకుండానే లోపలికి వచ్చాడు రవి. ఆ సమయంలో రవిని ఎత్తుకొని తిప్పాలన్నంత ఆనందంగా ఉంది హరికి. ఇటీవలి కాలంలో శృతి హరి మొహంలో అంత సంతోషం ఎప్పుడూ చూడలేదు. భగవంతుడా ఈ సంతోషాన్ని శాశ్వతం చెయ్యి తండ్రీ అనుకొంది శృతి.

అప్పటినుండి రవి తన మకాం వారింటికే మార్చివేశాడు. ఒకప్పుడు రవి కూడా శృతిని ప్రేమించినవాడే. కానీ హరి ప్రేమించాడని తెలిసి స్నేహితుని కోసం తాను తప్పుకున్నాడు. రవి కూడా శృతిని ప్రేమించాడని హరికి తెలుసు. కానీ శృతి హరిని చేసికోవాలని ఇష్టపడింది. రవి అంటే పెద్ద ఇంటరెస్ట్ లేదామెకు. రవి ఇంకా పెళ్ళి చేసుకోకుండా అలాగే ఉండిపోయాడు. రవి కూడా ఇంగ్లాండ్‌కు వచ్చి అప్పుడే సంవత్సరంన్నర అయింది. ఇద్దరూ పక్కపక్క దేశాల్లో ఉంటూ కూడా ఒకరికొకరికి తెలియదు. ఆ ఫోటోలు మారి ఉండకపోతే ఒక ఊరిలో ఉన్నట్లు కూడా ఒకరికొకరికి తెలిసేది కాదు. అంత పుణ్యం చేసిన ఫోటోలను మరీ మరీ ముద్దు పెట్టుకున్నాడు హరి.

చాలా అన్యాయంరా వాటిని ముద్దు పెట్టుకోవడం. పక్కన నేనున్నానుగా నన్నే పెట్టుకోవచ్చుగా. ఆ ప్రాణంలేని ఫోటోలు నీకేమి తియ్యదనాన్ని ఇస్తాయేం - అని పరిహాసమాడాడు రవి. 'శృతి మధ్యలో వచ్చి మనిద్దరినీ వేరు చేసిందిగానీ లేకపోతే మనిద్దరం పాలూనీళ్లలా కలిసిపోయి ఉండేవాళ్లం కదూ' అన్నాడు కాలేజీ రోజులు తలుచుకొని. 'నీకింకా పెళ్ళికాలేదు కాబట్టి ఇంకా ఇలా ఆలోచిస్తున్నావు. పెళ్లయి ఉంటే నన్ను ఏనాడో మరిచిపోయి ఉండేవాడివి' నిష్ఠూరంగా అన్నాడు హరి.

'అది సరేగానీ మరీ ఒక పిల్లతోనే ఆపేశావేమిటి ఏమైనా ఫామిలీ ప్లానింగా' అని అడిగాడు రవి. ఆ మాటలకు హరి మొహం వెలవెల బోవడం రవి గమనించలేదు. రవి

ఇంటికి వచ్చి వారం రోజులయింది. ఆ వారంనుండి గమనిస్తున్నాడు. హరి తన సన్నిధిలోనే హుషారుగా ఆనందంగా ఉంటున్నాడు. శృతి దగ్గర అందమైన భార్య పక్కన ఉన్న పరవశంగానీ, రాత్రి ఆమె పక్కకు చేరాలన్న తహతహగానీ జీవిత మాధుర్యాన్ని అనుభవిస్తున్న ఆనందంగానీ హరి మొహంలో ఒకనాడు కూడా చూడలేదు రవి. పైగా దంపతులిద్దరూ చెరొక కొండనూ ఎవరికీ కనిపించకుండా మోస్తున్నట్లు భారంగా కనిపిస్తున్నారు.

హరి సంసార జీవితంలో ఏవో కలతలున్నాయనుకున్నాడు రవి. వీలైతే సాధ్యమైనంత వరకూ ఆ కలతలు చక్కదిద్దాలి. వారు సంతోషంగా ఉండాలి అని తలిచాడు. తాను ప్రేమించిన శృతి అలా నిరాశగా బ్రతకడాన్ని రవి సహించలేక పోతున్నాడు. ఎలాగైనా అసలు సంగతి ఏమిటో హరినుండి రాబట్టాలని సమయం కోసం ఎదురు చూస్తున్నాడు రవి. అందరూ కలిసి ఆ ఆదివారం పార్కుకి వెళ్లారు. పార్కులో ఎక్కడ చూసినా జంటలు జంటలు జంటలు. అందరూ అర్ధనగ్నంగా శృంగారలీలలు సాగించేవారే. మాకు బెడ్‌రూమ్ అక్కర్లేదు అన్నట్లు పబ్లిగ్గా, కౌగిలింతలలోనూ, ముద్దులతోనూ కాలక్షేపం చేస్తుంటే రవికి చాలా చికాకనిపించింది. హరికి వారు ఎంత అదృష్టవంతులో కదా అనిపించింది. శృతికి ఏ భావమూ కలుగలేదు కానీ ఎందుకో హృదయం బాధగా మూలిగింది.

'అబ్బ, మరీ అసహ్యాకరమైన దృశ్యాలు' అన్నాడు రవి.

'నిజమే. శృంగారం ఎప్పుడూ రహస్యంగానే ఉండాలి. ఇలా పబ్లిక్‌గా ఏమిటో, పశువులకీ, మనుషులకీ తేడా లేకుండా' అన్నాడు. పాపం ఆ పాశ్చాత్యులు ఇలా మితిమీరిన శృంగారం వలన ముందుముందు ఎయిడ్స్ వ్యాధికి గురవుతామని ఏ మాత్రం ఊహించి ఉండరు కదా! అందుబాటులో ఉందని ఏదీ మితిమీరి అనుభవించకూడదు. ఏదయినా హద్దుల్లో ఉంటేనే అందం, ఆరోగ్యం. దేనికైనా ఒక పద్ధతి ఉండాలి. డైనింగ్ టేబుల్ మీద పడుకుని మంచంమీద అన్నం తినలేము కదా! ఏది ఎక్కడ ఎలా జరగాలో అలా జరిగితేనే అందం. అలా పబ్లిక్ శృంగారం అక్కడి వారికి కామమే కావచ్చు. కానీ భారతీయులైన హరి, రవి, శృతిలకు వెగటుగా అనిపించింది. రవి, హరి దాని గురించే కొంచెంసేపు చర్చించుకున్నారు. శృతి కామ్‌గా వారి సంభాషణ విందిగానీ వారి సంభాషణలో పాల్గొనలేదు. ఆమె శరీరం మాత్రం తనకు తెలియకుండానే దారి తప్పుతోంది. నిగ్రహాన్ని కోల్పోతోంది.

ఇంటికి రాగానే శృతికి ఫిట్స్ వచ్చాయి. ఆ ఫిట్స్ రాగానే అన్ని రోజుల సంతోషం గాలితీసిన బెలూన్‌లా చప్పబడిపోయింది హరిలో. నెల రోజులు లంఖణం చేసిన మనిషిలా నీరసపడిపోయాడు. ఇప్పుడు రవిని చూస్తుంటే హరికి మనసులో ఒక ఆలోచన

వచ్చింది. శృతికి, రవికి పెళ్ళి చేస్తేనో అని. శృతి ఒప్పుకోదని తెలుసు. రని అడగాలి ముందు. ఏమని అడగాలి. ఎలా అడగాలి. అతని మనసు పెనంమీద ఆవగింజలా గిలగిల లాడింది. ఎలాగయినా సరే మనసుని రాయి చేసుకుని శృతిని రవికి అప్పజెప్పాలి. అప్పుడుగానీ తనకు మనశ్శాంతి ఉండదు అనుకున్నాడు దృఢంగా.

శృతి గాఢనిద్రలో ఉంది బెడ్‌రూమ్‌లో. హరి దిగాలుగా కూర్చుని ఉన్నాడు రవి వచ్చేసరికి. ఇద్దరూ సిటింగ్ రూంలో కూర్చున్నారు. ఎందుకో రవికి హరిని అలా విచారంగా చూస్తుంటే బాధనిపించింది. తన దగ్గర ఏదో దాస్తున్నాడని అనిపించింది. హరి రవి దగ్గర ఆ సంభాషణ ఎలా ఎత్తాలా అని ఆలోచిస్తున్నాడు. హరి కాఫీ కలిపి ఇద్దరికీ తెచ్చాడు. 'శృతికి ఫిట్స్ ఎంతకాలం నుండి వస్తున్నాయి. ఇంతవరకు ఆమెకు ఈ డిసీజ్ ఉన్నట్లు తెలియదు నాకు' అన్నాడు రవి.

'నిజమే నాలాంటివాడిని కట్టుకున్నందుకు ఫిట్స్ రాక ఏమవుతాయి' అని అప్రయత్నంగా అనేశాడు హరి. హరి ఏం మాట్లాడుతున్నాడో అర్థం కాలేదు రవికి. హరికి ఏం తక్కువ అని అలా ఫీల్ అవుతున్నాడు అని అనుకుంటున్నాడు. హరికి ఏం తక్కువ అనుకున్నాడుగానీ మగవాడికి ఎన్ని ఉన్నా మగసిరి లేనివాడు మగవాడు కాదని ఆ మగసిరిని పెళ్ళయిన రోజే ఏక్సిడెంట్‌లో హరి కోల్పోయాడని, ఇద్దరూ అప్పటినుండి నిర్జీవంగా బ్రతుకున్నారని రవికి తెలియదు.

"ఎందుకురా హరీ అలా మాట్లాడతావు. నీకేం తక్కువని. నిన్ను సరిగా చూడడంలేదా శృతి?" అన్నాడు రవి. అలా అడిగేసరికి ఎన్నో రోజులనుండి దాచుకున్న దుఃఖం సముద్రంలా పొంగి పొరలింది హరిలో. 'రవీ' అంటూ బోరుమని ఏడ్చేశాడు రవిని కౌగలించుకుని. అలా ఎంతోసేపు ఏడిస్తేగానీ హరి హృదయంలో బాధ తగ్గలేదు. ఆ సమయంలో రవి అతనికి తన బాధలు తొలగించడానికి వచ్చిన దేముడిలా కనిపించాడు. ఇంక రవి దగ్గర ఏదీ దాచదలుచుకోలేదు హరి. రవి ఆప్యాయంగా హరి వీపు నిమిరాడు. ఆ ఆప్యాయతలో కరిగిపోయాడు హరి.

'రవీ, జీవితంలో నాకొక్క సహాయం చేసిపెట్టరా. జన్మంతా నీకు రుణపడి ఉంటాను' అన్నాడు. 'నాకు కాదురా సహాయం శృతికి చెయ్యాలి' అన్నాడు తిరిగి.

'ఏం చెయ్యాలిరా హరి. భర్తవు నీవు దగ్గరుండగానే నేనేం చెయ్యాలి చెప్పు. నీ సంతోషంకోసం ఏమైనా చేస్తాను. మీదిద్దరూ సంతోషంగా ఉండడమే నాకు కావాలి చెప్పు అన్నాడు. శృతిని హాస్పిటల్‌లో అడ్మిట్ చెయ్యాలా. ఇండియా తీసుకొని వెళ్లాలా? పోనీ డబ్బు సహాయం చెయ్యాలా' అని ఇలా ఆలోచిస్తున్నాడుగాని రవి శృతి మెడలో మూడుముళ్లు వెయ్యమంటాడని కలలో కూడా ఊహించలేదు.

'శృతిని నీవు....' అంటూ ఆగిపోయాడు హరి. 'ఊ ఏం చెయ్యాలో చెప్పు. శృతికి



ట్రీట్‌మెంట్ ఇప్పించాలా. మందులు తెచ్చిపెట్టాలా' ఆతృతగా అడిగాడు రవి. 'శృతిని నీవు రే... ' గరళం గొంతులో అడ్డుపడిన్నట్లు అతని ముఖ కవళికలే చెబుతున్నాయి. ఎందుకంత వర్రీ అవుతున్నాడో అర్థంకాని రవి 'ఎందుకు హరీ, నా దగ్గర నీకు మొహమాటం? ఏమిటి చెప్పు. నీకోసం నా ప్రాణమైనా ఇస్తానని తెల్సుగా. నిస్సందేహంగా చెప్పు. శృతిని నేను రేపు ఎక్కడికైనా తీసికొనివెళ్ళాలా' అని ఆదుర్దాగా అడిగాడు. అయ్యో, రవీ; నీకెలా చెప్పను నా మనసులోని మాట - అనుకున్నాడు హరి కొండంత బాధతో.

అతని మౌనాన్ని మరో విధంగా అర్థం చేసుకున్న రవి 'నా మీద నమ్మకం ఉంటేనే శృతి పని నాకు అప్పగించు. నీకంత నమ్మకం లేకపోతే వద్దులే'' అన్నాడు

నిష్టూరంగా. శృతి పని అప్పుడెప్పుడానికి సంశయిస్తున్నాడని రవి తలుస్తున్నాడు గాని హరి కోరిక వింటే తప్పక అదిరిపోతాడు. హరి చేతిని రవి తన చేతిలోనికి తీసికుంటూ అనునయంగా అన్నాడు.

'హరి. మనసులోని బాధ ఎవరికైనా చెప్పుకుంటే కొండంత ఉపశాంతి కలుగుతుంది. అందుకే నిన్ను నాపై సగభారం వెయ్యమంటున్నానుగాని, మరో ఉద్దేశ్యంతో కాదు. నా వలన మీ ఇద్దరికి ఏ మాత్రం ఉపకారం జరిగినా నాకు జీవితంలో ఎంతో తృప్తిగా ఉంటుంది. మీరిద్దరూ నాకు ప్రాణ స్నేహితులు. మీరు బాధపడుతోంటే చూడలేక అడుగుతున్నాను'' అన్నాడు అసలు సంగతి గ్రహించని రవి. హరి చెప్పబోయేది మామూలు విషయమే అనుకుంటున్నాడు.

జారిన గుండెను దరిచేర్చుకుని లేని ధయిర్యాన్ని కూడగట్టుకొని బొంగురు పోయిన గొంతుతో మాట పలకలేనట్లున్న నోటితో ఎట్టకేలకు తెగించి సాహిసించి 'రవీ నీవు నీవు... శృతిని... శృతిని.... రేప్ చెయ్యాలిరా' అన్నాడు. అనేసి గభాల్న మొహాన్ని చేతుల్తో కప్పుకొని వెక్కి వెక్కి ఏడవసాగాడు. ఆ మాట అతి కష్టం మీద ఎంతో ప్రయాసతోనూ పలికిన ఆ మాట రవి తలపై పిడుగు పడినట్లు అనిపించింది. పిడుగు పడినా అంత ఆశ్చర్యపోయేవాడు కాదేమో. తను విన్నది నిజమేనా లేక హరికి ఏమైనా మతిస్థిమితం తప్పిందా - లేక నేను కలగంటున్నానా - అని చాలసేపు హరిని ఓదార్చడం కూడా మరచిపోయి స్థాణువులా వుండిపోయాడు రవి.

తన పతి మానం చంద్రమతి మాంగల్యం అని తలచే భారత దేశంలో పుట్టిన మగవాడు తన భార్యను రేప్ చెయ్యమని మరో మగాడిని అందులో స్నేహితుడ్ని అడుగుతున్నాడు. అలా అడగడానికి అతను జీవితంలో ఎంతటి నరకాన్ని చిత్రహింసను, మానసిక క్షోభను అనుభవించి ఉంటాడో మనం ఊహించవచ్చు.

కొంచెం సేపటికి తేరుకున్న రవి జరిగినది కల కాదని హరి అన్నమాటలు నిజమేనని గ్రహించి 'ఏమిటి హరీ నీవు మాట్లాడుతున్నది! మనసు స్థిరంగా ఉందా, లేక ఏదైనా లోకంలో ఉందా' అని అడిగాడు. ఇంక హరి రవి దగ్గర ఏదీ దాచదలచుకోలేదు. అంతా వివరించి చెప్పేసాడు ఆ తరువాత భారం నీదేనంటూ.

హరికి, శృతికి పెళ్ళి కుదిరింది. ముహూర్తాలు కూడ నిర్ణయించారు. ఇంకా పెళ్ళి వారం రోజులుందనగా అర్జంటుగా హరి బెంగుళూరు కాన్ఫరెన్స్‌కు వెళ్ళ వలసి వచ్చింది. శృతిని కూడ పంపమని వేదాంత శర్మగారిని అడిగితే ఆయన ఒప్పుకోలేదు. ఎలాగైతే బ్రతిమాలి శృతిని బెంగుళూరు ప్రయాణం కట్టించాడు హరి తనతో. మరో వారం రోజుల్లో కాబోయే దంపతులు వయసులోనున్నారు, ఒంటరిగానున్నారు, అందమైన ఊరులో, చల్లని ప్రదేశంలో నున్నారు. ఇంక కోరికలకు అడ్డేమిటి.

శృతి ఎంతో బ్రతిమాలింది వద్దని, తనను తాకవద్దని. 'పెళ్ళయితే ఇంక అడ్డులేదు కదా. అపుడు మీమాట జవదాటను' అంటూ ఎంతో వేడుకొంది. కాని హరి ఆగలేక పోయాడు, తాళలేకపోయాడు. 'నీ కాళ్ళు పట్టుకుంటాను ప్లీజ్' అన్నాడు. ఆ మాటకు ఇంక లొంగిపోక తప్పలేదు శృతికి. కాబోయే భర్తే కదా అని మనసులోనే ఉన్నా పెళ్ళి పీటలమీద కన్యగా కూర్చోవాలని ఆమె ఆశ. ఆమె ఆడది కాబట్టి అలా ఆలోచించింది. హరి మగవాడు. ఒక వారం ముందు ఇద్దరం ఒకటైతే తప్పేమిటి అన్న దృష్టిలో అతను ఆలోచించాడు. శృతి అన్యమనస్కంగానే అతనికి తన శరీరాన్ని అర్పించుకొంది. మనసులో బాధగా ఉన్న హరికోసం ఆ నాలుగురోజులు సంతోషంగానే గడిపి అతనికి పూర్తి సహకారాన్ని ఇచ్చింది. శృతి సన్నిధిలో స్వర్గాన్నే మరచిపోయాడు హరి ఆ నాలుగురోజులూ. వారు తిరిగి వచ్చిన తరువాత యధావిధిగా పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళిలో ఎన్నో ఆశీర్వాదాలు, ఎన్నో అక్షింతలు, ఏవీ అన్నీ ఏమయిపోయాయి. వారి జీవితంలో శాపాలయిపోయాయి.

పెళ్ళి జరిగిన తరువాత గుడినుండి వస్తుంటే కారుకి ఏక్సిడెంట్ అయింది. హరివెళ్ళి క్రిందపడ్డాడు. డ్రైవరుకి ఫ్రాక్చరు అయింది. హరికి ఏమీ దెబ్బ తగలలేదు కదా అమ్మయ్య అని అందరూ నిట్టూర్చారు. కాని అతని జీవితానికి తగిలిన గాయం సంగతి ఎవరికీ తెలియదు.

ఆ మర్నాడు హాస్పిటల్‌కి వెళ్ళిన హరి డాక్టరుగారు చెప్పిన మాట విని నిలువునా కృంగిపోయాడు. రక్తమంతా నీరయిపోయినట్లు నీరసపడి పోయాడు. శృతిని తలంచుకొని బెంబేలుపడి పోయాడు. అప్పటినుండి ఆ సంగతి హరికీ శృతికీ ఆ డాక్టరుకీ తప్ప వేరొకరికి తెలియదు.

ఆ డాక్టరుగారే అమెరికా వెళ్ళమని సలహా ఇచ్చారు. అప్పటినుండి ఒకరినొకరు ఓదార్చుకుంటూ ఇలా కాలం గడుపుతున్నారు. పెళ్ళయిన నెల్లాళ్ళకే శృతికి వేవిళ్లు ప్రారంభం కావడంతో అసలు ఎవరికీ ఆ విషయంలో అనుమానమే రాలేదు. అమెరికా వెళ్ళి ట్రీట్‌మెంట్ తీసికోవాలంటే వేలకొలదీ డబ్బు కావాలి. ఇరు కుటుంబాలవారు పేదవారే. అందుకే ఇద్దరూ కలిసి వర్మ సహాయంతో ఐర్లాండు వచ్చారు. అక్కడ డబ్బు సంపాదించి అలాగే అమెరికాలో ఉద్యోగంకూడ సంపాదించి ఒకేసారి వెళ్ళాలని వారి ఆలోచన. డబ్బు సమకూడే వరకు శరీరం ఆగదుగా. ఆ పరిస్థితులను శృతి తట్టుకోలేక పోతోంది. అమెరికా వెళ్ళినా ఒకవేళ బాగుపడకపోతే అన్న ప్రశ్న హరిని పెద్ద భూతంలా ఎదురుగా నిలిచి భయపెట్టేస్తుంది. ఆ డాక్టర్లతో నీవు ఇంక బాగుపడవు అని అనిపించుకోక ముందే శృతి మనసు మార్చి ఆమెకు వేరే పెళ్ళి చెయ్యాలని హరి ఆరాటం. తన భర్తను బాగు చేయించుకోవాలని బాగు పడకపోయినా అతని సన్నిధిలోనే కాలం వెళ్ళబుచ్చాలని శృతి ఆశయం.

"అందుకేరా రవీ, ఆమెకు ఫిట్స్ తగ్గాలన్నా, ఆమె జీవితంలో వసంతం రావాలన్నా నీవు నేను కోరిన కోరిక తీర్చాలి. ఎందుకంటే శృతి ఈ జన్మల్లో తనను మరో మగవాడు తాకడానికి ఇష్టపడదు. ఆమె గాఢనిద్రలో నుండగానే ఆమెను నీ దాన్నిగా చేసికోరా రవీ. అంతా అయిపోయాక నిజం తెలిసి అయినా నిన్ను పెళ్ళి చేసకుంటుందేమో. శృతి బిడ్డ తల్లి అని ఆలోచించకు. శృతి అంటే నీకు ఇష్టం కదరా! ఈ మేలు చేసిపెట్టరా. నీ కాళ్ళు పట్టుకుంటాను" అన్నాడు హరి ఎంతో వ్యధతో కూడిన గొంతుతో. అన్ని విషయాలు విన్న రవి ఆ బాధంతా తనేపడినట్లుగా ఊహించుకున్నాడు. హరి ఇంతకాలం ఎంత నరకాన్ని అనుభవించి ఉంటాడో గ్రహించగలిగాడు. అతన్ని ఎలా ఊరడించాలో తెలియలేదు రవికి.

ఏడుస్తున్న హరిని ఏడవ్వద్దని వారించి "రేపు ఆలోచించుకొని చెబుతాను" అన్నాడు రవి. అంతకంటే ఎక్కువ మాట్లాడడానికి అతనికి మనస్కరించలేదు. అతని మనసులో ఎన్నో ఆలోచనలు ఉన్నాయి. అవి కార్యరూపంలో పెట్టేవరకూ హరిని అలాగే జోకొట్టాలి అనుకున్నాడు. శృతిని తను ప్రేమిస్తే ప్రేమించి ఉండవచ్చు, ఆమెకు సంసార సుఖం లేకపోతే లేకపోవచ్చు. అంతమాత్రాన ఆమెను తాకడానికి అతనికి మనసు ఎలా ఒప్పుతుంది. శృతి ఇపుడు సోదరితో సమానంగాని అంతకు మించి మరే తలపూలేదు రవిలో. నిజంగా హరికి మగసిరి తిరిగిరాని పక్షంలో శృతి రెండవ పెళ్ళికి ఒప్పుకున్నా మరో మగవానికిచ్చి అయినా చేస్తాడుగాని, స్నేహితుడు స్వీకరించిన పుష్పాన్ని తాను అంగీకరించలేడు.

ఆ రాత్రంతా మరొకవిధమైన బాధతో గడిపాడు హరి. 'రేపు ఆలోచించుకొని చెబుతానన్నాడు. నిజంగా శృతిని రవి అనుభవిస్తాడా భార్యగా అంగీకరిస్తాడా...!' అని తలచుకోగానే. ఎదలో ఏదో తెలియని బాధ. శృతి పరాయిసొమ్ము అయిపోతుందంటే అంతులేని ఆవేదన కలుగుతుంది. ఆమెను దగ్గరపెట్టుకొని తాను ఆమెకు ఏ సుఖాన్ని ఇవ్వలేక అడకత్తెరలో పోకచెక్కలా నలిగిపోతున్నాడు హరి.

తెల్లవారింది. 'నా పాత గదికి వెళ్ళిపోతాను' అంటూ వెళ్ళిపోయాడు రవి. ఆ హఠాత్ప్రయాణానికి తెల్ల బోయాడు హరి. ఆశ్చర్యపోయాడు హరి. 'నేను అర్జంటుగా వెళ్ళాలి. రెండురోజుల్లో వస్తాను' అని హరి మాటలకు ఎదురు చూడకుండానే టాక్సీలో సూట్‌కేస్ పెట్టేసి 'బై' అంటూ వెళ్ళిపోయాడు రవి. హరి ఇంకా పూర్తిగా తేరుకోకుండానే.

రెండు రోజుల తరువాత రవి ప్రొద్దున్నే ఫోన్ చేసాడు. హరి అందుకున్నాడు ఫోన్. ముందుగా 'శృతి ఆ గదిలో ఉందా' అని అడిగాడు రవి 'లేదు స్నానం చేస్తుంది' అన్నాడు హరి. నీవు శృతికి చెప్పకుండా సాయంకాలం నాలుగు గంటలకి నా రూమ్‌కి వస్తున్నావు' అని ఠక్కున ఫోన్ పెట్టేసాడు రవి. రవి వింత ప్రవర్తన ఆశ్చర్యంగా ఉంది హరికి. వీడు మొదటి నుండే అంతా హడావిడి బేరం అంతా అనుకొని నవ్వుకున్నాడు.

సాయంకాలం శృతితో బజారు పని ఉంది అని చెప్పి వెళ్ళాడు హరి రవి దగ్గరకు. 'నిన్ను ఒకచోటికి తీసికొని వెళతాను. నాతో నోరుమూసికొని రావాలి' అన్నాడు రవి. అలాగేనంటూ నోటిని చేతితో మూసికొని రవిని అనుకరించాడు హరి. ఇంటికి తాళం వేస్తూ వెనక్కి వెనక్కి తిరిగి హరి ఫోజు చూసి నవ్వకుండా ఉండలేకపోయాడు రవి. రవితోపాటు హరికూడా నవ్వుతో శృతి కలిపాడు. 'ఒరేయ్ హరి. ఈ నీ చిరునవ్వులు చిరకాలం ఉండాలిరా. దానికి నా శాయశక్తులా కృషి చేస్తాను. నా పూర్తి సహకారం నీకుంటుంది.' అన్నాడు. పూర్తి సహకారం అన్న మాటను మరో విధంగా అన్వయించుకున్నాడు హరి.

ప్రస్తుతం అతని మనసు ఆలోచించే స్థితిలో లేదు. రవి ఎలా నడిపిస్తే అలా నడవడమే అతని పని. రవిని చూసిన తరువాత అతనికి తెలియకుండానే అతని గుండెల్లో భారం సగం దిగిపోయింది. ఆత్మీయుల సన్నిధిలో ఆపదలు కూడా ఆనందంగానే ఎదుర్కోవచ్చు. 'నిన్ను నిన్నుగా ప్రేమించుటకు, నీ కోసమే కన్నీరు నించుటకు నేనున్నానని నిండుగ పలికే తోడొకరుండిన అదే భాగ్యము, అదే స్వర్గము.' ఎంత చక్కటి మాట. అందులో ఎంతటి నిజం ఉందో అనుభవిస్తున్న హరికే తెలుసు. అందుకే తన జీవితాన్ని రవి ముందు విప్పి చెప్పేసాడు. రవి చేతిలో పెట్టేసాడు.

రవిని దారిలో ఏమీ ప్రశ్నించలేదు హరి. ఎక్కడికి ఎందుకు అని అడగలేదు. మామూలుగా హాస్పిటల్ సంగతులు మాట్లాడుకుంటూనే ఒక షాప్‌లోకి వెళ్ళాడు. ఆ షాప్‌ని చూసిన హరి దిగ్భ్రమ చెందాడు. బట్టలు, నగలు, ఉప్పులు, పప్పులు, పాలు, చేపలు, మాంసం, రేడియోలు, ఫ్రిజ్‌లు ఇంకా గృహానికి కావలసిన అన్ని సామానులు గల దుకాణాన్ని ఇంతవరకూ చూసాడుగాని సంసార సుఖానికి సరిపడే వస్తువులు కూడ బజారులో దొరుకుతాయని, మానవుని మేధ, సైన్సు అంత అభివృద్ధి చెందినదని తెలియని హరి ఆ షాపుని చిన్నపిల్లాడిలా సంబరంగా చూసాడు. హరి ముఖంలోని సంబరం రవికి సంతోషాన్నే కలిగించింది. విరిగిపోయిన కాలు స్థానంలో చెక్క కాలు పెట్టుకొని మనిషి నడవగలుగుతున్నాడు. అంతేగాని నిరాశతో మూల కూర్చోవడం లేదుగా కన్నుతీసి. కన్ను, గుండె తీసి గుండె అమరుస్తున్నారు. ప్రాణం తీసి ప్రాణం పొయ్యలేకపోవచ్చు. కాని గుడ్డి కంటే మెల్ల నయం అన్నట్లు అవిటి జీవితాలకు ఏదో చిన్న ఆధారం. మానవుడు ఆశాజీవి. అవిటి తనానికి కృంగిపోయి నశించి పోవనక్కరలేదు. దానిని మరచిపోయి జీవితాన్ని మరో పంథాలో నడిపించుకోవాలి. మనం జీవితంలో పోగొట్టుకున్నది తిరగి సంపాదించుకోలేక పోవచ్చు కాని ఉన్నదానితోనే తృప్తిపడి జీవితాన్ని కొనసాగించి ఆనందమయం చేసికోవచ్చు. మనకు అందని దాని గురించి అర్రులు చాచనక్కర్లేదు. ముఖ్యంగా జీవితంలో మనకు కొన్నింటికి కాంప్రమైజ్ అయితేనేగాని మనిషి సుఖంగా బ్రతకలేడు.



లండన్ నగరంలోనున్న ఆ షాప్‌లో అన్నీ పెద్ద పెద్ద మనుష్యుల సైజులో నున్న ఆడబొమ్మలు, మగబొమ్మలు రబ్బరువి. అవి బేటరీతో పని చేస్తాయి.

ఎయిర్‌పిల్లోకి లాగ గాలి కూడ కొట్టుకోవచ్చు. అవి ప్రాణం లేని బొమ్మలే కావచ్చు. ప్రాణం ఉన్న మనిషికి ముఖ్యంగా సెక్స్‌కి దూరం అయిన వారికి ఎంతో ఉపయోగపడతాయి. షిప్పులో ప్రయాణంచేసి భార్యలకు దూరం అయిన ఉన్నవారు, మిలటరీవారు, భార్యగాని, భర్తగాని చనిపోతే మరో వివాహానికి ఇష్టపడనివారు అందరూ వాటిని ఉపయోగించి తాత్కాలికంగా వారి సెక్స్ వాంఛను చల్లార్చు కుంటారు.

అలాంటి బొమ్మను ఒకటి కొని పేక్ చేయించాడు రవి. ఆ బొమ్మకు హరీష్ అని పేరు పెట్టాడు. 'ఇకపై ఇంటిలో ఇద్దరు హరిలుంటారు' అని చెప్పి అది హరికి అప్పచెప్పి హరితో చెప్పాడు. 'ఇది నేను కొనిపించినట్లు మాత్రం శృతికి చెప్పకు. ఏ స్త్రీ అయినా తన సంసారం విషయం ముఖ్యంగా సెక్స్ విషయంలో మరో మగవాడి ప్రసక్తిని భరించలేదు. చాల గిల్టీగా ఫీల్ అవుతుంది. మీ సంసారిక విషయాలు నాకు

చెప్పినట్లు కూడ శృతికి చెప్పవద్దు. నేను ఏమీ తెలియనేట్లే ఉంటాను' అన్నాడు రవి.

రవి చేసిన పనికి చెప్పిన మాటలకు హరి కన్నులు చెమ్మగిల్లాయి ఆనందంతో. దాదాపు 75 శాతం బాధ తగ్గినట్లుగా ఫీల్ అయ్యాడు. తన మొర విని దేవుడు తనకోసం రవిని పంపినట్లుగా తలచాడు హరి. ఆ బొమ్మను ఇంటికి తెచ్చాడు హరి. దానికి శృతి ఎలా రిసీవ్ చేసుకుంటుందోనని భయం. మెల్లగా ఆ విషయం చెప్పాడు. శృతి సంతోషాన్ని, విచారాన్ని కూడా వ్యక్తపరచలేదు. పోనీ దానివలన అయినా హరి రెండవ పెళ్ళి సంగతి ఎత్తకుండా ఉంటే చాలనుకొంది.

అది తన శరీరానికి పూర్తి సంతోషాన్ని ఇవ్వకపోయినా శరీరం వేడి తగ్గించి ఆ ఫిట్స్ తగ్గితే చాలనుకొంది. ఆపైన హరి కౌగిలి సన్నిధి తనకు ఎలాగు ఉంటాయి, మనసు సేద తీర్చుకోడానికి. శృతి ఆ బొమ్మను చూసి ఏమీ భావం వ్యక్తం చెయ్యకపోవడం హరికి సగం బలాన్నిచ్చింది. మౌనం ఎపుడూ అర్ధాంగీకారమే కదా! భగవంతుడా, నేను ఇవ్వలేని సుఖాన్ని ఈ బొమ్మ ద్వారానైనా ఇప్పించు నా భార్యకు అనుకున్నాడు హరి.

రవి మామూలుగా హరి దగ్గరకు వస్తున్నాడు, వెళ్తున్నాడు. ఒక వారం తరువాత ఒక డాక్టరుగారి అడ్రసు ఇచ్చి హరిని, శృతిని కూడ ఆ డాక్టరుగారి కలవమని చెప్పాడు రవి. రవిని కూడతోడుగా రమ్మన్నాడు హరి. కాని 'ఇది మీ సంసారిక విషయం. మధ్యలో నేనుండకూడదు' అని మృదువుగా తప్పించుకున్నాడు.

ఒక మంచిరోజు చూసి ఆ రోజుకి ఆ డాక్టరుగారి దగ్గర ఎపాయింట్‌మెంట్ తీసికొని ఇద్దరూ దేవుని ధ్యానించుకొని హాస్పిటల్‌కు వెళ్లారు. ఆ డాక్టరుగారు భారతీయుడే. డాక్టర్ రాజు హరిని, శృతిని ఎంతో ఆప్యాయంగా పలకరించారు. ఆయనకు భారతీయులంటే వల్లమాలిన అభిమానం. ఆయన జీవితంలో పెద్ద పొరపాటు చేసాడు. తాను జీవితాంతం సరిదిద్దుకోలేక పోయాడు ఆ పొరపాటుని. అందుకే భారతీయులకు సహాయం చెయ్యడానికి పూర్తి సహకారాన్ని అందిస్తాడు ఆయన మహదానందంగా.

రాజుగారు వయసులో ఉండగానే భార్యను ఇద్దరి చిన్నపిల్లలను ఇండియాలో వదిలి ఇంగ్లండు వచ్చారు. ఆయనకు ఉద్యోగం దొరికింది. మెల్లగా భార్యను తీసికొని రావచ్చని అనుకున్నారు. ఇంతలో అనుకోకుండా ఇంగ్లీషు వనితతో పరిచయం కలిగి ఆమెతో శారీరకంగా ఏకమయ్యాడు. అంతే. ఆమె శనిలా పట్టుకొని ఆయనను వదలలేదు.

పెళ్ళి చేసికుంటేగాని ఊరుకోలేదు. అప్పటికే ఆవిడకు ఇద్దరు పిల్లలు. భర్తకు విడాకులిచ్చింది. పెళ్ళయిన తరువాతగాని రాజుగారికి తెలియలేదు, ఆమె కేవలం డబ్బుకోసమే తనని పెళ్ళి చేసికొందని. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొని

ప్రయోజనం ఏముంది! తను కన్న పిల్లలను, కట్టుకొన్న భార్యను గాలికి వదిలి ఎవరికో పుట్టిన పిల్లలకు తండ్రి అయ్యాడు. అప్పటినుండి నరకం అంటే ఎక్కడోలేదని భూమిమీదనే ఉందని గ్రహించాడు.

ఆ రోజునుండి ఈరోజువరకూ జీవచ్ఛవంలాగానే బ్రతుకుతున్నాడు. ఎక్కువకాలం రోగులతోనే గడిపేస్తారాయన. తన భార్య పిల్లలు గుర్తుకి రాగానే గార్డినల్ని గాని బోటిల్ని గాని ఆశ్రయిస్తాడు. అలాగే పాతిక సంవత్సరాలు గడిచిపోయాయి.

ఎందుకోగాని శృతిని హరిని చూడగానే తన కూతురిని, అల్లుడిని చూసినట్లుగా అనిపించింది రాజుగారికి. అందుకే చాల శ్రద్ధగా హరికేసు స్టడీ చేసాడు. అన్ని రకాల ఎక్స్రేలు, స్కేనింగ్లు చూసాడు. ఆ రిపోర్ట్సు అన్నీ చూసిన రాజుగారి ముఖంలో ఆనందం చిందులు వేసింది. ఆ కేసుకోసం అమెరికా వెళ్ళనవసరం లేదని తానే చేస్తానని చెప్పాడు హరితో రాజుగారు. పెద్దబండ గుండెలమీద నుండి దించినట్లయింది ఇద్దరికీ. మరో నెల శలవు పొడిగించారు ఇద్దరూ.

ఆ సమయంలో ఉద్యోగం వదిలేయమన్నా సిద్ధంగానే ఉన్నారు. తమ సంసారం బాగుపడడమే వారికి కావలసింది. అందరి దంపతులాగా హాయిగా బ్రతకాలని వారికీ ఉంది. ఇద్దరు ఒకరి ప్రక్కన ఒకరు ఉండికూడా ఒంటరి జీవితం ఒకరి నొకరు అంటరాని జీవితం గడపాలంటే వారికి విసుగ్గాను ఉంది బాధగాను ఉంది.

మరోవారంరోజుల తరువాత రాజుగారు హరి శృతి దంపతులను ఇద్దరినీ పిలిచి చెప్పారు. 'అప్పటి ఏక్సిడెంట్లో వెన్నెముకకు చిన్న దెబ్బ తగిలిన మాట నిజమే. కాని విచిత్రం ఈ రెండు సంవత్సరాలలో ఆ దెబ్బ తగ్గి వెన్నెముక దానికదే అడ్జస్ట్ అయిపోయింది. ఇంక నేను చెయ్యవలసింది ఒక చిన్న ఆపరేషన్ ఉంది. దానికి ప్రిపేరయి రండి' అని చెప్పారాయన. '99 శాతం తప్పక నా చేతుల్లోనే ఈ కేసు బాగవుతుంది. మీరేమీ వర్రీ కాకండి' అన్నారాయన. ఆ ఒక్క శాతం దేవునిదే భారం మరి. డాక్టరు ఎంతటి ప్రజ్ఞాశాలి అయినా డాక్టరు కూడా మనిషే. విధికి ఎదురీద లేడు, ఎదిరించలేడు. దేవుని ఆశీర్వాదం లేనిదే డాక్టరు కూడా ఏమీ చెయ్యలేడు.

ఆరోజు హరికి ఆపరేషన్. శృతి మొక్కని దేవుడులేడు. తన మొర ఆలకించమని మరీ మరీ వేడుకొంది. హరి ఆపరేషన్ సక్సెస్ చెయ్యమని దేవునికి మౌనంగా విన్నవించుకొంది. హాస్పిటల్కి వెళుతూ ఇల్లంతా ఒకసారి సర్దుతుంటే బెడ్రూమ్లోనున్న ఆ బొమ్మ వెక్కిరించినట్లనిపించింది శృతికి. నా అవసరం నీకు లేదా అంటూ అప్రయత్నంగా పెదవులపై చిరునవ్వు కదలాడింది. 'భగవాన్ ఆమె చిరునవ్వులు సదా అలాగే ఉండేట్లు ఆ బొమ్మ అవసరం జీవితంలో రాకుండా ఉండేటట్లు ఆశీర్వదించు తండ్రి' అనుకొంటూ రేపటి జీవితంపై ఆశతో తమ సోమా జ్యోతిర్గమయ అనుకుంటూ ఇంటిమెట్లు దిగాడు. హరి అదే ఆశతో హాస్పిటల్ మెట్లు ఎక్కాడు.

ఆపరేషన్ థియేటర్ బయట కూర్చున్న శృతి మనసులో ఆలోచనలు పరి పరి విధాల పోతున్నాయి. ఎవరి ఆలోచనలతోనూ సంబంధం లేనట్లు కాలం తిరుగుతూనే ఉంది. గోడ మీద గడియారం కీ ఉన్నంత సేపు తన పని తాను చేసికొని పోతుంది. జీవితంలో మనిషికి ప్రాణం ఉన్నంత వరకు తాపత్రయాలు తపనలు తప్పవు. కాల చక్రంతోపాటు మనిషి జీవిత చక్రం కూడా తిరుగుతూనే ఉంటుంది. శృతి గడియారంవైపు ఆపరేషన్ థియేటర్ తలుపువైపు ఒళ్ళంతా కళ్ళు చేసుకొని ఆతృతగా చూస్తుంది ఆపరేషన్ సక్సెస్ అన్నమాట కోసం.



# ఐర్లాండు విశేషాలు

అందమైన లండన్ మహానగరంలో అడుగు పెట్టానుకాని, ఆ అందాన్ని అనుభవించే స్థితిలో లేదు నా మనస్సు. విమానంలో పిల్లలతో అవస్థ పడడం కూలీలు లేని లండన్ ఎయిర్‌పోర్ట్ నుంచి అతి కష్టంతో బయటపడటం తలుచుకుంటే, నేను క్షేమంగా చేరానో లేదో నాకే అనుమానంగా ఉంది. సంవత్సరం క్రితం మమ్మల్ని వదిలి వచ్చిన శ్రీవారిని చూడగానే బాధ అంతా మరిచి పోయాను. లండను నుండి మరొక ఎయిర్‌పోర్ట్ మారి ఐర్లండు చేరుకున్నాం. మావారికి ఉద్యోగ రీత్యా ఇక్కడికి వచ్చాం.

ఐర్లాండు చాలా చిన్న దేశం. మన దేశంలో ఒక రాష్ట్రమంత ఉండవచ్చు. ముఖ్య పట్టణం డబ్లిన్. దీనికి ఒక ప్రక్క ఐరిష్ సముద్రం, మరొక ప్రక్క అట్లాంటిక్ సముద్రం ఉన్నాయి. వీరికి ఐరిష్ భాష ఉన్నప్పటికీ వీరు మాట్లాడేది ఇంగ్లీషు మాత్రమే.వీరి ఆరాధ్యదైవం మేరీమాత. ఇది రోమన్ కాథలిక్ దేశం. కాబట్టి కుటుంబ నియంత్రణ లేదు. ఇక్కడి ప్రజలలో చాలావరకు విదేశాలలో ఉన్నారు. కాబట్టి జనాభా ఎక్కువనే సమస్య లేదు. ఐరిష్ ప్రజలు స్నేహభావం గలవారు.

నేను ఇక్కడికి వచ్చిన కొత్తలో ఒక సంఘటన జరిగింది. పగలు ఎవరో వచ్చి కాలింగ్ బెల్ కొడితే తలుపు తీసాను. ఎవరో ఒకావిడ పిల్లను ఎత్తుకొని పిల్లకు పాలు లేవు డబ్బులేమైనా కావాలి, రేపు ఇచ్చేస్తాను' - అని అడిగింది. నిజమే అనుకొని, 'ఎంత కావాలి?' అంటే - 'ఒక పౌను' - అంది. (అంటే మన రూపాయలలో ఇప్పటికి 18 రూపాయలు). నా దగ్గర ఉన్న ఒక పౌను ఇచ్చి పంపాను. మరో అరగంటకు మరొకామె, తరువాత వేరొకామె, ఒకరి తర్వాత ఒకరు నా మీదకు దండయాత్ర ప్రారంభించేసరికి గుండెలలో దడ ప్రారంభమైంది. ఈ దేశంలో అడుక్కునే వాళ్ళుండరు అనే నా వూహను తారుమారు చేస్తూ ఇలా చాలా చాలా వచ్చే వారు. తరువాత నేను డబ్బులివ్వడం మానేశాను. వీరిని టింకర్సు అంటారు. ఫలానా ఇంటావిడ డబ్బులిస్తుందని ఒకరికి ద్వారా ఒకరు విని అలా వస్తూంటారు. సాధారణంగా వీరు ఇండియన్స్‌నే అడుగుతారు. ఐరిష్ వాళ్ళను అడగరు. ఈ దేశంలో పేదవాళ్ళు వీరే. వీరికి ఇళ్ళుండవు. ఉద్యోగాలుండవు. వీరికి ఒక పెద్ద కారుంటుంది. అందులో నివసించడానికి అనువుగా అన్ని సదుపాయాలు ఉంటాయి. ఆ కార్లను కేరవాన్స్ అంటారు. వీరికి గవర్నమెంటు వారానికి ఇంత అని డబ్బు ఇస్తుంది. "మీకు ఇళ్ళు కట్టిస్తాము, వచ్చి ఉండండి" - అని గవర్నమెంటు చెప్పినా ఆ కార్‌వాన్స్‌ని వదలరు.

సాధారణంగా పుట్టిన ప్రతి పిల్లకు, ఉద్యోగం లేని వారికి, పెండ్లికాని తల్లులకు, పిల్లలకు గవర్నమెంటు అలవెన్సులు ఇస్తుంది. రిటైర్ అయిన వారికి పెన్షను, ముసలివారికి విశ్రాంతి గృహాలు ఉంటాయి. కాబట్టి వీరికి రేపటి గురించి ఆలోచించ వలసిన అవసరం లేదు. 'దేశంలో సగం మందిని ప్రభుత్వం పెంచుతుంది' - అన్నా తప్పు లేదు.

పిల్లల విషయంలో తల్లిదండ్రుల బాధ్యత తక్కువ. చిన్నతనంలో ఆడపిల్లలకు, మగ పిల్లలకు స్కూల్సు వేరువేరుగా ఉంటాయి. వీటిని నేషనల్ స్కూల్స్ అంటారు. మగ పిల్లల స్కూల్సుని బ్రదర్సు, ఆడ పిల్లల స్కూల్సుని నన్స్ నడుపుతారు. చాలా మంది హైస్కూలు చదువులో ఆపేసి ఏదో చిన్న ఉద్యోగం చూసుకుంటారు. గాల్వే, డబ్లిన్, కార్క్, బెల్ ఫాస్ట్ మొదలైన చోట్ల విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. సాధారణంగా ఉద్యోగం దొరకగానే అబ్బాయిలు, అమ్మాయిలూ కలిసి డేటింగ్స్ మొదలుపెడతారు. తనకు నచ్చిన అబ్బాయి దొరికే వరకూ ఎవరితోనైనా వీకెండ్స్‌కి వెళుతుంటారు. అమ్మాయిలు, అబ్బాయిలు ఒకరికొకరు పరిచయం కలగడానికి డాన్స్‌లకు వెళతారు. ఈ బోయ్‌ఫ్రెండ్స్‌తో తిరగడంతో ఒక్కొక్కసారి అమ్మాయిలు మోసపోయే అవకాశం ఉంది. పెండ్లి కాకుండా తల్లులవుతారు. అలాంటి పిల్లలు వద్దు అనుకున్నవారు ఎవరికైనా దత్తత ఇస్తారు. ఇక్కడ ఫామిలీ ప్లానింగ్ లేదు కాబట్టి, కొందరు రహస్యంగా ఇంగ్లండు వెళ్ళి అబార్షన్ చేయించుకోవడం జరుగుతుంది. పెళ్ళికి ముందు పిల్లలున్నా అది వారికి పెళ్ళికి ఆటంకం కాకపోయినప్పటికి, అమ్మాయిలు చాలా వరకు జాగ్రత్తగా ఉంటారు. పెళ్ళికి ముందు ఎంతమంది బోయ్‌ఫ్రెండ్స్ ఉన్నప్పటికి, పెళ్లయిన తర్వాత సంసారంలో చాలా జాగ్రత్తగా ఉంటారు. ఎందుకంటే వీరికి విడాకుల మీద అంతగా నమ్మకం లేదు.

ఐర్లాండు ఉత్తర భాగంలో కొంత భాగం కోసం ఇంగ్లీషు వారు పోట్లాడుతుంటారు. ఆ కారణంగా అక్కడ ఎప్పుడూ అల్లరులు జరుగుతూ ఉంటాయి. ఇంగ్లీషువారు ప్రొటస్టెంట్‌లు ఐరిష్‌వారు కాతలిక్కులు కాబట్టి ఇవి కొంత వరకూ మత సంబంధమైన పోరాటాలని చెప్పవచ్చు. ఆ భాగంలో బెల్‌ఫాస్ట్ అనే పూరు చెప్పుకోతగింది. మేముండే చోటికి కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న వెస్ట్‌పోర్ట్‌లో సెయింట్ పేట్రిక్ కొండ ఉంది. ఇది చాలా ప్రసద్ధి కెక్కిన యాత్రాస్థలం. జూలై ఆఖరి వారంలో ఇచ్చట పూజలు జరుగుతాయి. మొక్కుబడు లుంటాయి. జోడు లేని కాళ్ళతో కొండ ఎక్కడం అంటే చాలా ఘనత. దీనికి ఒక కథ ఉంది. సెయింట్ పేట్రిక్ ఐర్లాండుకి బానిస లాగ వచ్చాడు. తరువాత భక్తితో, ప్రార్థనలతో సెయింట్ అయ్యాడు. పూర్వ ఆదాము, అవ్వ పాము మాట విని ఏపిల్ తిని, కోరికలు కలిగి కష్టాల పాలైనారనే బైబిలు కథ ప్రకారంగా పేట్రిక్ పాముల మీద కోపంతో వాటిని అట్లాంటిక్ సముద్రంలో వదిలి వేశాడు. అప్పటినుండి ఈ దేశంలో పాములు లేవు. మరే జంతువులు కూడా కనిపించవు.

ఈ దేశం చీజుకి, బీఫ్‌కి ప్రసిద్ధి. వీటిని ఇతర దేశములకు ఎగుమతి చేస్తారు. పాలు గుడ్లు కూడా ఇక్కడ ఎక్కువ.

ఈ దేశానికి 1921లో స్వతంత్రం వచ్చింది. కాని వీరు స్వతంత్ర దినోత్సవం అంటూ ప్రత్యేకంగా ఏమీ చేసుకోరు. వీరి జండా మన జండా రంగులలాగే టుంది. మనది అడ్డంగా ఉంటే వీరిది నిలువుగా ఉంటుంది. కొన్ని ఆచార వ్యవహారములలో ఐర్లాండును మన దేశంతో పోల్చవచ్చును.

అక్టోబరు నుండి మార్చి వరకూ శీతాకాలం. శీతాకాలం అంతా వర్షాలు. ఈదురుగాలి ఉంటాయి. ఆ తరువాత మెల్లగా చలి తగ్గి సూర్యుడు దర్శనమిస్తాడు. జూలై, ఆగస్టు నెలల వేసరి కాలం అప్పుడే పిల్లలు శలవు లుంటాయి. జనవరిలో మోకాలి లోతుమంచుకురిస్తే చూడడానికి తెల్లసముద్రంలా ఎంతో అందంగా ఉంది. మంచుతో మేన్ ని తయారు చెయ్యడం ఇసుకగూడు లాంటివి కట్టడం అంటే వీరికి సరదా. వేసవికాలం రాత్రి పదకొండు గంటల వరకూ వెలుతురుంటుంది మళ్ళీ తెల్లవారు జామున అయిదికి వెలుతురు వస్తుంది. శీతాకాలంలో సాయం కాలం అయిదు గంటలకు చీకటిపడి, ఉదయం ఏడు, ఎనిమిది గంటల వరకూ చీకటి ఉంటుంది. కాబట్టి ప్రతీ సంవత్సరం అక్టోబరులో శీతాకాలం వస్తుందని గడియారంలో ఒక గంట వెనక్కి వేసవి కాలం వస్తుందని మార్చిలో ముందుకి ఇలా సంవత్సరంలో గడియారాన్ని రెండు సార్లు మారుస్తారు.

వీరికి ఎండ అంటే మహా ప్రీతి. జూన్ జూలైలలో వచ్చే ఎండ కోసం ఆనందంతో ఆడ మగా లాన్‌లలో పడుకుంటారు. దీనిని 'సన్ టేనింగ్' అంటారు. ఆ ఎండకు తెల్లటిశరీరం, ఎరుపుకి మారితే చూసుకుని మురిసిపోతారు. వీరి తెలుపు వీరికే ఇష్టం ఉండదు. చలికాలంలో ఇంటిని వేడిగా పెట్టుకోవడానికి చాలా ఖర్చు అవుతుంది. ఇంట అద్దెలు ఎక్కువ. సాధారణంగా ఇంటిలో మంట (ఫైర్) వేసుకుంటారు రోజంతా. ఇందువల్ల ఇల్లు వేడిగా ఉంటుంది. చవక అనికూడ భావిస్తారు. ఈ ఫైర్ వలన తరుచుగా అగ్నిప్రమాదం జరుగుతాయి.

పెద్దా చిన్న, పేదా గొప్ప భేదం లేకుండా అందరినీ పేర్లతో పిలుచుకుంటారు. పేర్లతో పిలిస్తే గౌరవం. పిల్లలు టీచర్నుని, హెడ్‌మాస్టర్నుని కూడ పేర్లతో పిలిస్తే మొదట్లో ఆశ్చర్యం అనిపించేది. ఒకసారి నేను చీర కొనాలని ఒక కొట్టుకి వెళ్ళి వాళ్ళ మాక్సీలకు ఉపయోగించే బట్ట ఆరు గజాలు చీరకు సరిపడా తెచ్చుకున్నాను. ఆ రోజు కొట్లో ఆవిడ నన్ను బాగా పరీక్షించింది. ఆ మరునాడు అదే బట్ట ఆ కొట్లో ఉన్న షొకేస్‌లో బొమ్మకు ఫాంటు, షర్టు తీసివేసి, చక్కగా చీర కట్టడం చూస్తే నవ్వు వచ్చింది. జాకెట్టు మాత్రం వెయ్యలేదు. ఇండియన్స్ అంటే నల్లవారని, పేద దేశం నుండి వచ్చారని, కొంచెం తేలిక భావం ఉన్నప్పటికీ ఐరిష్ ప్రజలు ఇండియన్స్‌తో చాలా సన్నిహితంగానేఉంటారు. ఈ దేశంలో మన దేశస్తులు డాక్టర్లు చాలమంది ఉన్నారు. ఏమైనప్పటికి ఐరిష్ ప్రజలు చాలా మంచివారు.





# ఓ బుర్ర కథ

రోడ్డంతా అస్తవ్యస్తంగా నడుస్తున్న వాహనాలతో పిచ్చివాని మెదడులా వుంది. అంతా గందరగోళం, హడావిడి. ఊపిరి తీసుకోవడానికి టైములేని ఉరుకులు పరుగులు ఉద్యోగం చేసే ఆడదానిలా ఆ రోడ్డు ఎప్పుడూ బిజీగానే వుంటుంది. ఏ రాత్రి పదిగంటలకో, పన్నెండు గంటలకో దానికి విశ్రాంతి. మరలా కోడికూతతోపాటు, కార్ల హారన్‌లు మ్రోగుతాయి. కొందరు తాగుబోతు లారీ డ్రైవర్లు రాత్రుళ్ళు ఇంట్లో భార్యలకు రెస్ట్ ఇచ్చి, ఆ రోడ్డు భరతం పడుతూ ఉంటారు. లారీతో రోడ్డు మీద భరతనాట్యం చేయిస్తుంటారు. ఎవరు ఏంచేసినా, ఎన్ని గోతులు చేసినా, రాళ్ళతో కొట్టినా, తారు పూసినా, రోలర్లతో పచ్చడి చేసినా పల్లెత్తు మాట అనకుండా తరతరాలుగా మన మూఢాచారాలలాగే స్థిరంగా వుంది ఆ రోడ్డు.

ఒకావిడ తన కొడుకుని తీసుకొని ఒక ప్రక్కగా నడుస్తున్నది. ఆవిడ స్లీవ్‌లెస్ బ్లవుజ్, లిప్‌స్టిక్, బాబ్డ్ హెయిర్, హైహీల్స్ షూస్‌తో ఆధునికంగా ఉంది. జడ పెద్దది పెంచుకున్నవారు పాత భావాలకు ప్రతీకలా తలవంచుకునే నడుస్తున్నారు. మరి తలవంచు కున్నది జుట్టు భారంతోనో, అది భారతీయ పద్ధతి అనో అన్నది మాత్రం వారికే తెలియదు. బాబ్డ్ హెయిర్ వాళ్ళు తల ఎత్తి నిటారుగా, ధైర్యంగా నడుస్తున్నారు. వారికి తలవంచు కోవడానికి వెనుక జడభారం, బరువు లేవు. మగవాళ్ళు క్రాఫ్ చేయించుకోవడంలో ఉన్న సత్యం అదే కాబోలు. ఎప్పుడూ తల ఎత్తుకుని, కాలరు ఎత్తుకొని ఆడవారి మీద అహం అనే ధ్వజం ఎత్తుతుంటారు.

ఆవిడ ఆలోచిస్తూ నడుస్తున్నది. ఆ ఆలోచనలతో తన కొడుకుని అంతగా పట్టించుకోవడం లేదు. ఆ అబ్బాయే తనకు మించిన తెలివితేటలతో రాసుకుపోతున్న లారీలను, పక్కగా పోతున్న సైకిళ్ళను, పరుగెడుతున్న కార్లను తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ, తల్లితోపాటు స్పీడుగా నడవలేక అవస్థ పడుతున్నాడు.

అక్కడికీ ఒక ఆటో ఆ అబ్బాయిని గుద్దేయబోయినా ఆవిడ మాత్రం అంతగా ఆ విషయం పట్టించుకోలేదు. ఆవిడకు, తల చెరిగిపోతుందేమో, మేకప్ ఎండకు కరిగిపోతుందేమో అన్న ధ్యాసే ఎక్కువ ఉన్నట్లుంది. వారి వెనుక నడుస్తూ చాలా సేపటినుండి ఆ అబ్బాయి అవస్థలు గమనిస్తున్న ఒకాయన ఇంక ఆగలేక 'ఏమండీ, కాస్త అబ్బాయిని ఆ ప్రక్కన నడవనీయండి. మీరు వాహనాలవైపు నడవండి. ఏదైనా తగిలితే ప్రమాదం కదా! చిన్నవాడు ప్రమాదం జరిగినా తట్టుకోలేడు' అన్నాడు.

ఆవిడ ఆయనవైపు గుర్రుగా చూసింది. నన్ను కన్నతండ్రి, నాకు తాళి కట్టిన భర్తే నన్ను ఏనాడు ఏ విషయం ఎత్తిచూపలేదు, రోడ్డుమీద పోయే ఒక అనామకుడికి ఆ అధికారం ఎక్కడిది అన్నట్లుగా కోపంగా రెప్పలు ఆడించింది. ఆ తరువాత పెదవులు విప్పి అతనిని జాడించింది. 'ఉడ్ యు మైండ్ యువర్ ఓన్ బిజినెస్' అంది చికాకుగా. అంతలోనే అతనిని పరిశీలనగా చూసింది. పాతకాలం వదులు ఫ్యాంటు నలిగి ఉంది.. కాటన్ చొక్కాకు కూడా ఇస్త్రీలేదు. ఆ చొక్కాలో నుండి బనీను చిరుగులు కనబడు తున్నాయి. తలదువ్వు కోవడానికి బద్ధకం అయినందువలనేమో తలమీద ఇంజ్ కటింగ్. పైగా కొంత బట్టతల. తప్పదు, ధరించకపోతే కళ్ళు సరిగా కనబడవు అన్నట్లుగా నయనాలను అలంకరించి ముక్కుని ఆసరాగా చేసుకున్నందువలన పడిపోకుండా కళ్ళకే అంటిపెట్టుకుని ఉన్న కళ్ళద్దాలు.

ఓహ్, ఇతనా నాకు బుద్ధులు చెప్పేది అనుకుంది మనసులో కసిగా ఆమె. బహుశా తను మాట్లాడిన ఇంగ్లీషు అతనికి అర్థం అయి ఉండదు అని భావించింది. అందుకే మరలా తెలుగులో వివరించింది. 'మీ పని మీరు చేసుకోండి. నా సంగతి మీకు అనవసరం' గట్టిగానే చెప్పింది. అతను శ్మశాన వైరాగిలా నవ్వాడు. వాళ్ళను దాటుకుంటూ ముందుకి వెళ్ళిపోయాడు. నాకెందుకు అని అనుకోలేదాయన. ఆవిడకే తెలుస్తుందిలే అని అనుకున్నాడు.

ఆయన ఆంధ్రదేశంలో నున్న ఒకే ఒక్క ప్రఖ్యాత న్యూరోసర్జన్ 'డాక్టర్ మేధావి' అని పాపం ఆవిడకు తెలియదు. ఆవిడకే కాదు ఆ రోడ్డుమీదనున్న చాలా మందికి తెలియదు.

ఓ.పిలో పేషెంట్లను ఓపికగా చూస్తున్నాడు డాక్టర్ మేధావి. ఆయనకు ఆ పేరు పెట్టినవారు నిజంగానే చక్కగా సరిపోయేలా పెట్టారు. లావుపాటావిడకు లత అని,

కోపిష్టి స్త్రీకి శాంతి అని పెట్టినట్లుగా కాక ఆయన తెలివి తేటలను, పెరిగిన తరువాత ఆయన చదివే చదువును దివ్యదృష్టితో చూసినట్లు తక్కెటలో వేసి తూసినట్లుగానే పెట్టారాపేరు.



ఒక్కొక్క పేషెంటుని చూస్తుంటే ఇంతలో "డాక్టరుగారూ" అంటూ ఘొల్లున ఏడుపు వినబడింది. అక్కడవున్న అసిస్టెంట్, స్టాఫ్ నర్స్, వార్డుబోయ్ ఎవరు వారించినా ఆవిడను ఆపలేకపోతున్నారు. గొప్పింటి స్త్రీ, పుత్రభిక్ష పెట్టమంటూ, బాధలను చెప్పుకుంటూ దేవుని సన్నిధిలో భోరుమన్న భక్తునిలా విలపిస్తోంది. అంత ఏడుపులోను డాక్టరుని తేరిపార చూసింది. అంతే ఉలిక్కిపడింది. ఒక్క గంటక్రితం తన వెనుక నడుస్తూ పిల్లవాడు జాగ్రత్త అని హెచ్చరించిన మనిషి. న్యూరో సర్జికల్ ఓ.పిలో ఓపిగ్గా ఎంతోమంది పేషెంట్స్‌ని చూస్తున్నారు. ఆయన్ని చూడగానే పిల్లాడిని తీసికొని ఆయన దృష్టినుండి తప్పించుకొని, పరుగెత్తుకుని పారిపోవాలనే తలంపు కలిగింది ఆవిడలో. కాని పట్టుదలకు, మొహమాటానికి సమయం కాదది. ప్రాణాలు రక్షించుకోవలసిన అవసరం ఎతయినా వుంది. ఆయన మాత్రం ఆ ఏడుస్తున్న స్త్రీని పరీక్షగా గమనించలేదు. తలకు దెబ్బ తగిలి, రక్తం కారుతూ స్పృహలేని స్థితిలోనున్న ఆ పిల్లాడినే దీక్షగా చూసాడు. ఆ తరువాత జరగవలసిన కార్యక్రమం జరిగిపోయింది. ఓ.పిలోని మిగిలిన పేషెంట్లను అసిస్టెంట్ అర్జున్‌కి అప్పగించి ఆయన ఎమర్జెన్సీ థియేటర్ వైపు దారితీసాడు. ఒక్కరూ కాదు. ఆ అబ్బాయితో సహా. ఆయనది ఆ సమయంలో పగిలిన గాజు అతికే ప్రయత్నం. ప్రాణాలను పదిలంగా కాపాడాలనే తాపత్రయం. ఇంక లోకంలో తనూ, ఆ పేషంటూ తప్ప మరేమీ కనబడడం లేదు. తనో దీక్షలోకి వెళ్ళిపోయిన తపస్విలా ఆ థియేటరులోకి ప్రవేశించారు. ఆయన చెవులు సౌండ్‌ప్రూఫ్ అయిపోయాయి. చుట్టూ జరిగే శబ్దాలను కూడా వినడం లేదు. ఆయన కళ్ళు మైక్రోస్కోపుని పరిశీలిస్తున్న చందంగా తయారయ్యాయి. ఆ ఎదురుగా ఉన్నది తప్ప మరేది కనబడటం లేదు.

బయట ఆవిడ వెక్కిళ్ళు, ఏడుపులు డాక్టర్ మేధావి పట్టించుకోనే లేదు. తన

ప్రయత్నంలో తాను పడిపోయాడు. అయిదు గంటల హోరాహోరీ పోరాటం తరువాత ఆయన ఆ థియేటర్ నుండి బయటపడ్డారు. ఆ అయిదు గంటలు అయిదు యుగాలుగా ఆవిడ భావిస్తుంటే, అయిదు నిమిషాలులాగ ఆ డాక్టరుగారు భావించారు. ఆపరేషన్‌లో ఎంత సమయం గడిచినా ఆయనకు ఆయాసం, ఆకలి అనేదే ఉండదు. ఆయన ధ్యేయం ఎప్పుడూ పేషెంటు ప్రాణాలను పట్టితేవడమే. అలా పట్టి తెచ్చి పట్టుతేనెలా వాళ్ళవాళ్ళకు అప్పగిస్తారు. వాళ్ళు పొగిడినా, తెగడినా అవన్నీ గాలికే. ఆ మాటలతో సంబంధం లేకుండానే పనులు పూర్తిచేస్తారు. ఏదైనా కేసు ఫెయిలయితే మాత్రం కరెంటు పోయిన ఫాన్‌లా నిశ్శబ్దంగా బాధపడతారు.

ఆ అబ్బాయి తల్లిమాత్రం కొడుకు కళ్ళు తెరిచేవరకూ కన్నీళ్ళు ఆపలేదు. నోరు తెరిచి అమ్మా అని పలిచే వరకూ దుఃఖంలో 'బాబూ' అన్న పదం ఆపలేదు. తన కొడుకుని ఇంటికి తీసికొని వెళ్ళేలేపల మేధావికి 'సారీ' చెప్పాలని చాలా ప్రయత్నించింది. కాని ఆయన ఆ అవకాశం ఇవ్వలేదు. ఒక వేళ ఆ అవకాశం ఆవిడ కల్పించుకున్నా మేధావి మాత్రం సారీ చెప్పడం కాదు కావలసింది, పిల్లలను జాగ్రత్తగా చూడండి అని ఉండేవాడు.

అప్పుడే ఏదో మీటింగునుండి బయటకు వస్తున్నారు సర్జన్లందరూ. అందరూ గుంపుగా నిలబడి దేనిగురించో సీరియస్‌గా డిస్కస్ చేసుకొంటున్నారు.

వాళ్ళకు దూరంగా నిలబడి వుంది థియేటర్ నర్స్ పరిమళ. పక్కనే వున్న కొత్తగా ఆ ఊరికి ట్రాన్స్‌ఫర్ అయివచ్చిన స్టాఫ్ నర్స్ మేరీతో ఏదో చెబుతూ నవ్వుతోంది.

'ఏయ్, చూడు మేరీ, నీకు ఇంకా వాళ్ళందరూ తెలియదుగా, నేను ఒక్కొక్కళ్ళను పరిచయం చేస్తాను జాగ్రత్తగా గుర్తుపెట్టుకో'

అదిగో సన్నగా, పొడుగ్గా 'సెలైన్ స్టాండ్'లా వున్నారు చూడు ఆయన న్యూరోసర్జన్. కపాల మాంత్రికుడు.

ఆ పక్కన పొట్టిగా కొద్దిగా లావుగా ఆక్సిజన్ సిలెండరులా ఉన్నాయన "గుండెలు తీసిన బంటు" అంటే కార్డియాలజిస్టు.

అటు తిరిగి దొంగలు ధరించేలాంటి గళ్ళ బనీను, కళ్ళద్దాలు వేసుకున్నారు చూడు, ఆయన ఐ స్పెషలిస్టు. ఆయన ముద్దుపేరు 'నయనతార'. అచ్చు ఏంపిసిలిన్ కాప్స్యూల్‌లా వున్నారు కదూ. పైనుండి క్రిందవరకూ ఒకేలా. అంటుంటే మేరీ నవ్వు ఆపుకోలేక పకపకా నవ్వుతోంది. ఇదిగో ఇటు ఆయన్ని చూడు బినాకా ఎడ్వర్‌టైజ్ మెంట్‌లా, ఎవరైనా నోరు తెరిస్తే పళ్ళు రాలగొడతారు. ఆయన డెంటిస్టు. 'దుర్వాస్' అంటే నోటి దుర్వాసన అంతా పోగొడతారు.

అదిగో చేతిలో కాలే సిగరెట్టుతోనున్నారు చూడు ఆయన గరళకంఠుడు. అంటే

ఇ.ఎన్.టి. సర్జనన్నమాట. పూర్వం శివుడు మింగిన గరళం టాన్సిల్స్ రూపంలో కొందరికి కొద్దికొద్దిగా పంచబడిందట. ఈయన ఆ గరళాన్ని తన ఆపరేషన్‌తో తీసిపడేస్తారు. తెల్లగా గోడ సున్నంలా మెరిసిపోతున్నాయన ఆర్థోపెడిక్ సర్జన్. పిండికట్లు కట్టికట్టి తెల్లగా అయిపోయారు. ఆయన పేరు 'వీరపాండ్య కట్టబ్రహ్మన్న'.

తెల్లగా, మృదువుగా ముట్టుకుంటే కందిపోయేలా, మెత్తగా దూదిలా ఉన్నాయన 'కాటన్ దొర'. ఈయన బ్రిడ్జిలేమీ కట్టించలేదుగాని. ఆపరేషన్ చేసేటప్పుడు అప్పుడప్పుడు పొట్టలో కాటన్ మరిచిపోతుంటారు. ఆ రహస్యం మాకే తెలుసు సుమా, మేము థియేటర్ నర్సులము కదా! ఎవరికీ చెప్పకేం. ఆ కాటన్‌దొర జనరల్ సర్జన్.

'అబ్బ, ఊరుకో పరిమళా. నీవు మరీ విపరీతంగా మాట్లాడుతున్నావు' నవ్వు పళ్ళబిగువున అణచుకుంటూ అంది మేరి. ఆమె నోరు మూసుకున్నా కళ్ళు నవ్వేస్తున్నాయి.

అటుచూడు నోటికి చెయ్యి అడ్డంపెట్టుకుని దగ్గుతున్నారు చూడు. ఆయన స్లీపింగ్ పిల్. అంటే ఎనస్తటిస్ట్ అన్నమాట. పేషెంట్లకు ఎనస్తీషియా ఇచ్చి మత్తెక్కిస్తారు. ప్రేయసిలకు మత్తులాంటి మాటలు చెప్పి వలలో వేసికొని ఆ తరువాత వాళ్ళ ఖర్మానికి వాళ్ళను వదిలేస్తారు.

'ఇంకా పెళ్ళికాలేదా?' మేరీ అడిగింది.

'ఊహు. అయినా తండ్రి మాత్రం అయ్యారు. పాపం ఎంతమంది ప్రేయసిలనని పెళ్ళి చేసికోగలరు. అందుకే పెళ్ళి తల్లిదండ్రుల ఇష్టానికి మోసంచేసిన వాళ్ళను ఘోరమైన నష్టానికి వదిలేసారు.

'పరిమళా. అదిగో ఆయన గురించి చెప్పలేదు' మరో డాక్టర్ని చూపిస్తూ అడిగింది మేరి.

ఆగవే, అంత కంగారెందుకు. ఆయన రేడియాలజీ చీఫ్. అచ్చు 'గ్లూకోజ్ బాటిల్'లా పెద్ద శరీరం, చిన్నతలతో ఉన్నారుగా. ఆయన పేరు అస్థిపంజరం.

'ఆస్తిపంజరమా? అస్థిపంజరమా?'

'మొదటిదే కరెక్ట్. డబ్బంటే ఆయనకు ఆరోప్రాణం.

సన్నగా, సిరంజి నీడిల్‌లా మెరిసిపోతున్నారు చూడవే. ఆయన యూరాలజిస్టు. హాస్పిటల్‌లో నున్న సంగతులకు రంగులుపూసి సూపర్నెంటుకి సిరంజిద్వారా ఎక్కించేస్తాడు.

(డాక్టర్లు మన్నించాలి. సరదాకు వ్రాసింది, ఇది)

పరిమళ, మేరీ కామెంట్స్ చేసుకొని నవ్వుతూ మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఆ డాక్టర్లందరూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు. డాక్టర్ మేధావి మాత్రం వారివైపు వచ్చాడు.

'గుడ్ ఆఫ్టర్‌నూన్ సర్' ఇద్దరూ ఒబీడియంట్‌గా, అంతకు ముందు మాట్లాడిన మాటలు అన్నీ తాము కాదన్నట్లుగా, గొంతులో గౌరవం నింపి చెప్పారు.

ఆ మాటను ఆయన పట్టించుకోకుండానే కదలిపోయారు. 'అదేమిటి పరిమళ విష్ చేస్తే తిరిగి రెస్పాన్స్ ఇవ్వరేం. మనం అంటే మరీ అంత చులకనా?' పరిమళను అడిగింది.

'చులకన కాదే మొద్దుమొహం. ఆయనతీరే అంత. ముదిరిన బెండకాయ. ఆయన ఇంట్లో ఒంటరిగా నున్నప్పుడు నీవు ఆయనను ప్రేమించి గుండె తలుపులు తెరుచుకుని జాకెట్ గుండీలు విప్పుకుని వెళ్ళినా కన్నెత్తిచూడడు'

'శ్రీరామచంద్రుడా?'

'ఊహూ. శ్రీరామచంద్రుడు కనీసం కాంచన సీతనైనా భార్యగా తలచాడు. ప్రవరాఖ్యుడైనా ఆడదాని మాయలోపడగలడు గాని, ఆయన మాత్రం, అబ్బే: ఆవ గింజంతయినా పడడు'

'మరి ఆయనతో ఏదైనా మాట్లాడాలి అంటే ఎలాగ?'

'ఒక్కటే ఉపాయం. చెప్పమంటావా?'

'చెప్పవే, త్వరగా!'

'తల బద్దలు కొట్టుకుని వెళ్ళి అది ఆయన చేతిలో పెట్టు' పరిమళ మాటలకు ఫక్కున నవ్వింది మేరీ.

'ఇంట్లో ఆయనొక్కరే ఉంటారా?'

'అబ్బే చాలామంది ఉంటారు. గాలి, ధూళి, పుస్తకాలు, బీరువాలు, గ్లాసులు. కాని ఆయనకు భయపడి ఏవీ శబ్దం చేయవు. నిశ్శబ్దంగానే ఉంటాయి. ఆ ఇంట్లో గాజుల గలగలలు, పువ్వుల కువకువలు, చీరకుచ్చెళ్ళ చిరుశబ్దాలు, కాలిపట్టాల మువ్వల శబ్దాలు ఉండవు. ఇది వరకు ఆయన చెల్లి సంఘమిత్ర, అక్క కూతురు సంయుక్త ఉండేవారు. వాళ్ళిద్దరూ ఎవరితోవన వాళ్ళు రిజిస్టర్ మేరేజ్ చేసికొని వెళ్ళిపోయారు. పాపం ఈయన పెళ్ళిచేస్తారని చూసి, చూసి లాభం లేదు. తనలాగే తమని ముదరపెట్టేస్తాడని భయపడి, పెళ్ళిచేయడానికి పెద్దదిక్కులేక, లంటే, ఆయన తల్లిదండ్రులు, అక్క అందరూ ఏక్సిడెంట్‌లో చనిపోయారులే. రిజిస్టరు బుక్‌లో

సంతకాలు పెట్టేసి దంపతులైపోయారు. విచిత్రం ఏమిటంటే వాళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళు అయిపోయినట్లు, చెల్లెలికి ఒక కూతురుకూడా పుట్టినట్లు ఆయన ఇప్పటికైనా గమనించారో లేదో మరి.

మేరి మరోసారి మధురంగా నవ్వింది. 'ఇవన్నీ నీకెలా తెలుసు పరిమళా. ఆయన డైరీ అంతా చెప్పేస్తున్నావు'

'ఓ, అదా! వాళ్ళ అక్కకూతురు, మా అక్క ఫ్రెండ్స్‌లే. తన మామయ్య గురించి రోజుకో కథ చెప్పేదట. అయోమయం మహర్షి అని, ఆకలి దప్పుల గురించి కూడా పట్టించుకోడని, ఇంట్లో వున్న ఇద్దరి ఆడవాళ్ళలో ఎవరు చెల్లో, ఎవరు మేనకోడలో కూడా గమనించడని ఇలాగే చెప్పేదట. మా అక్క నా చెవిన వేసేది.

'అయితే ఈయనకు జీవితంలో ప్రేమ, పెళ్ళి, ఆడది అన్నవే తెలియవన్న మాట' స్వగతంగా అన్నా పైకే అనేసింది మేరి.

'అబ్బే, అలాకూడా పొరబాటు అభిప్రాయాలు ఏర్పరచుకోకు' ప్రేమను చవిచూసిన మనిషే. ఆయన మద్రాసులో ఎమ్.సి.హెచ్ (సూపర్ స్పెషాలిటి) చేస్తున్నప్పుడు తనతో చదువుతున్న మరో లేడీ డాక్టరును పెళ్ళాడాలనుకొని, ప్రేమించారట. కాని చదువులు అయిన తరువాత, ఉద్యోగాలు దొరికతే జీవితాంతం ఇద్దరూ ఊరిలో ఉండాలని భయంవేసి దాని బదులు పెళ్ళి చేసుకోకుండా ఉండటం మంచిదని తలపోసి ఇద్దరూ విడిపోయారట.

"ఏం, ఆవిడ ఏ ప్రైవేట్ ప్రాక్టీసో చేసుకోవచ్చుగా!"

"ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నది ఆయనొక్కరే న్యూరోసర్జన్. తన భార్యకూడా తనున్న ఊరిలోనే ఉంటే తమ చదువు నిరర్ధకం అవుతుందని అదే ఆవిడ మరో ఊరిలో ఉద్యోగం చేస్తే ఆ చుట్టుప్రక్కల పేషెంట్స్‌కి సహాయం చేయవచ్చని రోగులకోసం ప్రేమను త్యాగం చేసిన త్యాగజీవి ఆమె"

"ఆ. ఆయనకు భార్య విలువ ఇప్పుడు తెలియదులే. కాలో చెయ్యో పడితే అప్పుడు అవసరం వస్తుంది. ఆ సమయంలో కావాలంటే రెడీగా ఎవరూ దొరకరు. ఎవరినైనా మంచి అమ్మాయిని చూసి పెళ్ళి చేసుకోవచ్చుగా!"

"ఇంకానయం. ఆయనకు ఎదురుపడిన వాళ్ళందరినీ నార్మల్ మనుషులుగా కాక ఏ బ్రెయిన్ ట్యూమరో, ఏ బ్రెయిన్ డిసీజో ఉన్నంత సీరియస్‌గా చూస్తారు. ఒకవేళ మనలాంటి వాళ్ళ నమస్కారాలు అందుకున్నా దానికి ప్రతిగా తన్నేస్తాన్, కొట్టేస్తాన్ అన్నట్టు తిరిగి సమాధానం చెబుతాడు. ఎందుకులే ఆయన్ను అలానే ఉండనీ. ఇంకో ఆడ ప్రాణిని బాధపెట్టడం ఎందుకు"

"అసలు ఇంట్లో ఆడప్రాణిలేకే ఆయనకు సతాయింపు తెలియకే బుర్రంతా తుప్పు పట్టేసిందేమోనని నా అనుమానం. బహుశా కదలిక లేకుండా పోయి వుంటుంది" మేరీ అంది.

"అది నిజంకాదు. ఆయన అక్క కూతురు స్వంత కూతురు కాదులే. పెంచుకున్న అమ్మాయి. సంయుక్త ఈయనను మార్చాలని తనను ప్రేమించాలని ప్రయత్నించి ప్రయత్నించి మూర్ఛవచ్చినంత పనయిందటగాని ఈయన హృదయం సూదిమొన మోపినంత కూడా కదలలేదట. మరీ మొండిఘటం" అంది.

"అందమైన మేనకోడలిని ఇంట్లో పెట్టుకుని కూడా చలించలేదంటే బహుశా చేతకాని వాడేమోనే ఆయన" మేరీ అనుమానంగా అంది.

"అవును చేతకానివాడే. ఒకరిని మోసం చేయడం, డబ్బు సంపాదించడం, ప్రాణాలతో చెలగాటమాడటం చేతకానివాడు. అందుకే అలా విరాగిలా మిగిలిపోయాడు.

"ఆ, పెళ్ళిళ్ల చేసుకున్నవాళ్ళందరూ డ్యూటీ సరిగా చేయరని నీ అభిప్రాయం!"

"నాది కాదు ఆ అభిప్రాయం. డాక్టర్ మేధావిది. ఆయన అచ్చు అలాగే అనుకుంటారు. పెళ్ళయిన వాళ్ళకు, పెళ్ళాం, పిల్లలు సంసార తాపత్రయం ఎక్కువని. అవసరాల కోసం డబ్బుకి ఆశిస్తారని, పనిలో ఏకాగ్రత ఉండదని ఆయన అనుకుంటారు. అందుకే ఆయన దగ్గర ఎమ్.సి.హెచ్. చేసిన వారికి డిగ్రీ ఇవ్వడానికి మాత్రం ముప్పుతిప్పలు పెడతారు. ఆయన పనిలో మాత్రం ఏ విధంగానూ చేటిస్ఫై కారు. అందుకే ఆయనంటే చాలామందికి భయం."

"ఆయన దగ్గర ఎంతమంది డిగ్రీ పొందారు ఇప్పటికి" మేరీ అడిగింది పరిమళను.

"ఇప్పటికి ఇద్దరయ్యారు. ప్రస్తుతం డాక్టర్ అర్జున్ మూడవ ఆయన. ఆ ఇద్దరూ ప్రమోషన్ మీద వైజాగ్ ఒకరు, తిరుపతి ఒకరు వెళ్ళిపోయారు. మన రాష్ట్రంలో న్యూరోసర్జన్స్ తక్కువనీ కనీసం ఆంధ్రదేశంలో ఉన్న మెడికల్ కాలేజీల్లో ఒక్కో కాలేజీకి ఒక్కరైనా లేరని. తాను యంత్రంలా తయారయి న్యూరోసర్జన్స్ పెర్ఫెక్ట్‌గా తయారుచేసి ఒక్కో మెడికల్ కాలేజీ ఉన్న ఊరికి ఒక్కోళ్ళను గిఫ్ట్‌గా ఇవ్వాలని ఆయన తాపత్రయం."

"మంచి ఉద్దేశ్యమే. ఎవరి స్వార్థం వారు చూసుకునే ఈ రోజుల్లో అలా ఆలోచించడం చాలా గొప్పే. అయినా ప్రస్తుతం మన రోజులు ఏ విషయంలోనూ బాగాలేవు"

అలా అనకు. ఒక అయిదేళ్ళు గడిస్తే ఈ రోజులే ఎంతో బావున్నట్లు అనిపిస్తాయి. ఇప్పుడు బాగులేని రోజులే ముందు ముందు ఎంతో మంచివి అవుతాయి. ఎందుకంటే రానురాను కాలం మరీ అధ్వాన్నం అవుతుంది కాబట్టి" కాలజ్ఞానం బోధించినట్టుగా చెప్పింది పరిమళ.

"నిజమే సుమా" బోధన అర్థం అయినట్టుగా తల ఆడించింది మేరీ.

"మేధావిగారు అంతా మంచాయనే గానీ అసిస్టెంట్‌లకు ఏదీ రాదు అనే అభిప్రాయం కలిగి వుండి అందరిలోనూ చెడ్డపేరు తెచ్చుకుంటున్నారు"

"నిజమే అలా అయితే ఎలాగ. ఒకానొకప్పుడు ఆయనకూడా అసిస్టెంట్‌గా చేసినవారే కదా!"

"ఆయన అసిస్టెంట్‌గా చేసినప్పుడు ఇంక హాస్పిటల్ పనిలోనే మునిగి తేలిపోయి ఆ సర్జరీ ఒక తపస్సులా భావించి సాధించారుట. అసలు ఈయనకు పరీక్షలు కండక్ట్ చేయడం అనవసరం. డిగ్రీ ఇచ్చేయవచ్చు అని వాళ్ళ చీఫ్ అనుకున్న రోజులు కూడా ఉన్నాయట. అలాగే అందరూ తనలాగే వృత్తికి అంకితం అయిపోవాలని అంటారాయన"

"అందరూ గాంధీలు, గౌతమ బుద్ధులు అయిపొమ్మంటే ఎలా అవుతారు. అలాంటి వాళ్ళు అక్కడక్కడా ఉంటేనే అందం"

"మేధావిగారిలాగా" పరిమళ వాక్యాన్ని పూర్తిచేసింది.

"పరిమళా! నిజంగా చదువు అబ్బడం ఒక అదృష్టమనుకో. మా నాన్నగారు నన్ను డాక్టర్‌ని చేయాలనుకున్నారు. సరిగ్గా చదివేదానిని కాదు. నాన్నగారు అకస్మాత్తుగా పోవడంతో ఇంటికి పెద్దదాన్నయిన నామీద కుటుంబ భారం పడింది. గత్యంతరం లేక ఈ ఉద్యోగంలో చేరాను"

"మేరీ, ఎప్పుడూ అలా బాధపడకు. మనం ఏ పని చేసినా ఆత్మతృప్తితో చేయాలి. ఇది తక్కువ అనే భావం మనలో ఉండకూడదు. ఆఖరికి మేకలను నరికే కసాయివాడు కూడా ఆ పని ఎంతో ఏకాగ్రతతో చేస్తాడు. ఏ పనిచేసినా ఏ ఉద్యోగం చేసినా అది పెద్దదా చిన్నదా అనే భావం రాకూడదు. అందరూ డాక్టర్లయితే నిజానికి వాళ్ళు ఏపనీ సక్రమంగా చేయలేరు. ఆపరేషన్ చేసే డాక్టర్‌ని తీసికో, థియేటర్‌లో ఆపరేషన్ ఇన్‌స్ట్రుమెంట్స్ సక్రమంగా లేని తరువాత ఏదో అందించే నాలాంటి నర్స్ లేకపోతే ఆయన ఎంత చిన్న ఆపరేషన్ అయినా చేయలేరు. అలాగే ఆపరేషన్ అయిన తరువాత డాక్టర్లు చేతులు కడుక్కొని ఇంటికి వెళ్ళిపోతారు. ఆ తరువాత పేషెంట్స్ బాధ్యతంతా నీలాంటి నర్స్‌లదే కదా. డాక్టర్లు ఎప్పుడూ ఉండరుగా. రాత్రనకా, పగలనకా పేషెంట్స్‌ని అన్ని విధాలా చూసి ఆరోగ్యంగా ఇంటికి పంపించేది ఎవరు? మనమే కదా. అందుకే ఎప్పుడూ జీవితంలో ఈ ఉద్యోగం తక్కువ అనే న్యూనతా భావం నీలోరానీకు. నీ జీతంతో నలుగురిని పెంచుతున్నావు. అదే నీకు గర్వకారణం అనుకో" అంది.

"అది కాదు పరిమళ. నేను ఉద్యోగాన్ని కించపరచడంలేదు. ఈ ఉద్యోగంలో వున్న కష్టనష్టాలు నీకు నేను చెప్పడం ముంజేతికి కంకణం చూపించడంలాంటిదే. ఎందుకో నర్స్ అనగానే అదోరకమైన చిన్నచూపు, హాస్పిటల్స్‌లో పేషెంట్స్‌కు కూడా.

ఎందుకు చేయరు అన్నట్లే ప్రవర్తిస్తారు. ఎందుకో మనమంటే అంత చులకన. మనం చేసిన తప్పేమిటి? అందరి ఉద్యోగస్థులలాగే మనమూను. మగవారితో కలసి పని చేసినంత మాత్రాన నైట్‌డ్యూటీలు చేసినంత మాత్రాన మనం మంచివాళ్ళంకాదా?'' మేరీ గొంతులో ఆవేదన అదుపుతప్పి బయటకు వచ్చింది.

"ఆ తప్పు మనదికాదు. అది అలా మనల్ని తక్కువగా ఆలోచించే వాళ్ళ బుర్రలది. నీవెందుకు బాధపడడం. బాధపడడం సహజమనుకో. అయినా ఎవరో ఏదో అన్నవాళ్ళు నీ సంసారాన్ని, నా సంసారాన్ని ఉద్ధరించరు.

విదేశాలలో అయితే నర్స్ చేసేవారిని ఫ్లారెన్స్ నైటింగేల్‌కి ఇచ్చినంత గౌరవం ఇస్తారట. అయినా మన దేశంలో ఏ ఆడదానికి మాత్రం గౌరవమిచ్చారు లెద్దూ. నిప్పులాంటి సీతకే తప్పు అంటగట్టగా లేనిదిమనలాంటివాళ్లం ఒక లెక్కా. ఆడదాన్ని ఎప్పుడూ ఒకే దృష్టిలో చూడడం, మగవారికి తరతరాలుగా నరనరాల్లోనూ నిండిపోయింది. నీవు అనవసరంగా అటువంటి ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు' పరిమళ అంది.

"నిజమే. నీవు విడమరిచి చెప్పేవరకు నేను అంత నిదానంగా ఆలోచించలేదు. ఇకపై దేనికీ బాధపడనులే'' అంది మేరీ.

అంతలో అటువైపుగా హెడ్‌నర్స్ రావడంతో ఇద్దరూ రాయిపడ్డ పక్షుల్లా విడిపోయారు.

మధ్యాహ్నం మూడుగంటల సమయం. అప్పుడే ఆపరేషన్ ముగించుకుని బయటకు వచ్చాడు  డాక్టర్ మేధావి. ప్రొద్దుట హాస్పిటల్‌కు వెళ్ళేటప్పుడు లేలేత కిరణాలతో శరీరాన్ని ఆప్యాయంగా తాకే సూర్యుడు మధ్యాహ్నం ఇంటికి వచ్చే వేళకు మండిపడుతూ అందరిమీదా అకారణ కోపం చూపిస్తుంటాడు. సూర్యునికి ఎదురుపడని వారు  ధన్యులు. ఎండను పడ్డారో మసి చేసేస్తాన్ సుమా అన్నట్లు అందరివైపూ చూస్తాడు. ఉదయంపూట నవ యవ్వనంతో మిసమిసలాడే భానుకిరణాలు. మధ్యాహ్నానికి మధ్య వయస్కురాలై సాయంకాలానికి ముసలి వగ్గయి పోతాయి. అయిదయ్యే సమయానికి పనిచేసి అలసిపోయి ఓపిక తగ్గినీరసించిపోతాయి.

డాక్టర్ మేధావి బయటకు వచ్చి స్కూటర్ తీసుకుని హోటల్‌కి వెళ్లేసరికి మూడున్నర దాటిపోయింది. హోటల్లో భోజనం అయిపోయింది. ఏ హోటలుకి వెళ్ళినా సాధారణంగా అదే పరిస్థితి. ఇంక మరో హోటల్‌కి వెళ్ళే ఓపికలేక స్కూటర్‌ని ఇంటివైపు నడిపించాడు. ఇంటికి వచ్చి తాళం తీయడానికి జేబులో చేయి పెడితే తాళాలు దొరకలేదు. ప్రొద్దున్న థియేటర్ దగ్గర బట్టలు మార్చుకుని థియేటర్ డ్రస్ గ్రీన్‌ది వేసుకున్నప్పుడు తాళాలు నర్స్‌కి ఇవ్వడం గుర్తుకు వచ్చింది. ఉసూరుమంటూ మరలా హాస్పిటల్‌కు వెళ్ళి తాళాలు తెచ్చుకుని ఇంట్లో ఏమైనా ఉన్నాయా అని చూసేసరికి ఎండిన బ్రెడ్ ముక్కలు

దర్శనమిచ్చాయి. అవి కొరకడానికి కాదుకదా సుత్తితో కొట్టడానికి కూడా పని చెయ్యవు. ఫ్రిజ్ తెరచి పాలుతీసి వేడి చేసుకుని వేడి వేడి పాలలో అవి నానబెట్టుకుని తిని తాత్కాలికంగా కొంత ఆకలిని తీర్చుకున్నాడు. సంయుక్త; సంఘమిత్ర ఇంట్లో వున్నప్పుడు ఏది ఎలా ఉన్నా ఎప్పటికప్పుడు టేబుల్‌మీద వేడివేడి పదార్థాలు సిద్ధంగా వుండేవి. ఆకలికి బాధపడే అవసరం వుండేదికాదు. వాళ్ళు వెళ్ళి పోయిన తరువాత అంతా ఉంటే తినడం, లేదంటే పస్తులు అన్న స్థితికి వచ్చేసాడాయన.

కొంచెం ఓపిక వచ్చిన తరువాత చికాకుగా వుండి స్నానానికి వెళ్లాడు. ఆపరేషన్ చేసేటప్పుడు బ్రెయిన్ సర్జరీ కోసం హెడ్ ఓపెన్ చేసినప్పుడు పేషెంట్ రక్తం, ఫౌంటెన్‌లాగ జివ్వున పొంగి బట్టలు తడిపేయడం సాధారణంగా జరిగేదే. రక్తంతో తడిసిన థియేటర్ డ్రస్ అక్కడే వదిలేసినా డ్రాయర్‌కి అంటుకున్న రక్తం కొద్దిగా పాంట్‌కు అంటుకుంది. కాళ్ళంతా రక్తం మరకలు. ఎవరినో హత్యచేసి వచ్చినట్లుగా తన రూపం తనకే అద్దంలో కనబడడం ఆయనకు కొత్తేమీకాదు. ఎదుటి మనిషి రక్తంతో ఆ ఒళ్ళు తడిపేసే కొద్దీ పేషెంట్ల విషయంలో అనుభవం పెరుగుతుంటుంది. ఒక్కొక్క రక్తపు మరక ఒక్కో పేషెంట్‌కి ప్రాణదానం చేస్తుంది. అలా అని అన్ని కేసులూ సక్సెస్‌కావు. సాధారణంగా డాక్టర్ మేధావి చేతిలో పడినవి మాత్రం ఎప్పుడోగాని ఓడిపోవు.

స్నానం చేసివచ్చి ఇలా కూర్చున్నాడో లేదో ప్రక్క వీధిలోని అబ్బాయి పరుగెత్తుకువచ్చి "అంకుల్! మా తాతయ్య నోటి మాట రాకుండా పడిపోయాడు. ఇంట్లో పెద్దవాళ్ళెవరూ లేరు. మీరు డాక్టర్ కదా అని మీ దగ్గరికి వచ్చాను" అని చెప్పాడు. వెంటనే చెప్పులు వేసుకుని బయలుదేరాడు మేధావి. అది పెరాల్సిస్ కేస్ అని ఆ అబ్బాయి మాటలను బట్టి గ్రహించాడు.

'అంకుల్ ఇంటికి తాళం వేయలేదు' అని గుర్తుచేస్తే గాని ఇంటికి తాళం వేయలేదు. మిగిలిన విషయాలలో మతిమరుపులా వుండే ఈ బుర్ర మెదడు విషయంలో మెరుపుతీగే ! అక్కడ మతిమరుపుకీ పోస్టుపోన్‌మెంట్‌కీ తావేలేదు. అక్కడికి వెళ్లి పరిస్థితి చూడగానే అర్థమయ్యింది అది పక్షవాతమే. మెదడుకి సంబంధించిన జబ్బే. వెంటనే ప్రక్కవారి సాయంతో ఆటో పిలిపించి ఆటోలో హాస్పిటల్‌కి చేర్పించాడు. ఈ జబ్బుకి ఏ డాక్టర్‌ని చూడాలండీ అని ప్రక్కాయన అడిగిన ప్రశ్నకి "ఏ డాక్టర్‌నీ అవసరం లేదు. ఇది బ్రెయిన్‌కి సంబంధించినది. బ్రెయిన్‌ద్వారా మన శరీరానికి కావలసిన అన్ని స్పర్శలూ అనుభూతులూ తెలుస్తాయి. ఏ ప్రక్క అయినా బ్రెయిన్‌కి సంబంధించినది. బ్రెయిన్‌ద్వారా మన శరీరానికి కావలసిన అన్ని స్పర్శలూ అనుభూతులూ తెలుస్తాయి. ఏ ప్రక్క అయినా బ్రెయిన్ దెబ్బతింటే ఆ ప్రక్క ఇలా పక్షవాతం వస్తుంది. మీరు రోగం రాగానే ఎవరి దగ్గరికి వెళ్లాలో తెలియక ముదరబెట్టుకుని చివరికి అసలైన డాక్టర్‌గారి దగ్గరకు వస్తారు. చివరలో వస్తే మేం మాత్రం ఏం చేయగలం?" అన్నాడు.

మేధావిని బ్రెయిన్‌కి సంబంధించి ఏ విషయం అడిగినా విసుక్కోకుండా కావలసిన దానికంటే ఎక్కువ విషయాలు ఎదుటివారికి చెప్పడం అలవాటు. ఆయన 'వస' ఎక్కువై కాదు అలా చెప్పటం, అందరికీ కొద్దో గొప్పో ఇలాంటి విషయాలు తెలిస్తే జబ్బు ముదరబెట్టుకోరని. అదే ఏ పేషంటైనా ఈ మాత్రలు ఎన్నిసార్లు వేసుకోవాలి? అని రెండోసారి అడిగితే ఎక్కడలేని కోపం వచ్చేస్తుంది. అందుకే పేషెంట్లు ఆయనంటే భయపడ్తారు.

ఆయనను హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేసి ట్రీట్‌మెంట్ గురించి అసిస్టెంట్‌కి చెప్పి ఇంటికి తిరిగి వచ్చేసరికి ఆరయింది. కొంచెంసేపు మెడికల్ జర్నల్స్ తీసుకొని తిరగేశాడు.

కొంచెంసేపు చదివి ఆ తరువాత హోటల్‌కి వెళ్ళచ్చు అనుకున్న మేధావికి ఆ పుస్తకాలలో నుండి బయటపడి టైమ్ చూసేసరికి తొమ్మిదిన్నర అయింది. ఆ కొంచెం సేపు సమయం మూడున్నర గంటలు. ఆయన పుస్తకాలముందు కూర్చుంటే కాలమే తెలియదు. పేషెంట్ల ముందు కూర్చుంటే ఆకలే తెలియదు. ఆపరేషన్‌లోకి ప్రవేశిస్తే అలసట అన్నదే తెలియదు.

గబగబా హోటలుకి వెళ్ళి అన్నం తిని వచ్చాడు. అదీ ఆకలి తీర్చుకోవడం కోసమే. బ్రతకడం కోసం తినాలా? తినడం కోసం బ్రతకాలా అంటే ఆయన మాత్రం బ్రతకడం కోసమే తింటాడు. నలభైయవ వడిలో పడకుండానే ఏభయి నిండిన వాని నిండుతనం, అరవై నిండిన వాని లోకజ్ఞానం, తెలివితేటలు ఆయనకున్నాయి. ఏ విషయం అయినా నీకు క్షుణ్ణంగా తెలిస్తే దానిని ఇతరులకు తెలియజేయు అన్నదానిని ఫాలో అవుతాడు మేధావి.

ఆ మర్నాడు ఓ పీ లో కూర్చొని పేషెంట్లను చూస్తున్నారు ఏకాగ్రతతో. జలుబా, రొంపా అంటూ లక్షణాలు అడక్కుండానే అనాల్జిన్ రాసిచ్చేలాంటి కేసులు కావవి. పేషెంట్లను నిశితంగా చాలా సేపు పరిశీలించాలి. రోగ నిర్ధారణ చేయడం కూడా అంత సులువు కాదు. నరాల జబ్బుల వాళ్ళు, తల నొప్పి, నడుం నొప్పి, ఫిట్స్, బ్రెయిన్ పేషెంటుకి ఎంత త్వరగా చూసినా పావు గంటపైగానే, దాదాపు అరగంటవరకూ పడుతుంది సమయం. డాక్టర్లు తక్కువ, పేషెంట్లు ఎక్కువ ఉన్న మనదేశంలో డాక్టర్లు ఎంత కష్టపడినా చాలావరకూ పేషెంట్లు నష్టపోతూనే ఉంటారు.

వరుసగా పేషెంట్లను చూస్తున్న డాక్టర్ మేధావి ఎదురుగా నున్న పేషెంటుని చూసి ఉలిక్కిపడ్డాడు. ఉలికిపాటును అలాగే కప్పి పుచ్చుకుని అందరి పేషెంట్లను చూసినట్లే ఆమెను చూసాడు. ప్రశ్నలు వేయడం మొదలు పెట్టాడు.

"మీకు వివాహం అయిందా?"

"అయిందండి."

"ఎంతకాలం అయింది?"

"సంవత్సరంన్నర"

"ఫిట్స్ ఎంతకాలంనుండి వస్తున్నాయి?"

"దాదాపు సంవత్సరం నుండి"

"మీ కుటుంబంలో ఎవరికైనా ఉన్నాయా?"

"లేవు"

"ఐసీ. మీ భర్తతో, ఉ. అదే మీ సంసార జీవితం సక్రమంగా ఉందా లేక ఏవైనా గొడవలతో..."

ఆమె సమాధానం చెప్పలేక తలవంచుకుంది.

"డాక్టరు దగ్గర, లాయరు దగ్గర నిజాలు దాచకూడదు"

"ఆమె చెప్పడానికి సంశయిస్తున్నట్లు అటు ఇటూ చూసింది. దగ్గరలో ఆమె మాటలు ఎవరికీ వినబడవు అనుకున్న తరువాత మెల్లగా చెప్పింది. సిగ్గు విడిచి అంది. 'నా భర్త నపుంసకుడు.' ఒక్కసారి ఉలిక్కిపడి 'అయితే విడాకులు తీసుకోవచ్చుగా'

"తీసుకొని ఆరు నెలలయింది"

"ప్రస్తుతం ఒంటరిగానే ఉంటున్నారా?"

"అవును. కాని చుట్టు ప్రక్కల వాళ్ళు నన్ను హేళనగా చూస్తుంటే రాను రాను మనస్తాపం ఎక్కువై అస్తవ్యస్తమై పోయిన నా బ్రతుకును తలంచుకొని రోజూ కుమిలి పోతున్నాను"

"నీకు ఫిట్స్ రావడానికి కారణం కూడా అదే అయి ఉండవచ్చు. మందులు వ్రాస్తాను. జాగ్రత్తగా వాడాలి. ఇవి ఒక్క రోజులో, ఒక్క నెలలో, ఒక సంవత్సరంలో అయిపోవు. దాదాపు అయిదు సంవత్సరాలన్నా వాడితేగాని పూర్తిగా నయం కాదు. ముందు రోజుకి మూడు టాబ్లెట్లు సంవత్సరం తరువాత రెండు టాబ్లెట్స్ రెండు సంవత్సరాలపాటు రానురాను రోజుకి ఒక్కటి చొప్పున వాడితే నయం అవుతుంది. మధ్యలో జబ్బు తగ్గిందని మాత్రలు మానేస్తే మరలా కేసు మొదటికి వస్తుంది.

"అలాగే" తల వంచుకొని అంది ఆమె.

డాక్టర్ మేధావి ప్రిస్క్రిప్షన్ పేడ్ తీసుకొని సీరియస్‌గా మందులు రాస్తుంటే డాక్టర్ మొహంలోకి చూస్తూ కూర్చుంది ఆమె. డాక్టరు మాత్రం అదేమీ గమనించలేదు. మనసులో కలిగిన ఉలికిపాటు కూడా తాత్కాలికమే. ఆ హాస్పిటల్‌లో తను డాక్టర్, ఆమె రోగి. ఆమె పేరు సంయుక్త, డాక్టర్ మేనకోడలు.

పేషెంట్లందరూ వెళ్ళిపోయిన తరువాత వార్డులోకి వచ్చాడు మేధావి. అసిస్టెంట్ అర్జున్ భయం భయంగా ఆయన్ని అనుసరించాడు. దాదాపు మూడు సంవత్సరాల నుండి పని చేస్తున్నా, మాడు పగిలేలా చివాట్లు తినడం మానలేదు. చీఫ్ అంటే భయం. ఆ భయంలో మరిన్ని పొరపాటు పనులు చేస్తుంటాడు. ప్రతీదానికి వంకలు పెట్టి చివాట్లు పెట్టడం మేధావికి అలవాటు. వంకలు అంటే వంకలూ కాదు. ఏ పనిలో ఏ చిన్న పొరపాటు జరిగినా సరిపెట్టుకోలేని మనస్తత్వం, మేధావిది.

ఆఖరుకి ఆపరేషన్ అయిన పేషెంటుకి బేండేజ్ సరిగా కట్టలేదని ఇలా అయితే చదువు, డిగ్రీలు ఎలా వస్తాయని అర్జున్ మీద కేకలు వేసాడాయన. అలాంటివి అలవాటు పడినా, ఎప్పటికప్పుడు ఆ బాధ కొత్తే అర్జున్‌కి. పైగా అందరి ముందు తనలో పెద్ద తప్పు లేకపోయినా కసరడం తల కొట్టేసినట్లు అనిపిస్తుంది. అయినా ఆయన గురువు. తను విద్యార్థి. ఓర్చుకోక తప్పదు. కష్టే ఫలి - అనుకోక తప్పదు.

ఇంక పని అయిపోయింది ఇంటికి వెళ్ళిపోదాం అనుకునేసరికి కాజువాలిటీ నుండి ఎమర్జన్సీ ఉందని ఫోన్ వచ్చింది. గబగబా అక్కడకు వెళ్ళితే అది హెడ్ ఇంజరీ. వెంటనే ఆపరేషన్ చేయాలి. టైమెంత అని కూడా గమనించుకోకుండా ఆపరేషన్‌కి ఏర్పాట్లు చేయించాడు మేధావి. మేధావితోపాటు అర్జున్ కూడా ఉండిపోక తప్పలేదు. ధాన్యంతోపాటు తట్ట కూడా ఎండవలసి వచ్చినట్లు మేధావితోపాటు, అతని అసిస్టెంట్ అయినందుకు అర్జున్ కూడా ఆకలి చంపుకొని థియేటర్‌లోకి ప్రవేశించాడు. అక్కడ ఆపరేషన్ దగ్గర ఉన్నాడన్న మాటేగాని ఇంటి దగ్గర జ్వరంతో 'డాడీ ఈ రోజు హాస్పిటల్ నుండి త్వరగా రండి' అన్న కొడుకు మాటలు చెవుల్లో మారుమ్రోగుతున్నాయి. సాయంకాలం అయిదు అయినా సరే భార్య, తను వెళ్ళే వరకూ అన్నం తినదని తెలుసు. సారీ మహితా ! ఈ ఆపరేషన్ అయినా అనే లింకు ఎక్స్‌ప్రెస్‌లో చిక్కుకున్న బోగీలం మనం. ఇంజనుతోపాటు మనమూను. మనకు స్వతంత్రంగా నడవడానికి శక్తి లేదు. రూల్స్ ఒప్పుకోవు అనుకున్నాడు. మనసు ఇంటి దగ్గర, మనిషి ఆపరేషన్ దగ్గర. ఆ పేషెంటుని, ఆపరేషన్ చేసేవిధానాన్ని చూపించి ఏవేవో ఎక్స్‌ప్లయిన్ చేస్తున్నాడు మేధావి అర్జున్‌కి. అప్రయత్నంగా ఆ, ఉ అంటున్నా చెవుల్లో మాత్రం కొడుకు ఆ, ఉ అంటూ జ్వరంతో చేసే మూలుగులే వినబడుతున్నాయి. కొడుక్కి కావలసింది అక్కడ మెడిసన్ కాదు, తండ్రి రాక. పెళ్ళి, పిల్లలు లేని ఆ డాక్టర్ విషయం చెప్పినా అర్థం చేసుకోడని తెలుసు. చెప్పడం చెవిటివానికి సంగీతం వినిపించడం లాంటిదే అని ఎప్పుడో గ్రహించాడు.

"అయినా ఏమైనా చెప్పబోతే అస్తమానం పెళ్ళాం, పిల్లలు, సంసారం అనుకునే వాళ్ళు ఇలాంటి చదువులు చదవకూడదోయ్. హాయిగా ఎమ్‌బిబిఎస్ చదివేసి, పల్లెటూళ్ళకు వెళ్ళిపోయి రొంపా, జ్వరాలకు మందులిచ్చుకుంటూ ఉండాలిగాని, మెదడు ఆపరేషన్ చేస్తాను అంటూ తయారవ్వకూడదు'' అని అంటాడని తెలుసు.

అందుకే నోరు మూసికొని ఆయన చెప్పింది వింటున్నట్లు నటిస్తున్నాడు.

ఆపరేషన్ అయిన తరువాతయినా తనని వదులుతాడనుకుంటే అదీ లేదు. మన దేశంలో ఈ బ్రెయిన్ స్కానింగ్ ఈ మధ్యే (అంటే 1978లో ఢిల్లీలో) వచ్చిందిగానీ, విదేశాలలో ఇరవై సంవత్సరాల క్రితమే వచ్చింది. మన ఆంధ్రదేశానికి ఎప్పుడు వస్తుందోగాని, అప్పటివరకు డాక్టర్లకు తిప్పలు తప్పవు.

అసలు ఇండియాలోనే ఈ కేట్ స్కేన్ విచిత్రంగా వచ్చింది. నార్త్‌లో ఒక ధనవంతునికి మెదడు వ్యాధి వస్తే 1975లో ఢిల్లీలో డాక్టర్లు, మెదడు స్కాన్ గురించి అమెరికాగాని, ఇంగ్లాండ్‌గాని తీసికెళ్ళమన్నారట. అప్పుడు శ్రీరాజ్ గుప్తా అమెరికా వెళ్ళడం ఆ స్కాన్‌ను గమనించడం, అది భారతదేశానికి తీసికొని రావడం జరిగింది.

దీని వలన రోగ నిర్ధారణ ఎంతో సులువు. అంతేకాదు. పేషెంటుకి, డాక్టరుకి కూడా సమయం కలిసి రావడం, రోగ నిర్ధారణ చేయడానికి చేసే టెస్టులలో ఒక్కోసారి పేషెంటు మరణించడం, ప్రమాదంలో చిక్కుకోవడం లాంటి నుండి రక్షించడం జరుగుతుంది.

ఢిల్లీలో (1978లో) స్కాన్‌ను ప్రవేశపెట్టారుగాని మన రాష్ట్రానికి రావడానికి మరో రెండు మూడు సంవత్సరాలన్నా పడుతుంది. మన దేశంలో చాలా మంది గొప్ప వాళ్ళు డబ్బు ఎలా దాచుకోవాలి, ఎక్కడ దాచుకోవాలి అని ఆలోచిస్తారుగాని ఇలాంటి మంచి పరికరాలు, ప్రజలకు ఉపయోగపడేవి స్థాపించాలని అనుకోరు" డాక్టర్ మేధావి అనర్గళంగా మాట్లాడేస్తుంటే అసలే ఆకలిమీద ఉన్నాడేమో అర్జున్‌కి అరికాలి మంట నెత్తికెక్కింది. మరోసారి మరోసారి అయితే అలాంటి విజ్ఞానదాయకమైన విషయాలు మరీ మరీ అడిగి తెలుసుకునేవాడు. కానిప్పుడు మాత్రం ఆయన తల పగలగొట్టి ఆయన చేతిలో పెట్టాలి అనే తలంపు కలుగుతుంది. కోపంతో కలిగిన ఆ తలంపు శాపంలాగే మారుతుందని పాపం అర్జున్‌కి తెలియదు.

చీకటికాంత వెలుగుకి సుప్రభాతం పలికింది. బద్ధకంగా నిద్రపోతున్న వెలుగు ఒళ్ళు విరుచుకొని లేచి, తనను పాటలతో నిద్రలేపిన చీకటి వైపు కోపంగా చూసి ఆమెను మెల్లగా తరిమికొట్టింది. బంగారు రంగులో మెల్లమెల్లగా తెల్లవారడం మొదలు పెట్టింది రాను రాను "చింతపండుకి తెల్లబారుతున్న ఇత్తడిలా" వెలుగు ప్రకాశించసాగింది. పొంచి ఉన్న దొంగలా సూర్యుడు తనని ఎవరూ చడడంలేదు కదా అన్న మీమాంసతో ఆకాశంమీద నుండి నక్కి చూస్తున్నాడు. మేఘాలు సూర్యుణ్ణి ముందుకి తోస్తున్నాయి. సూర్యుడు కాలాన్ని వెనక్కి తన్నుతూ తాను పైకి చేరాడు.

మత్తు వదలరా, నిద్దర మత్తు వదలరా అని నిశ్శబ్దంగా పాడుతూ ఒక్కొక్కరినీ

నిద్ర లేపుతూ డ్యూటీలో జాయిన్ అయ్యాడు సూర్యుడు. సూర్యకిరణాలు మొహంమీద పడితేగాని మెలకువ రాలేదు మేధావికి. ఉలిక్కిపడి లేచాడు. లేవగానే ముందు గుర్తుకువచ్చిన సంగతి రాత్రి అంతా కష్టపడి తెల్లవారు జామున అయిదు గంటల వరకూ ఆపరేషన్ చేసిన పేషెంటు విషయం. వెంటనే హాస్పిటల్‌కు ఫోన్ చేసి, పేషెంటు ఎలాగున్నది అడిగి తెలిసికుంటేనే గాని, ఆయన ఆరాటం తీరలేదు. ఆ తరువాత మిగిలిన కార్యక్రమాలు ముగించుకొని, ఇంటికి తాళం వేసి మరలా బయలుదేరాడు హాస్పిటల్‌కు. దారిలో హోటల్ దగ్గర ఆగి ఆత్మారాముణ్ణి చల్లబరచి హాస్పిటల్‌కు చేరుకున్నాడు. 'ఈయనకు అప్పుడే తెల్లారిపోయిందా' డ్యూటీ నర్స్‌లిద్దరూ మెల్లిగా కామెంట్ చేసుకున్నారు ఆయనకు వినబడకుండా. అర్జున్ కూడా చీఫ్ గురించి పెందలాడే రాక తప్పడంలేదు.

"ఆ పెళ్ళామా? పిల్లలా? నిద్రకు ఆటంకం ఉండదు. ఇక్కడ పనికీ వేళా పాళా ఉండదు." మరో నర్స్ కామెంట్. పేషెంట్స్‌ని చూస్తున్న మేధావికి సడన్‌గా తల తిరిగినట్లయింది. రాత్రి అంతా మేల్కొని ఉన్నందువల్లనే అనుకొని ఊరుకున్నాడు. మెల్లగా తలనొప్పి మొదలైంది. ముందు అంతగా పట్టించుకోలేదుగాని తల నొప్పి ఎక్కువ కావడంతో స్టాఫ్ నర్సునడిగి ఏస్పిరిన్ వేసుకున్నాడు. అరగంట తరువాత తల నొప్పి సర్దుకుంది. హాస్పిటల్ నుండి మధ్యాహ్నం ఇంటికి వచ్చి పడుకున్నా తల తిరగడం మానలేదు. అకస్మాత్తుగా వాంతి అయిపోయింది. హోటల్ భోజనం అప్పుడప్పుడు సరిగా ఉండకపోవడం అలవాటే గాని ఇలా వాంతులు ఎప్పుడూ జరగలేదు. జరగకూడనిదేదో జరుగుతున్న భావన ఆయనలో మెల్లగా మొదలైంది. మరికొంత సేపటికి తలపై ఏదో తిరుగుతున్న భావన కలిగి ఏదో పురుగు అనుకొని దాని దోలసాగాడు. కాని పురుగూ కాదు, ఏమీ కాదు. ఆ తిరుగుతున్నది కూడా తలపై కాదు, తలలో అని తెలియడానికి ఏంతో సేపు పట్టలేదు. అకస్మాత్తుగా తనలో తానే ఉలిక్కిపడ్డాడు. ఏదో తెలియని భయం ఆయనలో ఆవహించింది. తాత్కాలికంగా ఏదో టాబ్లెట్ వాడి ఉపశమనం పొందినా మరునాటికి కూడా మరలా అవే సింప్టమ్స్ కనబడేసరికి ఆయనలో కంగారు ఎక్కువైంది. ఏమీ చేయడానికి పాలుపోలేదు.

మొండి ధైర్యంతో అలాగే హాస్పిటల్‌కు వెళుతున్నాడు. ఆ రోజు ఏక్సిడెంట్‌లో చాలా హెడ్ ఇంజరీలువచ్చాయి. మరోసారి, మరోసారి అయితే అసలు ఆ పేషెంట్లను ఎవరికీ అప్పజెప్పకపోయేవాడు. కాని అస్తమాను వాంతులు వస్తునట్లుగా అనిపించి ఒక ఇంపార్టెంట్ కేసును అర్జున్‌కి అప్పజెప్పాడు. అన్ని ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చిన తరువాత పాపం అర్జున్ ఎంత జాగ్రత్తగా చేసినప్పటికి పేషెంటు టేబుల్‌మీద చనిపోయేటప్పటికి మేధావి పరిస్థితి నిప్పులు తొక్కిన కోతిలా తయారయింది.

అర్జున్ కూడా ఎమ్ఎస్ పాసై, ఎమ్‌పిహెచ్ (మాస్టర్ డిగ్రీ సూపర్ స్పెషాలిటీ) చేస్తున్నాడన్న సంగతి వదిలేసి మరీ తాను యజమానిలాగా అర్జున్ తనని క్రింద పని చేసేవాడన్నట్లు అందరిలోనూ చెడామడా తిట్టేసాడు. నీవే ఆ ప్రాణాలు తీసేవు అంటూ కోపంతో ఊగిపోయేసరికి అర్జున్‌కి మతిపోయింది. తన చీఫ్ కోపం తెలియనిది కాదు. అయినప్పటికీ డాక్టరు పట్టిన ప్రతీ కేసు సక్సెస్ అయిపోతే ఇంకేమిటి? నిజంగానే ఆ పేషెంటు చాలా క్రిటికల్ కండిషన్లో ఉన్నాడు. అది గమనించకుండా తిట్టేయడమేనా అని ఎంతో చిన్నబుచ్చుకున్నాడు అర్జున్.

అర్జున్ పరిస్థితి గమనించకుండా 'మరో నెలలో నీ పరీక్షలు జరుగుతాయి. సర్జరీ ఇలాగే చేసావంటే ఎక్స్‌టర్నల్స్ ఏమనుకుంటారు. ఆ అప్రతిష్ట నీకు కాదు నాకు' అంటూ చిందులు వేస్తుంటే ఆ నిమిషంలో అర్జున్‌కి ఆ పేషెంటు బదులు నేను చనిపోయినా బావుండును అన్నంత ఆవేశం వచ్చింది. మీ దగ్గర నాకు చదువూ వద్దు డిగ్రీ వద్దు అని ఆయనకొక నమస్కారం పెట్టి పరుగు పెట్టాలనిపించింది. అంతలోనే తనకు తానే తమాయించుకున్నాడు. తన తండ్రి కోప్పడినట్లు, తన గురువు చీవాట్లు వేసినట్లు, తన మంచికే అన్నట్లు భావించుకొని మనసు జోకొట్టుకొని యధావిధిగా అయిపోయాడు అర్జున్. నిజానికి అర్జున్ గురువును మించిన శిష్యుణ్ణి కావాలి అనే పట్టుదలతో ఉన్నాడు. ఎందుకంటే తనకిష్టమైన సబ్జెక్ట్ బ్రెయిన్ సర్జరీ. పైగా త్వరలో ప్రమోషన్స్ వచ్చే అవకాశాలు ఉన్నాయి. తన ఫ్రెండ్స్‌కి కొందరికి ప్రమోషన్స్ వచ్చేసి వాళ్ళకు ఎంత సీనియర్స్ అసిస్టెంట్స్‌గా రావడం అర్జున్ ఎరుగనిది కాదు. అంతేకాదు అసిస్టెంట్స్‌ని న్యూరోచీఫ్ సార్ అనడం, అసిస్టెంట్స్ చీఫ్‌ని అని నీవు అని సంబోధించడం కూడా తెలుసు. అది వయోభేదం వలన వచ్చే తేడా. చిన్న వయసులోనే రెండు డిగ్రీలు తీసుకున్నవారు, త్వరగా ప్రమోజన్ పొందినందువలన ఏర్పడిన భేదం. అయినా వారిలో వారికి అవగాహన ఉన్నప్పుడు ఎవరు చీఫ్ అయినా, ఎవరు అసిస్టెంట్ అయినా ఫరవాలేదు. వైద్య విద్య పరుగు పందెంలో ఎవరు ముందుగా పరుగు పెడితే వాడే సింహాసనం ఆక్రమించవచ్చు. పరుగు పెట్టలేని వారు వెనుకబడి ఉన్నా, వారు తక్కువ వారేమీ కాదు. వారూ వైద్యులే. వారూ తమ చదువుకున్న చదువుకు తగినంత వైద్యం చేస్తూ, పేషెంట్లను కాపాడేవారే.

ఏ డిపార్ట్‌మెంట్‌లోనైనా వారి ఆధిక్యత తప్పదు. క్రిందివారు ఒదిగి ఉండడమూ తప్పదు. ఆ ఓర్పే ఒక్కో మెట్టు అవుతుంది. పైకి వెళ్ళడానికి, కోపానికి, ఆవేశానికి తావిచ్చి చదువులకు, ఉద్యోగాలకు స్వస్తి చెబితే ఎవరూ పైకి రాలేరు. చదువు చదవడం ఒక ఎత్తు. ఆధిక్యతను భరిస్తూ పైకి వెళ్ళడానికి ప్రయత్నించడం మరో ఎత్తు. ఒకానొకప్పుడు ఆయన మాత్రం నా స్థానంలో లేడా అని అనుకుంటే రేపు క్రింది వారు పైకి వెళ్ళి అదే ఫోజు కొట్టడం ఆనవాయితీ ప్రకారం జరిగితే ఏ పోస్టులో ఏ

పొజిషన్‌లోనున్నవారు దానిని పూర్తిగా తప్పక అనుభవిస్తారు. అవి లోక సహజం కూడా.

డాక్టర్ అర్జున్ మేధావిని పనిలో మెప్పించాలని ప్రయత్నించే కొద్దీ అతని ప్రయత్నాలు బూడిదలో పోసిన పన్నీరు అవుతున్నాయి. కన్నీరు అక్కడే కళ్ళను దాటి రావడంలేదు. ముందుగా చీఫ్ కోసం తలంచుకుంటేనే భయం కలిగి, సరిగా చేసే పని కూడా సరిగా చేయలేకపోతున్నాడు. ఈయన శాంతంగా నాకు నేర్పితే ఈయనకంటే బ్రహ్మాండమైన సర్జనుని అయిపోతాను అని అనుకుంటున్నాడు అర్జున్.

కాని మేధావి అలా అనుకోవడంలేదు. చదువు చదివేవాళ్ళను చూసీ చూడనట్లు ఊరుకుంటే తరువాత ప్రాణాలకు ప్రమాదం. ఎవరు అయినా రికమండేషన్‌తోగాని, డబ్బుతోగాని పాస్ కావచ్చు కాని డాక్టర్లు మాత్రం అలా కాకూడదు అన్నది ఆయన గట్టి నిర్ణయం. ఈ నిర్ణయం ప్రస్తుతం రాయిలా గట్టిగానే ఉండవచ్చు. కాని ముందు ముందు ఆ డాక్టరు జీవితానికి అదే బలమైన పునాది, అందుకే తన అసిస్టెంట్స్ విషయంలో ఏ చిన్న తప్పుకు ఒప్పుకోడు మేధావి.

ప్రొద్దున్నే మామూలుగా లేవాలని ఎంత ప్రయత్నించినా లేవలేకపోయాడు మేధావి. తలను ఎవరో రోకలితో దంచుతున్నంత బాధ, మెడ నరాలు తెగిపోతాయేమోనన్నంత నొప్పి, ఎటూ కదలకుండానే భూమి గిర్రున తిరుగుతున్నట్లు ఏమీ తినకుండానే కడుపు తిప్పుతున్నట్లు అనిపించసాగింది. పని మనిషి యధావిధిగా వచ్చి గదులు ఊడ్చేసి, బట్టలు ఉతికేసి వెళ్ళిపోబోయింది. ఆమెతో హోటల్ నుండి కాఫీ తెప్పించుకున్నాడు. ఎప్పుడూ రోబోట్‌లా తన పని తాను చేసుకొని పోవడమే తప్ప చిన్న మాటకు కూడా ఆ ఇంట్లో నోచుకోని పనిమనిషి ఆశ్చర్యపోయింది. కాఫీ తెచ్చి 'ఒంట్లో బావుండలేదాండి అయ్యగారూ' అని అడిగింది. ఈ మధ్య ఆ మాత్రం పరామర్శించే వాళ్ళు కూడా ఇంట్లో లేక తనకు తెలియకుండానే అల్లాడిపోతున్న మేధావి.

'అవును' అని ముక్తసరిగా సమాధానం చెప్పాడు. 'అయితే ఈ సంగతి పక్కింటి అయ్యగారికి చెప్పనా బాబూ' అని అడిగితే వద్దు, వద్దు అన్నాడు కంగారుగా.

ఆ రోజు బ్లడ్ టెస్టులు అన్నీ చేయించుకున్నాడు. తాత్కాలికంగా ఉపశమనానికి మందులు వాడుతున్నా వాంతులు, తల నొప్పి, తలలోపల బాధ, మెడ నరాలు లాగడం లాంటివి తప్పడం లేదు. ఏదో చెప్పలేని బాధ, తెలియరాని అనీజీనెస్, తలను చేతితో పట్టుకుని ఓపెన్ చేసి లోపల ఏముందో తెలిసికోవాలి అనేంత నొప్పి, రాను రాను తట్టుకోవడం కష్టంగా ఉంది మేధావికి.

నేనూ పేషెంటునా, పైగా బ్రెయిన్ పేషెంటునా అనుకోగానే నవనాడులు క్రుంగిపోయినట్లు, నరాలు తెగిపోయినట్లు, అనిపించి శరీరం సన్నగా వణకడం మొదలుపెట్టింది. ఇంకకాలం డాక్టర్‌గానే బ్రతుకు సాగించాను. ఇప్పుడు పేషెంటుగా

ఎలా సాగించాలి. నేను పేషెంటుని అయితే ఎంతమంది పేషెంట్లు నష్టపోతారు అనే ఆలోచన ఎక్కువైంది.

తన ఆరోగ్యం మీద తనకు అపనమ్మకం కలిగిన తరువాత మేధావికి ఇంట్లో ఎవరైనా ఉంటే బావుణ్ణు అనుకున్నాడు. ఒంటరితనం శాపం అన్నది, తనవారంటూ ప్రతీవారికి ఉండాలన్నది మొదటిసారి తెలిసివచ్చింది. తన ప్రమేయం లేకుండానే సంఘమిత్ర, సంయుక్త గుర్తుకి రాసాగారు. వజ్రాల్లాంటి వాళ్ళు ఇంట్లో ఉన్నప్పుడు పట్టించుకోకుండా ఇంతకాలం వజ్రాలకోసం గనుల్లో వెతికినట్లుగా ప్రవర్తించాడు. ముత్యాల లాంటి మనసున్న ఆ ఆడవాళ్ళిద్దరూ, తనను ఎప్పుడూ ఏ విషయంలోనూ బాధ పెట్టకుండా, తమ తమ సంసారాలు తాము ఏర్పరచుకొని, తమ కష్టాలు తామే పడుతుంటే, ముత్యాలకోసం సముద్రంలో ఈత కొడుతున్నట్లుగా ఉంది మేధావి పరిస్థితి.

నాలుగురోజుల క్రితం సంఘమిత్ర దగ్గరనుండి ఉత్తరం వచ్చినట్లు గుర్తుకి వచ్చింది. తరువాత చదువుదాంలే అని ఎక్కడో పెట్టేసి, ఎప్పుడూ విప్పని ఉత్తరాల గుట్టలోకి చేరిపోయిందా ఉత్తరం అని గ్రహింపుకి వచ్చి, మొత్తం అంతా వెతికి ఉత్తరాన్ని సాధించాడు. ఎప్పుడూ లేని ఆత్రుత ఆ క్షణంలో అతనిలో ప్రవేశించింది. ఉత్తరం గబగబా విప్పి చదివాడు.

ప్రియమైన అన్నయ్యకు,

సంఘమిత్ర ప్రేమతో వ్రాయుట. నీకు అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నాను. నీ దగ్గర నుండి ఒక్క ఉత్తరమైనా రాలేదు. అసలు నీవు చదువుతున్నావో లేదోనని నా అనుమానం.

మనల్ని అమ్మ, నాన్నలు, అక్కయ్య కూడా ఒంటరివాళ్ళను చేసి పోయారు. నీకంటే నేను నయం. ఒక సంసారం ఏర్పరచుకొని హాయిగా ఒంటరి జీవితానికి స్వస్తి పలికాను. నేను ఇక్కడ ఉన్నా ఎప్పుడూ నీ ధ్యాసే.

అసలు నీవు అన్నం తింటున్నావో లేదోనని నేను ప్రతీక్షణం ఆలోచిస్తూ ఉంటాను. నా గురించి నీవు ఆలోచించకపోయినా ఫరవాలేదు. నాకు అత్తగారు, మామగారు, భర్త అందరూ ఉన్నారు. నీ గురించి ఆలోచించడానికి ఎవరున్నారు, ఇంట్లో బూజుపట్టిన వస్తువులు, దుమ్ముపట్టిన సామానులు తప్ప.

నా కూతురికి నీ పేరే పెట్టాను. పేరు మాధవి. నీ అంత గొప్ప చదువులు చదవాలి. నీలాగే మంచి సర్జను కావాలి. దానికి మాటలు రాకపోయినప్పుడే ముందుగా నిన్ను తలవాలని 'మామా' 'మామా' అనడం నేర్పాను. అది మామా మామా అంటూ నిన్ను మరీ మరీ గుర్తుచేస్తుందిక. మా ఇద్దరికీ నీ ధ్యాసే. అలా నిన్ను అస్తమాను తలంచుకుంటామని మా బావగారు ఉడుక్కుంటారు. ఎవరేమనుకున్నా నాకు

ఫరవాలేదు. నిన్ను తలంచుకోకుండా ఉండలేను. నీవు మమ్మల్ని పట్టించుకోవడంలేదని ఏనాడు నిందించను. కాని సంయుక్త భర్తతో విడిపోయి ఒక్కతే ఉంటుంది. రాకాసిలోకం తన మానాన తనను బ్రతకనివ్వడంలేదు. మగవాడివైన నిన్ను ఒంటరిగా ఉన్నా ఏమీ అనని సంఘం ఒక ఆడది ఒంటరిగా, తన పాట్లు తాను గడుపుకుంటూ కాలం గడిపితే ఊరుకోదేం? రాళ్ళు విసురుతుందేం ? చేయని తప్పులు నెత్తిన రుద్ది పైగా ఎత్తిచూపుతుందేం? అంటే ఆమెకు వెనుక ఎవరూ లేరనేకదా! నీకు నీవు నీకు నేను తోబుట్టువులం ఉన్నాం. పాపం సంయుక్తను అప్పుడప్పుడు చూస్తూ ఉండు. కనీసం నీవు ఉన్నావన్న ధైర్యంతోనైనా కాస్త హాయిగా బ్రతుకుతుంది. లేదంటే ఏమై పోతుందో, ఏమో.

భగవంతుడు పురుషత్వం లేని మొగుణ్ణి, అనుమానపు మొగుణ్ణి ఆ అమాయకురాలికి ముడిపెట్టి, ఆమె జీవితాన్ని తెగిన గాలిపటంలా చేసాడు. ఆ తెగిన గాలిపటాన్ని ఇంకా ముక్కలుచేసి వినోదించాలని చూస్తున్నారు చుట్టుప్రక్కల వాళ్ళు. నడుం విరిగిపడిన వారికి చేయి అందించడం చేతకాకపోయినా, పడిపడి నవ్వడం మాత్రం చేతనవును మన సంఘానికి. ఆ న్యాయమే చాలా అన్యాయం.

అన్నయ్యా ! నీవు ఎంతో మందికి మెదడు ఆపరేషన్‌లు చేసి అందులోన్ను లోపాలు తొలగించి పుండును తీసేసి మరలా మంచిగా చేసేస్తావు కదూ ! అలాగే నీకు సాధ్యమైతే ఆ బ్రెయిన్‌లో ఉండే కుళ్ళు ఆలోచనలు, తుప్పు పట్టిన భావాల్ని కూడా తొలగించే మార్గం ఆలోచిద్దూ. అలా చేస్తే సంయుక్త లాంటివాళ్ళు హాయిగా బ్రతికి గాంధీజీ కలలను నిజం చేస్తారు.

ఉంటానిక. చాలా వ్రాసాను. నీవు చదివినా చదవకపోయినా, నా భావాలు ఎప్పుడూ నీతో చెప్పుకోవాలని అనిపిస్తుంది. అన్నయ్యా ! కోరరాని కోరిక కోరుతున్నా నేమో, నీవూ ఎవరినో ఒకరిని, కనీసం నీకు ఇంత అన్నం వండి పెట్టడానికైనా, నీ యోగక్షేమాలు చూడడానికి ఉపయోగపడే స్త్రీని పెళ్ళి చేసుకోకూడదూ. అప్పుడు నేను చాలా సంతోషిస్తాను. మాధవి మామయ్యకు ముద్దులు పంపుతున్నది మొద్దుపిల్ల.

- ప్రేమతో సంఘమిత్ర

ఆ ఉత్తరం చాలా ఆలోచనలను రేకెత్తించింది మేధావిలో. ఇంతకాలం కుటుంబం గురించి ఆలోచించలేదు. కాని ఇప్పుడిప్పుడే ఆలోచించాలి అనిపిస్తుంది. కారణం తన అనారోగ్యం. సంయుక్త గురించి ఆలోచించాడు. ఆ రోజు హాస్పిటల్‌కు వచ్చిన తరువాత మరలా చెకప్‌కి వచ్చినట్లు కూడా గుర్తు లేదు. పిచ్చి పిల్ల ఎలా ఉందో, ఎక్కడ ఉందో, కనీసం ఎక్కడ ఉంటున్నావు - అని కూడా అడగలేకపోయాను అనుకున్నాడు.

సంయుక్త, తాను ఎంత రాత్రి వేళవచ్చినా వేడి వేడిగా వడ్డించడం, తను నిద్రపోతే

లైటార్పి, బ్లాంకెట్ కప్పి, ఫేన్ వేసి వెళ్ళడం లీలగా గుర్తుకి రాసాగాయి. కావాలని అన్నీ గుర్తుకి తెచ్చుకుంటున్నాడు. కారణం తమ మెమరీ పవర్ని తానే పరీక్షించుకోవడంకోసం మొదడు జ్ఞాపక శక్తిని ఏమీ కోల్పోలేదు కదా అనే అనుమానంతో తన ఇంట్లో జరిగిన సంగతులు హాస్పిటల్‌లో చేసిన కేసులు పదే పదే జ్ఞాపకం తెచ్చుకొని అమ్మయ్య నేను ప్రస్తుతం బాగానే ఉన్నాను అని ఊపిరి పీల్చుకుంటున్నాడు. ఆ తరువాత సంగతే అంతుపట్టడంలేదు. తలంచుకుంటే నిద్రపట్టడంలేదు.

సంయుక్త విషయం ఏం చేయాలి. ఆమె ఎక్కడ ఉందో ఎలా తెలిసికోవాలి అని జీవితంలో మొట్టమొదటిసారి ఆలోచించాడు. తాను ఉండేవాళ్ళకు లేనివాడి వయ్యానని కొత్తగా ఒక విధంగా ఫీలింగ్ కలిగింది ఆయనలో. వెంటనే సంయుక్త అడ్రసు వ్రాయమని సంఘమిత్రకు ఉత్తరం వ్రాసాడు. ఉత్తరమైతే వ్రాసాడుగాని సంఘమిత్ర అసలు ఏ ఊరులో ఉంటుందో, అడ్రసు ఏమిటో కూడా ఆయనకు తెలియదు. ఎంత మొద్దుబుర్రనాది అనుకొని ఉత్తరాన్ని చించి ముక్కలు చేసి పడేసాడు. పాత ఉత్తరాలన్నీ తిరగేస్తే  సంఘమిత్ర అడ్రసు దొరుకుతుంది. కాని అంత ఓపిక లేదు. పైగా అవి ఎప్పుడో విప్పడానికి నోచుకోకుండానే డస్ట్‌బిన్‌లోకి వెళ్ళిపోయి ఉంటాయి - అన్న ఊహ రాగానే నేనెంత ఫూలిష్‌గా ప్రవర్తించాను అని తనను తానే తిట్టుకున్నాడు డాక్టర్ మేధావి.

గోధూళి వేళ. గోవులన్నీ ఇళ్ళకు, పక్షులన్నీ గూళ్ళకు చేరుకుంటున్నాయి. సాయంసంధ్య చీకటి కన్యకు స్వాగతం పలకడానికి అలిసిన మోముతో సిద్ధంగా ఉంది. చీకటి అప్పుడే సింగారం మొదలుపెట్టింది. ఒంటినిండా నల్లచీర కట్టుకోడానికి రడీగా పట్టుకుంది. కళ్ళకు కాటుక పెట్టుకుంది. నుదుటనున్న ఎర్రబొట్టు కనబడకుండా సముద్ర కెరటాల్లా ఎగసిఎగసి పడుతున్న నల్లని కురులను మోమంతా కప్పుకొని, తనను చూసి ఎవరూ భయపడరు కదా అనే అనుమానంతో, కాలిగజ్జెలు తీసి అవతల పారేసి వయ్యారంగా మెల్లిగా అడుగులు వేయడానికి సంసిద్ధంగా ఉంది.

అప్పుడే దీపం వెలిగిద్దాం అని అనుకుంటూ బద్ధకంగా అలాగే మంచం మీద దొర్లసాగింది సంయుక్త. మనసు ఆమెను మంచం మీద నిలకడగా ఉండనీయడంలేదు. తెలియని శక్తి శరీరాన్ని, జీవితాన్ని కూడా కలచిపారేసింది. జీవితంలోనుండి పారిపోలేక, ఎందుకు బ్రతుకుతోందో తనకే అర్థంకాని స్థితిలో ఎవరో బ్రతికిస్తున్నట్లు తనను మంత్రించి నడిపిస్తున్నట్లు బ్రతికేస్తూంది, బండరాయిలా.

ముత్యంలాంటి అందం, పగడంలాంటి యవ్వనం, వజ్రంలాంటి మనసు ఆమెది. కాని జీవితం మాత్రం మసిబొగ్గులా, మాసిన చిరిగిన బట్టలా, మసిబారిన దీపంలా తయారయింది. అనుమానపు, అసమర్ధపు భర్తను తలచుకోగానే, మనసు బాధగా మూలిగింది. అగ్ని దగ్గరకు వస్తుంటే పారిపోవాలనిపించినట్లు ఆ ఆలోచనల నుండి

పారిపోవాలని ప్రయత్నించినా అవే ఆమెను తరిమితరిమి కొడుతున్నాయి.

ముప్పయేళ్ళ జీవితంలో ఆమె అనుభవించిన సంతోషాలు, సుఖాలు ఏమీ లేవు. ఏ ఆనందం లేకుండానే ముందుకి కదిలిపోయింది. వయసు, రోడ్డు ప్రక్కన ఉన్న స్తంభంలాగా ఏ ముద్దుముచ్చట్లు లేక స్థిరంగా ఉండి పోయిందామె బ్రతుకు. 'ఒంటరిగా ఉన్నావా? అయ్యోపాపం' అంటూనే మాటలతోనే విసిరే సంఘంలో ఒంటరి బ్రతుకు రానురాను దుర్భరమైపోతూంది.

తలుపు ఎవరో కొట్టడంతో ఉలిక్కి పడిలేచి లైటువేసి తలుపు తీసింది సంయుక్త. ఎదురుగా ఒకావిడ నిలబడి ఉంది. 'ఎవరు మీరు? లోపలికి రండి' అని ప్రశ్నిస్తూనే ఆహ్వానించింది సంయుక్త.

"నా పేరు పరిమళ. గవర్నమెంట్ హాస్పిటల్‌లో స్టాఫ్ నర్స్‌గా చేస్తున్నాను" అంటూ లోపలికి వచ్చింది.

"ఓ కూర్చోండి. మీ గురించి ఇదివరకు విన్నాను చూడడం ఇదే ప్రథమం' అంది.

"ఏదైనా మొదటిసారి ప్రథమమే మరి. ఆ ప్రథమము అనే పదం మీ నోటినుండి మరోసారి రాకుండా నేను తరచుగా వస్తుంటాను. మీకు అభ్యంతరమా ?" అంది.

"ఊహూ, లేనే లేదు. పైగా చాలా సంతోషం కూడా" అంది.

"ఒంటరిగానే ఉంటున్నారా?"

"అవును పగలంతా స్కూలు పిల్లలు తోడుంటారు. శలవు దినాలు, పండుగ దినాలు రాత్రిళ్ళు మాత్రం ఒంటరినే"

"మా పాప చెప్పింది. మా టీచర్ చాలా బాగా చెబుతుంది. పేరు సంయుక్త చాల అందంగా ఉంటుంది" అనే సరికి మిమ్మల్ని చూడాలనిపించింది.

"పసిపిల్ల మాటలతో మరీ నన్ను పొగిడేయకండి"

"పసిపిల్ల కాబట్టే నిజం చెప్పిందని అనుకున్నాను. నేను అబద్ధం ఎప్పుడో చెప్పే ఉంటాను. అందుకే ఆడపిల్ల పుట్టింది. మా అమ్మాయి 'రవిత'కు తప్పక మొగపిల్లాడే పుడతాడు"

"అంటే?"

"అంటే ఏముంది. రవిత ఏమీ అబద్ధం చెప్పలేదు. మీరు చాలా అందంగా ఉన్నారు. పిల్లలు టీచర్ల పాఠాలకే కాక వారి అందాలకు, వారుకట్టుకున్న చీరలకు, పెట్టుకున్న వస్తువులకు కూడా అట్రాక్ట్ అవుతారని నా ఫ్రెండ్ అంటే కాదని వాదించినందుకు బాధపడుతున్నాను."

సంయుక్త శబ్దంలేని చిరునవ్వు నవ్వింది. అయినా ఆమె నవ్వులో ఎన్నో సరిగమలు, శ్రుతులు వినిపించాయి పరిమళకు.

మీరు క్లాసులో పిల్లలకు చిన్నదెబ్బతగిలినా, వాళ్ళు దెబ్బలాడుకున్నా విలవిలలాడిపోతారట. మా రవిత చెప్పింది లెండి. మీరు రవితకు పాఠాలు చెబితే అది టీచర్ల కబుర్లు మాకు చెబుతుంది. పసి పిల్లాడి మనస్తత్వం కలిగి ఒక్క సర్జరీలో నూరుశాతం నాలెడ్జి, జీవితంలో జీరో శాతం అవగాహన కలిగిన డాక్టర్ మేధావి, అదే మీ మామయ్యకు వంట్లో బావుండకపోతే ఒక్కసారి అయినా వచ్చి చూసారా!

"మామయ్యకు ఒంట్లో బావుండలేదా!" ఆమె మొహంలో అమావాస్య చీకట్లు అకస్మాత్తుగా వచ్చేసాయి.

"అవును. ఆయన ఆ విషయం ఎవరికీ చెప్పకపోయినా, ఇంట్లో లోన్లీగా ఉంటున్నారని, మీకు చెబితే మంచిదని నాకు అనిపించింది. బహుశా మీ ఇల్లు కూడా ఆయనకు తెలిసి ఉండకపోవచ్చు. అవునా?'' అంది.

"అవునో కాదో. ఆయన మనసేమిటో, మనసులో ఏముందో, ఆ బుర్రలో ఏం ఆలోచిస్తాడో కూడా నాకు తెలియదు."

"ఆయన బుర్రలో ఏం లేదు. దోసెడు, పెద్ద దోసకాయ సైజులో మెదడు తప్ప. ఆ మెదడులో కూడా ప్రేమ, ఆకలి అవసరాలు అన్న రక్తనాళాలు చచ్చుబడిపోయి, వాటికి ఎప్పుడో పెరాల్సిస్ వచ్చేసింది. మెదడులో కొన్ని రక్తనాళాలు చచ్చుబడితే పక్షవాతం వస్తుంది అని ఆయన అంటారు. అందుకే నేనంటాను, ఆయన కాళ్ళు, చేతులు, ముక్కు మొహం సరిగా ఉన్నా కోరికలన్నీ చచ్చుబడిపోయాయి. దానికి వైద్యం లేదు. ఆయన మెదడులో విజ్ఞానం ఒక్కటే మిగిలి ఉంది. ఆ విజ్ఞానమే అజ్ఞానంగా ఆయన్ని ఒంటరిని చేసేసింది. మీరు ఏమైనా చేయగలిగితే వెళ్ళి ఆయనకు సహాయం చేయండి' అంది.

ఆ మాటలు కళ్ళతో వింటున్నట్టుగా కన్నీరు కార్చసాగింది సంయుక్త. కాటుక మరకలు బుగ్గ దగ్గర అంటుకొని వెన్నెల వెలుగులో చీకటి మరకల్లా ఉన్నాయి.

మీరు ఇలా సంఘానికి భయపడకుండా ఒంటరిగా బ్రతుకుతుంటే చీరకట్టుకుని జడవేసికున్న మొగవారనుకున్నాను. ధైర్యశాలి అనుకున్నాను. అబ్బే నేను పప్పులో కాలువేసాను. దయయుంచి మీరే తీసేయండి ఆ కాలు. మీరు నిజంగా మొగవారి లాగే ధైర్యంగా ప్రవర్తించాలి. మగవారి పాంటు చూసారా ఎంత దళసరిగా ఉంటుందో, వారి గుండెలాగే వారి శరీరం చూడండి. ఎంత బలంగా ఉంటుందో, వారి మనసులాగే మనం పలుచని చీరలు కట్టుకున్నంత మాత్రాన మన గుండెలు బలహీనంగా

ఉండనక్కరలేదు. ఆ చీరలు అయిదు గజాలని అని మరచిపోకుండా, మనమూ ధైర్యంగా నిలబడాలి, పోరాడాలి!"

'మీరు భలే మాట్లాడుతారు' మొహానికి పౌడరు అద్దుకున్నట్లు, నవ్వునూ అద్దుకుంది.

"మా ఆయన అలా అనరే, ఈ మాటలతో ఎంత మంది డాక్టర్లను వలలో వేసికున్నావు, అంటారు?"

కళ్ళకు నల్లని కాటుక దిద్దుకున్నట్లు కళ్ళు భయంగా రెపరెపలాడించింది సంయుక్త.

"అదే, ఆ బెదురే వద్దన్నాను. ఘనం బెదిరినంతలో మన బ్రతుకులు అదిరిపోవు. మనమే అందరినీ అదరగొట్టాలి. మన దగ్గర తుపాకి ఉంటే, అందులో తూటాలు లేకపోయినా, ఉన్నట్లు ఎదుటి వారిని భయపెట్టాలి. అదీ జీవితం ! అంతేగాని కంగారులో తుపాకి క్రిందపారేయకూడదు. అలా పారేస్తే మన కాలూ చితుకుతుంది. బ్రతుకూ చిల్లిపడుతుంది. మావారు తిట్టినప్పుడు చెవిటి దానిలాగ, కొట్టినప్పుడు శరీర స్పర్శ లేని కుష్టు రోగి లాగ నా ఎదురుగా తాగుతున్నప్పుడు గుడ్డి దానిలా నన్ను ప్రేమగా లాలించినప్పుడు మాత్రం అసలైన భార్యలా ఆరోగ్యంగా ఉన్నట్లు ప్రవర్తిస్తాను. ఇవన్నీ ఎందుకు చెబుతున్నాను, అంటే - నాకంటే నాలాంటి వాళ్ళ కంటే మీరు వేయిరెట్లు మెరుగు. మీకు ఇంతగా ఎందుకు చెబుతున్నాను? మీరు డాక్టర్ మేధావి మేనకోడలు కాబట్టి. ఆడదాన్ని ఆటవస్తువుగాను, సెక్స్‌కి తప్ప దేనికీ పనికిరానిది గాను చూసే మగవాళ్ళున్న మన సంఘంలో డాక్టర్ మేధావి లాంటివాళ్ళు, అందమైన మేనకోడలు ఉన్నా, హాస్పిటల్‌లో ఎందరో ఆయన ప్రేమకు పాకులాడినా ఆ చలించని మనస్తత్వం అంటే నాకెంతో ఇష్టం. మా రవిత అంటే ఎంత ఇష్టమో, ఆయనన్నా అంతే.

ఆయన అలా తలనొప్పితో బాధపడుతుంటే నేనేమీ చేయలేకపోతున్నాను. అక్రమంగా సంబంధాలు అంటగట్టించుకునే ప్రొఫెషన్ నాది. మేము తాడిచెట్టు క్రింద నిజంగా పాలే తాగుతాం. తాడిచెట్టు నీడనివ్వకపోయినా చేరబడడానికి వెన్నంటితోడుగా ఉంటుంది. అందుకని మేము ఆ స్థలంలో అలసట తీర్చుకుంటూ అందరికీ అలుసైపోయాము.

"పోనీ లెండి బాధపడకండి. మరి మీరు మగవారిలా ప్రవర్తిస్తానని ఇందాకేగా చెప్పారు" సంయుక్త అంది.

'అమ్మయ్య, మీనోటికి చలనం వచ్చిందన్న మాట' అయితే నేనిహ వెళతాను అంటూ లేచింది. పరిమళ నలిగిన కాటన్ చీరలో నడలిన గులాబీలా ఉంది. లేచి చీర సవరించుకుని, హేండ్ బేగ్ భుజానికి తగిలించుకొని 'వస్తాను' అంటూ బయటకు దారితీసింది.

"అయ్యో కనీసం కాఫీ అయినా తాగలేదు" సంయుక్త అంది. "మీరు కాఫీ తెచ్చేసరికి, ఈ చీకటి మరింత విజృంభిస్తుంది మా వారు నేను మీ దగ్గర ఉన్నాను అంటే ఎంత మాత్రమూ నమ్మరు. అదే ఏ మగవాడి దగ్గరైనా ఉన్నాను - అంటే అందులో నిజం లేకపోయినా టక్కున నమ్మేస్తారు. ఎందుకంటే ఆయన దృష్టికి మంచితనం అనే చిన్న లోపం ఉంది. మంచి కళ్ళద్దాలు వేయించుకోండి అంటే వేయించుకోరు. ఆయన రేచీకటికి నా శీలం మసకగానే కనపడుతోంది - అంటూ వెళ్ళిపోయింది నవ్వుతూ.

డాక్టర్ మేధావి ప్రొద్దున్నే నిద్రలేవలేకపోయాడు. నిజానికి నిద్రపోలేదు కూడ. రాత్రంతా తలంతా బాధ, దిమ్ము. రేడియోలో పాటలు వినబడగానే ఎవడా అని ఉలిక్కి పడి లేచాడు. పని మనిషి రేడియో పెడుతుంది అని అనుకోలేక పోయాడు. సంఘమిత్ర గానివచ్చిందా అని అనుమానం వచ్చింది. వంటగదిలోనుండి పరిచయమైన చిరుగాజుల సవ్వడి, మృదు మధురంగా వినిపించింది.

"రంగమ్మా! కాస్త దుకాణానికి వెళ్ళి కాఫీ పొడితీసికొనిరా' అని మాట్లాడుతున్న గొంతు సంయుక్తదిదగా గుర్తు పట్టాడు. అప్రయత్నంగా అమ్మయ్యా అనుకున్నాడు. మరి కొంచెం సేపటికి "మామయ్యా ! కాఫీ, తాగే లే' అంటూ లేపింది.

"సంయుక్తా ! ఎప్పుడు వచ్చావు. నీ ఒంట్లో ఎలా ఉంది?" మేధావి ప్రశ్నకు ఉలిక్కిపడింది. మామయ్యకు మతిచలించలేదు కదా అనే అనుమానం వచ్చింది. ఏనాడు సంయుక్తా అని పిలవడమే ఎరుగడు. పైగా, ఎలా ఉన్నావు - అని అడుగుతుంటే ఆమె నమ్మలేకపోయింది.

'బాగానే ఉన్నాను, నీవేమిటి హాస్పిటల్‌కు వెళ్ళలేదు. ఒంట్లో బావులేదా?' ఏమీ తెలియనట్లే అడిగింది.

'అవును బావుండలేదు' అంటూ లేచి బాత్ రూమ్‌కి వెళ్ళాడు. బాత్‌రూమ్ శుభ్రంగా ఉండడమే కాక వేడి నీళ్ళు దర్శనమిచ్చాయి. ఫినాయిల్ వాసన సన్నగా తగిలింది ముక్కుకి.

"సంయుక్తా ! నీవు దయయుంచి ఇక్కడే ఉండిపోగలవా!" అన్నాడు స్నానం చేసి వచ్చిన తరువాత.

'ఎలా ఉంటాను మామయ్యా! ఆయనకు నీ మీద, నా మీద అనుమానం. ఇంతకాలం మీ మామయ్య దగ్గర ఉన్నావు. నీవు నీతిగానే ఉన్నావా అని రోజూ అనేవాడు. ఇప్పుడు నేను ఇక్కడ ఉంటే లోకం అదే నిజమంటుంది' అంది.

"నీవు ఇక్కడ ఉన్నప్పుడు ఏనాడైనా నీతో అసభ్యంగా ప్రవర్తించానా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అసభ్యమైన ప్రవర్తన నీదికాదు. మా ఆయనది. అందుకే అలా అనగలిగాడు".

"అయినా, నీవు నీ భర్తతో విడిపోయానన్నావుగా"

"అందుకే ఇంకా జాగ్రత్తగా బ్రతకాలి నేను."

"నీవేం తప్పు చేయలేదుగా, ఎందుకు ఎవరికో భయపడడం" తలవంచుకునే అడిగాడు, సంయుక్తను చూడలేక.

"లోకంలోనిందలు పడిన వాళ్ళందరూ తప్పుచేసిన వాళ్ళయితే, సీతా తప్పుచేసినట్లే లెక్క"

"పనిలేని లోకం సంగతి వదిలెయ్యి. నా ఒంట్లో ఏమీ బావుండడంలేదు. నీవు ఇక్కడే ఉండిపోగలవా" అర్థింపుగా అడిగాడు మేధావి.

"నాకోసం ఉండిపొమ్మంటావా?"

"నీకోసం కాదు, నా రోగం కోసం"

"ఏమిటి నీ జబ్బు?"

"బ్రెయిన్ ట్యూమర్ అని అనుమానంగా ఉంది."

"బ్రెయిన్ ట్యూమరా?" పిడుగు పడినట్లు ఉలిక్కిపడింది. ఆమె కాలిక్రింద నేల కదిలినట్లనిపించింది.

"అవును. నా అనుమానం తొంబయి శాతం నిజం"

"నీకు బ్రెయిన్ ట్యూమరా మామయ్యా!" ఒక్కో మాట ఒత్తి పలుకుతూ ఉంది. ఏదో మామూలు తలనొప్పి తనుకుంది గాని అది పెద్ద తలనొప్పి అనుకోలేకపోయింది. ఆమెకు చెప్పలేని నీరసం ఆవహించింది.

"ఏం నాకు రాకూడదా? నేను మాత్రం మనిషిని కానూ?" విరక్తిగా నవ్వాడు. కాని మేధావికి చాలా వేదనగా ఉంది. అతను ఎన్నో కలలు కన్నాడు. ఎంతో మంది పేషెంట్లను చూడాలనుకున్నాడు. వారిని బాగుచేయాలనుకున్నాడు. ఇప్పుడు తానే పేషెంటు అయినందుకు చెప్పరాని బాధగా ఉంది.

"ఇంతకాలం నీవు మహర్షివని అనుకున్నాను. నీవు కూడా మామూలు మనిషివని, నీకూ మనిషితో అవసరమని ఇప్పుడే తెలుసుకున్నాను మామయ్యా! సంయుక్తా అని నీవు నోరారా పిలిస్తే ఎంతో మురిసిపోయాను. నీలోని మార్పుకు చాలా సంతోషించాను. కాని నీ ఆరోగ్యాన్ని బలితీసికున్న ఈ మార్పు మాత్రం వద్దు మామయ్యా. నీవు ఎప్పటిలాగే మేధావిగా, మరమనిషిలా ఉండిపో. నిన్ను చూస్తూ హాయిగా బ్రతికేస్తాను.



కాని నన్ను నోరారా పిలిచి నాలో ఆశలు రేపి నీవు రేపు అన్యాయం కావద్దు. నేను సహించలేను మామయ్యా. సహించలేను'' ఆ మాటలు మూగగా ఆమెలోనే ఉండిపోయాయి. ఆ మాటలు గొంతులోను, కన్నీరు కళ్ళలోను, ప్రేమ హృదయంలోను బయటకు రాకుండా లోపలి అవయవాలలాగే నిక్షిప్తంగా, నిశ్శబ్దంగా ఉండి పోయాయి.

"ఏం! సంయుక్తా మాట్లాడవు''

ఉలిక్కి పడిచూసింది. ఏం మాట్లాడుతుంది. "'అబ్బే అదేం లేదు. నీకు బ్రెయిన్

ట్యూమర్ అయి ఉండదు. ఆపరేషన్లు చేసి చేసి నీకు అన్నీ అలాంటి ఆలోచనలే" అంది.

"ఆపరేషన్లు చేసాను కాబట్టే, ఎంతో మంది పేషెంట్లను చూసాను కాబట్టే అంత ఖచ్చితంగా చెప్పగలను."

ఈసారి మౌనమే శరణ్యమయింది సంయుక్తకు. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రఖ్యాత బ్రెయిన్ స్పెషలిస్టుకు బ్రెయిన్ ట్యూమర్" అనే మాటలు వేలవేల గొంతులతో అరుస్తున్నట్లు అనిపిస్తున్నాయి. అన్నిటినీ మించి అది నిజంకాకూడదు అనే ఆశ ఆమెలో ఉంది. ఆమె కోరుకున్నదేదీ అప్పటివరకూ జీవితంలో జరగలేదు. అలాగే ఇదీ జరగదేమోననే భయం ఆమెలో కలవరాన్ని రేపింది. ఆ కలవరం కళ్ళల్లో నీళ్ళను రప్పించింది. ఆ కన్నీళ్ళు మేధావి కళ్ళబడకుండా వెనక్కి తిరిగి తుడిచేసుకుంది.

అంతటి బాధలోనూ ఒకే ఒక్క చిన్న ఆశాకిరణం దొరికింది మేధావికి. అది అప్పుడే ఆంధ్రప్రదేశ్‌లో హైద్రాబాదులో బ్రెయిన్ స్కానింగ్ త్వరలో రాబోతుంది.

"నీ ఇల్లు కాలుతుంది అంటే పోనీలే బొగ్గు లెత్తుకుంటాను" అన్నట్లుగా ఉంది మేధావి పరిస్థితి. కొత్తగా పెట్టబోయే బ్రెయిన్ స్కానింగ్‌కి తాను ఎంతోమంది పేషెంట్లను పంపవలసింది పోయి తాను మొదటి పేషెంటు అవుతాడేమో. ప్రారంభోత్సవం చేయడం విచిత్రంగా, ఆహ్వానితుడిగా కాక అనారోగ్య వంతుడిగా పేషెంటుగా తలచుకునే కొద్దీ తలనొప్పి మరీ ఎక్కువ కాసాగింది.

సంయుక్తను అక్కడే ఉండిపొమ్మని మరీ మరీ చెప్పి హాస్పిటల్‌కు వెళ్ళాడు మేధావి. ఇంట్లో ఉంటే లేనిపోని ఆలోచనలతో మరీ బాధగా ఉంటుంది. హాస్పిటల్ అయితే పనిలోపడి బాధ మరచిపోవచ్చు అన్నది అతని భావం. అందుకే డ్యూటీ మానడం లేదు. అక్కడ పేషెంట్ల పక్క తను పడుకొని లేడుగాని అలా పడుకునే పరిస్థితి తప్పక వస్తుందని మాత్రం తెలుసు.

సంఘమిత్రకు ఈ విషయంలో ఉత్తరం వ్రాయాలావద్దా అని సంయుక్తకు అనుమానం వచ్చింది.

ఆ ఎందుకులే ముందు రిపోర్టు రానీ, ఆ తరువాత ఆలోచించవచ్చని ఈలోపుగా అనవసరంగా ఆమెను కంగారు పెట్టడం ఎందుకని ఊరుకుంది.

మేధావి విషయంలో ఇదివరకు అంతా ఒక రకమైన బాధ, ఇప్పుడు మరొక రకమైన బాధ. నిజంగా అది బ్రెయిన్ ట్యూమరే అయితే అన్న ఊహవస్తే చాలు ఇటు మేధావి, అటు సంయుక్త కూడా వణికిపోతున్నారు. సంయుక్త అయితే పూర్వపు బాధే నయం, మామయ్య విషయంలో కొత్త బాధ మాత్రం వద్దు అనుకుంది.



హైద్రాబాదులో (1981లో) ప్రభుత్వ సహకారంతో ప్రయివేటు రంగంలో యునైటెడ్ గ్రూపు సంస్థ వారు న్యూరలాజికల్ రీసెర్చి సెంటరు పేరుపై బ్రెయిన్ స్కానింగ్ ప్రవేశపెట్టారు. అసలు బ్రెయిన్ స్కానింగ్‌ని భౌతిక శాస్త్రజ్ఞుడు, గాడ్ ఫ్రీహన్స్ ఫీల్డ్, ఎక్సరే డాక్టరు జేమ్సు అంబ్రోసు సహకారంతో కనుగొన్నారు. దీనివలన రోగ నిర్ధారణ సులువు కావడమే కాదు, త్వరగా అయిపోతుంది కూడా.

ప్రారంభోత్సవం అయిన తరువాత ఎవరూ ఊహించని విధంగా మేధావిగారే తన బ్రెయిన్ స్కానింగ్ తానే చేయించుకున్నారు మొదట.

అందులో ఏమీ ఉండకూడదు అని సంయుక్త వేయి దేవుళ్ళకు మొక్కుకుంది. ఎప్పటి లాగే ఆమె మొరను దేవుడు ఆలకించలేదు.

తన స్కానింగ్ రిపోర్టు తాను చూసుకున్న డాక్టర్ మేధావి అసలు సిసలైన పేషెంటులా బాధపడ్డాడు.

★ ★ ★

సంయుక్త లోకానికి భయపడదలచుకోలేదు. అందుకే మకాం మేధావి ఇంటికి మార్చేసింది. ఉద్యోగానికి శలవుపెట్టింది. మామయ్య అనారోగ్యం ఆమెకు మనశ్శాంతి లేకుండా చేస్తుంది.

ఆరోజు ఆదివారం, హాస్పిటల్‌కు వెళ్ళి త్వరగా వచ్చేసాడు మేధావి. బీరువాలోవున్న ప్రొజెక్టరు తీసాడు. దాన్ని సరిగా పెట్టి స్లైడు తీసాడు. సంయుక్త కూడా వచ్చి పక్కన కూర్చొని అతనికి కావలసిన స్లైడ్సు అందిస్తుంది. ఆ ఇంట్లో ఉన్న కెమేరా ఎవరినీ ఫొటోలు తీయదు, ఒక్క పేషెంట్లను తప్ప. మేధావి తాను ఆపరేషన్ చేస్తున్నప్పుడు ప్రతీ స్పెషల్ కేస్‌ని ఫోటో తీస్తుంటాడు. పేషెంటుకి డిసీజ్ ఉన్నప్పుడు ఒకటి, ఆపరేషన్ అయిన తరువాత ఒకటి తప్పక తీస్తాడు.

అవి కాన్ఫరెన్స్‌లకు వెళ్ళినప్పుడు గాని విద్యార్థులకు గాని ముందు ముందు చాలా ఉపయోగపడతాయి.

ఒక్కో స్లైడు పెట్టి చూస్తున్నాడు. అక్కడ వాటి గురించి వివరించడానికి స్టూడెంట్స్ ఎవరూ లేరు. సంయుక్త మాత్రమే ఉంది. ఆమెకే చెబుతున్నాడు అన్నీ.

చూడు, ఇది బ్రెయిన్ ట్యూమర్ కేసు, ఈ ఆపరేషన్ చేయడానికి ఎంత కష్టపడ్డానో తెలుసా? ట్యూమర్ తొలగించి తలను అతికించేసరికి అయిదారు గంటలు పట్టింది. బ్రెయిన్ చాల డెలికేట్‌గా ఉంటుంది. ఆపరేషన్ చేయడంగాని కుట్లు వేయడంగాని విజ్ఞానంతోనే కాదు, ఓర్పు నేర్పు, పనితనం కూడా కావాలి.

ఇదిగో, ఈ కేసు చూడు, మెదడు దెబ్బతింది. దాని మూలాన పాపం అతని మాట పోయింది. సర్వేంద్రియాలు పనిచేయడానికి మెదడు ప్రధానమైనది. శరీరంలోని అన్ని భాగాలకు ఇది సంకేతాలను పంపుతుంది. అన్నిటినీ ఇది కంట్రోల్‌లో పెడుతుంది అన్నాడు.

అంతలోనే స్లైడులో ఒక అబ్బాయి ఫోటో వచ్చింది. చాలచక్కగా ఉన్నాడు. 'ఇతను పేషెంటా?' ఆశ్చర్యంగా అడిగింది. 'అవును ఏక్సిడెంట్‌లో బ్రెయిన్ దెబ్బతింది. ఇప్పుడు పాపం పసివాడికంటే అన్యాయం. అతనిలో ప్రాణం ఒక్కటే ఉంది. అనుభూతులు, రుచులు, అలాంటివి ఏమీ లేవు. నోరుంది. మాట్లాడలేడు. ఏదో తినగలడు. కళ్ళతో చూడగలడు. కాని ఎవరినీ గుర్తుపట్టలేడు. తానెవరో తనకే తెలియదు. తను చదివిన ఐఎఎస్‌లో ఒక్క అక్షరం కూడా తెలియకుండా గుర్తు లేకుండా బ్రెయిన్ దెబ్బతింది. అది అతని జీవితాన్ని దెబ్బతీసింది.

అయ్యోపాపం - అంది సంయుక్త.

మరో పక్షవాతం స్లైడు పెట్టాడు. పక్షవాతం మెదడు జబ్బు వల్లనే వస్తుంది. తల్లి

గర్భంలో ఉండగా ప్రసవం ఆలస్యమైతే పక్షవాతం వస్తుంది. మెదడుకి రక్తప్రసరణ సరిగా లేక మెంటల్ రిటార్డేషన్ దగ్గరనుండి మూర్ఛరోగం వరకూ వస్తాయి.

"ఈ ఫోటో చూడు తల ఎంత పెద్దగా ఉందో. ఇది పుట్టుకతో వచ్చే జబ్బు హైడ్రోకెవలాస్. ధనుర్వాతం, హైడ్రోఫోబియా, మెనింజైటిస్, మెదడువాపు వ్యాధి ఇవన్నీ బ్రెయిన్‌కి సంబంధించినవే. దురదృష్టం కొద్ది పేషెంట్లకు తెలియదు ముందుగా ఏ డాక్టరు దగ్గరకు వెళ్ళాలో.

సంయుక్తా! ఇప్పుడు ఈ బ్రెయిన్ స్కానింగ్ మన రాష్ట్రానికి వచ్చింది గాని, మెదడు జబ్బు పరీక్ష చేయడం, వ్యాధి నిర్ణయానికి వారంరోజులు పడుతుంది. అనేక కష్టతరమైన పరీక్షలు చేయాలి. ఈ పరీక్షలుకూడా చాలా ప్రమాదమైనవే. ఒక్కోసారి పరీక్షలలోనే పేషెంట్లు ప్రాణాలు కోల్పోతారు. బర్‌హోల్ లాంటి చిన్న ఆపరేషన్ మైలోగ్రామ్, వెంట్రిక్‌లోగ్రామ్ లాంటి టెస్ట్‌లు చేస్తేగాని రోగ నిర్ధారణకాదు" మేధావి ఒళ్ళు మరచి చెబుతుంటే, కళ్ళు పెద్దవి చేసికొని వింటుంది సంయుక్త. ఇవన్నీ నాకెందుకు అనుకోలేదు.

మరో స్లైడు పెట్టాడు. 'ఈ పేషెంటుకి రక్త నాళాలు పగిలి రక్తం గడ్డకట్టేసింది. అన్‌కాన్షస్ అయిపోతే ఆపరేషన్ చేసాను' అన్నాడు.

'అలాగా' అంది మామయ్య తనతో మాట్లాడుతుంటే ఆమెకు సంతోషంగా ఉన్నా ఆ సంతోషం వెనుక చెప్పలేని ఆవేదన. మామయ్య అందరికీ ఆపరేషన్‌లు చేసాడు. మామయ్యకు ఎవరు చేస్తారు. ఎవరు బ్రతికిస్తారు అన్నదే ఆమె ఆలోచన. మేధావికి కూడా అదే ఆలోచన ఉంది. మేధావి ఎటోచూస్తూ సంయుక్తతో అన్నాడు.

"మనిషి తన స్కిన్ క్రింద రకరకాల అవయవాల్ని దాచుకొని పైకి అందంగానే కనబడుతున్నాడు. ఆ అవయవాలు కూడా భూగర్భరైళ్ళలా పైవారికి కనబడకుండానే తమ పని తాము చేసి కొని పోతాయి. ఎటొచ్చీ వారికి అనారోగ్యం కలిగి రిపేరు వచ్చినప్పుడే అవస్థ అంతా. ఏపుట్టలో ఏ పాముందోనన్నట్లు ఏ మనిషిలో ఏ రోగం ఉందో ఎవరికీ తెలియదు. కనబడని దొంగలా కాచుకొని ఉంటుంది. శరీరంలో రోగం.

సాధారణంగా మనిషి పేషెంటు కాకుండానే ఉండాలి గాని ఒకసారి అయిన తరువాత దొంగతనం చేసి దొంగ అన్న ముద్రవేయించుకున్నట్లే పేషెంటు అనే ముద్ర వేయించుకుంటాడు. అతని తప్పొప్పులకు, మనస్తత్వాలకు సంబంధం లేకుండానే జరిగిపోతుంది.

దేవుని దృష్టిలో అయినా - పేదా గొప్పా, చిన్నా పెద్దా, కులమూ మతము, తెలుపు నలుపు లాంటి తేడాలుంటాయోమోగాని, వ్యాధికి మరణానికి ఆ తేడా లుండవు. ఏ రోగం లేకుండా చనిపోయినవాడు అదృష్టవంతుడే. ఏ నిమిషం ఎలాగడుస్తుందో

తెలియనట్లే ఏ మనిషికి ఏ రోగం వస్తుంది అన్నది చెప్పలేం. కొత్త కొత్త మందులు తయారయ్యే కొద్ది ఇంకా కొత్త కొత్త జబ్బులు వస్తున్నాయి. శాస్త్రవేత్తలు మందుల తయారీలో పోరాటం సాగిస్తూనే ఉంటారు ఎప్పుడూ.

'ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసా?' అకస్మాత్తుగా అడిగిన ప్రశ్నకు ఉలిక్కి పడింది సంయుక్త. 'ఊహూ తెలియదు' అంది పసిపిల్లలా.

"ఇందాక చూపించిన స్లైడులు చూసావుగా. అందులో అవయవాలు పడిపోయినవారు ఉన్నారు. మనుషులను గుర్తుపట్టనివారున్నారు. మాటలు రానివారున్నారు. ఒకవేళ నా ఆపరేషన్ సక్సెస్ కాకపోతే అందులో ఎవరో ఒకరిలా మిగిలిపోతాను, నేను పూలమ్మిన చోట కట్టెలమ్మినట్లుగా."

'అలా అనకు మామయ్యా!' బాధను గొంతులో అదిమిపట్టి అంది, సంయుక్త.

'నీకు మెర్సీకిల్లింగ్ తెలుసా?' అకస్మాత్తుగా అడిగాడు, ఆ ప్రశ్న ఎందుకు వేసాడో అర్థం కాకపోయినా తెలుసు. ఎవరైనా బాధపడుతూంటే అది తగ్గని రోగం అయితే... ఇంక చెప్పలేక ఆగిపోయింది. ఆ వాక్యం చెబుతుంటే ఆమెకు అప్పుడు అర్థం అయింది. ఆ పదం ఎందుకు ఉపయోగించాడో ఆ తలంపు రాగానే ఎక్కువైంది.

"అయితే నీకు తెలిస్తే ఒకవేళ ఆపరేషన్ సక్సెస్ కాకుండా నేను వారిలో ఒకరిలా ఎవరిలాగ అయినా మిగిలిపోతే మెర్సీకిల్లింగ్‌ని నా విషయంలో నీవు నిజం చేయగలవా? సంయుక్తా! అందులో నీకు ఏ పాపం అంటుకోదు. అంతా నాదే!"

'అదేమిటి మామయ్యా! అలా అంటావు. నీవు తప్పక బాగవుతావు. మరలా ఎన్నో ఆపరేషన్‌లు చేస్తావు'

"ప్రతీ పేషెంటు బల్లఎక్కేముందు అలాగే అనుకుంటాడు. ముందు బ్రతికి బట్టకట్టాలిగా"

'అందరి సంగతి వదిలెయ్యి. నీవు తప్పక బాగవుతావు. ఆ నమ్మకం నాకుంది".

"నీవు ఎప్పుడూ మెదడు ఆపరేషన్ చేయలేదుగా, అందుకే అంత ఖచ్చితంగా చెప్పగలుగుతున్నావు. సరైన సర్జను కేసును చేపట్టకపోతే, పేషెంటు పరిస్థితి ఎలా ఉంటుందో నాకంటే ఎవరూ బాగా చెప్ప లేరని నేను బల్లగుద్దిచెప్పగలను."

"నీవు తప్పక మంచిగా బ్రతకాలి మామయ్యా!"

"ఆ కోరిక నీకే కాదు, నాకూ ఉంది. నేను బ్రతకాలి. మామూలుగా, పేషెంటులా కాదు. పాత న్యూరోసర్జన్‌లా.

బ్రెయిన్ వ్యాధుల పాలిట పిశాచిలా బ్రతకాలి. నేను మరెన్నో ఆపరేషన్లు చేసి

పేషెంట్లను బాగు చెయ్యాలి. కాని అది జరగుతుందంటావా? అర్ధాంతరంగా చనిపోవడం నాకూ ఇష్టం లేదు. నా చదువును పూర్తిగా చివరి ఊపిరి వరకూ నా శరీరం ముసలిది అయ్యే వరకూ సార్ధకం చేసికోవాలని ఉంది. కాని ఆ అవకాశం ఉందో లేదో నాకు తెలియదు. అసలు ఈ జబ్బు నాకెందుకు వచ్చిందంటావు?'' అమాయకంగా ప్రశ్నించాడు.

"అంత పెద్ద మేధావివి ఆ చిన్న సంగతే తెలియదా? మనం కుడి చేత్తో పని ఎక్కువ చేస్తాం. కుడి చెయ్యి సాధారణంగా ఎక్కువగా లాగుతూ ఉంటుంది చాలా మందికి, కళ్ళకు ఎక్కువ స్ట్రయిన్ కలిగిస్తే దృష్టిలోపం వచ్చి కళ్ళద్దాలు వేసికోవలసి వస్తుంది. ఎక్కువ పరుగు పెడితే కాళ్ళు నొప్పెడుతాయి. అలాగే నీవు బ్రెయిన్‌తో ఎక్కువగా ఆలోచిస్తావు. నీ బ్రెయిన్ అలసిపోయింది. అందుకే ఆ ట్యూమర్ వచ్చింది, అంతే'' అంది.

'మరి బ్రెయిన్ కేన్సర్, ట్యూమర్ లాంటివి వచ్చేవాళ్ళందరూ న్యూరోసర్జనులు కారే వాళ్ళు ఎక్కువ ఆలోచించకుండానే ఎందుకు వస్తుంది' ఎదురు ప్రశ్న వేసాడు.

'అది వాళ్ళ ఖర్మ' అనాలనుకుని, మౌనంగా ఊరుకుంది సంయుక్త. మామయ్య తనతో మనసు విప్పి మాట్లాడడం ప్రపంచవింతే. ఆ వింతలోనే చెప్పలేనంత చింత ఆమెకు.

టైము చూసింది. రెండయింది. అన్నం వడ్డించి మేధావిని పిలిచింది. మేధావి, భోంచేసిన తరువాత తనూ భోంచేసింది. మేధావి పేషెంటు అయి ఆమె దగ్గరగా రావాలని ప్రయత్నిస్తున్నా ఆమెలో ఏదో బెరుగ్గా భయం పోలేదు. మేధావితో కలిసి భోంచేయాలంటే కలిసి దొంగతనం చేస్తున్నట్లుగా అనిపిస్తుంది. అందుకే విడిగా తింటుంది.

"ఈరోజు నేను హాస్పిటల్‌కు వెళ్లను. వరంగల్ వెళ్ళాలి. కోర్టు పని ఉంది'' అన్నాడు. మేధావి ఆ మర్నాడు.

"నీకు వంట్లో బావుండ లేదు కదా ! కొన్ని రోజులు శలవు పెట్టకూడదూ, ఈ ప్రయాణాలు అవీ ఎందుకు?'' అంది సంయుక్త.

"బతికున్నంతకాలం తినడం ఎలా తప్పదో, డ్యూటీ కూడా అలాగే తప్పదు. పేషెంట్లను మేము బ్రతికించితేనే సరిపోదు. వారి బ్రతుకులూ సరిదిద్దాలి. పల్లెటూరు రాజకీయ కొట్లాటలలో తలపగిలిన పేషెంటుకి ట్రీట్‌మెంట్ ఇవ్వడమే కాక ఆ తల ఎలా పగిలింది అన్నది కోర్టులో చెప్పాలి. డాక్టర్లు ఇలాంటి కేసులకు అటెండ్ కాక తప్పదు. వెళ్ళాలి. ఆ కోర్టులోనూ రెండు పార్టీల వాళ్ళు ఉంటారు. వాళ్ళకు మా లాంటి వాళ్ళం అపకారం చేయకపోయినా మేము ఎవరి తరపున న్యాయంగా మాట్లాడామో చూసి



అవతలి పార్టీ వాళ్ళు మామీద కక్ష కట్టడం మామూలే. ఒక్కోసారి డాక్టరుకి హాని కూడా చేస్తారు.''

'బాబోయ్' భయంగా గుండెల మీద చేతులు వేసుకుంది సంయుక్త.

'బాబోయ్ అన్నంతలో జరిగే పనులు జరక్కమానవు.'

'నేనూ నీతో రానా? వరంగల్?' అడిగింది.

'నీవా? వద్దు'

'పోనీ మీ అసిస్టెంట్ని తీసికెళ్ళచ్చుగా.'



'ఆ ఇంకా నయం. ఇద్దరం ఒకేసారి ఊరిలో లేకపోతే ఎలా. పైగా అతనికి పరీక్షలు దగ్గరకొచ్చాయి' అన్నాడు.

'నీకు ఈ హాస్పిటల్ తాపత్రయం మాత్రం తప్పదు''

'నా తల్లి, తండ్రి, గురువు అన్నీ ఆ హాస్పిటల్, అది ప్రాణం లేని ఇటుకలతో కట్టినదే కావచ్చు. కాని ఎంత మందికి ప్రాణ దానం చేసిందో తెలుసా? అసలు ప్రజలందరికీ.

"కాశీకి వెళ్ళినవాడు, కాటికి వెళ్ళినవాడు సమానమన్న దానిలో కాశీ అన్న మాటకు బదులు ప్రభుత్వ హాస్పిటల్ అంటారుగాని, అందులో నిజం ఎక్కువ లేదు. అక్కడక్కడ రోగులు నిర్లక్ష్యం చేయబడతారుగాని, అది ఏ ఒక్క శాతమో, రోగం ముదిరి

చనిపోయేవాళ్ళే ఎక్కువ. జబ్బు తగ్గించుకుని హాయిగా వెళ్ళేవాళ్ళు ఇంకా ఎక్కువ. మరెందుకో ప్రజలు వారిని గుర్తించరు. చెడు గుర్తించినట్టుగా, మంచి గుర్తించడం మనుషులకు అలవాటు లేదుగా'' అన్నాడు.

తిరిగి అన్నాడు 'నేను ఈ మధ్య ఎక్కువ మాట్లాడుతున్నాను కదూ! ఆపరేషన్‌లో పొరపాటున, నా మాట పడిపోతుందేమోనని భయంగా వుంది. అందుకే ఆపరేషన్‌కు ముందే చెప్పదలచుకున్నది చెప్పేయాలి' అన్నాడు. ఆమె హృదయానికి ఒక్కోమాట ఒక్కో రాయిలా తగలడం మేధావి గమనించనేలేదు.

సాయంకాలం వరంగల్ నుండి, విపరీతమైన తలనొప్పితో తిరిగి వచ్చాడు. బాధతో గిలగిలలాడుతున్న మేధావిని చూసి మనసు విలవిలలాడింది సంయుక్తకు. కష్టసుఖాలు పంచుకోవచ్చు. కాని వ్యాధి కూడా ఎవరైనా పంచుకునే పద్ధతి ఉంటే ఆ బాధ మేధావి నుండి తీసుకుని తను పడాలని అనుకుంది సంయుక్త. మేధావి మాట్లాడడం నేర్చుకుని మాట్లాడే కొద్దీ సంయుక్త గొంతు మూగబోయింది బాధతో.

వెంటనే డాక్టర్ అర్జున్ ఇంటికి కబురుపెట్టింది రమ్మని పనిమనిషితో. అర్జున్ వచ్చాడు. మేధావికి సంయుక్త కబురుచేసినట్లు తెలియదు. హాస్పిటల్ విషయాలు చెప్పడానికి వచ్చాడనుకుని, 'ప్రొద్దుట ఇరవై ఐదేళ్ళ అబ్బాయికి మైలోగ్రామ్ చేయమన్నాను, చేశావా అర్జున్' అన్నాడు.

"లేదుసార్ ! మీరు లేరని, మీతో తప్ప మరెవరితోనూ చేయించుకోనని ఆ పేషెంట్ ఎవరితోనూ చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయాడు'' భయంభయంగా చెప్పాడు అర్జున్.

"అర్జున్! ఇది వరకు నీకు చాలాసార్లు చెప్పాను. ఇక్కడ పేషెంట్లతో చిన్నఅబద్ధం ఆడక తప్పదు. పెద్ద డాక్టరుగారే ఆపరేషన్ చేస్తారు. అని వాళ్ళను నమ్మించాలి. ఆపరేషన్ థియేటర్‌లో ఎవరుచేసింది ఎలా తెలుస్తుంది. అన్నీ నేనేచేస్తే మరి నీవు నేర్చుకునేది ఎప్పుడు. పేషెంట్లను ఆకట్టుకోవడం నీకు రావడం లేదు'' విసుక్కున్నాడు అర్జున్‌మీద. సాధారణంగా డాక్టర్లు ప్రయివేట్ కేసులో ఇంత ఇంటరెస్ట్ చూపిస్తారు. కాని డాక్టర్ మేధావి మాత్రం ప్రభుత్వపు హాస్పిటల్‌లోని పేషెంట్‌లను ప్రైవేట్ పేషెంట్‌లలాగే ట్రీట్ చేస్తాడు. వారినుండి ఏమీ తీసుకోకుండానే ఒక పేషెంట్ హాస్పిటల్ నుండి వెళ్ళిపోయాడు అంటే, ఒక దొంగ తప్పించుకుంటే బాధపడే పోలీసాఫీసర్‌లా బాధపడతాడు.

"మీరు ఈ రోజు సెలవు పెట్టారని వాళ్ళకు తెలుసటసార్! అందుకే నమ్మించలేకపోయాను'' తప్పు నాదికాదు - అన్నట్లు చెప్పాడు అర్జున్.

"అవునుకదూ!'' తన తప్పు గ్రహించాడు మేధావి. సంయుక్త రెండు కప్పులతో కాఫీ తెచ్చింది.

"తీసుకో" అజ్ఞాపిస్తున్నట్లు అన్నాడు. అందులో ఆప్యాయత వున్నా ఆయన మాట అలాగే వినబడింది అర్జున్‌కి.

చీఫ్ ఎదురుగా ఉన్నారని ఈ కాఫీని ఆముదం తాగినట్లు తాగాడు. ఆయనముందు కాఫీ తాగడానికీ భయమే.

కొంచెంసేపు హాస్పిటల్ కబుర్లు అయిన తరువాత, పరీక్షలకు బాగా చదువుతున్నావా అని అడిగి అర్జున్‌ని పంపించేశాడు మేధావి.

అర్జున్ వెళ్ళిపోయిన తరువాత అసలు సంగతి చెప్పలేదని కంగారుపడి నొచ్చుకుంది సంయుక్త మేధావికి తెలియకుండా. హాస్పిటల్ సంగతులు వినగానే అదే మంచి టేబ్‌లెట్‌గా పనిచేసింది మేధావికి. తలనొప్పి ఇట్టే పోయింది. మరలా ఏదో కేసు గురించి స్టడీ చేయడం మొదలు పెట్టాడు.

"ఇప్పుడు ఎందుకు మామయ్యా" మరలా చదువు; తలకు స్ట్రెయిన్‌కదా, నొచ్చుకుంటూ అంది సంయుక్త.

"రేపు మేజర్ ఆపరేషన్ వుంది సంయుక్తా. చదవక తప్పదు. నన్ను కొన్ని ఆపరేషన్‌లు అయినా చెయ్యనీ, నా ఆపరేషన్ ముందు" అన్నాడు.

నా ఆపరేషన్ ముందు అన్నమాట తుఫానుగాలిలా తగిలింది ఆమెకు. అదేమాట మేధావికి కూడా పిడుగుపాటులాగే ఉంది. ఆ ఇద్దరిలోనూ ఒకరికి తెలియకుండా మరొకరిని వేధిస్తున్న ఒకే ఒక ప్రశ్న - ఆపరేషన్ ఎవరు చేస్తారు - అన్నది.

మేధావికి అయితే రాత్రిళ్ళు నిద్ర వుండటం లేదు. తను చేసిన కేసులన్నీ, తన చేతిలో ఫెయిలైన కేసులన్నీ కళ్ళముందు కరాళ నృత్యం చేస్తున్నాయి. నీవూ మాలో చేరిపో అని చెవిలో ఇల్లు కట్టుకొని పోరాడుతున్నాయి.

'నేను చనిపోకూడదు. అలా అని పేషెంటులాగానూ మిగిలిపోకూడదు' అని పదేపదే అనుకుంటున్నాను.

నృత్యంనే ప్రాణంగా భావించినవారికి కాళ్ళు విరిగినట్లు, అందెలు మ్రోగనట్లు, గానంనే ఊపిరిగా తలపోసేవారికి, గొంతు కేన్సర్ వచ్చినట్లు, పాట మూగబోయినట్లు పెయింట్‌నే పెన్నిధిగా తలచినవారికి మణికట్టువరకూ, ఏక్సిడెంట్‌లో చేయి విరిగినట్టు, డ్రాయింగ్ కాగితాలు, కుంచెలు రంగులు వెలసి మసిబారినట్టు రోజుకో రకమైన ఆలోచన, రాత్రికో రకమైన కలవచ్చి మేధావి బుర్రను ఇంకా పిచ్చివానిని చేసేస్తున్నాయి. ఆపరేషన్ సక్సెస్ కాని, ఆపరేషన్ చేయలేని బ్రతుకు నాకు వద్దు. దాని బదులు చావే నయం. నాకు చావుకూడా వద్దు. నేను బ్రతకాలి. బతకాలి అని ఎన్నోసార్లు అనుకుంటున్నాడు రోజుకి.

మేధావి బాధ చూడలేక 'మామయ్యా త్వరగా ఆపరేషన్ చేయించేసుకో. అప్పుడు ఈ బాధ ఉండదుగా' అంది సంయుక్త. పైకి అలా అందిగాని ఆ ఆపరేషన్ అనేమాట 'మృత్యువు' అనే పదంలా అనిపిస్తుంది ఆమెకు. ఆలస్యం చేస్తే జబ్బు ఇంకా ముదిరిపోతుంది అని ఆమె భయం.

'ఎవరితో చేయించుకోమంటావు సంయుక్తా?' అన్నాడు. 'విశాఖపట్నంలో ఒక న్యూరో సర్జన్ వున్నాడుగా' గుర్తుతెచ్చుకుంటూ అంది, ఆయనతో చేయించుకో అనే వుద్దేశంతో.

'ఆయన ఆపరేషన్ ఎలా చేస్తాడో తెలుసా? తలని గుమ్మడికాయలా పగలగొడ్తాడు. కుట్లు వేస్తుంటే గోనెసంచి కుడుతున్నట్లు కుడతాడుగాని, అది అతి సున్నితమైన మెదడు అన్న సంగతి అతని మెదడుకి పట్టదు. ఏదో శ్మశానంలో మాంత్రికుడు మెదడు తినడానికి శవం తల పగలగొడుతున్నట్లుగా వుంటుంది ఆ ఆపరేషన్' అన్నాడు.

"పోనీ, తిరుపతిలో ఇంకో ఆయన వున్నారుగా' గుర్తుచేసింది సంయుక్త. అది మేధావికి తెలియని సంగతికాదు. అయినా తన ప్రయత్నం తాను చేసింది.

'ఆయన ఎలా చేస్తాడో తెలుసా? కోతికి కొబ్బరికాయ దొరికినట్టుగా చేస్తాడు. ఆపరేషన్ చేస్తున్నంతసేపు నేలమీదకాకుండా నిప్పులమీద నిలబడినట్లు నిలబడుతూ, ఎప్పుడెప్పుడు స్కల్ మూసి బయటపడదామా అన్న ఆరాటమే తప్ప ఆ స్కల్ ఎందుకు ఓపెన్ చేసిందీ గుర్తించడు. చేయవలసిన పని కంగారుగా చేసేసి కంగారులో పరుగెత్తుకొచ్చేస్తాడు బయటకు. స్కల్ ఓపెన్ చేసానా లేదా? తిరిగి అతికానా లేదా అన్నదే గమనిస్తాడుగాని ఆ రోగం తీశాడా లేదా అన్నది గుర్తించకుండా ఒక్కోసారి బ్రెయిన్‌ని బయట పెట్టేసి కుట్టేసినా ఆశ్చర్యపోనక్కరలేదు. పైగా ఆపరేషన్ చేస్తున్నంతసేపు మర్డర్ చేస్తున్నట్టు మొహం పెట్టి దగ్గరున్న థియేటర్ నర్స్‌లు ఆ ఆపరేషన్ ఎక్కడ నేర్చేసుకుంటారో అన్నట్లు వాళ్ళమీద చిర్రుబుర్రులు. ఆ పేషెంట్‌కి మత్తు పుణ్యమా అంటూ మెలకురాదుగాని వచ్చిందా, ఆ అరుపులకే టపా కట్టేస్తాడు''

మరోసారి అయితే ఆ మాటలకు కిలకిలా నవ్వేసేది సంయుక్త. కాని ఆ డాక్టర్ల చేతిలో మేధావి మెదడుని, తలని ఊహించుకుని గజగజ వణికిపోయింది.

"మామయ్యా! మరి ఆ డాక్టర్లిద్దరూ నీ దగ్గరే చదివారుగా. నీవు వాళ్ళకు అలాగే నేర్పావా?'' నేర్పుగా అడిగింది.

"నేను వాళ్ళకి విజ్ఞానాన్ని బోధించగలనుగాని, ప్రతిసారి వాళ్ళు ఆపరేషన్ చేసే ప్రతి పేషంట్ దగ్గరా నేనుండి వాళ్ళ చేతులు పట్టుకుని పనిచేయించలేనుగా. వాళ్ళ వేళ్ళతో వేళ్ళు కలిపి కట్టు వేయించలేనుగా. నా దగ్గర వున్నంతకాలం బాగానే వున్నారు.

ఇప్పుడు రెక్కలు వచ్చిన పక్షులు. వదలి వెళ్ళారు. ఆపేవాళ్ళెవరు. మంచి చెడూ చెప్పేవాళ్ళెవరు.

"నీకు ఆ సంగతులు ఎలా తెలిశాయి" అడిగింది.

"ఎలా తెలిసాయా? వాళ్ళ దగ్గర ఆపరేషన్లు చేయించుకుని నా దగ్గరకు రిపేర్లకు వస్తుంటే తెలిసింది. నేను నేర్పిన విద్య ఇదేనా అనే అనుమానం నాకే కలుగుతోంది. నేను ప్రొఫెసర్‌గా తగనేమో సంయుక్తా."

"ఎందుకు తగవు. నీవే బాగా సరిపోతావు. నీదగ్గర నేర్చుకునే అలా తయారయ్యారంటే ఇంక చూసీ చూడనట్లు వదిలేస్తే ఇంకేమన్నా వుందా?"

"అందులో తిరుపతిలో ఉన్నాయన ఎం.ఎస్. పాస్ కావడానికి పదివేలు లంచం ఇచ్చాడనీ తెలుసు. నేను లంచాలకు లొంగకుండా అతనిని పనిలో లొంగదీశానని ఇప్పటికీ నా మీద కోపమే."

"అలా అని పాసైన వాళ్ళందరూ తెలివైనవాళ్ళు, ఫెయిలైనవాళ్ళు తెలివితక్కువ వాళ్ళు అనుకోకూడదు. ఏ విద్యలోనైనా పైకి రావాలంటే తెలివితేటలతో పాటు రవ్వంత అదృష్టంకూడా కలవాలి" అన్నాడు.

"నీకూ అదృష్టంమీద నమ్మకం ఉందన్నమాట"

"నేనూ మామూలు మనిషినే అని ఇప్పుడిప్పుడే అర్థం అవుతూంది" శ్మశాన విరాగిలా మాట్లాడాడు.

పోనీలే ఇప్పుడిప్పుడైనా అర్థం అవుతుంది అనుకుంది మనస్సులో అలా అనుకున్నా ఆ మనసులో ముల్లు గుచ్చుకున్న వేదన స్పష్టంగా తొంగిచూసింది.

"పోనీ మామయ్యా! ఏ రాయవేలూరో వెళ్ళి ఆపరేషన్ చేయించుకోవచ్చుగా !" ఆశాజనకంగా అడిగింది.

అప్పటివరకూ ఆ ఆలోచన రానందుకు ఉలిక్కిపడ్డాడు. అంతలోనే మరలా విరక్తిగా నవ్వాడు.

"ఎంతోమంది పేషెంట్లు, నా దగ్గర రోగనిర్ధారణ చేసుకుని రాయవేలూరుకో, అపోలోకో వెళ్ళిపోతుంటే వాళ్ళను తిట్టేవాడిని. "ఆంధ్రదేశం గొడ్డుబోయిందా ! మేం మాత్రం డాక్టర్లం కాదా ! దూరపు కొండలు నునుపు అని వాళ్ళను హేళన చేసేవాడిని. మా చదువులకు, శ్రద్ధను తక్కువగా అంచనా వేసినందుకు, పుట్టిన నేలను అపహాస్యంపాలుచేస్తున్నారని వారిపై ఒంటికాలిపై లేచేవాడిని. ఇప్పుడు నన్నూ, అదే దారిలో నడవమంటావా? నా తిట్లు నన్నే తిట్టుకోమంటావా?" అన్నాడు.

"ఏది ఏమైనాకానీ, నీవు బావుండడం కావాలి నాకు. నాకేకాదు, మన రాష్ట్రంలోని పేషెంట్లకుకూడా. బహుశా ఆ పేషెంట్లందరూ చావు అన్నది ఆంధ్ర డాక్టర్ల చేతిలోనే వుంది. అవుటాఫ్ స్టేట్‌లో వున్న డాక్టర్ల చేతిలోలేదు అని తలపోశారేమో. మనమూ ఆంధ్రులమేకదా! అలాగే ఆలోచిద్దాం!'' అంది.

ప్రక్కింటివాళ్ళ అమ్మాయికి హాస్పిటల్‌లో సిజేరియన్ చేస్తే చూడడానికి సంయుక్త వెళ్ళింది. హాస్పిటల్‌లో పరిమళ ప్రేమపూర్వకంగా పలకరించి నవ్వితే ఎవరా అని ఆశ్చర్యంగా చూసింది, సంయుక్త గుర్తు తెచ్చుకోవానికి ప్రయత్నిస్తూ.

"నేను పరిమళను. నన్ను చీరలో చూశారు. డ్యూటీ డ్రస్‌లో గుర్తుపట్ట లేదనుకుంటాను'' అంది నవ్వుతూ.

'అవును కదూ! మరీ ఇంత తేడానా? నాకీ హాస్పిటల్‌లో తెలిసిన వారెవ్వరా అనుకున్నాను. సారీ. ఆనవాలు పట్టలేకపోయాను' అంది.

'ఏమో మీ మామయ్యగారి మతిమరుపు మీకు అంటుకుందేమో ఈ మధ్య. ఆయనకు మతిమరుపు తగ్గింది కదా అనుకున్నాను'

'అబ్బే అలాంటి ట్రాన్స్‌ప్లాంటేషన్స్ ఏమీలేవు'

'అన్నట్లు మీరు ఉద్యోగం రిజైన్ చేసేశారట. మా రవిత చెప్పి ఒకటే బాధ పడిపోతుంది. అదృష్టవంతులు. మిమ్మల్ని పెంచడానికి డాక్టర్ గారున్నారు కాబట్టి హాయిగా కాలుమీద కాలేసుకుని కూర్చుంటారు ఇంట్లో'

'ఏం మీకు కాలుమీద కాలేసుకునే అవకాశం లేదా' నవ్వుతూనే అంది సంయుక్త.

'ఉహూ. మా ఆయన జీతం సరదాలకి, నా జీతం సంసారానికి. కావాలంటే మావారు ఆయన కాళ్ళు కూడా నామీద వేసేస్తారుగానీ, నా కాలుమీద నా కాలు మాత్రం వేసుకోనివ్వరు. అందుకే ఈ తెల్లగౌనులకు అంకితం అయిపోయాను' అంది.

'తెల్లగౌనులో రాజహంసల్లా చక్కగా ఉంటారు మీరందరూ. తెలుపు శాంతికి, సహనానికి చిహ్నం కదా!'

'మీరు అలాగే అంటారు. పేషెంట్లు మాత్రం మమ్మల్ని మాకు నోరెక్కువ అని గయ్యాళులమంటారు. నిజానికి ఈ ఉద్యోగాలలోకి రాకముందు మాకూ నోరుండదు. పరిస్థితులు, పేషెంట్లు, వాతావరణం మమ్మల్ని అలా తయారుచేస్తాయి. అసలు రహస్యం చెప్పాలంటే అసలు మేము పేషంట్లకు, డాక్టర్లకు మధ్యలో, మీడియేటర్లలాగా ఉండబట్టే డాక్టర్లు నోరు విప్పే అవసరం రాకుండా పోతుంది. వాళ్ళ బాధ్యత కూడా మేము నిర్వహించి చివరకు నిందలు భరిస్తాం'

సంయుక్తకు ఏం సమాధానం చెప్పాలో తెలియక మౌనంగా చూస్తూ నిలబడింది.

'మా ప్రొఫెషన్ గురించి చెప్పి మిమ్మల్ని బోరు కొట్టినట్లున్నానా. ఇంక చెప్పనులెండి. కాస్త నవ్వండి' అంది.

'అబ్బెబ్బె, అదేంకాదు' కంగారుగా అంది సంయుక్త.

'ఎందుకంత కంగారు. ఇప్పుడేం కొంపలు మునిగిపోలేదే. ఇంత కంగారుపడే పిరికివారైతే రేపు డాక్టర్ మేధావిగారికి ఆపరేషన్ అయితే ధైర్యంగా ఉండగలరా?'

ఆపరేషన్ పేరు వినగానే సంయుక్త మొహంలో పట్టపగలు అమావాస్య రేఖలు కదలాడాయి. చీకటిలో ముంచి తీసినట్టుగా అయిపోయింది మొహం అంతా. అనుకోకుండా శరీరం అంతా చిరుచెమటలు పట్టేశాయి.

అది గమనించిన పరిమళ 'భలేవారే ఎందుకలా బెదిరిపోతారు. ఏమంత పెద్దజబ్బని అది. కాన్సర్ కాదు. అంతకంటే భయంకరమైనది అంతకన్నా కాదు. ఆఫ్టరాల్ బ్రెయిన్ట్యూమర్. గట్టిగా మాట్లాడితే రెండురోజుల్లో లేచి తిరగ్గలరు అంటాను. దానికింత భయమా? అబ్బే లాభం లేదండి. డాక్టరుగారికంటే ముందు మీకివ్వాలి ధైర్యం అనే ఇంజక్షన్. ఆ తరువాతే డాక్టరుగారి సంగతి' అంది టాపిక్ మార్చేస్తూ.

'మీలాంటి వాళ్ళు పక్కన ఉంటే నిజంగా ధైర్యం అనే మత్తుమందు మాటలద్వారా చల్లేటట్లున్నారు' అంది తేలికపడిన మనసుతో.

'ఆఫ్టరాల్ మాటలే కదండీ. ఎన్నయినా మాట్లాడేయగలను. మీరు ధైర్యంగా ఉంటానంటే' అంది.

'జీవితంలో ఆ ఆఫ్టరాల్ మాటలు మాట్లాడేవాళ్ళు లేక నేనెంత ఒంటరితనం అనుభవించానో మీకేం తెలుసు. నిరాశగా గతాన్ని తలుచుకుంటూ అంది సంయుక్త.

'ఇకపై ఆ అవసరం ఉండదు లెండి. మీ మకాం మారిపోయిందిగా. మౌనంగా ఉండాల్సిన అవసరం తీరిపోయి ఉంటుంది. పదండి. గైనిక్వార్డుకెళదాం' అంటూ తీసుకెళ్ళింది పేషెంట్ దగ్గరకు సంయుక్తను.

సంయుక్త ఆవిడను పలకరించేసిన తరువాత ఇద్దరూ కలిసి బయటకు వచ్చారు.

సంయుక్త అంది 'మామయ్యకు ఆపరేషన్ తప్పదా, మందులతో తగ్గదా?' అని.

'మరీ చదువుకోని పేషెంట్ అటెండెంటులా అడిగారు. ఇదిగో అన్నీ తెలిసి ఇలాంటి ప్రశ్నలతో మమ్మల్ని మరీమరీ విసిగించేస్తావే. మేము వాళ్ళను కసిరేసి గొప్పగొప్ప బిరుదులు సంపాదించింది. డాక్టరుగారి మేనకోడలుగా మీరు ఆ ప్రశ్న వేసిఉండకూడదు'

'ఏదో నా ఆత్రుత నాది. ఇంతకాలం పేషెంట్లు ఇంటికి కూడా వచ్చి మామయ్యను

విసిగిస్తుంటే వాళ్ళమీద నాకూ కోపం వచ్చేది. ప్రాణం ఎంత విలువైనదో, దానికోసం ఆ పేషెంట్, పేషెంటు తరఫువాళ్ళు ఎంత తల్లడిల్లిపోతారో ఇప్పుడే అర్థం అయింది' అంది.

'అందుకే నీటిలో దిగిన వాడికే లోతు తెలుస్తుందని అంటారు. అనుభవ పూర్వకంగా తెలుసుకున్నారన్న మాట'

'కానీ ఇలాంటి అనుభవం శత్రువులకు కూడా వద్దు పరిమళా. జరగరానివేవో ఊహించుకుని బ్రతకడం చాలా కష్టం. దానిబదులు భవిష్యత్తు అనేది తెలియకుండానే ఉంటే ఎంతో మంచిది' అంది.

'నిజమే కదా!' పరిమళ అంది. హాస్పిటల్ గేటువరకూ మాట్లాడుకుంటూ వచ్చారు.

తరువాత ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

సాయంకాలం డాక్టర్ మేధావి, ఇంటి ముందు లాన్‌లో కూర్చుని పేపరు చూస్తున్నాడు. చల్లని పిల్లతెమ్మెర సరాగాలు ఆడుతూ పూబాలలను మెల్లగా ఊపుతుంది. పూలగాలికి అటుఇటూ ఊగుతూ సంగీతానికి లయబద్ధంగా తాళం వేస్తున్నట్లు అనిపిస్తుంది. రకరకాల పూలతో తోట కలర్‌ఫుల్‌గా ఉంది.

'ఎవరు నేర్పేరమ్మా ఈ కొమ్మకు పూలిమ్మనీ రెమ్మరెమ్మకు' అన్నట్లుగా ఉంది ఆ వనం. ఎంతటి మండే గుండెకైనా సేద దీర్చే మలయమారుతం. ఎంతటి బండ హృదయానికైనా, స్పందన కలిగించే రంగురంగుల అందమైన రకరకాల పూలు, ఎంతటి మొద్దుబారిన నాసికకైనా సుగంధ పరిమళాలలను, సౌరభాలను అందించే సువాసనలు. అన్నీ ప్రకృతిలో స్వచ్ఛంగా, మంచిచెడులు కలిగిన మానవ గుణాలకు అతీతంగా, ఊహాతీతంగా ఉన్నాయి.

మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్నాడు అర్జున్. అతను నడుస్తున్నట్లు లేదు. నడవడం ఇష్టం లేనట్లు వెనక్కి పారిపోదామా అన్నట్లు ఉంది అతని నడక. తప్పదు. వెళ్ళకా తప్పదు, డాక్టర్ మేధావిని కలవకా తప్పదు; ఆ చీవాట్లు తినకా తప్పదు.

అంతా ఖర్మ అనుకుంటూ ధైర్యంగా నడవబోయాడుగానీ ఒక్కో కాలుకి ఒక్కో కిలోరాయి కట్టివున్నట్లుగా పాదం ముందుకు కదలనంటుంది. ఎలాగైతే వెళ్ళి డాక్టర్ మేధావికి దూరంగా నిలబడి తనకే వినబడనంత గొంతుతో సార్ అన్నాడు. అతని పరిస్థితి చూస్తే దొంగతనంచేసి యజమాని దగ్గరకు తప్పు ఒప్పుకోడానికి వచ్చినట్లుగా ఉంది. పఠనంలో పడిన మేధావికి అర్జున్ గొంతు వినబడలేదు. ఈసారి కొంచెం గట్టిగా సార్ అన్నాడు.

ఉలిక్కిపడిన మేధావి ఒక్కసారి అర్జున్‌వైపు చూసి మొహం చిట్లించాడు.

మొహంలో ఆ చిట్లింపు చూడగానే తన గుండె చిట్లినట్లుగా బాధపడ్డాడు అర్జున్.

'రా కూర్చో' అన్నాడు మేధావి. భయంభయంగా కూర్చున్నాడు అర్జున్. మేధావి అనబోయే మాటలు ఊహించుకుంటూ గత్యంతరంలేదు. పడాలి ఎన్నయినా పడాలి.

'ఎంత పని చేశావ్ అర్జున్! నీమీద నేను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. ఓరల్స్‌లో నోరు విప్పలేదు. ఇంక సర్జరీ సరేసరి. అంతమంచి డాక్టరువి. అంత సింపుల్ క్వశ్చన్స్‌కి ఆన్సర్ చేయలేకపోయావా? ఇంకా నీ గురించి వారికి ఎంతో గొప్పగా చెప్పాలను కుంటూనే ఆగిపోయాను ఎక్స్‌టర్నల్ ఎగ్జామినర్స్ దగ్గర. నీ టాలెంట్ వారే చూస్తారుకదా. తినబోయే వాళ్ళకు రుచెందుకు అనుకున్నాను. నా ఊహల్ని తారుమారు చేసేశావు కదా!' మేధావి గొంతులో నిష్ఠూరం ధ్వనించింది.

"సార్! అలా అవుతుందని అనుకోలేదు. అన్నీ తెలిసినవే. అయినా ఏదో చెప్పరాని భయం ఎగ్జామినర్స్ అంటే" గట్టిగా మాట్లాడితే కొడతారేమో అన్నట్లు మెల్లిగా అన్నాడు.

'ఎందుకు భయపడడం. వాళ్ళూ నీలాంటి డాక్టర్లే కదా! చెప్పినంతవరకూ, చేసినంతవరకూ బాగానే చేశావు. కానీ సారీ అర్జున్ నిన్ను పాస్ చేయలేకపోయాం, నీవు ఇంకా బాగా చేస్తావని ఎక్స్‌పెక్ట్ చేశాను' అన్నాడు మేధావి.

అర్జున్ మాట్లాడకుండా తల వంచుకున్నాడు. పరీక్ష పోతుందని తెలుసు. అయినా ఏదో ఆశ. పాస్ అవుతానేమో, పొరపాటునైనా అనే భ్రమ. కాని అది భ్రమలాగే మిగిలిపోయింది. ఫెయిల్ అవుతాను అని ఊహించినప్పటికీ నీ పరీక్ష పోయింది అనే మాట చీఫ్ నోటినుండి వచ్చేసరికి ఆ మాటకు తట్టుకోవడం కష్టం అయింది. తనకు కష్టానికి తగిన ఫలితం దొరకలేదు. ఆ కష్టం గట్టెక్కిపోతే ఏ టెన్షనూ లేక హాయిగా ఉండవచ్చు అనుకున్నాడు.

'ప్రమోషన్ అక్కర్లేదు. డిగ్రీ చేతిలో పడితే పని ఇంకా బాగా నేర్చుకుంటాను. సంతోషంగా అనుకున్నాడు. కానీ ఇతని ఊహలు తారుమారయ్యాయి. డాక్టర్ మేధావిగారు ఎక్స్‌టర్నల్స్‌కి కాస్త రికమండ్ చేస్తే ఏం పోయింది అనే బాధ అతనిలో మెల్లగా మొదలైంది. ఎంతో బాగా చెప్పిన ఓరల్స్‌కి కూడా ఆయన నోరు విప్పలేదు అంటారని తెలుసు. నేర్పుగా చేసిన ఆపరేషన్‌నైనా సరిగా చేయలేదంటారని తెలుసు. అయినా ఆయనకు ఆ నిమిషంలో పాస్ చేయాలి అనే ఊహవచ్చి ఉండచ్చుకదా అనే ఉంది. ఆ ఆశ కూలిపోయేసరికి చెప్పలేనంత నిస్పృహ అతనిలో చోటు చేసుకుంది. అతని మనసును పూర్తిగా, చదివినట్లు, అతని బాధను పోగొట్టాలనే ఉద్దేశంతో మేధావి.

'చూడు అర్జున్! ప్రతీ అపజయానికీ అలా బాధపడకూడదు. ముఖ్యంగా డాక్టర్

వృత్తిలో ఎంత అనుభవం సంపాదిస్తే అంత మంచిది అని నేను నీకు చెప్పనక్కర్లేదు. ఒకటి, రెండు అయితేగానీ డాక్టర్ కాదంటారు. అసలు ఆ ఒకటీ, రెండు కేసులు మాత్రం ఎందుకుపోవాలి అని నేనంటాను. మన చేతిలో బాగయి, సంతోషంగా ఇంటికివెళ్ళే ప్రతి పేషెంటూ మనం ఎక్కుతున్న ఉన్నత శిఖరాలకు ఒక్కో మెట్టులాంటివారు. ఆఫ్‌కోర్స్ పేషెంట్ మన చేతిలో పోవాలని మనం కోరుకోమనుకో. పేషెంటు బాగయితే దేవుడిదయ, పోతే డాక్టర్ పొరపాటు అంటారు ప్రజలు.

డాక్టరు అల్లావుద్దీన్ అవతారం ఎత్తి పోతున్న ప్రాణాన్ని అద్భుతదీపంతో తేవాలని పేషెంట్లు, పేషెంట్ల తరపువారు కోరుకుంటారుకానీ అదేమి జబ్బు? దానికి తగిన మందుందా? లేదా? ముదిరిపోయిన తరువాత డాక్టరు దగ్గరకు వచ్చామా. అని అనుకోరు. గాజుగ్లాసు రెండు ముక్కలైతే అతికించగలంకానీ చిన్నచిన్న ముక్కలు చాలా అయితే అతగ్గలమా?

ఆ సంగతి వారికి తెలిసినా, నిందలు మనమే పడాలి. వాళ్ళు కేవలం డాక్టర్లు లైసెన్స్ మర్డరర్స్ అన్న విషయానికే ప్రాముఖ్యత ఇస్తారుగానీ, మనిషికి ప్రాణం పోస్తారు అనే దానికి అసలు ఇంపార్టెన్స్ ఇవ్వరు. అందుకే ఏ సర్జరీ అయినా ఎంతో ఓపికతో చేయాలి. అర్ధం అయిందా? చిన్నపిల్లాడిని అడిగినట్లు అడుగుతుంటే బుర్ర ఊపడం తప్ప మరేమీ చేయలేకపోయాడు అర్జున్. అతనిలో 'ఫెయిల్' అనే మాట పెద్దదెబ్బ కొట్టింది. కళ్ళు తిరిగినట్లయింది. ఇంకా ఆ దెబ్బనుండి కోలుకోలేక పోతున్నాడు.

'అర్జున్! నీవు ఫెయిల్ అయినందుకు నీకంటే ఎక్కువగా నేను బాధ పడుతున్నాను తెలుసా?' మేధావి గొంతులోని బాధతో కూడుకున్న మాటలకు ఎండకు తగిలిన ఐస్‌క్రీంలా కరిగిపోయాడు అర్జున్.

'మీరు విచారిస్తున్నారా?' మాటలను కూడదీసుకుంటూ అన్నాడు.

'అవును. నా మనసు నీకు అర్థం అయినా కాకున్నా నీకు చెప్పక తప్పదు. ముందుముందు నాకు చెప్పే అవకాశం ఉంటుందో ఉండదో నాకు, నీకు కూడా తెలియదు. నీకు తెలుసుగా మొన్న మద్రాసునుండి డాక్టర్ రామన్‌గారు ఎక్స్‌టర్నల్ ఎగ్జామినర్‌గా వచ్చారు. ఆయన నన్ను, నా కేసును బాగా ఎగ్జామిన్ చేశారు. మరో వారంలో హైద్రాబాద్ వచ్చి నాకు ఆపరేషన్ చేస్తానన్నారు. ఆయన నాకు గురువు. ఆయన దగ్గరే నేను న్యూరోసర్జన్ని అయ్యాను. ఆఖరికి ఆయనకే పేషంటుని కూడా అయ్యాను. ఇదంతా ఎందుకు చెబుతున్నానూ అంటే ఎంత మంచి సర్జన్‌కానీ, ఎంత జాగ్రత్తగా కళ్ళల్లో వత్తులు వేసికొని పేషెంటుని చూడనివ్వు. ఆ పేషెంట్ బ్రతికి బట్టకట్టేవరకూ పేషెంటు తరపు వారితోపాటు డాక్టరూ టెన్షన్‌లోనే ఉంటాడు. ఎంతో బాగవుతాడు అన్న పేషెంట్ చివరలో పరిస్థితులు తారుమారయ్యో, భూమిమీద నూకలు

చెల్లో చనిపోతూ ఉంటాడు. లాభంలేదు, బ్రతకడు అనిపించినా పొరపాటున బాగయిపోయి దర్జాగా ఇంటికి వెళ్ళిపోయేవారు ఉంటారు. ఒకవేళ పొరపాటున నేను మొదటికోవలోకి వెళితే - ?'

"సార్! మీరు అలా పొరపాటుగా కూడా ఊహించకండి. మీరు తప్పక బాగవుతారు'' అన్నాడు అర్జున్. ఇప్పుడతనిలో పరీక్షతప్పింది అన్న ఆవేదన మచ్చుకైనా లేదు.

'బాగవ్వాలనే అందరూ అనుకుంటారు. మనిషి బ్రతుకుతాడో చనిపోతాడో అన్నది సైన్స్‌కి అతీతమైన విషయమే అవుతుంది ఒక్కోసారి. సైన్స్‌ని మనం ఎంత నమ్మినా ఏదో అదృశ్యశక్తి ఉంది. దానికి దేవుడు అనిగానీ, దేవత అనిగానీ, దెయ్యం అనిగానీ ఏ పేరు పెట్టినా అది మనల్ని నడిపిస్తుంది అని, మెడమీద మెదడు ఉన్నవారందరికీ తెలుసు. ఆఫ్‌కోర్స్ ఈ విషయం నాస్తికులు నమ్మకపోయినా, ఎవరి అభిప్రాయం వారిది అని మనం అనుకోవచ్చు. ఒకవేళ ఆపరేషన్‌లో నేనేదైనా అయితే...

'సార్' గొంతులో ఆవేదన పొంగింది అర్జున్‌కి. 'ప్లీజ్ అర్జున్. నన్ను పూర్తిగా చెప్పనివ్వు. నేనే ఏమయినా అయినా నాచేతిలో డిగ్రీ పొందిన నీవు నేను లేనిలోటు తీరుస్తావనుకున్నాను. నేను పోయినా ఫరవాలేదు. నా చేతిలో పెరిగి పూలుపూసిన మొక్క కాయలుకాసి, అవి విత్తనాలైతే మరిన్ని చెట్లు తయారవుతాయకున్నాను. కానీ నీవు నా అభిప్రాయాన్ని తారుమారు చేశావు. నీకు డిగ్రీ ఇవ్వలేకపోయాను. ఇది నీకంటే నన్నే ఎక్కువ కుంగదీస్తుంది.

ఏం ఫరవాలేదు. పాత నీరు పోతే కొత్త నీరు వస్తుంది. కానీ నేనున్నా లేకపోయినా నీవు మాత్రం బాగా చదువు. ఎంత బాగా కృషిచేస్తే అంత నీకు మంచిదే. ఎవరి తిండి వారి కండలే పెంచుతుంది - ఎవరి చదువు వారి విజ్ఞానాన్ని పెంచుతుంది. ఇదే నేను నీకు చెప్పాలనుకున్నది' అన్నాడు.

అర్జున్ మేధావి మాటలు వింటూ ఊపిరి పీల్చుకోవడం కూడా మరచిపోయి, చెక్కిన శిల్పంలా కూర్చుండిపోయాడు. మేధావి మనస్సును అంచనా వేయడానికి అతని మేధస్సు సరిపోలేదు.

కాని హాస్పిటల్ అంతా మాత్రం "మేధావిగారు, అర్జున్‌కి, డిగ్రీ ఇవ్వడానికి అడ్డుపడ్డారని, ఆయనను అర్జున్ మించిపోతాడని భయం అని అందుకే తన దగ్గర చదివే వాళ్ళను తొక్కిపడతాడని ఇంకా ఏవేవో పుకార్లతో గుప్పుమంది. కాని ఆ సంగతులేవీ ఇటు అర్జున్‌కి గాని, అటు మేధావికిగాని తెలియనే తెలియవు. మేధావికి ప్రొఫెషనల్ జలసీ ఎక్కువ అన్న ముద్రమాత్రం పడిపోయింది, అందులో ఆవగింజంత నిజమైనా లేకపోయినా.

సంయుక్త వ్రాసిన ఉత్తరం చూసుకొని సంఘమిత్ర భర్తను, కూతురిని తీసికొని రెక్కలు కట్టుకుని వాలింది. సంఘమిత్రను చూడగానే సంయుక్త బావురుమంది. ఇంకాలం ఎలా ఏడవాలో కూడా తెలియక కొట్టుమిట్టాడుతున్నట్లు, మిత్రను చూడగానే దుఃఖం కట్టలు తెంచుకుని ప్రవహించింది. సంయుక్త ఏడుపు చూస్తుంటే చెప్పలేని భయం కలిగింది సంఘమిత్రకు. ఏమీ తెలియని మాధవి, చిన్నారి నవ్వులు నవ్వుతుంది, అందరినీ చూసి చెల్లెలిని చూసిన మేధావిలో తనకు తెలియకుండానే ప్రేమ పొంగిపొరలింది. తనకు చెల్లి అనేది ఉందని అప్పుడే తెలిసినట్లు, వింతగా, ఆశ్చర్యంగా, ప్రేమ భరితంగా ఆమె వైపుచూసాడు. అన్నలోని మార్పు సంఘమిత్ర గమనించిందిగాని, ఆ మార్పు వెనుక ఉన్న కారణం మాత్రం కత్తితో పొడుస్తున్నట్లుగా ఉంది. అన్నయ్యా! నీవు పూర్వపు అన్నయ్యలాగే, మమ్మల్ని పట్టించుకోకుండా మాతో మాట్లాడకుండా, నీలో ఏ జబ్బూ లేకుండా ఉండవూ! అని మనసు ఎంతగానో ఆలోచించింది. మేధావిని తలంచుకుంటే 'మరణం ఎరుగని దేవతలకన్నా, నలుగురికి మేలు చేసే నరుడే మిన్న' అనిపిస్తుంది సంయుక్తకు.

ఎవరి బాధలతోను, ఆలోచనలతోను, ప్రమేయం లేకుండానే ఆ వారం రోజులు గడిచిపోయాయి. డాక్టర్ రామన్, మద్రాసు నుండి వచ్చి ఉస్మానియా హాస్పిటల్ సూపర్నెంటు పర్మిషన్ తీసికొని, డాక్టర్ మేధావికి ఆపరేషన్ చేసారు. ఆపరేషన్‌కు ముందే డాక్టర్ మేధావి, అర్జున్‌ని పిలిచి "నాకు ఆపరేషన్ చేసే టైములో థియేటర్‌లో ఉండి బాగా చూడు, డాక్టర్ రామన్ అంటే భారతదేశంలో ప్రసిద్ధి చెందిన న్యూరోసర్జన్ అని నీకు తెలుసా? ఆయన దగ్గర చదివినందుకు నేను ఎంతోగర్విస్తాను. ఎప్పుడూ నీకు ఆయన దగ్గర చదివే అవకాశం లేకపోయినా, కనీసం ఒక ఆపరేషన్ చూసే అవకాశం అయినా కలుగుతుంది. తప్పకుండా కొన్ని సంగతులు నేర్చుకో అని మరీ మరీ చెబుతుంటే ఆయన విజ్ఞానతృష్ణకు అంజలి ఘటించకుండా ఉండలేకపోయాడు అర్జున్. ఒక ప్రక్క చావుబ్రతుకుల సమస్యతో సతమతమవుతున్నా, చీఫ్ తనను సర్జరీలో అంతగా ప్రోత్సహిస్తున్నందుకు బాధపడాలో, విచారించాలో తెలియలేదు అర్జున్‌కి. మొదట్లో చీఫ్ మీద చాలా చీప్ ఇంప్రెషన్ ఉండేది అర్జున్‌కి. ఇప్పుడది మచ్చుకైనా లేదు.

డాక్టర్ రామన్‌గారు తన శిష్యుడికి, తన చేతులమీదుగా ఆపరేషన్ చేసారు. ఆయన ముట్టుకుంటే చాలు రోగం తగ్గిపోతుంది అన్నంత మంచిపేరు, ప్రజలకు అభిమానం ఉన్నాయి, ఆయన ఎడల ఆయన అంత ప్రఖ్యాతిగాంచడానికి కారణం, ఏ మేజిక్కు, ఏ లాటరీ లాంటివి కావు, సైన్సులో, సర్జరీలో ఆయన నిరంతర కృషి పట్టుదల, ఆయనను అంత ఎత్తున నిలబెట్టాయి. సముద్రాన్ని చిలకగా చిలకగా అమృతం వచ్చినట్లే, సైన్సు విడవకుండా చిలికి చిలికి సాధించారాయన కృషితో నాస్తి

దుర్భిక్షమని రుజువు చేస్తూ, ఆపరేషన్ చేసే ముందు ఎంతోమంది పేషెంట్లకు గుండు చేయించినట్లే డాక్టర్ మేధావికూడా గుండుచేయించుకున్నాడు. అందరినీ బల్ల ఎక్కించినట్లే, ఆయన బల్ల ఎక్కారు. తనకు దైవంతో సమానమైన తన గురువుగారి కాళ్ళకు నమస్కరించి, తన తలను ఆయన చేతిలో పెట్టి నిశ్చింతగా మత్తులోకి వెళ్ళిపోయారు, ఎనస్తీషియా టెస్ట్ సహాయంతో.

ఆపరేషన్ థియేటర్‌లో ఇన్‌స్ట్రుమెంట్స్‌లో కదలిక మొదలైంది. ఆ ప్రాణంలేని ఇన్‌స్ట్రుమెంట్స్ పేషెంటుకి ప్రాణం పోయడానికి, సర్జను సహాయంతో ప్రయత్నిస్తున్నాయి. చేతులకున్న చిన్న చిన్న వ్రేళ్ళు పెద్ద పెద్ద ఆపరేషన్లని సునాయాసంగా చేసేస్తాయి. నిజానికి ట్యూమర్ చిన్నదే, పనే పెద్దది. జాగ్రత్తగా ఉండడం అక్కడ మరీ పెద్దగా ఉండాలి. లేదంటే యమధర్మరాజు పొంచి ఉంటాడు, టక్కున ప్రాణాన్ని పట్టుకుపోతాడు. నాలుగుగంటలు ఇటు డాక్టర్‌కి, అటు ధర్మరాజుకి యుద్ధం జరిగింది. ట్యూమర్ తొలగింది; తల యధావిధిగా మూతపడింది. చిరిగిన బట్ట అతికినట్లు అతికేసారు, అతిజాగ్రత్తగా. బ్రతికున్న మనిషి శరీరాన్ని కొంచెంసేపు, చలన రహితంచేసి, దాన్ని కట్‌చేసి, మరలాకుట్టడం అన్నది అలవాటు ఆయన పనే అయినా అది సామాన్య విషయం కాదు.

డాక్టర్ మేధావి మెల్లగా కళ్ళు తెరిచిన తరువాత అందరి మనసులూ తెరిపిన పడ్డాయి. ఆయన మాట్లాడిన తరువాత అందరినోళ్ళకు పలుకులు వచ్చాయి. అంతవరకూ అందరిలో ఉన్నటెన్షన్ ఆయనలో ట్యూమర్‌లాగే బయటకు పోయింది. హాయిగా ఉంది. మేధావికి తలంతా భారంగా, పుండులా వుంది. అయినా అందులో ఎంతో సంతోషం. బెడ్ దగ్గర నిలబడ్డ అందరినీ గుర్తుపట్టి అమ్మయ్య నా మెమరీ పవర్ పోలేదు అనుకున్నాడు. బాధతో ఎప్పుడో చనిపోయిన అమ్మను గుర్తుతెచ్చుకొని, నోరారాపలికి, అమ్మయ్య నాకుమాట పోలేదు అని తృప్తిపడ్డాడు. చేతుల్ని అటూ ఇటూ కదలించి ఆనందంగా నా చేతులకేమీ పక్షవాతం రాలేదు. నేను ఆపరేషన్లు చేయవచ్చు అనుకొని హాయిగా గాలిపీల్చుకున్నాడు. తన బెడ్ దగ్గర నిలబడిన వారందరూ తనని ఆశీర్వదించడానికి వచ్చిన దేవతల్లా అగుపించారు. అందరికీ చేతులెత్తి నమస్కారం చేయాలనిపించింది. కాని చేతులు నీర్సంగా పైకి లేవలేదు. ఇంతకాలం పేషెంట్ల తాలూకు వాళ్ళు డాక్టర్ల వెనుక పడుతుంటే వాళ్ళ ఆరాటానికి చిరాకు పడేవాడు, వాళ్ళ కంగారుకి కోపం వచ్చేది, వారి ఆతృతకు ఒళ్ళు మండేది. ఇప్పుడు ఆ ట్యూమర్‌తోపాటు అన్నీ పోయాయి.

డాక్టర్ మేధావి క్షేమంగా ఇంటికి వచ్చేసాడు. సంఘమిత్ర అన్నయ్య ఇంటికి రాగానే మరలా అతనిని సంయుక్తకే అప్పజెప్పి కాకినాడ వెళ్ళిపోయింది, భర్తతో సహా మరలా తరువాత వస్తానని చెప్పి.

మేధావిని పరామర్శించడానికి వచ్చే పోయే జనంతో సంయుక్తకు ఊపిరి ఆడడం లేదు. ఆయన ఆ ఉక్కిరిబిక్కిరిలో చెప్పలేని ఆనందంగా ఉంది. పిడుగుపడుతుంది, పడుతుంది నాశనం చేస్తుంది అని భయపడితే అది వెళ్ళి సముద్రంలో పడినంత రిలీఫ్‌గా ఉంది సంయుక్తకు. డబ్బుపెట్టి కొనలేనిది ఆరోగ్యం. అది బజారులో దొరకదు. అందుకే అనారోగ్యవంతులకు తీరని ఆవేదన ఉంటుంది.

మేధావికి ఆపరేషన్ అయి రెండు నెలలు గడచింది. రెండు నెలలు సంయుక్త డాక్టర్‌గా, నర్సుగా, సేవకురాలిగా కంటికి రెప్పలా కాపాడింది. డాక్టర్ మేధావి ఎన్నోసార్లు తన మెమరీ పవర్ ఏమైనా దెబ్బతిందా అనే అనుమానంతో, గతాన్ని తలచుకోవడం మొదలుపెట్టాడు. అన్నీ గుర్తుకి వచ్చిన తరువాత అతనికి ఆకాశమంత ఆనందం కలిగింది. గతంలో ఏ సన్నివేశం తలచుకున్నా సంయుక్త తన ఎడల చూపించిన ప్రేమ, అనురాగం గుర్తుకి రాసాగాయి. తనకళ్ళకున్న చీకటిపొరలు తొలగినట్లు భావించాడు.

ఆ రోజు సాయంకాలం గార్డెన్‌లో కుర్చీలు వేసికొని కూర్చున్నారు, మేధావి సంయుక్త. ఇద్దరూ ఎవరి ఆలోచనలలో వారుండగానే, ఆకాశంలోకి పున్నమి చంద్రుడు వచ్చేసాడు. వెన్నెలవలను భూమిమీదను విసిరేసాడు. దాన్ని చూసి భయపడి, దొంగలా పారిపోయింది కారు చీకటి. తనతో దోబూచులాడుతున్నా మబ్బు తునకలను తప్పించుకుంటూ ఆకాశంలో వీరవిహారంచేస్తూ, వెన్నెల ప్రతాపాన్ని చూపిస్తుడు చంద్రుడు.

మేధావి ఆపరేషన్ అయిన తరువాత కాస్త ముభావంగా మారడం సంయుక్త గమనించకపోలేదు. 'మామయ్య జబ్బు తగ్గగానే యధావిధిగా అయిపోయాడు అనుకుంది. అలా అయినా ఫరవాలేదులే, క్షేమంగా ఉంటేచాలు అని సరిపెట్టుకుంది.'

'సంయుక్తా!' అన్న పిలుపుకి ఉలిక్కిపడి పలికింది. 'మీ ఆయన నిన్ను, నన్నూ కలిపి అనుమానించాడన్నావు కదా! నీ జీవితం ఎలాగు తిరిగి బాగుపడదు. అందుకే మీ ఆయన అన్న మాటల్ని నిజం చేద్దాం. మనం పెళ్ళి చేసుకుందాం. నీకు ఇష్టమేనా.' ఒక విద్యార్థిని అడిగినట్లే అడిగాడు.

ఈ ప్రశ్న వస్తుందేమో అనే అనుమానం ఆమెలో ఉన్నా, రాదేమో అనే భయం కూడా ఉంది. సడన్‌గా అడిగేసరికి పరీక్షకు ప్రిపేర్ కాని విద్యార్థిలా సమాధానం చెప్పలేకపోయింది.

'నీ కిష్టం లేకపోతే వద్దులే' కంగారుగా అన్నాడు, తానేమైనా తప్పు మాట్లాడానా అని ఆలోచిస్తూ 'అదృష్టం ఒకేసారి వస్తుంది కాలదన్నుకుంటే పోతుంది' అన్న సంగతి గుర్తుకి వచ్చి గాభరాగా అంది సంయుక్త 'నాకు అభ్యంతరం లేదు... కాని'...

'ఊ... కానీ చెప్పు. నేను పేషెంటునని అనుమానిస్తున్నావా?"



‘ఛ...’ నొచ్చుకుంటూ అంది. నేను మాత్రం రెండో పెళ్లిదాన్ని కాదా. నీవు అంగవికలుడివి అయినా నాకు అభ్యంతరం లేదు. నీ ఇష్ట ప్రకారమే చేసుకుందాం. మనం ఇద్దరం వయసుదాటిన వారం. మనం చేసుకునేది వయసులో కోరికలతో, చేసికునే పెళ్ళికాదు. ప్లస్సు, మైనస్సు అంటూ కూడికల తీసివేతలతో పిల్లలను లెక్కవేసికుని కనే వయసూ కాదు, మనది. అందుకే దానికి పెళ్ళి అని పేరు పెట్టకు మామయ్యా. రిజిష్టరులో సంతకాలు పెట్టేసి ఆ సంగతి నలుగురికీ తెలియడంకోసం చిన్న పార్టీ ఇద్దాం. ఆ పార్టీ అయినా కేవలం మనకు అక్రమ సంబంధం అంటగట్టకుండా, సంఘం నోటికి తాళం వేయడానికే. మనం చేసికునేది పెళ్ళికాదు. జస్ట్ తోడుకోసం, ఒంటరితనాన్ని తరమడం కోసం సహజీవనం అది ఉంది.

సంయుక్త చెప్పినదానికి మేధావి అంగీకరించాడు. మంచిరోజుచూసి పురోహితుణ్ణి పిలిచి ముహూర్తం పెట్టించారు. మరో నెలలోనే మంచి ముహూర్తం కుదిరింది. ఆ ఇంట్లో ఆ ఇద్దరూ తిరుగుతున్నా, త్వరలో పెళ్ళి చేసుకోబోతున్న జంటలా లేరువాళ్ళు. జీవితాన్ని, కష్టసుఖాల్ని కాచివడబోసిన ముదివగ్గుల్లా ఉన్నారు. నేను ఇకపై ఒంటరిగా బతకాల్సిన అవసరం లేదు అని సంయుక్త అనుకుంటే, ఇంట్లో అన్నీ చూసుకోడానికి, నా ఆరోగ్యం కాపాడుకోడానికి సంయుక్త ఉందిలే అని మేధావి నిశ్చింతగా ఫీల్ అయ్యాడు. వారి నిర్ణయం సంఘమిత్రకు మాత్రం మరింత ఆనందాన్ని కలుగచేసింది.

ఆ రోజు డాక్టర్ మేధావి ఇచ్చే పార్టీ సందర్భంగా హాస్పిటల్ స్టాఫ్ చాలామంది వచ్చారు. అదొక మెడికల్ కాన్ఫరెన్సులా ఉందిగాని టీపార్టీలాగా లేదు. ఎందుకంటే ఏ ఇద్దరు డాక్టర్లు కలిసినా మాట్లాడుకునేది వాళ్ళ కష్టసుఖాలు కాదు, పేషెంట్ల రోగాల గురించే అయిదేళ్ళపైనే కష్టపడి చదివాం మరి దాని గురించి మాట్లాడకపోతే ఎలాగ అన్నట్లు ప్రవర్తిస్తున్నారు.

అందరినోటిలోంచి ఒకటే మాట, మేధావి చాలామారిపోయాడు. మర మనిషి కాస్తా, మామూలు మనిషి అయిపోయాడు బ్రెయిన్ ట్యూమర్ పుణ్యమా అంటూ అని.

సంఘమిత్ర మాత్రం వచ్చిన దగ్గరనుండి సంయుక్తను ఏడిపిస్తూనే ఉంది, మా అన్నయ్యకు నా కూతుర్నిచ్చి చేద్దామనుకున్నాను. మధ్యలో అడ్డుతగిలి నీవు ఎగరేసుకుపోయావు అని. 'మరీ అన్యాయం మిత్రా, మరీ అంత ముసలి మాధవికి పడుచు భర్త ఎలా దొరుకుతాడనుకున్నావు? అందుకే నేను మధ్యలో రావాల్సి వచ్చింది' అని.

ఇల్లంతా లైట్లతో మిరుమిట్లు గొలుపుతూ ఉంది. మేధావికి ఆ పెళ్ళితో నూతన యవ్వనం వచ్చినట్లు ఓ పదేళ్ళు చిన్నాడిలా కనబడుతున్నాడు. అంతకుముందు మౌనాన్ని భోంచేస్తూ, సైన్సుని గాలిలా చేసికొని పీలుస్తూ ఉండే మేధావిలోని మార్పు అందరికీ వింతగానే ఉంది.

ఆ రోజు ఆ ఫంక్షన్‌కి ప్రత్యేక ఆహ్వానితులు డాక్టర్ రామన్‌గారు, మద్రాసు నుండి వచ్చారు. ఆయనకు ఒక మొమెంటో ఇవ్వాలని, ఆ ఫంక్షన్‌లో మేధావి 'చార్ మినార్' మెటల్‌తో చేసినది కొన్నాడు. ఫలాహారాలు, టీ అయిన తర్వాత అందరినీ ఉద్దేశించి, వచ్చిన వారికి, తనకు ఆపరేషన్ చేసిన రామన్ గారికి థాంక్స్ చెబుతూ 'చార్‌మినార్' ని అంధించాడు మేధావి.

ఆ ఫంక్షన్‌ను పురస్కరించుకొని డాక్టర్ రామన్‌గారు మాట్లాడటం ప్రారంభించారు.

"ఫ్రెండ్స్, ఈనాడు మేధావి ఇలా మనందరిలోనూ, ఆరోగ్యంగా తిరగడమేకాక,

ఒక ఇంటివాడు కావడం నాకు చాలా ఆనందంగా ఉంది. మనం ఒక మంచి సర్జన్ని కోల్పోలేదు అనే సంగతి మనకందరికీ తెలిసినదే.

మేధావి గురించి మీకు కొంతే తెలుసు. నాకు అంతా తెలుసు. ఎందుకంటే అతను నా విద్యార్థి. ప్రతి విద్యార్థి ఆయన నుండి విజ్ఞానాన్ని కాదు, పట్టుదలను, కార్యదీక్షను, క్రమశిక్షణనూ నేర్చుకోవాలి. ఎంతో శ్రద్ధగా చదివి మొదటిసారే డబల్ ఎం.ఎస్. పాసయ్యాడు.

మొదటిసారి పాస్ అయిన వాళ్ళందరూ తెలివైన వాళ్ళు, తప్పిన వాళ్ళు తెలివి తక్కువవాళ్ళు అని నా అభిప్రాయం కాదు. పరీక్షపాస్ అయిన వాళ్ళను, ఫెయిల్ అయిన వాళ్ళను రెండు భాగాలుగా విభజిస్తే మనం అదృష్టవంతులు, దురదృష్టవంతులు అని భాష్యం చెప్పుకున్నా తప్పులేదు అని నేను గట్టిగా చెప్పగలను.

బాగా చదివిన వాళ్ళు సమయానికి సబ్‌జెక్ట్ మరచిపోయి ఎగ్జామ్ తప్పవచ్చు. ఏదో నాలుగుముక్కలు చదివినవారు, ఆ నాలుగు ప్రశ్నలే లాటరీ తగిలినట్లు పరీక్షల్లో తగిలేసరికి అదృష్టం తన్నుకొన్ని ఎగ్జామ్ పాస్ కావచ్చు. ఇది ప్రతీవారికి తెలిసిన సంగతే.

కానీ, మేధావి ఆపరేషన్ విషయంలో మీకు ఇక్కడ తెలియని సంగతి ఒకటుంది, అది ఇప్పుడు చెబుతాను. ఆయన కసలు బ్రెయిన్ ట్యూమర్ లేదు. ఆపరేషన్ అంతా హంబక్ అంటానని పొరపాటు పడకండి. మేధావికి బ్రెయిన్‌లో ఉన్న ట్యూమర్ తొలగించడానికి నిజంగా చాలా శ్రమ పడవలసి వచ్చింది. కేసు క్రిటికల్ కండిషన్‌లోకి వెళ్ళిపోయింది. బ్రతుకుతాడు అనే ఆశ ఆ చివరి క్షణంలో కలుగలేదు. పైగా గోరు చుట్టు మీద రోకటి పోటు అన్నట్లు సడన్‌గా నా చేతులు ఒణకడం ప్రారంభించాయి. ఆ పరిస్థితి స్కల్ ఓపెన్ చేయకముందైతే, అసలు ఓపెన్ చేసేవాడిని కాదు. తీరా ఓపెన్ చేసిన తరువాత నా చేతులు వణుకుడు చూసుకొని నా శరీరం అంతా ఒణికింది. భయం వేసింది. అనవసరంగా మేధావి ప్రాణాలు పోగొడతానేమో. అనుకున్న సమయానికి డాక్టర్ అర్జున్ నా చేతులను తన చేతులుగా తీసికొని, నా మెదడుని తన మెదడుగా చేసికొని ఆపరేషన్ అంతా సక్సెస్ చేసాడు. కాబట్టి నిజానికి ఈ మెమెంటో ఇవ్వాల్సింది నాకు కాదు, అర్జున్‌కి అంటూ ఆ చార్‌మినార్ అర్జున్ చేతిలో పెట్టాడు. అర్జున్‌కి కంగ్రాట్స్ చెప్తుతూ, కరతాళ ధ్వనులు చేసారు. అర్జున్ ఆయన అలా చెబుతారని ఊహించలేదు. అందుకే ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

ఆశ్చర్యం నుండి తేరుకున్న మేధావి, మైక్ ముందుకి వచ్చి 'డాక్టర్ రామన్‌గారు చెప్పిన విషయం నాకు గర్వకారణంగాను, చెప్పరాని ఆనందంగానూ ఉంది. నా చేతిలో పెరిగిన బిడ్డ పడకుండా పరుగులు పెడుతున్న సంతోషం కలుగుతోంది నాలో. ఈ

విషయం ఇంతకాలం ఆపరేషన్ థియేటర్‌లోని వారందరూ నా దగ్గర దాచి, ఆశ్చర్యంగా ఈ రోజు చెప్పారు.

అర్జున్ అంత సమర్థుడనీ నాకు తెలుసు. మరి ఎందుకు పరీక్ష తప్పాడు అని మీరు అనుకోవచ్చు. అతనికి భయం, కంగారు ఎక్కువ. ప్రతీ డాక్టర్ ఒక మనిషే అతనికి అనుభూతులు, బాధలు, వేదనలు ఉంటాయి. కానీ, అవి పేషెంట్లవరకూ తీసికెళ్ళకూడదు. ఆపరేషన్ థియేటర్‌లో అడుగుపెట్టకుండానే ఆ మనస్తాపాల్ని గుమ్మం ఇవతలే జోళ్ళతోపాటు వదిలేసి ప్రశాంతంగా లోపలికి అడుగుపెట్టాలి. లేనట్లయితే ఎఫెక్టు పేషెంటు మీద చూపించాల్సి వస్తుంది. ప్రతీ డాక్టరుకి ఇంట్లోనో, హాస్పిటల్‌లోనో ఏవో చికాకులు ఉంటూనే ఉంటాయి. అవి వైద్యంలో కలసి పోకుండా, పాలను, నీటిని హంస వేరు చేసినట్లు వాటిని డాక్టరు వేరు చేయగలగాలి. ఆ శక్తి మాత్రం అర్జున్‌లో లేదు. నన్ను చూడగానే పిరికివాడై పోతాడు. నేను మాటలేకుండా పడి ఉండేసరికి, తనని నేను ఏమీ అనలేనని, సర్జరీలో విజృంభించాడు. నాలాంటి వాళ్ళకు బెదరకుండా అతనిని అతీతంగా తయారుచేయాలి అన్న ప్రయత్నమే అతను ఫెయిల్ కావడానికి కారణం. అంతేగాని కక్షగాని, అసూయగాని లేనేలేదు. అంటూ టేబుల్ మీదున్న మరో దండతీసి అర్జున్‌కి వేసాడు మేధావి. అదే తనకు పెద్ద డిగ్రీగా భావించి మనస్ఫూర్తిగా మేధావికి నమస్కరించాడు అర్జున్. అవి వట్టి పూల దండలా అనిపించలేదు అర్జున్‌కి. బంగారు పూలదండలా అనిపించింది. సంవత్సరాలు గడిచే కొద్ది స్కానింగ్‌లు ఎక్కువయ్యాయి, న్యూరో సర్జన్లూ ఎక్కువయ్యారు.

పెళ్ళయిన సంవత్సరంలోనే మేధావికి ఆడపిల్లలు ట్విన్స్ పుట్టారు. వెంటనే ఫామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించుకున్నాడు. కారణం అప్పటికే మేధావిని తెలియనివారు 'మీ మనుషులా' అని అడుగుతున్నందుకు.

1987లో హైదరాబాద్‌లో జరుగుతున్న న్యూరో సర్జికల్ కాన్ఫరెన్సుకివచ్చాడు, అర్జున్. కర్నూలు నుండి ప్రతి సంవత్సరం డిసెంబరు మూడవవారంలో భారతదేశంలోని ఒక్కో రాష్ట్రంలో ఆ కాన్ఫరెన్సు జరుగుతూ ఉంటుంది. అర్జున్ మేధావితో అన్నాడు 'సార్!' మా పెద్దాడు ఎం.ఎస్‌లో జాయిన్ అయ్యాడు. న్యూరో సర్జరీ మాత్రం మీ దగ్గరే చేస్తాడట' అని.

'ఏం నీ దగ్గరే చేయొచ్చుగా, నీవు నన్ను మించి పోయావుగా. అన్నాడు మేధావి. 'ఇంట వైద్యం ఒంట బట్టదు కదుసార్' అన్నాడు అర్జున్ అందరూ నవ్వారు.

నా పిల్లలను మాత్రం నీ దగ్గరకే పంపుతాను. ఆంధ్రదేశంలో ఆడ న్యూరోసర్జన్లు కనబడటం లేదు. అందుకే వాళ్ళిద్దరిని న్యూరోసర్జన్లని చేయాలని నా ఆశ అన్నాడు మేధావి భవిష్యత్తుపై ఆశలు పెంచుకుంటూ.



గుంటూరులో జరిగిన న్యూరోసర్జరీ సిల్వర్ జూబ్లీ (28-01-1996)
సందర్భంగా వ్రాసిన హాస్య కథ. దేవుడికి క్షమాపణలతో..

# బుర్రల కథ

ఆ మధ్య స్వర్గలోకంలో బ్రహ్మ ముసలివాడై మెదడు సరిగా పనిచేయక, సృష్టి కార్యాన్ని తిన్నగా నిర్వహించలేక పోతున్నాడని సరస్వతి నారధుల వారి దగ్గర విన్నవించుకుంది. అది విని నారధుల వారు ఒక సలహా యిచ్చారు. ఒంటిమీద బంగారం దాచుకొనడానికి మనకు లాకర్ల సౌకర్యంగానీ, కాపలాకు నౌకర్ల సహాయంగానీ లేదు కదా అందుకని బ్రహ్మగారిని, ఆ బంగారం చెడగొట్టించి, బంగారు మెదడుని చేయించుకోమని చెప్పు తల్లీ అప్పుడు ప్రజల బ్రతుకులు బంగారంలా వ్రాస్తాడు. కొందరికి నోట్లో బంగారం పన్నులున్నాయి గాని, ఎవరికీ తలలో బంగారం మెదడులు లేవు. మొట్టమొదటి బంగారు మెదడు పెట్టుకొన్న కీర్తి బ్రహ్మకు దక్కుతుంది. గిన్నీస్ బుక్ లోనికి ఎక్కవచ్చు. పైగా అన్ని లోహాల లాగయిది తుప్పు పట్టదు. బ్రహ్మతో తప్పుడు రాతలు రాయించదు అని.

సరేనని పతిదేవునితో చెప్పింది సరస్వతి. బంగారంతో మెదడు చేయించుకోవడానికి ఆయన వినలేదు. కావాలంటే ఒక తల తాకట్టు పెట్టి పని జరిపిస్తానన్నాడు. విడాకులిస్తానని బెదిరించింది. రంభ, ఊర్వశి, మేనక ఉన్నారుగా ఫరవాలేదన్నాడు. రొట్టెల కర్ర చూపించింది. అందరిలా ఒక్క దెబ్బ కాకుండా నాలుగు తలల మీద నాలుగు దెబ్బలు తినాలి అని భయపడి, భార్యకైనా చెప్పకుండా మోఘాల లిఫ్టులో భూమికి చేరుకున్నాడు బ్రహ్మ.

వైద్యుణ్ణి కలిసాడు. వైద్యుడు స్కానింగు రాసాడు. కాని అక్కడే ఓ పెద్ద చెక్కు వచ్చిపడింది. స్కానింగు ఒక తలకే చెయ్యాలా? నాలుగు తలలకి చెయ్యాలా? అని స్కానింగు వారు నాలుగు తలలకీ చెయ్యాలన్నారు. నాలుగింటికి నా దగ్గర డబ్బులేదు. అని గొణిగాడు బ్రహ్మ. దానితో డాక్టర్‌గారు కల్పించుకొని నాలుగు బుర్రలూ తీయించుకుంటే ఒకటి ఫ్రీగా చేయిస్తానని చెప్పారు. ఆ నాలుగో బుర్ర స్కానింగు ఖర్చు ఆపరేషన్ బిల్లులో అడ్జెస్ట్ చేసికోవచ్చని ఆయన ఊహ. అందరికీ బ్రహ్మ లాగే నాలుగు తలలుంటే ఎంత బావుండునో కదా, మా స్కానింగు సెంటరుకి బోలెడు డబ్బులు వచ్చేవి కదా, ఈ బ్రహ్మకు అసలు బుర్రలేదు. తన కొక్కడికేనా నాలుగు తలలు అని విసుక్కున్నాడు స్కానింగు ఆయన.

బ్రహ్మ స్కానింగు చేసినా ఆయన మొహం చూసి ఏమీ అర్థం కాక నాలుగు చేతులతో నాలుగు బుర్రలూ గోక్కున్నాడు.

స్కానింగు ఆయన ఊహించునట్లు నిజంగానే ఆ నాలుగు బుర్రలలోను మెదడు లేదు. అంతా మట్టే ఉంది. ఆ మట్టి చూసిన డాక్టరుగారు అబ్బా! ఎంత మంచి మట్టో, హైబ్రీడ్ గులాబీలు వేస్తే సంవత్సరమంతా పువ్వులే పువ్వులు అనుకొని ఎందుకైనా మంచిదని మోకాలుకి స్కానింగ్ చేయించాడు. ఆ మెదడు కాస్తా మోకాలిలో ఉంది.

అయితే అందుకే నన్నమాట భూమిపై యిన్ని అరాచకాలు, ప్రాణాలతో పరాచికలు, అకృత్యాలు, కరాళ నృత్యాలు, కత్తిపోట్లు ప్రజలకు పాట్లు అనుకున్నారు డాక్టర్‌గారు.

మోకాలిలో మెదడు తీసి తలలో పెట్టడానికి బ్రహ్మకు, డాక్టర్‌కు బేరం కుదిరింది. వైద్యుడు చెప్పిన ధరకు బ్రహ్మకు తల తిరిగి రిమ్మ తెగులు వచ్చింది. నా దగ్గర ఇప్పుడు అంత డబ్బు గట్రా లేదు. నగా నట్రా అమ్మి డబ్బు పట్టుకొని వస్తాను అని అర్జంటుగా ఆ వైద్యుడు తల ఓపెన్ చేసేస్తాడని భయమేసి పి.టి.ఉషను దాటుకుంటూ దారిలో కనబడిన రాకెట్‌ను లిఫ్ట్ అడిగి మరీ స్పీడుగా వెళ్ళిపోయాడు.

దారిలో డాక్టర్ల చేతిలో చనిపోయిన ప్రేతాత్మలు అక్కడ తిరుగుతూ బ్రహ్మను చూసి వెటకారంగా నవ్వాయి. ఈ లోపుగా మెదడు కాలిలో ఉంది కాబట్టి ఆ కేసు నాది అని ఆర్థోపెడిక్ సర్జన్, దానిని తీసి తలలో పెట్టాలి కాబట్టి ఆ కేసు నాది అని న్యూరోసర్జన్ కేసు కోర్టులో వేసారు.

ఆపరేషన్ సజావుగా జరిగితే తిరుపతిలో బ్రహ్మతో తలనీలాలు యిప్పిస్తానని సరస్వతి మొక్కుకుంది. మరి అక్కడ నాలుగు తలల జుట్టూ యివ్వాలా? ఒక్కటే సరిపోతుందా? అన్నది ఎవరు నిర్ణయిస్తారో తెలియదు.

కోర్టులో కేసు వాయిదాలు పడుతుంది. బహుశా అది యీ వరల్డ్ ఎండింగు వరకూ సాగవచ్చు. స్కాన్ సెంటర్ వారు రావణాసురిడి రాక కోసం ఎదురుచూస్తున్నారు. ఒకేసారి పది తలలకు స్కానింగ్ తీయవచ్చని ఆశ.

(ఎదుటివారి బుర్ర తినేవారికి ఇది అంకితం)



# బ్రెయిన్ స్కానింగ్ (స్పెషల్ ఫీచర్)

**"The only way to keep your health is to eat what you dont want, drink what you dont like; and do what you rather not."**

- Mark Twain

"ఆరోగ్యమే మహాభాగ్య" మన్నారు. అది అక్షరాల నిజమైన మాట. "డబ్బుకు లోకం దాసోహం" అయినప్పటికీ డబ్బుతో కొనలేనివి కొన్ని ఉన్నాయి. విజ్ఞానము, తృప్తి, ఆరోగ్యము.

పూర్వం రోజులలో మనుషులు కష్టజీవులు, మెషినరీ ఏమీ తెలియని వారు. వారి రెక్కలే వారి మెషీన్లు. వారు చాలా ఆరోగ్యంగా ఉండేవారు. అప్పుడు అనారోగ్యవంతులు ఉన్నప్పటికీ ఆ రోగాలు అంతుపట్టేవికావు, అంతుపట్టినా ఆకుపసరో, మిరియాల కషాయమో వాటి వైద్యానికి ఉపయోగించేవారు. ఆ రోగాలకి సరైన మందులు ఉండేవి కావు. డాక్టర్లూ అంతగా ఉండేవారు కారు.

రానురాను, కాలంలో మార్పు జరిగినట్లే మనుషులలోను, తద్వారా వారివారి ఆరోగ్యాలలోను మార్పు వచ్చింది. జనాభా పెరుగుదల, కొత్త జబ్బులు, వాటికి మందులు. ఒకటిని మించి ఒకటి పోటీపడుతున్నాయి. కొత్త కొత్త జబ్బులు, వాటికి కొత్త కొత్త మందులు. వైద్య విధానంలో ఎంతో అభివృద్ధి చెందాము మనం.

విదేశాలలో అయితే ప్రతీవారు ఎప్పటికప్పుడు జనరల్ చెకప్ చేయించుకుంటారు. కాని దురదృష్టం కొద్దీ మనలో చాలా మంది అసలు రోగం పూర్తిగా ముదిరిపోయి, పైకి కన్పించేంత వరకు కూడా డాక్టర్ని కలవం. కలలో కూడా తలవం. అథవా డాక్టర్ని కలిసినా డాక్టరు, ఏ మెజీషియన్ మాదిరో "అబ్రకదబ్ర" అని రోగాన్ని ఒక్క మంత్రంలో తగ్గించ వేయలేదని నిందలు వేస్తాం. ఇలాంటి మనఃప్రవృత్తితో డాక్టరు వృత్తికి కళంకం తెస్తాం.

అసలు యిదంతా జరగకుండా ప్రతీవారు కనీసం సంవత్సరానికొకసారైనా, జబ్బు ఉన్నా లేకపోయినా జనరల్ చెకప్ చేయించుకుంటే రోగాలను ముందే అరికట్టవచ్చు. వరద మొదలైన తరువాత గట్టు ఎలా వేయాలా అని ఆలోచించేకంటే వరద రాకముందే గట్టు కట్టడం అన్ని విధాల ఉత్తమం. "Prevention is better than cure" ఇది ఫాలో అయితే జబ్బులు ముదిరిపోయే అవకాశాలు ఉండవు.

మనదేశంలోని పేషెంట్లు డాక్టరుకి కో-ఆపరేషన్ యివ్వరు. కాని ఏమాత్రం

డాక్టరు నచ్చక పోయినా కోపాన్ని మాత్రం చూపిస్తారు. డాక్టరు దగ్గర రోగాన్ని దాచడం, ఎవరికి వారు ద్రోహం చేసికొనడమే.

ప్రపంచంలో తప్పులు చేయని వారు, జబ్బులు చేయనివారు ఉండరు. అందుకే డాక్టరు దగ్గర అన్ని విషయాలు వివరంగా చెప్పాలి.

☆ ☆ ☆

మనిషి శరీర నిర్మాణంలో అన్ని అవయవాలు ముఖ్యమైనవే అయినప్పటికి కాలుగాని, చేయిగాని, కన్నుగాని లేకపోయినా బ్రతకవచ్చు. కాని మెదడు, గుండె అవయవాలు లేకుండా భూమిపై ఉండడం సాధ్యంకాని పని.

శరీరం లోపలి భాగాలన్నిటి కంటే ముఖ్యమైనది మెదడు. (అది తక్కువ ఉన్నందువలన, పైభాగంలో ఉన్నందువలన కాదుసుమండి. పైన ఉండడం వలన ముందు తలకే దెబ్బతగిలే ప్రమాదం ఉంది. గుండె గుప్పెడు ఉంటే, మెదడు దోసెడు ఉంటుంది. చిన్న "కర్బూజాకాయ" అంత ఉంటుంది. అంత చిన్నది శరీరం మొత్తాన్ని తన గుప్పెట్లో పెట్టుకుంటుంది. శరీరంలోని స్పర్శ జ్ఞానాలు, అన్నీ మెదడు ద్వారా తెలుస్తాయి. అంతే కాదు, భావాలు, భయాలు, ఆలోచనలు, ఆందోళనలు, కోపాలు, నవ్వులూ అన్నీ, కాని మెదడు మాత్రం స్పర్శ జ్ఞానం లేనిది. అది స్పర్శ లేకుండానే శరీరాన్నంతటిని కంట్రోల్ చేస్తుంది.

(మెదడు తమకు లేదేమో అనే అనుమానం ఉన్నవారు ఈ బ్రెయిన్ స్కానింగ్ చేయించుకొని చూసుకోవచ్చు)

## చివరగా పేషెంట్లకు ఒక మనవి

పేషెంటు డాక్టరు దగ్గరకు వచ్చినప్పుడు, డాక్టరు పేషెంటుకి దేవుడు - జబ్బు సగం తగ్గినప్పుడు స్నేహితుడు, పూర్తిగా తగ్గి డిశ్చార్జ్ అయినప్పుడు మాత్రం దేవుడుకాదు, స్నేహితుడు కాదు, శత్రువు.

డాక్టరుని శత్రువులాగ చూడకండి. ఏ డాక్టరుకి తన చేతిలో రోగి మరణం చెందాలని ఉండదు. పేషెంటుయొక్క జబ్బు తగ్గేవరకూ పేషెంటుతోపాటు, డాక్టరుకు టెన్షను ఉంటుంది.

డాక్టరుచేతిలో రోగి ఎంతమంచిగా అయితే డాక్టరుకి అంత ఆనందం. డాక్టరు అధిరోహించే ఉన్నత శిఖరాలకి మెట్లు ఎవరో కాదు. బాగైన పేషెంటులే. ఒక్కొక్క జబ్బు నయమైన పేషెంటు డాక్టరుకి ఒక్కొక్క నిచ్చెన మెట్టు.

## CATSCAN

భౌతికశాస్త్రజ్ఞుడు, గాడ్‌ఫ్రీ హన్స్‌ఫీల్డ్ ఎక్స్‌రే డాక్టరు (రేడియాలజిస్టు) జేమ్స్ అంబ్రోసు సహకారంతో ఈ పరికరాన్ని కనుగొని ఉపయోగానికి తీసుకొనివచ్చారు.

ఈ అణుయుగంలో, మర మనుషుల యుగంలో ఎక్స్‌రేలను కంప్యూటరు ద్వారా శరీర భాగములను చిత్రీకరించడం ద్వారా వ్యాధిని నిర్ణయించడం దీని ప్రత్యేకత.

వ్యాధిగ్రస్తునకు ఏ విధమైన అవరోధం రాకుండా ఎటువంటి జబ్బునైనా కేవలం 10-12 నిమిషముల వ్యవధిలో వ్యాధి నిర్ణయం జరగడం దీని ముఖ్య ఉద్దేశ్యం. అంతేకాదు ముఖ్యమైన ఉపయోగం కూడ.

## CATSCAN ఇండియాలోకి ఎలా వచ్చింది?

అత్యాధునిక వ్యాధి నిర్ణయ పరిశోధనలో కంప్యూటరైజ్‌డ్ మోగ్రఫీ ఒక కలికితురాయి. పాశ్చాత్య దేశాలలో ఈ పరికరములు 12 సంవత్సరముల క్రితం ఉపయోగములోనికి వచ్చినా, మన దేశములో 1978వ సంవత్సరములో మొదటి స్కాన్ సెంటరు ఢిల్లీలో నెలకొల్పబడినది.

నిత్య జీవితంలోగాని, వైజ్ఞానిక పరిశోధనలోగాని, మరెందులోనైనా, ఏ రంగంలోనైనా ఏది అభివృద్ధి చెందాలన్నా ఒక ఆలంబన, అవకాశం, ప్రోత్సాహం కావాలి. తెలివితేటలు ఒక్కటే ఉంటే సరిపోవు. దానికి కావలసిన పెట్టుబడి, ఆర్థికంగా నిలదొక్కుకునే పరిస్థితులు కావాలి. మనకు బియ్యం ఉన్నంత మాత్రాన ఉపయోగం లేదు. వాటిని అన్నంగా మార్చడానికి పొయ్యి, గిన్నె, కట్టెలు, నీళ్ళు కూడా కావాలి.

మనదేశంలో ఈ స్కాన్‌ను ప్రసిద్ధిలోనికి తీసికొనిరావడం, భారతీయులకు అది అందుబాటులోనికి రావడం కాకతాళీయంగా జరిగింది. అత్యవసర పరిస్థితిలో తప్ప మన భారతీయులకు ఆలోచనాశక్తి, తెగింపు రావు.

ప్రతి జయము, అపజయము వెనుక ఒక స్త్రీ హస్తం దాగి ఉందని నానుడి, ఈ స్కాన్ సెంటరు మన భారతదేశంలోకి అందుబాటులోనికి రావడానికి కారణం ఒక స్త్రీ. (ధనమంతా ఆమె భర్తదే అనుకోండి.)

ఉత్తర భారతదేశంలో ఒకానొక ప్రముఖ ధనిక పారిశ్రామికవేత్త భార్యకు మెదడు వ్యాధి నిమిత్తం 1975లో ఢిల్లీలో డాక్టర్లు, మెదడు స్కాన్ నిమిత్తం అమెరికాగాని, ఇంగ్లాండుగాని వెళ్ళమని సలహా యిచ్చిన పిమ్మట శ్రీ రాజ్ కుమార్ గుప్తా ఆయన భార్యను తీసికొని అమెరికా వెళ్ళడం, అక్కడ ఈ స్కాన్‌ను గమనించడం జరిగింది.

పిమ్మట, అటువంటిది భారతదేశంలో పేద ప్రజలకు అందుబాటులో ఉండేందుకు వీలుగా ఆయన సి.టి.స్కాన్ ఇండియాలో నెలకొల్పడానికి కృషిచేసి

కృతకృత్యులైనారు. మానవులలో ఋషులైనారు. ప్రభుత్వ సహకారంతో ప్రయివేటు రంగంలో యునైటెడ్ గ్రూపు సంస్థవారు ఢిల్లీలో 1978లో మొదటి స్కాన్‌ను నెలకొల్పడం జరిగింది.

తదుపరి ఇతర భాగస్వాములతో ఈ సంస్థ దేశంలో ప్రతీ మారు మూల పట్టణంలోనూ ఈ స్కాన్ సెంటర్‌లు స్థాపించడం అతివేగంగా జరిగింది.

ప్రస్తుతం ఈ సంస్థ దేశంలో నలుమూలల రమారమి 150 సెంటర్లలో నెలకొల్పడం జరిగింది. మన రాష్ట్రంలో ఈ సంస్థవారిచే హైదరాబాదులో 1981లో హైదరాబాదు న్యూరలాజికల్ రిసెర్చి సెంటరు పేరుపై సోమాజిగుడలో సెలకొల్పబడినది. అప్పటి నుండి మన రాష్ట్రంలో హైదరాబాదులోనేకాక ఈ సంస్థ ద్వారా విశాఖపట్నం, గుంటూరులో కూడ బ్రాంచిలను నెలకొల్పారు. మెదడు స్కానుతో మొదలయిన ఈ సంస్థ ప్రస్తుతం శరీరములోని అన్ని అవయవాలను పరీక్ష చేసేందుకు వీలుగా Body Scanning ఈ మధ్యనే నెలకొల్పారు.

ఈ పరికరం ధనికులకు మాత్రమే అందుబాటులో ఉంటుంది. పేద వారికి లేదు అనే అపోహ ప్రజలలో సాధారణంగా ఉంటుంది. అది నిజంగా అపోహ మాత్రమే పేదవారికి కూడ ఈ సంస్థ వైద్యుల సలహా నిర్ణయం మేరకు ఉచితంగా తక్కువ ధరలో కూడ చేసి ప్రజలకు సేవ చేయుచున్నారు.

(తరంగిణి, 25-09-86)



# పెళ్ళి మీద పెళ్ళి

మంగళ వాయిద్యాల మధ్య మూడు ముళ్ళు వేశాడు సుధీర్. భాను మెడలో గుండెలమీదకి చేరిన కొత్త పసుపుతాడు మెత్తగా, మధురంగా ఎదను తాకింది. తాకిడికి ఆమెలో ఎన్నో వేల ఆనందతరంగాలు వెల్లువగా పొంగాయి. నేను నీ కోసమే పుట్టాను. ఇతని సాహచర్యంలో నా జీవితం ఆనందమయం చేయి భగవంతుడా అని మనసులోనే దేవుని ధ్యానించుకుంది.

సుధీర్, భాను ప్రక్కన ఠీవిగా కూర్చున్నాడు. అతని స్పర్శ బట్టలనుండే విద్యుత్ తరంగాలను అంతరంగంలోకి పంపుతోంది. వేకువనే లోకం వీణపై సంతోష సంగీతాన్ని ఆలపిస్తున్న భావన కలిగింది భానులో. ఎద పులకించింది. అది పయ్యెద తిలకించింది.

సుధీర్ ఓరచూపులు చూశాడు, భానువైపు. 'ఈమె నా భార్య అన్న భావన తప్పించి పెద్దగా ఏమీ కలగలేదు. అతనికి... పెళ్ళి చూపుల్లో ఐదు నిమిషాలు చూసాడు అంతే ఆమెను. ఆ ఐదు నిమిషాల్లోనూ తామరాకుమీద నున్న నీటిబొట్టు, అలా తాకీ తాకనట్లుగా చూశాడు.

అమ్మకు నచ్చింది. నాకూ నచ్చింది. మిగిలినవన్నీ పెద్దలే చూసుకుంటారు. తన పని మెడలో తాళి కట్టడమే అనుకున్నాడు.

'తల్లి మాట జవదాటడు పెళ్ళికొడుకు' పెళ్లిలో అందరూ అంటుంటే భాను మురిసిపోయింది. తల్లిమాట జవదాటనివాడు, భార్య మాటా దాటడు. అంటే ఆడవారిని నొప్పించే మనస్తత్వం కాదన్నమాట. నా మాట దాటకూడదని అనుకోనుగాని, నన్ను నొప్పించకుండా వుంటే చాలు అనుకుంది భాను. ఆమె పాసయింది టైపు షార్టుహ్యాండూ.

సుధీర్, భార్య ఏం చదివింది అనికూడా పట్టించుకోలేదు. నాకు ఎలాంటి భార్య కావాలో అమ్మకు తెలుసుకదా అనుకున్నాడు.

అంతకుముందు సుధీర్ తల్లి వసుంధరకు (భాను నాన్నగారు) నారాయణ రావుగారు కొద్దిగా తెలుసు. మంచి కుటుంబం, అణుకువ. అందం, చదువు ఉన్న పిల్ల భానుని సెలెక్ట్ చేసిందావిడ. పెళ్లిలో వసుంధర అడిగినవన్నీ జాగ్రత్తగానే ఇచ్చారు. పెళ్లికొడుకు తల్లిగా తనకు ఎక్కువ, మర్యాద చేయలేదు. అందరితో సమానంగానే చూశారు - అని అలిగిందావిడ.

నారాయణరావుగారు 'ఏమీ అనుకోకండి అక్కయ్యగారూ. ఆడపిల్ల పెళ్లికదా! చూసుకోవాలి. మీమీద మాకు కోపం కాదుకదా! ఏదో హడావిడిలో మీ దగ్గరకు త్వరగా రాలేకపోయాను' అన్నారు.



ఎవరైనా బ్రతిమాలితే కరిగిపోవడం మంచివారి లక్షణం. ఇంకా కరుడు గట్టుకుపోయి, బిగుసుకుపోవడం మర్యాదస్తుల లక్షణం కాదు. మగ పిల్లాడి తల్లిని, అంత బింకం చూపించకపోతే ఎలా అంటూ ఆవిడ మరింత బిగుసుకుపోయింది.

అత్తా పదునైన కత్తా అన్నట్లుందావిడ.

ఆకోపంతో నారాయణరావుగారిని, సుమతిని ఏమీ చేయలేక, తమ గూటికి చేరిన భానుమీద విరుచుకుపడింది.

గుడ్ల నీరు కుక్కుకుని, వడ్లగింజలోంచి బయట పడిన బియ్యపు గింజలా రక్షణ లేనట్లు ఫీల్ అయింది భాను. భర్తకు మాత్రం ఈ విషయం చెప్పలేదు భాను. ఇకపై బియ్యపుగింజకు తొడుగు, తనకు వేదనల వర్షంనుండి కాపాడే గొడుగు భర్తే అనుకుంది.

సుధీర్‌కి భార్య అంటే అంత ఇంటరెస్టు లేకపోయినా, ఆ తొలిదినాలు గడిచిన తరువాత, భార్యతో అనుబంధం పెరిగి ఆమె అంటే ఆరాధన ఏర్పడింది.

ఇంక అక్కడినుండి ప్రతీ దానికి భార్యను పిలవడం, అడిగి చేయించుకోవడం, సాయంకాలం పూలు తేవడం, షికార్లకు, సినిమాలకు తిప్పడం మొదలుపెట్టాడు. వసుంధరకు అది కన్నెర్రగా వుంది. 'ఎర్రగా, బుర్రగా వున్న పెళ్లాం వచ్చింది. బెల్లం అయిపోయింది. ఇంక నా కొడుక్కి నేను కనబడతానా. అప్పుడే కొంగున చేర్చుకుంది.

రేపు వేరే కాపురం అని, నా కొడుకుని నా నుండి వేరు చేస్తుందేమో అంటూ సణుగుడు మొదలుపెట్టింది. అవన్నీ భాను చెవిలో పడుతున్నా అత్తల గుణం ఇంతేకదా అని పట్టించుకోలేదు భాను. భర్త ప్రేమ సముద్రంలో తేలియాడే పైకపు ఓడలా తయారయింది. మనసు ముద్దయిపోయింది. భర్త ఎలా వంగమంటే అలా వంగడం, ఏమి చేయమంటే అది చేయడం అంతే.

'అమ్మా! అమ్మా!' పిలిచాడు సుధీర్.

'ఏం నాయనా, భాను వచ్చిన తరువాత ఈ ఇంటిలో అమ్మా అనే పిలుపు వినబడడంలేదు. ఆ మాయలాడి అంతా నిన్ను అకట్టేసుకుంది' అంటూ వచ్చింది వసుంధర.

'రేపు భాను పుట్టినరోజు. భానుకి తెలియకుండా సర్‌ప్రయిజింగ్‌గా ఒక చీర కొనాలి. నాకు చీరల సెలక్షన్ తెలియదుగా. నీవు రా అమ్మా బజారుకి' అన్నాడు.

కొడుకు తనకు విలువ ఇవ్వడం సంతోషమే కలిగించినా, ఆ బజారుపని కోడలికి మరింత రేపు సంతోషాన్ని కలిగిస్తుంది అన్న నిజాన్ని ఆవిడ జీర్ణించుకోలేకపోయింది.

అయినా సరే బజారుకి వెళ్ళి చీర తెచ్చింది. బజారునుండి వచ్చి పేకెట్ సీక్రెట్‌గా దాచేశాడు సుధీర్. ఇంటికి వచ్చేసరికి సుధీర్ స్నేహితుడు తరుణ్ వచ్చి వున్నాడు.

'హాయ్ తరుణ్' సంతోషంగా పలకరించాడు సుధీర్. సుధీర్, తరుణ్ ప్రాణ స్నేహితులు.

'ఏమిటి విశేషం' అడిగాడు సుధీర్.

'ఏం విశేషాలు లేకపోతే మీ ఇంటికి రాకూడదా ఏమిటి?'

'అబ్బే ఈ మధ్య బిజీ అయిపోయావుకదా! మా పెళ్లికి వచ్చినవాడివి మరలా ఇదే రావడం! పోనీ నాగురించి కాపోయినా, భాను పెళ్లికి ముందు నీకు తెలిసిన అమ్మాయేనటకదా. ఆమెను పలకరించడానికైనా రావచ్చుకదా!'

'మీ మధ్య పానకంలో పుడకలా నేనెందుకని రాలేదు. కొత్తగా పెళ్లియినవాళ్లను కొంతకాలం ఎవరూ డిస్టర్బ్ చేయకూడదు'

'ఓహో, అలాగా, అయితే నీకు పెళ్లయిన తరువాత మేముకూడా మీ ఇంటికి ఎక్కువగా రాకూడదని, ముందుగానే హెచ్చరిస్తున్నావా?'

'నీవు ఎలా అనుకున్నా నాకు ఇష్టమే' భాను కాఫీ, టిఫిన్ తెచ్చింది.

నిజంగా, భాను నీ భార్యకావడం నీ అదృష్టంరా సుధీర్. భానులో వంక పెట్టవలసిన గుణం ఏదీ లేదు. చంద్రునిలోనైనా మచ్చ వుందిగాని...'

'ఏమిటి భట్రాజువైపోతున్నావ్, తరుణ్' నవ్వుతూ అంది భాను.

'నేను నిజమే చెబుతున్నాను, భాను' అన్నాడు.

'నేను కూడా ఒప్పుకుంటున్నానులే, తరుణ్. నిజంగా భాను చాలా మంచి అమ్మాయి." భార్యవైపు కొంటెగా చూస్తూ అన్నాడు సుధీర్.

భాను సిగ్గుతో మొహం దించుకుంది. భర్త నోటివెంట వచ్చిన పొగడ్త, పొగడపు ఊయలనెక్కి ఊగినట్లు, మొగలి పొదలో ఎద దాగినట్లు సాగర తీరాన తరంగాలపై అలల ఒడలో సాగినట్లు అనిపించింది. మనసంతా మధుర భావనతో నిండిపోయింది.

'నేను త్వరలో స్టేట్స్‌కి వెళ్ళవచ్చు. అప్పుడే చెబితే మీరు నామీద విరుచుకు పడతారని, ఇప్పుడే చెబుతున్నాను' మెల్లగా అన్నాడు తరుణ్.

'హాయ్, కంగ్రాచ్యులేషన్స్. నాకు అక్కడినుండి మంచి షూ తేవడం మరచిపోకు!'

'ఇంకా నేను వెళ్ళనే లేదుకదరా'

'ఎప్పుడో అప్పుడు వెళతావుకదరా. భానుకి మాత్రం ఇండియాలో తయారై, అమెరికాకి ఎక్స్‌పోర్ట్ అయి, అక్కడ ఆ ఫారెన్ చీరలా చెలామణి అయ్యే మంచి చీర పట్టుకురా.'

ముగ్గురూ నవ్వుకున్నారు.

కొంచెం సేపు కూర్చుని వెళ్ళిపోయాడు తరుణ్.

ఆ మర్నాడు భర్త లేవకముందే ఎప్పటిలాగే స్నానం చేసేసింది భాను. అత్తింటికి వస్తున్నప్పుడు, ఈ చీర నీ పుట్టిన రోజుకి కట్టుకో అని తల్లి ఇచ్చిన చీర కట్టుకుంది.

బెడ్‌కాఫీతో భర్తను లేపడానికి వెళ్లింది. 'హాయ్. హేపీ బర్త్‌డే' అంటూ భార్యను దగ్గరకు లాక్కుని ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు సుధీర్.

'అదేమిటి, చీర నేను ఇవ్వకుండానే తీసి కట్టుకున్నావా? నీకు సర్‌ప్రయిజింగ్‌గా ఇవ్వాలనుకున్నానే' అన్నాడు సుధీర్.

'ఏమిటి, చీరేమిటి' ఆశ్చర్యంగా అడిగింది భాను. 'ఈ చీర నేను నీ పుట్టినరోజుకోసం కొన్నదికదూ!'

'కాదండి. ఇది అమ్మ కొనింది. మీరు నా చీరలు అన్నీ చూడలేదుకదా!' అంది.

'అయ్యో. అయితే నేను సరిగ్గా ఇలాంటి చీరే పింక్ కలర్‌కి రెడ్ బోర్డరున్నదే కొన్నా' అంటూ డ్రాయర్ తెరిచి చీర ఇచ్చాడు.

'థాంక్స్. ఫరవాలేదులెండి' అంటూ గబగబా ఆ చీర విప్పేసి భర్త కొన్న చీర కట్టుకుంది. అచ్చు రెండూ ఒకలాంటివే.

భర్తకాళ్లకు నమస్కరించింది. ఎందుకో సుధీర్ మనసు చివుక్కుమంది.

ఆ చివుక్కుమనడాన్ని తల్లి ఆసరాగా తీసుకుని కథ అల్లేసింది.

'మనం ఆ చీర కొన్నామని చూసి వుంటుందిరా. అందుకే మీకంటే ముందు అమ్మ కొనిచ్చిందిలే అని కేర్‌లెస్‌గా ఎలా కట్టుకుందో చూడు' అంది.

ఆ మాటలు అతనిపై చాలా ప్రభావం చూపాయి. ఆ రోజంతా మూడీగానే వున్నాడు సుధీర్. సాయంకాలం భార్యను సెకండ్‌షోకి తయారుకమ్మన్నాడు అదీ యధాలాపంగానే.

'సినిమాకు తీసుకెళితే ఆ సినిమా కూడా మీ అమ్మతో చూసేశాను అనవుకదా' అన్నాడు నిష్ఠూరంగా.

'ఛఛ అదేమిటండి. ఎందుకంటాను. ఒకవేళ నేను చూసినా మీతో చూసిన ఆనందం అంతకుముందు చూసినప్పుడు వుండదుకదా'

'ఎంతయినా సెకండ్ సెకండే'

'వట్టి సెకండేకాదు. ట్వంటీ సెకండ్ అయినా సరే మీతో పంచుకునే తృప్తి ఎందులోనూ వుండదండి' అంది భర్తను అనునయిస్తూ.

కాస్త స్థిమితపడ్డాడు సుధీర్. సినిమానుండి వచ్చిన తరువాత మూడీగా వున్న భర్తను తానే కవ్వించి, నవ్వించింది, భాను.

ఆమె నవ్వులలో, ఆ సన్నిధిలో ప్రొద్దుటినుండి పడిన మనస్తాపం మరచిపోయాడు సుధీర్.

కాని ఆ చిన్న సంఘటనే కుటుంబ కలతలకు బలమైన విత్తనం అయింది.

కొడుకు, కోడలికి ఎక్కువ ప్రిఫరెన్స్ ఇవ్వడం, ఆమెను ఎక్కువగా ప్రేమించడం వసుంధరకు నచ్చలేదు. తన స్థానం దిగజారిపోతున్నట్లు భావించుకుంది.

ఆ వయసువారికి అలా ప్రవర్తించడం సహజమని, అలా ప్రవర్తించడమే సరియైన మార్గమని; భార్యను నిర్లక్ష్యం చేసి, తల్లి కొంగు పట్టుకు వేళ్లాడడం, మంచి పద్ధతి కాదని ఆవిడ అనుకోలేదు. కొడుకుపై కోపం పెంచుకుంది.

భర్త ఏనాడూ, వసుంధరపై నోరెత్తలేదు. భార్యగా ఆయనకు ఆవిడ ఏ లోపం చేయలేదు. తల్లిగా, పిల్లలకు అంతకన్నా లోటు చేయలేదు. దానితో ఇంట్లో అందరికి ఆవిడంటే మంచి అభిప్రాయమే. భార్య మంచిది అని సత్యవంతుడు, అమ్మ మంచిది అని పిల్లలు ఎప్పుడూ అనుకుంటారు.

అత్త మంచిది అని భాను అనుకోలేకపోయింది. ఎందుకంటే అత్త స్థానం కొత్తది.

అది అసూయ ద్వేషాలతో నిండి వుంది. కోడలంటే చులకనభావంతో పండిపోయింది. పాపం తాను అత్తగారి హోదా క్రింద సాదా సీదా కోడలిలా నలిగిపోతుంది.

'అబ్బాయ్! నేను సినిమాకు వస్తానంటే మీ ఆవిడ ఏమందో తెలుసా?' ఒకరోజు కొడుకు రాగానే పురాణం విప్పింది. అసలే ఆఫీసులో, ఆ రోజు లెక్కలు సరిగా తేలక విసుగ్గా వున్నాడు సుధీర్. కోపంగా వుడికిపోతోంది మనసు.

'ఏమంది?' మొహం చిట్లించాడు.

'నేను మీతో సినిమాకు రాకూడదట. అసలే తలనొప్పికదా, సినిమా చూస్తే ఆ శబ్దానికి మరీ ఎక్కువవుతుంది అంది. నన్నూ రమ్మన్నావని, ప్రొద్దుటినుండి చిరచిరలాడుతుంది. ఇంతకుముందు నన్ను నీవు ఎన్నిసార్లు తీసుకెళ్లలేదు సినిమాకు. ఈవేళే కొత్తగా తీసుకెళ్తున్నావా? ఈ రోజు సినిమాకు వద్దంది. రేపు ఇంటిలోనే వుండొద్దంటుంది. ఏవో అనుకున్నాను. నీ పెళ్లాం గట్టి పిండమేరా, నిన్ను ముక్కుపట్టుకుని పిండేటట్లు కనబడుతుంది. కాస్త కంట్రోల్‌లో పెట్టుకో నాయనా. రౌతు మెత్తనివాడయితే, గుఱ్ఱం మూడుకాళ్లమీద నడుస్తుందట' అక్కసుగా అంది వసుంధర.

'భానూ, భానూ' గట్టిగా అరిచాడు సుధీర్. వంటగదిలో కాఫీ కలుపుతున్న భాను కంగారుగా వచ్చింది.

'ఏం, అమ్మను సినిమాకు వద్దన్నావట' కోపంగా అడిగాడు.

'నా ఉద్దేశం' ఆమె మాట పూర్తికానేలేదు.

'ఇక్కడ నీ ఉద్దేశ్యాలు ఎవరూ అడగలేదు. ఎవరికీ అక్కరలేదుకూడా. పేనుకి పెత్తనం ఇచ్చినట్లుగా ప్రవర్తించకు. అమ్మకూడా మనతో ఎప్పుడూ సినిమాకు వస్తుంది అన్నాడు.

నిజానికి ప్రొద్దుటినుండి తలనొప్పి, తలనొప్పి అంటూ తల పట్టించుకుంది భానుచేతనే. అబ్బ అసలే నాకు బి.పి ఈ శబ్దాలు భరించలేకపోతున్నాను అంటూ రేడియోగాని, టి.విగాని పెట్టనివ్వలేదు. టి.విలో మనం తక్కువ సౌండు పెట్టుకుని ంటాం. సినిమాలో సౌండు చాలా ఎక్కువగా అనిపిస్తుందని, అసలే ఆ సినిమాలో టింగులు ఎక్కువ వున్నాయని తరువాత వెళదాంలెండి సినిమాకు' అంది అత్తగారితో. నని తీసుకెళ్లడం ఇష్టం లేక అన్నదని అర్థం చేసుకుని కొడుకుతో చెప్పింది ఆవిడ.

వచ్చే కన్నీటిని కళ్లల్లోనే ఆపుకుని వంటగదిలోకి వెళ్లిపోయింది భాను.

కనీసం ఆ రాత్రి సుధీర్ భానుని నొప్పించినందుకు సారీ అన్న మాటకూడా అనలేదు. 'భార్య అంటే పడి వుండేది' అన్న మాట అతని తలకు బాగా ఎక్కించేసింది

తల్లి. తల్లి మాట వేదం, తండ్రి చెప్పిందే నీతి అన్నట్లుగానే వుంటాడు సుధీర్.

అప్పటినుండి సినిమా విషయం వస్తే ఏం మాట్లాడకుండా ఊరుకుంటుంది. రమ్మంటే వెళ్లడం, వద్దంటే మానడం అలవాటు చేసుకుంది భాను. దానికీ కోపం వచ్చింది వసుంధరకు. 'ముంగిలాగ మాట్లాడదురా నీ పెళ్లాం. నేను రావడం ఇష్టం లేనట్లుంది. ఎంత మూడీగా వుందో చూడు' అని అంటుంది. వసుంధర కొడుకుతో సినిమాకి వెళ్లినప్పుడల్లా.

'పోనీలేమ్మా. తను ఎలా వుంటే ఎవరికి కావాలి' అని సుధీర్ అంటే ఆమె మనసు చల్లబడేది.

సుధీర్ ఆఫీసుకి వెళ్లగానే తన కొడుకుని ఎంత అపురూపంగా పెంచింది, కోడలు ఎంత నిర్లక్ష్యం చేస్తున్నదీ రికార్డు విప్పేది భర్త దగ్గర అదీ భాను వినేలా.

భానుని ఎక్కువ బాధపెడితే భర్తతో ఎలాగూ ఎక్కువ సహకరించదు. అప్పుడు కొడుకు మనసు కోడలి ఆధీనంలో వుండదు. తన ఆధీనంలోనే వుంటుంది అని ఆవిడ అభిప్రాయం. ఆ అభిప్రాయం భాను బ్రతుకులో కంటకప్రాయం అయి, కంటినిండా నీళ్లతో ఎప్పుడూ దర్శనమివ్వడం అలవాటైపోయింది.

ఇప్పుడు ఏమన్నానని ఆ ఏడుపు. వుండీ తినలేక, సుఖాలు అనుభవించలేక అంటూ తిరిగి తిరిగి భానునే అంటుంది.

తనవాళ్లింట్లో వుంది. భర్త తన మాట వినడు. వినకపోయినా అర్థం చేసుకోడానికి ప్రయత్నించడు. అలాంటప్పుడు చెవిటిదానిలా నోరుమూసుకొని పడి వుండడం ఉత్తమం అనే నిర్ణయానికి ఏనాడో వచ్చేసింది భాను.

పండుగకు పిలవడానికి భాను తండ్రి వచ్చాడు. కొడుకు అత్తారింటికి వెళితే, భార్య అటాచ్‌మెంట్ పెరిగిపోతుందని భయపడింది వసుంధర.

'ఎందుకు నాయనా పండుగకు వెళ్లడం. మీ మామ మహా పెళ్లిలో చేసేశాడుకదా మర్యాదలు. ఇంక పండుగకు చెయ్యాలి. నీవు అక్కడకు వెళ్లావంటే నీకు మందో మాకో పెట్టే రకం. మానుండి నిన్ను వేరుచేయాలని తండ్రీ కూతుళ్ల పన్నాగం. అందుకే ఈ పండుగ పిలుపులు' అంటూ ఎక్కించింది.

సుధీర్‌కు చిన్నప్పటినుండి తల్లి ఎంత చెబితే అంత తప్పించి, దేనికీ తర్కించేవాడుకాదు. అదే అలవాటైపోయింది అతనికి. ఇప్పుడు అదే పద్ధతిలో నడుస్తున్నాడు. అమ్మ నా మేలుకోరుతుందికదా అని మాత్రమే అనుకుంటాడు. భార్యగురించి ఆలోచించడు. ఈ ఇంట్లో ఆమెకేం తక్కువ అనుకుంటాడు.

వసుంధర ప్రభావంతో సుధీర్ అత్తారింటికి వెళ్లలేదు. శలవు లేదంటూ దాటేశాడు.

భాను ఒక్కర్తీ వెళ్లి మూడురోజులు వుండి వచ్చేసింది. వస్తూ వస్తూ భర్తకు, అత్తమామలకు కూడా బట్టలు తెచ్చింది.

ఆ బట్టలు వసుంధరకు నచ్చలేదు. సణుక్కుంటూనే తీసుకుంది. ఆ బట్టలను కామెంట్ చేస్తూ ఏదో ఒకటి అంటూనే వుంది. మా అమ్మాయికైతే మేం ఇంత తక్కువ రకం కొనం. మరలా ఎవరూ వంక పెట్టకుండా వుండేవి, నాలుగు డబ్బులు ఎక్కువైనా సరే కొంటాం' అంది.

అప్పటికే అత్తగారి నోటి ధోరణికి అలవాటుపడిపోయింది భాను. అందుకే ఏమీ ఎదురుచెప్పడంలేదు. ఆవిడ అన్నవీ, భర్తకు చెప్పడం లేదు.

'అమ్మాయ్ భానూ!' సత్యవంతుడుగారు పిలిచారు.

'వస్తున్నాను మామయ్యా, అంటూ గబగబా వచ్చింది భాను. అప్పుడే వసుంధర కాఫీ అడిగింది. ఆ కాఫీ వెంటనే ఇవ్వలేదని అలిగింది వసుంధర.

'అవునులే నా మీద ఎందుకుంటుంది. మామగారైతే అప్పుడప్పుడైనా వెనకేసుకు వస్తారని, మోజంతా చూపిస్తుంది. అరిచి అరిచి అదే ఊరుకుంటుందిలే అని నిర్లక్ష్యం లేదంటే తనే కాసుకు తాగుతుందిలే అని మొండితనం. అసలు మా రోజుల్లో అయితే అత్తగారంటే గడగడలాడేవాళ్లం. మామగారి ఎదుటకు, బావగార్ల ఎదుటకు వచ్చేవాళ్లమే కాదు. ఇప్పుడు అంత మర్యాదలెక్కడివిలే. మామగారితో కలిసి కూర్చుని భోంచేసే రోజులు. అయినా ఏమిటో, మరలా అన్నీ తక్కువయిపోతున్నట్లు టెక్కులు' వసుంధర వాక్ ప్రవాహం ఆగడంలేదు.

'వస్తున్నానత్తయ్యా. మామయ్యగారికి అర్జంటుగా పుస్తకం కావాలంటే ఇచ్చి వస్తున్నాను. ఇదిగో ఒక్క నిమిషంలో మీకు కాఫీ తెస్తాను'

'అక్కరలేదులేమ్మా. ఇంకా మీ మామగారి పనులో, మరెవరి పనులో వుంటే చూడు; మరీ అంత అత్తగారిమీద ప్రేమ కురిపించేయనక్కరలేదు' ఈసడింపుగా అందావిడ.

'నేను మాత్రం ఖాళీగా లేను కదత్తయ్యా' సంజాయిషీ ఇస్తున్నట్లుగా అంది.

'అయ్యో, నీకెక్కడి తీరిక తల్లీ. పని, పని, పని, ఒకటే పని. నిన్ను రాచి రంపాన పెట్టేస్తున్నానుకదూ! నీకసలు తీరికే వుండడంలేదుకదూ. అనమ్మా. అను. రోజులు నీవి. పడేది నేను. తప్పుతుందా? మరి. అత్త పెట్టే ఆరళ్లు కనిపిస్తాయిగాని, కోడళ్లు చేసే కొంటెపనులు కనబడవు అని ఊరికే అన్నారా.' అదే విధంగా సాగిందావిడ ధోరణి.

భానుకి తలతీసికెళ్లి రైలుకింద పెట్టాలన్నంత కోపం వచ్చింది. తనను తాను తగ్గించుకుంది. స్వతహాగా నెమ్మదస్తురాలు భాను. అత్తగారి మీద కోపం వచ్చినప్పుడు

తల్లి మాటలు టేప్ రికార్డర్‌లాగా, వాక్‌మేన్‌లాగా చెవుల్లో గింగురుమంటాయి. 'అత్తలన్న తరువాత ఏదో అంటూ వుంటారు. అవి పట్టించుకోకు. అణకువగా మసలుకో. నేను అంటే ఎంత ఈజీగా తీసుకుంటావో, మీ అత్త ఏమైనా అన్నా అలాగే తీసుకోవాలి. పలానావారి ఆడపడుచు గయ్యాళిది అని ఎవరూ అనుకోకూడదు. నిదానమే ప్రధానం భానూ, గుర్తు పెట్టుకో. ఎంత ఓర్చుకుంటే నీ సంసారం అంత బావుంటుంది. ఇంట్లో ఎవరినీ నొప్పించకమ్మా!' అని.

'మరి నన్ను నొప్పిస్తే ఏం చేయనమ్మా' ఎదురుగా లేని తల్లిని ఎదలోనే ప్రశ్నించింది భాను. దానికి జవాబులేదు. ఉన్నా రాదు కూడా.

ఆ రాత్రి భర్త మంచి మూడ్‌లో ఇంటికి వచ్చాడు. అతని సంతోషంలో పాలుపంచుకుందామని ఎంత ప్రయత్నించినా మనసు సహకరించలేదు. అత్తగారి మాటల్ని మరచిపోలేకపోయింది.

'ఏయ్, ఏమిటా ఏడుపు మొహం. ఛ, ఛ ఇంటికి వస్తే ఒక సంతోషం లేదు. సరదా లేదు. ఏదో భూభారాన్నంతా నీవే మోస్తున్నట్లు ఆ మొహం ఏమిటి?' కసురుకున్నాడు సుధీర్ తల్లి ఎదురుగానే.

'ఏమోరా, ఈ పిల్లను నీకు కట్టబెట్టి నీ గొంతు కోశానేమోనని బాధపడుతున్నాను. నీ జీవితంలో ఓ మురిపెంలేదు. ముచ్చటా లేదు. ఈ తప్పంతా నాదేరా సుధీర్. ఆడవాళ్లు ఇంటెడు చాకిరీ చేసుకుని, భర్త వచ్చేసరికి చక్కగా తయారై నవ్వులతో ఎదురు చూస్తారు. మీ ఆవిడకు నేను స్నానం చేయమన్నా కోపమే. పూలు పెట్టుకోమన్నా కోపమే' అని మెల్లగా సన్నాయి నొక్కులు నొక్కింది.

'సరేలేమ్మా. సుఖపడడానికికూడా అదృష్టం వుండాలి. భాను ఎప్పుడూ స్మశానంలో కాపురం చేస్తున్నట్లు ఏడుపు మొహంతోనే వుంటుంది. నేను అలా బయటకు పోయి వస్తాను' అంటూ వెళ్లిపోయాడు సుధీర్.

భాను నీరుకారిపోయింది. గబగబా స్నానంచేసి తయారవుదామనే అనుకుంది. 'భానూ ఆకలిగా వుంది. కొంచెం పకోడీలు వెయ్యి' అన్న అత్తగారి మాటతో ఆ పనిలో పడింది. ఈ లోపుగా భర్త రావడం, వెళ్లిపోవడం కూడా జరిగిపోయింది తన ప్రమేయం లేకుండానే.

భర్త వచ్చేసరికి చక్కగా తయారై కూర్చుంది. భాను తయారవడం గుర్రుగుర్రు చూస్తూనే వుంది వసుంధర.

భర్తతో కలిసి తిందామని అన్నం తినలేదు. రాత్రి పన్నెండుదాటిన తరువాత వచ్చాడు సుధీర్. భార్యవైపు కన్నెత్తి కూడా చూడలేదు.



'అన్నం బయట తినేశాను' అన్నాడుగాని నీవు తిన్నావా అని అడగలేదు. అలా అడిగేంత అనురాగం ఉన్నవాడైతే భార్య అంతరంగాన్నే గ్రహించేవాడు.

మనసులో లావాలు పొంగుతుంటే కంటిమీద కునుకు రాకుంటే, అలాగే ఎప్పుడో ఆకలి కడుపుతో నిద్రపోయింది భాను. చీకటి ఒకటే తోడుగా ఆమెకు మెలకువగా వుంది.

తెల్లవారీ తెల్లవారక ముందే అత్తగారి పిలుపుతో ఉలిక్కిపడింది. అప్పుడప్పుడే నిద్రపట్టిందేమో ఆవిడ అరుపులకు గబుక్కున లేచింది. దానితో అంతా తలంతా దిమ్మ అనిపించింది.

'ఏమిటీ ఏడుపు మొహం నీవూనూ. అసలు నా కొడుకుని మనశ్శాంతిగా బ్రతకనిస్తున్నావా? వాడు అసలే అమాయకుడు. నీది రాయిలాంటి మనసు. పడక పడక నీపాలబడ్డాడు. వాడి నెత్తిన పాలుపోయడం మాని, నిప్పులు పోసినట్లున్నాను. అందుకే నీలాంటిది దొరికింధి. అలా నీరసంగా వుండకపోతే వాడితో హుషారుగా గడపవచ్చు కదా!''

ముళ్ల కుర్చీమీద కూర్చోబెట్టి, కంఫర్ట్‌గా కూర్చోమని అజ్ఞాపించినట్లు అందావిడ.

భానూ అన్న పిలుపులో వేల వేల అసూయారాగాలు, మరికొన్ని వేల ద్వేషాల స్వరాల వుంటాయి. చెవిటిదానిలా అన్నీ భరిస్తూనే వుంది భాను. ఏ విషయం సుధీర్ నోటబడినా తల్లికే సపోర్టుచేసి భార్యనే మందలిస్తున్నాడు భాను.

తల్లి అతనికి పుట్టినప్పటినుండి తెలుసు. ఆమె మనసు ముత్యం అని అతని భావన. కొత్తగా వచ్చింది భాను. ఆమె మనస్తత్వమే మంచిది కాదేమో. అందుకే ఇంట్లో చికాకులు అనే అనుకుంటాడు సుధీర్.

ఒక్కోసారి తండ్రి దగ్గరకు వెళ్లిపోదాం అనుకుంటుంది భాను. కాని అప్పులు చేసి పెళ్లిచేసిన తండ్రి తననుచూసి ఢీలా పడిపోతాడు. కూతురు బ్రతుకు బాగులేదంటే తట్టుకోలేడు అనుకుని ఊరుకుంది.

పెళ్లినాడు ఆమె శ్రీదేవి. ఇప్పుడు భూదేవి. అప్పుడు డబ్బు ఇవ్వక తప్పలేదు. ఇప్పుడు సహనాన్ని ప్రదర్శించకా తప్పడంలేదు.

సుధీర్ ఆఫీసు వాళ్లందరూ అరకువేలీ జాలీ ట్రిప్ వేసుకున్నారు కుటుంబాలతో సహా. ఆ విషయం విన్న భాను మనసు నెమలివలె నాట్యమాడింది. ఇంటినుండి అలా బయటకు వెళితే భర్త తనను అర్థం చేసుకుంటాడనుకుంది. అన్నీ చకచకా సర్దేసుకుంటుంది. ఆమె అలా హుషారుగా తిరుగుతుంటే వసుంధరకు పదిరోజులు జ్వరంతో మూలన పడినంత నీర్సంగా వుంది.

ఆమె మెదడులోని కుళ్లు కళ్లల్లోకి చేరి ఒళ్లంతా పాకిపోయింది.

ఏ వంకతో ఆ ప్రయాణం మాన్పించాలా అని ఎదురుచూస్తుంది. ఈ లోపులో కూతురు సుజాత వస్తున్నట్లు టెలిగ్రాం రావడంతో అది మంచి అవకాశంగా భావించి కొడుకుతో చెప్పింది.

'చెల్లాయ్ వస్తే రానీయమ్మా. ఇది వరకు భాను లేకముందు ఎన్నిసార్లు రాలేదు. ఎన్నిసార్లు వెళ్లలేదు అన్నాడు సుధీర్'.

'అదేమిటిరా, రాక రాక ఆడపడుచు వస్తుంటే వదినగారు తగుదునమ్మా అంటూ పిక్‌నిక్‌కి వెళితే అదేమనుకుంటుంది. ఈ పిక్‌నిక్‌లు ఎప్పుడూ వుండేవేగా. పైగా నాకు నడుంనొప్పి, లేవలేకపోతున్నాను. సుజాత వస్తే ఎలా?' అంది.

'చెల్లాయ్ ఎప్పుడు వచ్చినా వంటపని అంతా తానే చేస్తుందిగా' అన్నాడు.

'చేస్తుంది లేవోయ్. అయినా అన్నగారి పెళ్లయిన తరువాత కూడా పుట్టింట్లో అది రెస్టు తీసుకోకపోతే ఎలా. వాళ్లాయన ఏమనుకుంటాడు. ఇక్కడికి వచ్చినా పనేనా అనుకోడూ? అసలు ఆడవాళ్లను అప్పుడప్పుడు పుట్టింటికి ఎందుకు పంపుతారనుకున్నావు. అత్తింట్లో అలసిన పిల్ల నాలుగు రోజులు విశ్రాంతిగా వుంటుందని, మామూలుగా అయితే వంటింట్లో ఆడాళ్లకు ఆదివారాలు సెలవుదినాలు వుండవుగా. ఆ పుట్టిల్లే ఆదివారాలు తెలుసా?' అన్నాడు తండ్రి. తండ్రికూడా అలా అనే సరికి ఇంక తర్కించలేదు సుధీర్. కోడలి ప్రోగ్రాము ఆగిపోవడంతో ఈసారి వసుంధర మనసు నెమలిలా నాట్యమాడింది. ఆ ఇంట్లో అత్తో, కోడలో ఇద్దరిలో ఎవరో ఒకరే సంతోషంగా వుంటారు. ఇద్దరూ కలిసి ఆనందించే సన్నివేశమే లేదు.

అరకువేలీకి ఒక్కడూ వెళ్లాడు సుధీర్. అందరూ భార్యలతో వస్తే తానొక్క ఆంజనేయుడిలాగా, భీష్ముడిలాగా ఒంటికాయ సొంటికొమ్ములా వున్నాడు. ఆ చికాకు భార్యమీదే కోపాన్ని తెప్పించింది. ఆమె దానికి బాధ్యురాలు కాకపోయినా తేరగా వున్నవాళ్లనే తిట్టబుద్దేస్తుందట. భాను అనే మామిడి చెట్టుకి సహనమే కాయలు, సౌశీల్యమే ఆమె మేనిచాయలు. ఎన్ని ఉన్నా కష్టాల లోయలు దూకక తప్పదుగా మరి సంసారంలో.

ఇంటికి వచ్చి సుజాతను, బావ సుందర్‌ను చూసి పిక్‌నిక్‌లో వచ్చిన కోపం అంతా మరచిపోయాడు సుధీర్. భార్య మనసులో మంట చల్లారలేదు. అయినా ఏమీ తను బయటపడదు. అతి సహనంకూడా ఒక్కోసారి మనసుల్ని వేరుచేస్తుందేమో. రానురాను అదే జరుగుతుంది భాను, సుధీర్‌ల మధ్య.

'వదిన చాలా మంచిదిరా అన్నాయ్' అంది సుజాత.

'అలాగా' అని నవ్వేశాడు సుధీర్.

'మరి అమ్మ ఎప్పుడూ ఆ మాట అనదే' అనుకున్నాడు మనసులో.

ఇంతలో తల్లి అందుకుంది. 'చుట్టపు చూపుగా వచ్చిన నీమీద ప్రేమ ఒలకబోస్తుంది! ఎత్తుకో చిల్లుల కుండలలోకి! నిన్ను ప్రేమ వర్షంలో తడిపేస్తుంది. జలుబు చేస్తుంది వెళ్లిపో ఎండలోకి! ఎప్పుడూ దగ్గర వుండే మాకు తెలుస్తుందిగాని ఆవిడ మనస్తత్వం నీకేం తెలుస్తుందే, పిచ్చిమొహమా' అంది వసుంధర.

'అమ్మకు కవిత్వం వస్తుందే' నవ్వుతూ అన్నాడు సుధీర్. కాని మనసు తల్లి అన్నమాట మీదే లగ్నమైంది. భానుని చేసుకుని నేను పొరపాటు చేశాను అనుకున్నాడు.

ఆ రాత్రి నిన్ను అరకువేలీ తీసుకెళ్లలేక పోయాను. ఏమనుకోకు. మనం మరోసారి వెళదాం అని సముదాయించి వుంటే నిజంగా వెళ్లినా వెళ్లకపోయినా ఆమె ఎంతో పొంగిపోయేది. అలా అనలేదు సరికదా 'చెల్లాయ్‌ని, బావగారిని బాగా చూసుకుంటున్నావా? మనం ఏదైనా లోటుచేస్తే మరలా మన గుమ్మం ఎక్కరు' అన్నాడు నిద్రకుపక్రమిస్తూ.

ఉసూరుమంటూ నిద్రపోయింది భాను. అలసట ఆమె నేస్తం. అత్తగారు మాట విసరటం, ఆమె దోస్తి. భర్త నిర్లక్ష్యం భానుకి సొత్తు. మనోవేదన ఆమె సొత్తు. అందుకే జీవితం చిత్తుకాగితంలా తయారవుతోంది రోజురోజుకి.

సుజాత ఏంచెప్పినా వినిపించుకోలేదు. కూతురికో నీతి, కోడలికో నీతి అనాదిగా మన దేశంలో వస్తున్నదేకదా. 'అమ్మ చెప్పింది నిజమే కాబోలు' అని సుజాత అనుకునేలా చేసేసింది, వసుంధర.

అంతే. తానెంతో అత్తారింటిలో మంచిగా కాపురం చేసేస్తున్నట్లు, వదిన తల్లిని, అన్నయ్యను వేపుకుతింటున్నట్లు భావించుకుంది.

ఆమెకూడా అన్నగారికి నీతిపాఠాలు వల్లించడం మొదలు పెట్టింది. తల్లి డైరెక్టుగా చెబితే, చెల్లి ఇండైరెక్టుగా చెప్పేది. ఒకరు టెక్ట్‌బుక్. ఒకరు గైడ్. రెంటింటిని నూరేశాడు సుధీర్. ఇంకేముంది. భార్య అంటే చులకన భావం మరీ పెరిగిపోయింది.

'మీ బావగారు అయితే, వాళ్ల అమ్మ ఎంత చెబితే అంత. ఎంత ఇంటెడు చాకిరీ చేసినా ఆయన వచ్చేసరికి ఆ అలసట కనబడనీయకూడదు. విసుగు ప్రదర్శించకూడదు. అలా చేశానా ఇక నా పని అయిపోయినట్లే. భార్యను తనకు నచ్చిన విధంగా కంట్రోలులో పెట్టుకున్నవాడే అసలైన మగాడు. వదిన విషయంలో అమ్మ చాలా దిగులుగా వుంటుందిరా అన్నయ్య, అమ్మ ఏనాడైనా బాధపడడం మనం చూశామా? ఇప్పుడు మాత్రం ఎందుకు బాధపడాలి? అమ్మను చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది. పోనీ అమ్మను, నాన్నను నా దగ్గరకు తీసుకుని వెళదామంటే కొడుకు వుండగా కూతురు దగ్గర వుండడం భావ్యంకాదుకదా' మెల్లగా విషయం ఎక్కించేసింది సుజాత.

వరద వచ్చి, నీరు తీసేసినా, అది చేసిన నష్టం జీవితం మీద చాలాకాలం వుంటుంది. ఆ నీరు దాని తెరన అది పోతుంది. కొందరి బ్రతుకులు దాని ప్రభావంతో సున్నాలైపోతాయి.

సుజాత వెళ్లిన తరువాత ఇంటి వాతావరణం పూర్తిగా చెడిపోయింది. వసుంధర వచ్చే సమయానికి ఏదో పనిచెప్పి సుధీర్‌కి కాఫీకూడా ఇవ్వనివ్వదు. వంటచేస్తాను. అంటే చల్లారిపోతుంది అంటుంది. పడుకోబోయే ముందుకూడా పుల్లవిరుపు మాట అని భాను మనసు విరిచేస్తుంది.

దానితో భాను మనసు పాడై భర్తతో పూర్తిగా కోఆపరేట్ చేయలేకపోతుంది. రాగానే పనిలో వుండే భార్య, పడక దగ్గరకు చేరగానే ఏదో ధ్యాసలో వుండే భార్య సుధీర్‌కి నచ్చడంలేదు.

భాను ఏదైనా చెప్పబోతున్నా 'ఏం చెబుతావు. అమ్మమీద చాడీలేకదా! పాతికేళ్లుగా ఎరుగుదును నేను. నీవే కొత్త దానికి ఈ ఇంటికి. నాకంటే నీకు తెలుసా? అమ్మగురించి అంటూ మధ్యలోనే కట్ చేసేవాడు. దానితో ఆమె మూగబోయేది. ఒంటరిదాన్ని నేను అనే భావం ఆమెలోపాతుకుపోయింది.

పోనీ మామగారైనా అర్థం చేసుకుంటారు అంటే భాను ఖర్మ కొద్దీ ఆయనకూడా వసుంధర తరపునే మాట్లాడతారు.

ఇదేం ఖర్మరా బాబూ అని దిగులు చెందని రోజులేదు భానుకి.

'ఏం ఎప్పుడూ దిగులుగా వుంటావు. ఇక్కడ వుండడం ఇష్టం లేనిదానివి పెళ్లెందుకు చేసుకున్నావు. మమ్మల్ని ఏడిపించడానిక కాకపోతే' అని అంటుంటే ఎదురుగానే తల బాదుకుని చావాలనిపిస్తుంది భానుకు.

ఛ, నేను ఎందుకు చావాలి - అంటూ తనకు తానే ధైర్యం తెచ్చుకుంటుంది.

ఆమె ఓర్పు ఆమె జీవితాన్ని చక్కదిద్దలేదు. భానులోని సహనం ఆనందపడవలో ఎక్కనీయలేదు. ఆమెలోని దయ, దయ్యాల కొంపలోకి దయ్యంవలె తన పీకకే చుట్టుకుంది. ఆమె ఆస్తి సుఖం నాస్తి అంటూ చాటిచెప్పింది.

అర్థం చేసుకోని భర్త ఆమె మెడలో తాళి కట్టడం పాపం అయింది. తరతరాలుగా ఆడవారి జీవితాలు ఇంతేనా? ఏ కొద్దిమందో సుఖపడితే చాలామంది దుఃఖపడి వున్నారు. ఇది నిజంగా దేవుడు రాసిన రాతేనా, లేక అత్తింటివారు రాసిందా? దేవుడు జాలి హృదయుడు అంటారు. మరి అంత క్రూరంగా బ్రతుకులను బండలు చేసి కష్టాల మండుటెండలోను, దుఃఖాల మంచుకొండమీద ఆడదాన్ని నిలబెట్టడం ఎందుకు?

చీమల పుట్టను తేనెటీగల తుట్టెకు బలిచేయడం ఎందుకు. అవి శరీరాన్నే కుడతాయి కానీ మనుష్యుల చీదరింపు మాటలు మనసునే కుడతాయికదా!

చినికి చినికి గాలివాన పెద్ద తుపాను అయింది. చిన్న చిన్న ఎండ చివరికి రాళ్లు పగిలే స్థితికి వచ్చింది. మామూలు ఉరుములు చివరికి పిడుగులు కురిపించాయి. వేదన రోదనగా మారింది. మాటలు తూటాలయ్యాయి. మనస్పర్థలు ఎక్కువయ్యాయి. చూపులు నిప్పులు కక్కాయి. భాను పుట్టింటికి వెళ్లిపోయింది. చివరికి ఎలాగైతేనేం భాను, సుధీర్ విడాకులు తీసుకోవడం కూడా జరిగిపోయింది. అప్పుడు వసుంధర దంపతులు హాయిగా విశ్రాంతి తీసుకున్నారు. తమ కొడుకును తిరిగి తమ చేతుల్లో భద్రంగా దాచుకున్నారు. కోడలి బ్రతుకును మాత్రం దోచుకున్నారు.

ముందు భాను తల్లిదండ్రులు లబోదిబో అన్నారు. ఆ తరువాత అందరూ పరిస్థితులకు తల ఒగ్గక తప్పలేదు. భానుకూడా మెల్లగా కొత్త జీవితానికి అలవాటు పడిపోయింది. తాళి బరువు తగ్గింది. బ్రతుకు బరువు పెరిగింది. ఆలిస్థానం పోయింది. ఉద్యోగంలో కూలిస్థానం వుంది.

ఇప్పుడు ఆమెకు నన్ను ఎవరైనా ఏమైనా అంటారేమో అనే చింత లేదు. బూడిదైపోయింది. తన మొండాన్ని, తలను వేరుచేస్తానన్నా బెదిరిపోని స్థితికి వచ్చింది. భాను విడాకులు తీసుకున్న వార్త ఆఫీసులో అందరికీ తెలిసింది.

దానితో ఆడవారికి చులకన అయిపోయింది. తమ మొగుళ్లను ఇలాంటి ఒంటరి వాళ్లు వలలో వేసుకుంటారని భయం. అందుకే అంటీ ముట్టినట్లు మీ ఇంటికి వస్తాను - అంటే -అదేదో కొంప కొల్లేరయిపోయినట్లు, పల్లేరుకాయ తిన్నట్లు మొహం పెడతారు. ఆముదం తాగినంతగా ఆ మొహంలోని భావాలు వెల్లడయిపోతాయి.

మగవారికి మాత్రం ఒంటరి ఆడదంటే మనసులో చులకన ఉన్నా పైకి ఎంతో బాగా మాట్లాడతారు. రాయి వేసి చూస్తే రాలకుండా వుంటుందా, వలవేసి చూస్తే పడకుండా వుంటుందా అన్నట్లు ఆలోచిస్తారు. మీ ఇంటికి వస్తాను అంటే ఇంటికప్పు తలకు తగిలేలా ఎగిరి గంతేస్తారు. ఇల్లు పావనం అయినట్లు, పానకంలో ములిగి తేలినట్లు ఫీల్ అవుతారు. అమృతం తాగకుండానే తాగినంత సంతోషంగా, హుషారుగా గంతులేస్తారు.

భానుకి ఆఫీసులో ఆడవారు శత్రువులుగా, మగవారు ఆశావహులుగాను తయారయ్యారు.

ఆమెమీద కామెంట్స్ ఎక్కువయ్యాయి. 'బంగినపల్లి మామిడిపండు, చిలక్కొట్టిన జామపండు, పరువాల పనసపండు' అంటూ మగవారు మాట్లాడుకుంటుంటే ఆడవారు 'కొవ్వెక్కి మొగుణ్ని వదిలేసింది. మొగసాలకెక్కింది. ఎంత గర్వమో, ఎంత గీరో' అంటూ తిట్టుకుంటున్నారు.

ఆమె మాత్రం అన్నీ వింటున్నా చూస్తున్నా మర మనిషిలా పనిచేసుకుపోతుంది. ఆమె ఇప్పుడు ప్రేమిస్తున్నది తన ఉద్యోగాన్నే. ఈ ఉద్యోగమే నాకు తిండి పెడుతుంది. ఆఫీసుకి రావడంతో నాలో పిచ్చి పిచ్చి ఆలోచనలు రాకుండా సమయం గడిచిపోతుంది అనుకుంది. అందుకే ఆమెకు ఆఫీసు ప్రాణమైపోయింది.

ఒకరిద్దరు మగవారు ఆమెకు దగ్గరవ్వడానికి ప్రయత్నించారు. కాని అది పడనివ్వలేదామె. ఎలాగూ విడాకులు తీసుకున్నావు కాబట్టి పెళ్లిచేసుకుందాం అని డైరెక్టుగా ఇద్దరు ముగ్గురు అడిగారు. పెళ్లి రొంపిలోకి మరలా దిగదలచుకోలేదు భాను. ఒకసారి దెబ్బతిని వుంది. మరో దెబ్బ అదే పుండుమీద పడితే భరించే శక్తి ఆమెలో లేదు.

ఒక్కోసారి రాత్రిళ్లు నిద్రపట్టదు. శరీరం ఎదురు తిరుగుతూ వుంటుంది. సెక్స్‌కి అలవాటు పడకపోతే అది వేరే విషయం. అలవాటు పడిన తరువాత అది దొరక్కపోతే కోరికలు అదుపులో పెట్టుకోడానికి కష్టపడవలసి వస్తుంది. తలనిండా పూలు పెట్టుకున్న రోజు ఏదో తెలియని కోరిక ఆమెలో ప్రవేశిస్తుంది. మనసుని గలిబిలి చేస్తుంది. అందుకే పూలు పెట్టుకోవడం మానేసింది. బహుశా పూర్వం ఇందుకే కాబోలు స్త్రీలను రంగుబట్టలకు, పూలకు, జుట్టుకు, బొట్టుకు, మంచి తిండికి దూరం చేశారు అనుకుంది.

విడాకులు ఇచ్చి తప్పుచేశానా అనుకుంది. నేను ఇవ్వలేదుగా విడాకులు. సుధీరే ఇచ్చాడు. వద్దని కాళ్లావేళ్లా పడి బ్రతిమిలాడాల్సిన ఖర్మ నాకు పట్టలేదు. అయినా వద్దన్న భర్త దగ్గర పడి వుండడం అంటే స్త్రీ తనకు తాను ద్రోహం చేసుకోవడమే. విడాకులకు ఒప్పుకున్నందుకే కదా నాకు అహంకారి అనే బిరుదు. మొగుణ్ణి ఎంత వేపుకు తిందో అంటూ మహంకాళి బిరుదు ఇచ్చారు ఆడవాళ్లు అనుకుంది.

భగవంతుడా! నేను చేసిన తప్పేంటి? నేరం అన్యాయంగా నెట్టబడి జైలులో వున్న ఖైదీలాగే బ్రతికాను ఆ ఇంట్లో. నా జీవితం సుఖ సంతోషాలతో వెలగాలని ఎంతో అణకువగా మెలిగాను. అయినా నాకు ఇలా విడాకులు వచ్చాయేమిటి?

అణకువ అంటే అర్థం ఏమిటి. వాళ్లు ఎలా ఆడమంటే అలా ఆడాను. ఎలా నడవమంటే అలా నడిచాను. అయినా ఎందుకు తృప్తి చెందలేదు. ఆడపిల్ల ఈడ పెత్తనం ఎందుకు చెలాయించాలనా? అసలు నేను పెత్తనం చెలాయించానా? చెల్లని కానీలా, మెల్లగానైనా మ్రోగని గజ్జెలా, సంస్కారపు గనిలా, పూలను మోస్తున్న సజ్జలాగే ఆ ఇంట ప్రవర్తించానుకదా!

రామ అంటే బూతుమాటగా వినిపించే ఆ ఇంట్లో బ్రతకడం ఎంత కష్టమో నాకు తెలుసు. నా వెనుక గుసగుసలాడుకునేవారికి, ఆ ఇంటి గునపపు దెబ్బలు ఏం తెలుసు. నన్ను మహంకాళి అనేవారికి ఆ ఇంటి మహామహుల మనస్తత్వాలు ఏం తెలుసు. నోరున్నది కదా అని పడేవాళ్లుంటే అంటారు. నాకూ నోరుంటే అత్తింట్లో నెగ్గుకు వచ్చేదాన్నో ఏమో! ఎందుకో నా మనస్తత్వానికి విరుద్ధంగా వుంది ఆ ఇల్లు. యుద్ధభూమిలాగే రోజా వుండేది. అక్కడ రోజా కత్తిపోట్లలాంటి మాటలకు, తుపాకి తూటాల్లాంటి చేతలకు గోరి అయి ప్రతి రోజూ చచ్చి బ్రతికేది నా మనస్సొకటే. ఎవరూ అర్థం చేసుకోరేం.

నేనెంత మానసిక క్షోభ అనుభవించానో, ఎంత మందికి తెలుస్తుంది. మాట్లాడినా తప్పే, మాట్లాడకపోయినా తప్పే. నాపై పగే ఆ ఇంటి వారికి నేనో శత్రువులా తయారయ్యాను. అది దట్టమైన పొగలా మారి చివరికి నా బ్రతుకును మసిబార్చేసింది. ముసి ముసి నవ్వులూ లేవు. మురిపాలు లేవు.

అక్కడ దిన దినగండం నూరేళ్లాయుస్సుకంటే ఈ జీవితమే బాగుంది నాకు. నన్ను నిత్యం తిట్టేవాళ్లు లేరు. ఆంక్షలు పెట్టేవాళ్లు లేరు. భయపడుతూ బ్రతకాల్సిన అవసరం అంతకన్నా లేదు.

దేవుడు నాకు అన్యాయం చేశానని ఆలస్యంగా గ్రహించాడుకాబోలు; సరిదిద్దుకునే అవకాశంగా విడాకులు పంపాడు - ఇలాగే ఆలోచిస్తుంది భాను.



సుధీర్‌కి భార్య ఇంటిలో లేకపోవడం ఒక విధంగా హాయిగానే వుంది. ఇంటికి వచ్చేసరికి అత్తాకోడళ్ల గొడవలు వినాల్సిన పనిలేదు.

తల్లి కమ్మగా వండి పెడుతోంది. దగ్గరుండి వడ్డిస్తుంది. ఆప్యాయత కురిపించడం ఆమెకామే సాటి. కొన్ని రోజులు చాలా హేపీగా అనిపించింది. ఆ తరువాత రాత్రి నిద్రపట్టడం మానేసిన దగ్గరనుండి ఏదో వెలితి. భాను అస్తమానూ గుర్తుకువచ్చేది.

'ఓహ్ భానూ! ఎందుకెళ్లి పోయావ్! నీవు లేకుండా వుండలేకపోతున్నాను అనుకుంటున్నాడు. భాను ఒంపులు సొంపులు గుర్తుకురాగానే ఆమె ఇచ్చే సుఖం గుర్తుకురాగానే పిచ్చి కోపం వచ్చేసేది. విడాకులు ఇచ్చి తొందరపడ్డానా అని చాలాసార్లు అనుకున్నాడు. అయినా నేను ఇస్తే మాత్రం తను వద్దని బ్రతిమాలొచ్చుగా. తనకే అంత పట్టుదల వుంటే మగవాడిని నాకెంత వుండాలి. పట్టుబట్టలా మెత్తగా వుండే ఆడదాని శరీరానికి పాషాణంలాంటి హృదయమా? నేను భరించలేను. అమ్మ మంచిదేగా భాను ఎందుకు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించలేదు...?

అమ్మ వేరే సంబంధాలు చూస్తూంది. భానుని కూడా అమ్మే చూసిందిగా. అయినా

ఇంత అధ్వాన్నంగా తయారయిందేం నా బ్రతుకు. అయినా పెళ్లి చూపుల్లో పైపై మెరుగులు తప్ప లోలోపలి విరుపులు ఎలా అర్థం అవుతాయి. ఈసారి ఏమైనా సరే ప్రేమించే పెళ్లి చేసుకోవాలి. అసలు మరలా పెళ్లి మంచిదేనా? రెండో భార్యకు భర్తంటే చులకన వుంటుంది. మీరు ఇలాంటివారు కాబట్టే మొదటిభార్య వదిలేసింది అని దెప్పుతుంది. ఆమెకు లోకువ అయిపోనా? తప్పకుండా అవుతాను. వద్దు. వద్దు. మరో పెళ్లి వద్దు. అమ్మ చూసిన సంబంధం అసలే వద్దు. పెళ్లి చేసుకుని సంసార సాగరాన్ని అతి కష్టం మీద ఈదేకంటే ఈ శరీర బాధే సుఖం. ఎప్పుడో ఈ శరీరానికి సుఖం కావాలని పిస్తుంది. అది కంట్రోల్‌లో పెట్టుకోగలిగే శక్తి వుంది, నాకు - అనుకున్నాడు.

ఆఫీస్‌లో సుధీర్‌ను, పెళ్లిగాని ఆడపిల్లలు ఆకర్షించాలని చూస్తున్నారు. సుధీర్ రెండో పెళ్లి వాడన్నమాటేగాని, మంచి ఉద్యోగం వుంది. పైగా చిన్న వయసు, అందగాడు మంచివాడు. ఇంక అంతకంటే వరునికి క్వాలిఫికేషన్స్ ఏమి కావాలి.

పెళ్లిళ్ల పేరయ్య సంబంధాలు తెస్తున్నాడు. తల్లి చెవిలో ఇల్లుగట్టుకొని పెళ్లి పెళ్లి అని పోరాడుతూనే వుంది. కాని సుధీర్‌కు ఆరేంజ్‌డ్ మేరేజ్ అంటే ఇష్టం కలగడంలేదు. మరో భాను నాకు ఇల్లాలు కాకూడదు. నేను పెళ్లంటూ చేసుకుంటే ప్రేమ వివాహమే చేసుకుంటాను.

నాకు సంబంధాలు వస్తున్నట్టే భానుకి సంబంధాలు వస్తున్నాయా? చేసుకుంటే నాకేం, చేసుకోకపోతే నాకేం? ఆమె ఇప్పుడు నా భార్య కాదు. నాకు ఏవిధమైన సంబంధమూ లేదు. పిల్లా పీచూ లేకపోవడం ఫ్యామిలీ ప్లానింగ్ పాటించడం నా అదృష్టం. భాను మరలా పెళ్లి చేసుకుంటే పడకపై నన్ను సుఖపెట్టినట్లే అతన్నీ సుఖ పెడుతుంటే ఇంతటి అందాల రాశిని, శృంగార తారని వదిలేసిన సుధీర్ పిచ్చివాడు అని, అతను వదిలేయడం వలనేకదా నాకింత అదృష్ట దేవత లభించింది అని అతను అనుకుంటాడా? నన్నుచూసి జాలిపడతాడా? ఇలా ఆలోచిస్తున్నాడు సుధీర్. ఆ ఆలోచన రాగానే మనసులో ముల్లు గుచ్చుకుంది. అయినా బలవంతంగా ఆ ఆలోచనలను బయటకు నెట్టేశాడు.

చాలా డల్‌గా తయారయ్యాడు సుధీర్. అతని వాలకం గ్రహించిన స్నేహితులు సుధీర్‌ని పేకాటకు లాక్కుపోతున్నారు. డ్రింక్ ఆఫర్ చేయబోతే మర్యాదగానే తిరస్కరిస్తున్నాడు సుధీర్. పేకాటమీద మనసు నిలవడంలేదు. రాత్రికి ఆడదాన్ని ఆరేంజ్ చేస్తాను అని స్నేహితుడంటే సుధీర్ ఇష్టపడలేదు. ఆ అనుభవం లేకపోయినా ఫరవాలేదుగానీ, ఆ జబ్బులు అవీ వద్దని గట్టిగా చెప్పేశాడు.

మరో రెండేళ్లు గడిచాయి. వసుంధర దంపతులు ఏక్సిడెంట్‌లో చనిపోయారు. 'భార్యాభర్తల్ని వేరుచేసిన పాపం ఊరికే పోతుందా' అని చుట్టుప్రక్కలవారు అనుకున్నారు.

సుధీర్‌ది ఇప్పుడు ఒంటరి జీవితం అయిపోయింది. పిల్లను వెతికి పెళ్లిచేసేవారు లేరు. అలాగే ఆఫీసుకి వెళుతున్నాడు. వస్తున్నాడు. త్వరలోనే ఒకరి ప్రేమలో పడ్డాడు.

ఒకరోజు హఠాత్తుగా తరుణ్ ఊడిపడ్డాడు అమెరికానుండి.

హాయ్, హాయ్‌ల పలకరింపులు కౌగిలింతలూ అయ్యాయి. ఆ పలకరింపుల్లో ఎన్నెన్నో పులకరింతలు. కౌగిలింతల్లో ఆనందపు పాలపుంతలు తొంగిచూశాయి.

ఆ తరువాత అసలు సంగతి ఎత్తాడు తరుణ్. ఊరిలోకి రాగానే సుధీర్, భాను విడిపోయిన సంగతి తెలిసిందట. అదే అడిగాడు సుధీర్.

'సరేలే ఆ సంగతి వదిలెయ్యి. నేను మరలా పెళ్లిచేసుకోవాలనుకుంటున్నాను తెలుసా!' అన్నాడు సుధీర్ సంతోషంగా. గడిచిన కాలం తిరిగిరాదు. ఆ రోజు సంగతి ఈరోజు చూసుకోవాలి. నిన్నటి సంగతి గురించి ఈరోజు ఏం చేయలేం కదా! అది జరిగిపోయింది. తిరిగిరాదు. కావాలంటే రేపటి సంగతి ఆలోచించవచ్చు.

'అయితే నీ మనసు మారదన్నమాట'

'మారదుగాక మారదు'

'నీకు చెప్పేకంటే ఆ రాయికి చెప్పడం బెటరు'

'పోనీ ఆ పనే చెయ్యి'

'మొండివాడు రాజుకంటే బలవంతుడు అని ఊరికే అన్నారా పెద్దలు' వెటకారంగా అన్నాడు తరుణ్.

'నేను జీవితంలో ఆటుపోట్లు తిన్నవాడిని. నీ వెటకారాలు, ఆ కారాలు, మిరియాలు, ఆ మిడిమిడి చూపులు, కోపతాపాలు నన్నేమీ చేయలేవు'

'అయితే నేను వెళ్లిపోతున్నాను'

'వచ్చినవాళ్లు వెళ్లక తప్పదుగా' నవ్వుతూ అన్నాడు సుధీర్. తరుణ్ భుజంపై చేయివేస్తూ.

'నేను నిజంగానే వెళ్తున్నాను సుధీర్' కోపంగా వెళ్లిపోయాడు తరుణ్.

అరేయ్ ఆగరా బాబూ అంటున్నా వినకుండా వెళ్లిపోయాడు తరుణ్.

'పోనీలే మరి ఏం చేస్తాం. నీ మనసు నీవు మార్చుకోవు. నా మనసు నేను మార్చుకోను' లోలోపల గొణుక్కున్నాడు సుధీర్.

సుధీర్ దగ్గరనుండి కోపంగా వెళ్లిపోతున్న తరుణ్‌కి భాను ఎదురైంది.

'ఏమండోయ్, చంద్రభానుగారూ' గట్టిగా పిలిచాడు.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది.

'ఓ మీరా, బావున్నారా' మొహానికి నవ్వు పులుముకుని పలకరించింది. కన్నుల్లో

నీలి మేఘాలు అల్లుకుని వున్నాయి. తొలకరి జల్లులు కాదు. మనిషి చల్లపడేలా కన్నీరు కురిపించడానికి సిద్ధపడినట్లు వున్నాయి.

ఆమెను చూస్తే మనసు పిండేసింది తరుణ్‌కి. పిండిబొమ్మలాంటి ఈమెను దేవుడు ఆ సుధీర్ చేతిలో ఎందుకు పెట్టాడో. అతను ఆమెపై కష్టాల కడగండ్లు కురిపించి ఆ బొమ్మను ముద్ద ముద్ద చేసి వదిలాడు. ముద్దుగా చేసుకోవడం చేత కాకపోయినా, మనిషిలా అయినా చూడలేదు కాబోలు' అనుకున్నాడు తరుణ్ మనసులో.

'బావున్నారా? ఇండియా ఎప్పుడు వచ్చారు' పలకరించింది భాను.

'నేను బావున్నాను సరే. మీరేమిటి ఇలా అయిపోయారు. అఫ్‌కోర్స్ అన్నీ విన్నాననుకోండి'

'రండి. అలా మా ఇంటికి వెళ్లి మాట్లాడుకుందాం' అంటూ వాళ్ల ఇంటికి తీసుకెళ్లింది భాను.

భాను దగ్గర తల్లి వుంది.

ఉపోద్ఘాతం లేకుండా డైరెక్టుగా మాటలు మొదలుపెట్టాడు తరుణ్.

'ఆ సుధీర్ సంగతి వదిలెయ్యండి. మూర్ఖుడు. సొంత అభిప్రాయాలుండవు వాడికి. మీరు ఇలా ఒంటరిగా ఉండడం బావులేదు.'

'అమ్మ వుందిగా' జీవంలేని నవ్వు నవ్వింది. భాను గతం ఆమెపై చాలా ప్రభావం చూపించింది.

'సుధీర్ మరలా పెళ్లి చేసుకునే ఉద్దేశ్యంలో ఉన్నాడు. మీరు ఏమీ అనుకోనంటే ఒక మాట చెబుతాను. మీరు మాత్రం ఎందుకు పెళ్లి చేసుకోకూడదు...?'

ఆమె షాక్ తింటుందనుకున్నాడు తన మాటలకు. కాని తినలేదు.

'మామూలు వాళ్లకే పెళ్లి కావడంలేదు. ఒకసారి విడాకులు తీసుకున్న నన్ను ఎవరు చేసుకుంటారు' నిర్లిప్తంగా అంది.

'ఎందుకుండరు! ప్రయత్నిస్తే దొరక్కపోరు'

'దొరుకుతారు. కానీ జీవితంలో ఎప్పుడో అప్పుడు దెప్పుతారు. నేను కుక్కిన పేనులా ఉండి ఇంతవరకూ తెచ్చుకున్నాను. ఇంకా అదే జీవితం కొనసాగించలేను. అలా ఏదైనా మరలా మనస్పర్ధలు వస్తే నన్ను చేసుకున్న ఆయన నీవు ఇలాంటి దానివి కాబట్టే ముందుమొగుడు వదిలేశాడు' అని అంటే భరించలేను. ఈ ఒంటరితనాన్నయినా భరించగలను. నాకు పిల్లలు పుట్టి, వాళ్లు కూడా ఏదైనా అనవచ్చు.

'అలా అని అనుకోకండి. మీకు పిల్లలు పుట్టి ఎదిగేనరికి పరిస్థితులు మారిపోతాయి'.

'పరిస్థితులు మారతాయి. మనస్తత్వాలు మారవు.' తరుణ్ ఆమెను ఎంతో ఒప్పించాలని చూశాడు. కాని ఆమె వినలేదు. నిరాశగా వెళ్లిపోయాడు.

పెళ్లికార్డులు పట్టుకెళ్లి తరుణ్‌కు ఇచ్చాడు సుధీర్. సుధీర్, రేఖ: కలసి పెళ్లయిన తరువాత ఇచ్చే రిసెప్షన్ కార్డు అది. ఆ అట్ట ఇద్దరి జీవితాన్ని కదిపే దిట్ట. "నువ్వు రావాలి. హోటల్ రెసిడెన్సీ కాన్ఫరెన్స్ హాల్..."

'అయితేమళ్లీ పెళ్లికి సిద్ధమయ్యావన్నమాట'

'ఏం నేను మగాడిని కానా'

'మగాడివి అన్న సంగతి భానుకు విడాకులు ఇవ్వడంలోనే అర్థం అయిందిగా'

'శుభమా అంటూ మరలా పెళ్లి చేసుకుంటుంటే, ఇప్పుడా సంగతి ఎందుకు?'

'మొదటి పెళ్లికూడా శుభమా అంటూనే చేసుకున్నావుగా?'

'అది మా అమ్మానాన్నలు చేసింది. ఇప్పుడిది ప్రేమ వివాహం. ఇందులో అమ్మానాన్నల ప్రేమయం లేదు. ఆ అమ్మాయి రెండేళ్లుగా నా దగ్గర స్టెనోగా చేస్తోంది. అందమూ, అణకువ వున్నాయి'

ఆ రెండూ భానులోనూ వుండేవిగా. పైగా ఆమె గొప్పింటి బిడ్డకూడా. అప్పుడు డబ్బుని చూసి చేసుకున్నావ్.

'అందుకే ఇప్పుడు డబ్బుకి విలువ ఇవ్వడం లేదు. ఉద్యోగానికి ఇచ్చాను'

'ఇన్ని తెలివి తేటలు భాను విషయంలో చూపిస్తే మీ జీవితం బాగానే వుండేది. మీ అమ్మగారు, నాన్నగారు, మీ చెల్లాయ్ అమెను చాలా బాధపెట్టారట. ఆ సంగతి అందరికీ తెలుసు, నీకు తప్ప. నీవు చాడీలు విని, ఆమెను కొట్టేవాడివట!'

'ఏదో భర్తను, కొట్టేనే అనుకో, అంత పౌరుషంగా పుట్టింటికి వెళ్లిపోవాలా?'

'ఎప్పుడు వెళ్లింది. ఎంతో ఓర్చుకుని కదా వెళ్ళింది. అయినా అది పౌరుషం అని ఎందుకనుకుంటావు. ఆత్మగౌరవం అని అనుకోవచ్చుకదా!'

'ఆమెకు నాతో కాపురం చెయ్యడం ఇష్టం లేదు'

'కాదు, మీ ఇంట్లో వాళ్లకు ఇంకా కట్నంతో నీకు మరో పెళ్లి చేయడం, ఇష్టం. నీవు భార్యను ప్రేమగా చూస్తే సహించేవారుకాదు. దానికి నీవు వంత పాడావు. భానుకి చింత మిగిల్చావు.

'ప్లీజ్' తరుణ్. ఈ సంతోష సమయంలో గతాన్ని గుర్తుచేయకు. దానిని కలలో కూడా తలవడం నాకు ఇష్టం లేదు. భాను విషయం అప్రస్తుతం. నేను రేఖా ఎంతగానో అర్థం చేసుకుని, ఈ నిర్ణయానికి వచ్చాం'

'మొన్న బజారులో కనిపించింది భాను. ఎలా వుండేది ఎలా ఎండిపోయిందనీ, మీరు విడాకులు తీసుకునే సమయానికి నేను ఇండియాలో వుండివుంటే ఆ పరిస్థి రానిచ్చేవాడిని కాదు'

'అందుకే బ్రతికిపోయాను. నా కళ్లు తెరుచుకున్నాయి ఆమె అహాన్ని అణచి వేశాను'.

'నీ కాపురాన్ని నాశనం చేసుకున్నావు. అసలు భానులాంటి భార్యకోసం నీవు పూర్వజన్మలో ఏ బంగారు పూలతోనో పూజ చేసి వుంటావు'

'స్టాపిట్ తరుణ్. ఆమె సంగతులుగాని, పాత విషయాలుగాని, ఎంతమాత్రమూ నాకు వినడానికి ఇష్టంలేదు. అది పెద్దలు చేసినపెళ్లి'

'నీవు వినడానికి ఇష్టంలేకపోయినా, నాకు చెప్పడానికి మాత్రం చాలా ఇష్టంగా వుంది. అలా మంచి మాటలు వినకే, ఆమె మానానికి ఆమెను వదిలేసి, సిగ్గులేకుండా మరో పెళ్లికి తయారయ్యావు. ఇప్పటికీ చెబుతాను. భాను వజ్రం. మంచితనం మూర్తీభవించిన వెలకట్టలేని వజ్రం.

సుధీర్ కోపంగా లేచాడు. తరుణ్ కిచ్చిన కార్డు విసురుగా లాగేసుకున్నాడు. 'నా గతానికి సమాధి కట్టేశాను. అది గుర్తుచేయవద్దంటే వినవేం. నా బాగుకోరేవాడివైతే రిసెప్షనుకి వచ్చి నన్ను ఆశీర్వదించు!' అంటూ వెళ్లిపోయాడు సుధీర్.

రిసెప్షనుకి వెళ్లిన తరుణ్ నోటమాట రాక అలాగే వుండిపోయాడు. ఆ పెళ్లికూతురు సుధీర్‌తో విడాకులు తీసుకున్న చంద్రభానురేఖ.





# జీవితమే నాటకరంగం

హైద్రాబాదులో కేన్సర్ హాస్పిటల్‌కు శంకుస్థాపన చేసిన దగ్గర నుండి డాక్టర్ నందకుమార్, వారిజలు చాలా బిజీ అయిపోయారు. ఇప్పుడు ఆ హాస్పిటల్ ప్రారంభోత్సవం దగ్గరవుతున్న కొద్దీ మరింత ఖాళీ లేకపోతోంది. ఊపిరి తీసికోవడంలో ఎవరైనా సహాయం చేయగలిగితే ఆ పనికూడా ఎవరికైనా అప్పజెప్పాలని ఉంది వారికి. విశాల్ ఆ బాధ్యత, ఆ హాస్పిటల్ విషయం వారి నెత్తిన పెట్టి తను హాయిగా ఉన్నాడు.

అందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి. మరో వారం రోజుల్లో ప్రారంభోత్సవం అనగా రేబెల్ దగ్గర నుండి వారికి ఉత్తరం వచ్చింది. ఈ ఉత్తరం కొత్త ఉత్సాహాన్ని తెచ్చింది. మరలా వెంటనే వారి మనసులు బరువెక్కాయి. ఏది ఎలా జరగాలో, ఎలా జరుగుతుందో అన్నది వారికి ఎప్పటినుండో అంతుపట్టడంలేదు. అన్నిటికి 'విధి'మీద భారం వేసి బ్రతుకుతున్నారు.

రేబెల్ వ్రాసిన ఉత్తరం విప్పుతుంటే చేతులు, విప్పిన తరువాత మనసు వణికాయి. ముందు ఆ ఉత్తరం ఆతృతగా గబగబా చదివేసి వారిజ కిచ్చాడు నందకుమార్. వారిజ రిలాక్సింగ్‌గా కూర్చొని చదవడం మొదలు పెట్టింది. ఒక్కొక్కలైను చదువుతుంటే ఒక్కొక్క దృశ్యం కళ్ళముందు కదలసాగింది. కళ్ళు మరోలైనులైను, మనసు గతం వైపు పరుగులు తీసాయి.

డియర్ డాక్టర్ నందా, మిసెస్ వారిజా,

మీరందరూ బావున్నట్లు తలుస్తాను. ఎప్పటికప్పుడు మీ ఉత్తరాలు అందుతున్నాయి సంగతులు తెలుస్తున్నాయి. హాస్పిటల్ పూర్తి అయినందుకు, ప్రారంభోత్సవం చేస్తు న్నందుకు చాలా సంతోషంగా ఉంది.

☆ ☆ ☆

"నా దగ్గర కావలసినంత డబ్బుంది డాక్టర్ నందా దానితో ఏదైనా మంచి పని చేయాలని ఉంది. మీరు డాక్టరు కదా! మీ ఆధ్వర్యంలో కాన్సర్ హాస్పి టల్ కట్టించ కూడదూ?'' విశాల్ అన్నాడు.

'ఎందుకు కట్టించ కూడదూ, కాని మాటలతో కాదు, ఇటికలతో అంత కన్నాకాదు, నోట్లతోనే కట్టించవలసి ఉంటుంది. హాస్పిటల్ ఎక్విప్‌మెంట్‌కే చాలా డబ్బు కావాలి' అన్నాడు నందా.

"డబ్బు సంగతి నాకొదిలేయండి. మా తాతలు నేతులు తాగినా ఇంకా ఎగ్స్‌యిటింగ్‌నే ఉంది. నా జీవితం ఇన్ని మలుపులు తిరుగుతుందని నేను కలలో కూడా అనుకోలేదు. మీకు గుర్తుందా, మొదటిసారి మనం కలసినప్పుడు నేనేమన్నానో, 'మీరు మా దేశం వచ్చారు. నాకు ఇండియా అంటే చాలా ఇష్టం. ఎప్పటికైనా చూడగలనో లేనో' అని - 'విశాల్ పెళ్ళికి రా' అన్నారు మీరు.

⋆ ⋆ ⋆

"మిసెస్ వారిజా! ఈమె నా గర్ల్ ఫ్రెండ్. పేరు రేబెల్. మా ఆఫీసులోనే పనిచేస్తుంది. బై ది బై నేను ఇల్లుకోసం వెతుకుతుంటే తన రూమ్‌లోని అమ్మాయిలు వెళ్ళిపోయారట. ఒక్కతే ఉంటుందట. నన్నూ తనతో ఉండమంటుంది" విశాల్ అన్నాడు.

'అవును మిసెస్ వారిజా. విశాల్‌కి ఇల్లు దొరకడం లేదు. హోటల్లో ఎంతకాలం ఉంటాడు? తనకి అభ్యంతరం లేకపోతే నాతో ఉండమంటున్నాను. నా ఫ్రెండ్స్‌కి ఒకమ్మాయికి పెళ్ళి అయి, మరో అమ్మాయికి ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోయారు. ఆ, అన్నట్లు నేను ఎక్కడ ఉంటానో మీకు తెలియదుగా. మీ మేడమీదే ఉంటాను. డాక్టర్ నందా బాగా తెలుసు నాకు'' అంది.

"ఆ పెళ్ళికాని అమ్మాయితో నీవు కలసి ఉంటావా.'' తెలుగులో విశాల్‌ని ఆశ్చర్యంగా ఆందోళనగా అడిగింది.

"తప్పేముంది? ఇక్కడ అలాంటి తప్పులులేవు" అని వారిజతో అంటూ "రేబెల్ నాకు నీ రూమ్‌లో ఉండడానికి అభ్యంతరంలేదుగాని మరి డేటింగ్స్ అని మాత్రం అనవద్దు. నాకు ఎంగేజ్‌మెంట్ అయిపోయింది" అన్నాడు.

"ఓ అలాగే, నీ ఇష్టం. నీది నా ఇష్టం నాది!'' నవ్వుతూ అంది.

"విశాల్‌ని నమ్మి మోసపోయాను నేను. మీ ఇండియన్స్‌కి ఆడవాళ్ళను మోసం చేయడం వెన్నతో పెట్టిన విద్య అటగా. తరువాత తెలిసింది నాకు. అప్పటికే పీకల వరకూ కూరుకుపోయాను. విశాల్ నన్ను అన్ని విధాల ఉపయోగించుకొని చివరికి మోసం చేసి కల్పనతో వెళ్ళిపోయాడు.''

⋆ ⋆ ⋆

"విశాల్! ఒక ప్రక్క ఎంగేజ్‌మెంట్ అయిందంటూ రేబెల్‌తో అంతచనువుగా తిరగడం ఎందుకు? ఆడవారి మనసుని తక్కువగా అంచనా వేయకు. ఆమె నిన్ను ప్రేమిస్తుందేమో. కల్పనకు అన్యాయం చేస్తావా, రేబెల్‌కు అన్యాయం చేస్తావా? ఆలోచించుకో!"

"కల్పనకు అన్యాయం చేసే క్వొశ్చనే లేదు. రేబెల్ అన్నింటికి ఒప్పుకునే నాతో కలిసి ఉంది. ఆమెకు బోయ్ ఫ్రెండ్ ఉన్నాడు తెలుసా? అతనికీ తెలుసు మేమిద్దరం కలసి ఉంటున్నామని" విశాల్ అతిమామూలుగా చెప్పాడు.

ఉలిక్కిపడింది వారిజ. "చాకలివాని మాట విని సీతను అడవికి పంపిన రాముడు పుట్టిన దేశంలో పుట్టిన విశాల్‌ని, తనబోయ్ ఫ్రెండ్ అనుమతితో, మరో మగ వానితో కలిసి ఉంటున్న రేబెల్‌ని అర్థం చేసుకొనడానికి చాలా కష్టపడవలసి వచ్చింది వారిజకు. ఈదేశం వారికి ఆ తప్పులేదు అని సరి పెట్టుకోలేకపోయింది. విశాల్ అలా ఇద్దరితో మనసున్న స్త్రీతో ఆటలు ఆడడం ఆమె భరించలేకపోయింది. విశాల్ మీద ఆశలు పెట్టుకోవద్దు అని రేబెల్‌ని హెచ్చరిస్తూనే ఉంది.

☆ ☆ ☆

"అయినా, నేను విశాల్‌ని వదల దలచుకోలేదు. నేను ఇంతకాలం మీ సంస్కృతి, మీ జీవన విధానం ఎంతో తెలిసికున్నాను. ముందుముందు సరదాగా అడిగితెలుసుకునే దాన్ని. రానురాను నా మనసంతా 'ఇండియన్ సంస్కృతి చుట్టూ, వారు భర్తకు ఇచ్చే విలువ వైపు తిరగసాగింది. మీరు మీ భర్తకు ఇచ్చిన విలువ నాకెంతో నచ్చింది. మిసెస్ సాధన తన భర్తకోసం ఎంత తపించిపోయిందీ, మీరు మరచిపోలేదనుకుంటాను.

☆ ☆ ☆

"హాయ్ సాధనా, నీవూ ఈ దేశంలోనే ఉంటున్నావా?" బజారులో కనిపించిన సాధనను ఆనందంగా పలకరించింది వారిజ. సాధన భర్త నందకుమార్‌కి తెలుసుగాని, వారిజ, సాధన ఫ్రెండ్ అని తెలియదు.

"అవును, నిన్ను ఇక్కడ చూడడం చాలా సంతోషంగా ఉంది."

"ఇంతకీ ఎవరిని పెళ్ళి చేసికున్నావు. క్రికెట్ వీరుణ్ణికాదా" వారిజ అడిగింది సాధనను. సాధనకు చాలా క్రికెట్‌పిచ్చి.

'కాదు, ఆయన ఇంజనీరు. ఇప్పుడు ఆ పిచ్చిలన్నీ వదిలిపోయాయిలే. జీవితమే ఛాలెంజింగ్‌గా తయారయింది' నిరాశగా అంది.

'సాధనా, నీవు అలా మాట్లాడడం చాలా ఆశ్చర్యంగా ఉంది. ఆ రోజు క్రికెట్ చూస్తూ నీవు అన్న మాటలు నేను మరిచిపోలేదు."



"ఏమన్నాను?' అమాయకంగా అడిగింది సాధన.

"నేను క్రికెట్‌ప్లేయర్స్ గురించి కాకుండా, క్రికెట్ చూడడానికి వచ్చిన వారిని కామెంట్ చేస్తుంటే, వారిజా, నీవు వి.ఐ.పి. పాస్ మీద వచ్చావు. డబ్బు విలువ తెలియదు. నేను రెండు వందలు టికెట్ కొనుక్కొని వచ్చాను. అది మానాన్నగారి కష్టార్జితం. అందుకే ఆట మొదలైంది మొదలు చివరి వరకూ క్రికెట్ ఆటను మాత్రమే చూస్తాను. నా ప్రక్కన ఎవరు కూర్చున్నదీ కూడా నాకు తెలియదు. ఎంతకట్నం ఇచ్చిఅయినా సరే క్రికెట్ వీరుణ్ణే పెళ్ళాడతాను" అన్నావు.

'వద్దు బాబోయ్. ఆ కార్క్‌బాల్ చేతితో పట్టి, బేట్‌కేసి కొట్టి వారి చేతులు మొద్దుబారిపోతాయి. అలాగే మనసూ మొద్దుబారుతుంది. భార్యలను సరిగా చూస్తారో చూడరో అని నేనంటే.'

"మొద్దు బారడం కాదే మొద్దు. గట్టి బడుతుంది. వారి చేతుల లాగే భార్యలపై వారి ప్రేమా గట్టిబడుతుంది" అన్నావుగా.

"అవును గుర్తుకు వచ్చింది. ఇంజనీరింగ్ చదివిన క్రికెట్ ప్లేయర్ని చేసికున్నాను. నేను ఇక్కడకు వచ్చి ఒకనెలే అయింది. మావారు వచ్చి రెండు సంవత్సరాలయింది." అంది.

"అయితే మనం ఒక ఊరిలోనే ఉంటామన్నమాట' సంతోషంగా అంది వారిజ.

"ఉహు. మా ఆయన్ను కొంగుకి కట్టుకొని ఇండియా లాక్కెళ్ళడానికే వచ్చాను" అంది నవ్వుతూ.

☆ ☆ ☆

"నేనూ సాధన నడచిన దారిలోనే నడవడానికి నిశ్చయించుకున్నాను. నన్ను మోసం చేసిన విశాల్‌ని వదలదలచుకోలేదు. అందుకే ఇండియా వస్తున్నాను. మీరు మా దేశానికి రావడం, మీతో పరిచయం కలగడం, ఆ పేజీ చదవడం పూర్తయి రెండోపేజీతిప్పేలోపల ఆ రెండో కాగితం గాలికెగిరిపోయింది. వారిజ మనసు పూర్తిగా ఆ దేశానికి వెళ్ళిపోయింది.

☆ ☆ ☆

లండన్ విమానాశ్రయంలో ఫ్లైట్ రాకకోసం ఆతృతగా ఎదురుచూస్తున్నాడు డాక్టర్ నందకుమార్. ఫ్లైట్ ఇంకా గంట లేటు అనేసరికి, ఆ గంట ఎలా కాలం గడపాలా అని ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. ఎప్పుడెప్పుడు భార్యాబిడ్డల్ని చూద్దామా అని ఆరాటంగా ఉంది. ఆ గంటను కాల చక్రంలో వేసేసి తనే గబగబ తిప్పేయాలన్నంత ఉత్కంఠగా ఉంది. సంవత్సరం తరువాత కలసి రాబోయే వారిజను, పిల్లలు ఆముక్త, ఆదిత్యలను చూడకుండా మరో గంట ఉండాలంటే అతని వశం కావడం లేదు. కాళ్ళు నిలవడం లేదు.

ఆలోచనలతో అలాగే తిరుగుతున్నాడు. నిజానికి అతనికి అప్పుడే భార్యాబిడ్డలను ఐర్లాండుకి తేవాలనే ఉద్దేశం లేదు. ఇంటిలో బాధ్యతలు అప్పులు చాలా ఉన్నాయి. అందుకే కేవలం డబ్బుకోసం ఆ దేశంలో ఉద్యోగం చేస్తున్నాడు.

నందకుమార్ కన్సల్టెంటు (చీఫ్) ఒకరోజు అడిగాడు.

"అందరికీ ఏమోగాని, నాకు అందంగానే ఉంటుంది" అన్నాడు నందా. 'తావలచింది రంభ, తాను మునిగింది గంగ అనే మాటను నిజం చేయాలి అనే దృష్టితో కాక నిజాయితీగానే సమాధానం చెప్పాడు. భార్య వారిజ అందగత్తె. "కాళ్ళు నడవగలవుగాని, మంచినడవడిక నేర్పలేవు. మంచి నడవడిక మంచి మనసు వల్లనే వస్తుంది" అలాంటి ఎంతో మంచి మనసు కలిగిన వారిజ అంటే ప్రాణం అతనికి.

'వెరీగుడ్. ఒకసారి పెళ్ళంటూ చేసికున్నాక భార్య అందంగా ఉన్నా లేకపోయినా, ఆమె నిన్ను నమ్ముకొని వచ్చింది కాబట్టి, ఆమె నీ సొత్తు కాబట్టి ఆమెను అపురూపంగాను, ఆప్యాయంగాను చూసుకొనే బాధ్యత నీది. నీవు నీ భార్యను త్వరగా రప్పించుకో' అని సలహా ఇచ్చాడు. వెనుకనున్న హెచ్చరిక గమనించాడు నందకుమార్.

నందకుమార్ ఏ నర్స్‌తోనైనా మైత్రీ భావంతో చనువుగా ఉన్నా, ఆయన కళ్ళు నందాని గమనిస్తూనే ఉండేవి. 'అవకాశం దొరికేవరకూ అందరూ మంచి వాళ్ళే' అన్నది ఆయన అభిప్రాయం. ఆ దేశస్తులు పెళ్ళయిన తరువాత స్త్రీలు, పురుషులు కూడ సాధారణంగా నిజాయితీగానే ఉంటారు. అత్యవసర పరిస్థితులలోగాని విడాకులు కోరుకోరు. అందుకే నందా వాళ్ళ చీఫ్ అతను ఏదైనా అట్రాక్షన్‌లో పడతాడని, భార్యను త్వరగా రప్పించు కోమని సలహా ఇచ్చాడు.

డాక్టర్ నందా ఆలోచనలలో ఉండగానే ఎయిరిండియా వచ్చేసిందన్న ఎనౌన్స్‌మెంట్ వినిపించింది. ఆకాశం నుండి విమానం క్రిందికి దిగింది. డాక్టర్ నందా హృదయం భార్యాబిడ్డలను చూస్తాను అనే ఆనందంతో భూమినుండి ఆకాశానికి ఎగిరింది.

'అందరూ వస్తున్నారు. వారిజ పిల్లలు రావడం లేదు. అతనిలో కంగారు ఎక్కువయింది. ఒకవేళ ఏ కారణం చేతనైనా బయలు దేరలేదా? అన్న ఊహ అతనిలో చెప్పలేనంత నీరసాన్ని తెచ్చిపెట్టింది. అంతకుముందే ఎయిరిండియాలో వచ్చేవారి లిస్టు కోసం అడిగితే "సారీ మేము ముందుగా చెప్పం'' అనేసారు.

ఆఖరికి ఆగలేక ఎయిరిండియా నుండి అప్పుడే డ్యూటీ దిగి వస్తున్న ఎయిర్ హోస్టెస్‌ని అడిగాడు. భార్య, పిల్లల గుర్తులు చెప్పి.

"ఆ ఆ ఈ ఫ్లయిట్‌లో వచ్చారు. ఆమె చాలా అందంగా ఉంది. యుఆర్ వెరీలక్కీ. ట్రాలీలో సామానులు వేసికొని తోసికుంటూ వస్తూంటే ఆమె చీర ట్రాలీ చక్రాల్లో పడింది. తీయడానికి సమయం పట్టింది. వచ్చేస్తూ ఉండవచ్చు'' అనేసరికి అమ్మయ్య అనుకున్నాడు. పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది నందాకు.

ఇంతలో ఎయిర్‌పోర్ట్‌లో ఫార్మాలిటీస్ అన్నీ ముగించుకొని వారిజ పిల్లలతో బయటకు రావడం జరిగింది. వారు ముగ్గురిని అమాంతంగా కౌగిలిలో తీసికోవాలి అనే కోరికను అతి కష్టం మీద ఆపుకున్నాడు. ఆ నిమిషంలో భార్యను అక్కడ అందరి ఎదురుగా ముద్దు పెట్టుకున్నా తప్పులేదు. కాని విదేశాలకు వచ్చినంతలో స్వదేశీ ఆచారాల్ని, గౌరవాన్ని మంటబెట్టదలచుకోలేదు. ఆముక్త తండ్రి చంక ఎక్కింది. ఆదిత్యకు తండ్రి గుర్తు లేదు. నందా ఆ దేశానికి వచ్చేసరికి ఆ అబ్బాయికి రెండు సంవత్సరాలు. అందుకే తండ్రి ఎత్తుకోబోతుంటే పరాయివాళ్ళలా భావించి బేర్‌మన్నాడు.

"మిసెస్ వారిజా, మీరు మీ హజ్‌బెండ్‌ని చూసి నన్ను మరచిపోయారు. మీరు ఇల్లాలిగాకంటే ప్రొఫెసర్‌గా బాగా పనిచేస్తారు. ప్రొఫెసర్లకే ఎక్కువ మతి మరుపు ఉంటుందంటా'' విశాల్ మాటలకు వారిజ, నందా ఉలిక్కిపడి అటుచూసారు. వారిజ నవ్వేసింది.

'విశాల్ మాతోనే ఫ్లయిట్‌లో వచ్చారు. పిల్లలను కాస్త తనూ చూసారు. మాతో ప్రయాణం చేసింది తెలుగువాడు తను ఒక్కరే. విశాల్ లేకపోతే భలే భయం వేసేది' వారిజ అంది.

'హాయ్' అంటూ విష్ చేసాడు విశాల్.

'మీరు ఇప్పుడు వేరే ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళాలి కదా! వెళ్ళండి నేనూ ఐర్లాండులోనే ఉద్యోగం చేస్తున్నాను. నేను రెండు రోజులు ఇంగ్లాండ్‌లో ఉండివస్తాను'' అంటూ వారికి బై చెప్పి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళినవైపే అలా చూస్తూ ఉండిపోయింది వారిజ. విశాల్ ఫ్లయిట్‌లో తనకు పిల్లల విషయంలో చాలా సహాయం చేసాడని అతని విషయంలో కృతజ్ఞతగా భావించింది.

ఆ విశాల్ ముందు ముందు తన బ్రతుకులో విడదీయరాని బంధంగా అల్లుకుపోతాడనిగాని, జీవిత నాటక రంగంలో ప్రముఖ పాత్ర వహిస్తాడనిగాని ఆ నిమిషంలో ఆమె తలంచలేదు.

లండన్‌లోనే ఉన్న మరో విమానాశ్రయానికి వెళ్ళి అక్కడ మరో ఫ్లయిట్ కాచ్ చేస్తారు. వారిజకు ఇంటర్ నేషనల్ ఫ్లయిట్‌లో నుండి, నేషనల్ ఫ్లయిట్ ఎక్కేసరికి ఏడంతస్తు భవంతిలో నుండి పూరిగుడిసెలోకి వచ్చినట్లయింది. ఇంటర్ నేషనల్ ఫ్లయిట్స్ పెద్దగా 350 మంది పట్టేట్లు ఉండి, టి.వి. అన్నీ ఉంటాయి. నేషనల్ ఫ్లయిట్ ఇరుకుగా చాలాచిన్నదిగా ఉంటాయి. ఆముక్త తండ్రికి చాలా కబుర్లే చెప్పేస్తుంది. అసలు తల్లితో మాట్లాడనీయడం లేదు. సంవత్సరం తరువాత కలసుకోవడం వలన నందా, వారిజ కళ్ళతోను హృదయంతోనూ చాలా సన్నిహితంగా మాట్లాడేసుకుంటున్నారు.

ఆరోజు రాత్రి భార్యను దగ్గరకు తీసికుంటూ "వాట్‌మోర్‌కి చాలాథాంక్స్' అన్నాడు.

'ఆయనెవరు?' ఆల్చిప్పలాంటి కళ్ళను యింకా వెడల్పు చేసి అడిగింది వారిజ.

ఆయన మా కన్సల్టెంటు చాలామంచాయన. నాకు ఉద్యోగం యిచ్చింది ఆయనే. మన దేశంలోలా యిక్కడ ఉద్యోగాలు పర్మనెంటుగా దొరకవు. ఆరు నెలలవరకూ యిస్తారు ముందు. ఆ తరువాత మనపని నచ్చితే అలాపొడిగిస్తారు. మరో ఆరు నెలలు నచ్చకపోతే ఐదో నెలలోనే చెప్పేస్తారు. వేరే చోటికి ప్రయత్నం చేసికోమని, మా కన్సల్టెంటు నా ఉద్యోగం మరో ఆరు నెలలు పొడిగించడమే కాక నిన్నుకూడ రప్పించారు.''

"నన్నా! ఆయనెందుకు రప్పించారు. నేనేం తెలుసు ఆయనకు''

"అదంతేలే. ఇంక మన మధ్యలో ఆయన గొడవ ఎందుకు గాని'' అంటూ భార్యను తమకంగా గుండెలకు హత్తుకున్నాడు. ఆ రోజు వారికి ఎలక్ట్రిక్ బ్లాంకెట్

ఆన్ చేసికునే అవసరం కలగలేదు. అది ఆగష్టు నెల అంతగా చలిలేకపోయినా వారిజ, పిల్లలు చలికి ఒణుకుతూనే ఉన్నారు. వారి కోసం ముందుగానే ఓవర్‌కోట్లు, స్వెటర్లు కొని పెట్టాడు నందా. అంతకుముందు నందా స్థానంలో కూడ నందా ఫ్రెండ్ ఇండియన్ డాక్టర్ చేసేవాడు. అతనే నందాను రప్పించి, వాట్‌మోర్‌కి ఇంట్రడ్యూస్‌చేసి, ఉద్యోగం వేయించి తమ ఇండియా వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ "తన భార్యా, పిల్లల ఓవర్ కోట్లు తీసికోమన్నాడు. మేమెలాగూ ఇండియా వెళ్ళిపోతున్నాం. మొన్ననే కొన్నాం మరలా అంత డబ్బుపెట్టి కొనడం ఎందుకు? ఉన్నన్ని రోజులు డబ్బు జాగ్రత్తగా వాడుకో" అని ముందు హెచ్చరికలు చాలా చేసాడు. అతను ఓవర్‌కోట్లు, కొంత సామాను వదిలేసాడు. ఓవర్ కోట్లు మాత్రం, సెకండ్ హాండ్‌వి వారిజ యిష్టపడదని పక్కనున్న ఐరిష్ ఫ్యామిలీవారు పేదవారుంటే వారికి యిచ్చేసాడు. వారెంతో సంతోషంగా తీసుకున్నారు.

నందా 'వెక్స్‌ఫోర్డ్' అనే ఊరిలో చేస్తున్నాడు. వారిజ వాళ్ళు వచ్చే వరకూ ఆ సంవత్సరం అంతా హాస్పిటల్‌లోనే చిన్నగదిలో ఉంటూ మెస్‌లో తింటూ కాలం గడిపేసాడు. ఇప్పుడు ఇండియన్ డాక్టర్ తానున్న యిల్లు ఇవ్వడంతో కొత్త సంసారం పెట్టాడు. మంచాలూ, కుర్చీల నుండి సమస్తం ఉన్న ఇల్లే అది. సామాను ప్రోబ్లమ్‌లేదు. 'మోడా'ల దగ్గర నుండి సోఫాల వరకూ అన్ని రెడీమెడ్‌గా ఉన్నాయి. బట్టలతో యింట్లోకి దిగితే చాలు ఎవరైనా.

ఆ మర్నాడు డాక్టర్ నందా హాస్పిటల్‌కు వెళుతుంటే 'భయంగా ఉంది ఒక్కదాన్ని, పిల్లలతో ఉండడానికి' అంటూ దిగులుగా మొహం పెట్టింది వారిజ.

"ఇది ఇండియా కాదమ్మాయ్ భయపడడానికి ఇక్కడ దొంగల భయాలు, మోసాలమాయలు ఉండవు. నీవు నిశ్చితంగా ఉండొచ్చు. త్వరగా వచ్చేస్తానులే. రేపు శనివారం కదా. రేపు, ఎల్లుండి యింట్లోనే ఉంటాను. ఇక్కడ వీకెండ్‌కి డ్యూటీపడితే తప్ప పనిచెయ్యనక్కరలేదు" అంటూ వెళ్ళాడు. హాస్పిటల్‌కు కారులో తనే డ్రైవ్ చేసుకుంటూ.

భర్తకొన్న కారు వైపు అపురూపంగా కిటికీలోనుండి చూస్తూ ఉండిపోయింది వారిజ. రిక్షాలు, ఆటోలు, బండ్లు ఎక్కడా కనిపించలేదామెకు. కార్లు, టాక్సీలు, స్కూటర్లు అంతే. అందరికి కారు తప్పనిసరిగా ఉండాలన్న మాట అనుకుంది. ఎలక్ట్రికల్ స్టవ్‌మీద నాలుగు బర్నర్స్ ఉండడంతో వంట అరగంటలో అయిపోయింది. పిల్లలకు స్నానాలు చేయించి, తనూ చేసి కిటికీ దగ్గర కూర్చొంది ప్రకృతినారాధిస్తూ. ఎంత చూసినా తనివితీరనట్లుంది. అక్కడ అన్నీ గాజు తలుపులే. అమ్మో యిదే ఇండియా అయితేనా ఒక గంట బయటకు వెళ్ళి వచ్చేసరికి యిల్లంతా ఖాళీ అనుకుంది.

మరో వారానికల్లా వారిజ పిల్లలు కూడ అక్కడి వాతావరణానికి అలవాటు పడిపోయారు. అది వేసవి కావడంతో రోడ్లనిండా జనం ఉంటున్నారు. అదే చలికాలం అయితే అవసరం ఉంటే తప్ప ఎవరూ బయటకు రారు.

ఆరోజు సాయంకాలం వారిజను, పిల్లలను బజారుకి తీసికెళ్ళాడు నందా. చిన్నాడని ఆదిత్యను ఎత్తుకుంటే వారివైపు అందరూ వింతగా చూస్తున్నారు. అందుకే ప్రామ్ కొనడం తప్పనిసరైంది. బజారులో అన్నీ వింతగా కంగారుగా చూడసాగింది వారిజ. ఆమె నల్ల త్రాచులాంటి వాలుజడను, అందులో అందంగా తురిమిన పసుపుగులాబిని, పసుపురంగు పట్టుచీరను, సూర్యునిలా ప్రకాశిస్తున్న ఎరుపురంగు బొట్టును ఐరిష్‌వారు మార్చిమార్చి చూస్తున్నారు. అక్కడ ఇండియన్స్ ఎక్కువగా లేకపోవడంతో వారికి వారిజ ఆకర్షణగా కనబడుతుంది.

నందా షాపులో ఏదో చూస్తున్నాడు. ప్రతీవాళ్ళు 'హలో' అంటూ పలకరిస్తుంటే తన భర్తకు అప్పుడే ఊరిలోని వారందరూ తెలిసిపోయారా అని ఆశ్చర్యపోయింది వారిజ. అదే సంగతి భర్తనడిగింది. 'మీకు వారందరూ తెలుసా? అని దానికి చిరునవ్వునవ్వి. 'ఈ దేశపు పద్ధతి అది. తెలియనక్కరలేదు. మనం విదేశీయులమని మర్యాద కోసం అలా పలకరిస్తారు. ప్రపంచంలో అందరికంటే ఐరిష్ వాళ్ళు చాలా మంచి వాళ్ళట అన్నాడు. అప్పటినుండి వారిజ కూడ తనని పలకరించిన వారిని 'హలో' అంటూ చిరునవ్వుతో తిరిగి విష్ చేయడం మొదలు పెట్టింది.

పిల్లలతో షాపింగ్ ముగించుకొని అక్కడే దగ్గరిలోనున్న హోటల్‌కెళ్ళి పొటేటో చిప్స్, స్నాక్స్ తిని వచ్చేసారు. బయట చలికి చేతులు దురద మొదలయ్యాయి వారిజకు. గబగబా హీటర్ ఆన్ చేసి దాని దగ్గర చేతులు వేడి చేసికుంటేగాని కుదుట బడలేదు ఆమె. పిల్లలిద్దరూ రాగానే నిద్రపోయారు. ఆ తరువాత కూర్చొని ఇండియాకు ఉత్తరం వ్రాయడం మొదలు పెట్టింది వారిజ. ఐర్లాండు చేరగానే క్షేమంగా చేరినట్లు కేబుల్ యిచ్చేసారు. వెంటనే ఉత్తరం వ్రాయడానికి బద్ధకించింది. ఆదిత్యకూడా పెన్ పట్టుకుంటే లాగేసుకుంటాడు. నిద్రపోయినప్పుడు వ్రాద్దామంటే ఇంటిపని.

ఆ సాయంకాలం నందా, వారిజ వెచ్చగా ఫైర్ ప్లేస్ ముందు కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంతలో కాలింగ్‌బెల్ మ్రోగింది.

"హు ఈజ్ ఇట్" తలుపు తెరుస్తూ అన్నాడు నందా.

'రేబెల్' వీణ మీటినట్లు పలికింది అవతలి కంఠం.

'ప్లీజ్ కమిన్ సైడ్' అంటూ ఓరగా తలుపులు తెరిచాడు. పూర్తిగా వారితో పాటు చల్లగాలి కూడా లోపలికి వచ్చేసి అంతవరకూ వెచ్చగా నున్న ఇంటిని త్రుటిలో



చల్లబరచేస్తుంది. వారితో పాటు ఆ చల్లగాలి కూడ రానే వచ్చింది లోపలికి పిలవనిపేరంటంలా.

రేబెల్‌తో పాటువిశాల్ కూడా ఉన్నాడు. 'రండి కూర్చోండి' కుర్చీ చూపించాడు నందా. వారిజ చూసి నవ్వింది.

"నేను రేబెల్ రూమ్‌లోకి వచ్చేస్తున్నాను. అంటే మీకు దగ్గరగా అన్నమాట". విశాల్ అన్నాడు.

'మాకు మూడు బెడ్‌రూమ్స్ ఉన్నాయి పిల్లలు చిన్నవాళ్ళు కదా! మా రూమ్‌లోనే పడుకుంటారు. కావాలంటే మరో ఇల్లు దొరికేవరకూ ఒక రూమ్‌లో ఇక్కడే ఉండొచ్చుగా' వారిజ అంది. ఆ మాటల్లో ఆ అమ్మాయితో కలసి ఉండడం ఎంతమాత్రమూ ఇష్టం లేనట్లు విశాల్ గ్రహించినా, ఆ భావానికి ఇంపార్టెన్సు ఇవ్వనట్లుగా, 'నన్ను మీ ఇంట్లో పెట్టుకోవడానికి మీకు అభ్యంతరం లేకపోవచ్చు. కాని ఇంటి ఓనరు ఊరుకోడు' విశాల్ అన్నాడు.

'ఏం. ఎందుకూరుకోడు. అతని అద్దె అతనికి ఇస్తున్నపుడు ఒక్కళ్ళు ఉంటేనేం. వందమంది ఉంటేనేం. ఈ ఇన్‌కన్వీనియన్స్ మనం భరించుకుంటాంగాని అతను భరించుకోడుగా" వారిజ అంది.

"ఇక్కడ వాళ్ళు, ఇల్లుని ఇల్లులాగే చూస్తారండి. మనలాగ సత్రంలాగ చూడరు" విశాల్ అన్నాడు.

'మీ పిల్లలు, మీ రూమ్‌లో పడుకుంటారా? బాబోయ్ అందరూ ఒకే గదిలో ఎలా పడుకుంటారు!' రేబెల్ ఆశ్చర్యంగా అడిగింది.

'మాకు అలవాటే, మాకు అభ్యంతరం ఉండదు' నందా అన్నాడు. 'మేమైతే పుట్టిన రోజు నుండి వేరే గదిలో పడుకో బెడతాం అంది. వాళ్ళు కొంచం సేపు ఉండివెళ్ళిపోయారు. "నిజంగా విశాల్ ఆ అమ్మాయితో కలసి ఉంటాడా? వారిజ అంది. 'అందులో సందేహం లేదుగా' నందా అన్నాడు. 'ఆ అమ్మాయి ఏమిటి బాబు, ఆదిత్య పాకుతూ ఆమెకాళ్ళదగ్గరకు వెళితే కాళ్ళతో ఆదిత్యను కితకితలు పెట్టింది!' అంది.

ఆ సన్నివేశం అసలు నచ్చలేదు వారిజకు. ఏది చూసినా హో హో ఇది వీరి అలవాటు కాబోలు అని సర్దిచెప్పుకోవానికి చాలా అవస్థపడవలసి వస్తుంది. తిరిగి అంది. "రేబెల్ ఐస్‌క్రీమ్ తను సగం తిని మిగిలినది ఆముక్తకు తినమని యిచ్చేసిందేమిటి? వాళ్ళకు ఎంగిలి పెట్టకూడదని తెలియదా. మనముందే యింతసేపు దాన్ని నాకుతూ తిని చిన్నపిల్లకు ఎలా యిచ్చేసిందో నేను చూసాను కాబట్టి ఆముక్తకు జలుబుగా ఉంది వద్దన్నాను. లేదంటే ఆ ఎంగిలి ఐస్‌క్రీమ్ ఆముక్త తినేసేదే. చిన్నపిల్లకదా" అంది నారిజ.

వారిజవైపు చిరునవ్వుతో చూసాడు నందా. దాన్ని అర్థం "అలాంటివి వారికి అలవాటు. సీరియస్‌గా తీసికోకు" అని.

"విశాల్ మన పైపోర్షనులోకి వస్తున్నాడు - అంటే చాలా సంతోషంగా ఉంది" అంది.

"కాని ఆ అమ్మాయితో కలిసి ఉండడానికి ఒప్పుకున్నాడు. అంటే యిద్దరికీ చాలా పరిచయం ఉందన్న మాట పైగా పెళ్ళికుదిరిందంటున్నాడు."

"సరదాగా అన్నాడేమో"

"నిజంగా కుదరకపోయినా ఆ అమ్మాయి ప్రేమలో పడితే కష్టం. పాశ్చాత్య స్త్రీలతో మన మగవాళ్ళు ఎడ్జస్ట్‌కావడం చాలా కష్టం. వాళ్ళకు మనవాళ్ళంటే చాలాక్రేజ్" అన్నాడు.

"ఏం యిక్కడి వాళ్ళు అందంగా ఉంటారుగా"

"ఇక్కడివాళ్ళు అందంగా ఉన్నా బాగాతాగుతారు. తాగి ఎక్కువగా పడుకుంటారు. ఆడవారికి కోరికలు తీరవు. అదే ఇండియన్ అయితే తాగరని, డబ్బుబాగా సంపాదిస్తారని వారికి ఆశ."

"బాబోయ్ ఇక్కడా ఉన్నాయన్నమాట వలలు"

"ఆ ఇవి చవకరకంవి కావు. ఫారెన్ వలలు చాలాస్ట్రాంగ్"

"నేను లేనప్పుడు మీకు వేసారా ఎవరైనా వలలు"

"ఆడబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు."

"మరి ఆడదాన్నేగా" నవ్వుతూ అంది వారిజ.

"నేను వలలోపడకుండా మా కన్సల్టెంటు నన్ను అన్ని విధాలా కాపలావేసి రక్షించారు. అందుకే నీ భార్యను త్వరగా తీసికొనిరా అని అస్తమాను అనేవారు"

"అయితే మీరు నన్ను ఆయనకోసం రప్పించారన్నమాట" చిన్నగా అడిగింది వారిజ.

"నీవు నామీద అలిగినా లాభం లేదు. మీ పుట్టింటికి వెళ్ళడానికి కుదరదు." ఉడికిస్తున్న ధోరణిలో అన్నాడు నందా.

"పుట్టింటికి వెళ్ళకపోతే పైకి వెళ్ళిపోతాను" దానికి డబ్బులు ఖర్చుండదుగా అంది.

"పైకి కుదరదు. పై పోర్షనులో రెబెల్ ఉంది" అన్నాడు నవ్వుతూ. ఆ మర్నాడు విశాల్ రెబెల్ రూమ్‌లోకి వచ్చేసాడు. పెళ్ళికాని అమ్మాయిలు ఉద్యోగాలు చేస్తున్నవారు ఒకో ఇల్లు అద్దెకు తీసుకొని అద్దె పంచుకుంటూ ఉండడం వారికి అలవాటే.

"మీరు దగ్గరలో ఉంటే ఇదే ఇండియా లాగుందండి" విశాల్ అన్నాడు సంతోషంగా వాళ్ళ దగ్గరకు వచ్చి.

'మీరు రావడం మాకు సంతోషంగా ఉంది' వారిజ అంది. ఇంతలో నందా ఫ్రెండ్స్ వస్తే అందరికీ కాఫీలు ఇచ్చింది వారిజ.

"మీరు ఎంత భారతీయులైనా, ఇలా భారీ ఎత్తున కాఫీ ఫలహారాలు అందరికీ పెడుతుంటే దానకర్ణుడు ఇండియాలో పుట్టాడా, ఐర్లండులో పుట్టాడా అని నేను అనుకోవలసి వస్తుంది" విశాల్ అన్నాడు కాఫీ కప్ అందుకుంటూ.

"మనదేశంలోనే పుట్టాడులెండి కర్ణుడు" సమాధానం చెప్పింది నవ్వుతూ. "బహుశా మీ ఇంట్లో పుట్టి ఉంటాడు" విశాల్ అన్నాడు.

"భలేవారే. ఈ కొంచం కాఫీ స్నేక్స్‌కేనా?"

"అదేమిటి, అయితే మీరు నాకు రోజా భోజనం పెట్టడం లేదా? మా ఫ్రెండ్స్‌కి చెప్పేసానే. మీ ఇంట్లో భోంచేస్తానని. ఇకపై నాకు ఫుడ్ ప్రాబ్లమ్ లేదని"

"మీరు తింటానంటే తప్పకుండా ఇక్కడే భోంచేయండి" సంతోషంగా అంది.

"ఇక్కడ కాదులెండి, డైనింగ్ టేబుల్‌మీద తింటాను" అంటూ "అమ్మయ్య నా మాటను అబద్ధం చేయనందుకు థాంక్స్" అన్నాడు.

"మరి నా వంట నచ్చుతుందో లేదో" అంది. నందా ఫ్రెండ్స్‌తో మాట్లాడుతుంటే వారిజ, విశాల్ వంటగదిలో మాట్లాడుకుంటున్నారు.

"నాకు గారెలు అంటే మహా ఇష్టం. ఆంధ్రులలో గారెలు చేయడం రాని వారుంటారా? మీకు వచ్చే ఉండవచ్చు. మినప్పప్పు దొరకవని భయపడకండి. డబ్లిన్‌లో మన వస్తువులు పప్పులు, బియ్యం కూడా మంచివి, పలావు బియ్యం కావాలంటే షాప్‌లో ఒక బస్తాకు ఆర్డర్ పెడితే వాళ్ళు రప్పిస్తారు. పులిహోర అంటే ప్రాణం నాకు. చింతపండు దొరకకపోతే ఫరవాలెండి, ఇక్కడ నిమ్మకాయలు బాగానే దొరుకుతాయి. నాకు నిమ్మకాయతో చేసిన పులిహోర అయినా ఇష్టమే."

"మీకు ఇంకా ఏమేమి ఇష్టం?"

"నన్ను మీరు అనకుండా మీరు ఉండడం ఇష్టం. మీ ఇంటిపైన నేనుండడం ఇష్టం. నేను మీలో ఒకడిగా కలసిపోవడం ఇష్టం. మీకు వంట రాకపోతే నేను అందరికీ కలిపి వంట చేయడం ఇష్టం. ఇంకా చాలా ఉన్నాయిలెండి. నెమ్మదిగా చెబుతాను. నెమ్మదిగా అంటే వినీ వినిపించనట్లు కాదండోయ్. తరువాత చెబుతాను అని అర్థం" అన్నాడు.

అతను చెప్పేతీరుకి నవ్వకుండా ఉండలేకపోయింది వారిజ. వారిజ నవ్వుతుంటే అప్పుడే డాక్టర్ నందా ఫ్రెండ్స్‌ని పంపించేసి వచ్చాడు అక్కడికి.

"వచ్చేసానండోయ్ డాక్టర్ నందాగారు, నాతో ఇంక మీకు బాధలు మొదలు. వారిజ వదినగారు ఇండియాలో ఆడవారి పోరు అత్తింటి పోరు తప్పించుకొని ఈ దేశానికి వచ్చారుగాని నేను ఆవిడకు ఆ లోటు లేకుండా తీర్చేస్తాను."

'ఆ పనిచేయవయ్యా. లేకపోతే అక్కడకు వెళ్ళిపోయి అందరితో చీవాట్లు తిని వస్తాను అంటుందేమోనని నాకూ భయంగా ఉంది" నందా అన్నాడు వారిజను ఏడిపిస్తూ.

విశాల్ చాలా సరదా అయినవాడు అని నందా, వారిజ మొదటిరోజునే గమనించారు. కాని వారికి రెబెల్‌తో కలిసి ఉండడం మాత్రం నచ్చడం లేదు. మెల్లిగా ఆ విషయం అతనికి నచ్చజెప్ప వచ్చనుకున్నారు.

ఆరోజు ఆదివారం. ఆ వారం నందాకు డ్యూటీ ఉండం వలన హాస్పిటల్‌కు వెళ్ళాడు. నెలలో ఒక్కవారం మాత్రమే అతనికి డ్యూటీ పడుతుంది. మిగిలిన శని ఆదివారాలు ఖాళీనే. కాని ఈ మధ్య ఓవర్ టైమ్ చేస్తున్నాడు. ఏ శని ఆదివారాలూ పనిచేసినా అతనికి ఎక్స్‌ట్రామనీ వస్తుందని చేస్తున్నాడు అప్పుడప్పుడు.

పిల్లలిద్దరు చాలాసేపు ఆడుకొని పడుకున్నారు. వారిజ కిటికి దగ్గర కూర్చుని చూస్తోంది. ఇంతలో రెబెల్, ఆ పక్కింటిలో నున్న మరో నలుగురు అమ్మాయిలు - బికిని, బ్రాలతోవచ్చి ఎండలో వెల్లకిలా పడుకున్నారు.

డ్రాయరు, బాడీతప్ప మరే ఆచ్ఛాదన లేని వారిని అలా చూడడానికి ఆమెకు చాల సిగ్గేసింది. చూడలేనట్లు మొహం తిప్పుకుంది. తెల్లని శరీరంపై నల్లని ఆ చిన్న బట్టలు ఉండీ లేనట్లే ఉన్నాయి. వారు తమ శరీరం అంతా కనబడుతుంది అన్న ఫీలింగ్ ఉన్నట్లు లేక హాయిగా జోక్స్ వేసుకుంటూ సరాగాలాడుకుంటూ ఎండలో పడుకొని కేరింతలు కొడుతున్నారు. ఇంతలో కిటికీ దగ్గరకు విశాల్ వచ్చాడు. అతను వాళ్ళను గమనించనట్లే ఉన్నాడు. అదేమీ కొత్తకాదు అన్నట్లు చూసాడు వాళ్ళను. వారిజే ఆశ్చర్యంగా చూస్తుంది.

"మీరు మరీ ఆశ్చర్యపోకండి. వాళ్ళకు ఎండ అంటే చాలా ఇష్టం. ఆగష్టు జూన్‌లలోనే ఎండ వస్తుంది. ఆ రెండు నెలలు వారికి పరమానందంగా ఉంటుంది. మిగిలిన నెలలో మంచుపడడంతో ఎవరూ బయటకు రారు. తెల్లగా ఉన్న వారి శరీరాలకు ఎండ తగిలి ఎర్రగా మారితే వారికి ఎంతో ఇష్టం. మన దేశంలో నల్లగా ఉన్నవారు తెల్లగా మారడానికి ఫెయిర్ అండ్ లవ్లీ లాంటివి వాడితే ఇక్కడివారు తెల్లని శరీరాన్ని ఎర్రగా మార్చుకోడానికి ఎండలో పడుకొని తిప్పలు పడతారు. దాని సన్ టానింగ్ అంటారు" అన్నాడు.

"వాళ్ళకి సిగ్గుగా అనిపించదూ, అలా పబ్లిగ్గా తిరగడానికి?"

"వారు పెరిగిన వాతావరణం అలాంటిది. చిన్నప్పటినుండి అలవాటే వారికి. ఎండవస్తే చాలా ఇంట్లోనున్న కుక్కపిల్లతో సహా బయటకు వచ్చేస్తారు. అదేదో ఇల్లు కూలిపోతుంది. అన్నంతగా ఇల్లు ఖాళీ చేసేస్తారు. నెలలో 10 నెలలు చలిలోనూ, మంచులోనూ విసిగిపోయి ఉంటారు. మీరు వారిని చూడడానికే బిడియపడుతున్నారు, కాని నేను వారి గురించి మాట్లాడడానికి కూడా బిడియ పడడం లేదు. కొన్ని రోజులు పోతే మీకు అలవాటైపోతుంది ఇటువంటి సీన్స్ చూడడం."

"ఏమో బాబూ, ఏమి పద్ధతులో"

"వాళ్ళూ మన గురించి అలాగే అనుకుంటున్నారు."

"మన గురించా, మన భారతీయులు ఇలా బరితెగించారా"

"తెగించలేదనే. మీరు ఎక్కువగా సిగరెట్లు తాగరు. డ్రింక్స్ తీసికోరు, ఒకే పార్టనర్‌తో జీవితాంతం బ్రతుకుతారు. అదేం జీవితం బాబు. అలాంటి బ్రతుకెందుకు, విసుగెయ్యదా అంటారు."

"మంచిగా బ్రతకడం కూడా తప్పేనా?"

"తప్పే అని మన గాంధీజీ జీవిత చరిత్ర చూస్తుంటే తెలియడం లేదా?"

వారిజ సమాధానం చెప్పేలోగా హాస్పిటల్ నుండి నందా రావడంతో సంభాషణ ఆగింది.

"ఏమోయ్ విశాల్. భోజనం అయిందా?" పలకరించారాయన.

"ఇంకా లేదండి. వారిజగారు ఇంకా వడ్డించందే. మీ కోసం చూస్తున్నాం. అందరం కలిసే తిందాం"

"వారిజగారు, వారిజగారు అనకపోతే చక్కగా అక్కయ్య అనో వదినా అనో పిలవకూడదా" అంది వారిజ.

"ఏమిటోనండి అలా అలవాటై పోయింది. ఇక్కడ చూడండి ఒక్క తల్లిదండ్రులను తప్పించి మిగిలిన అందరినీ చిన్న పిల్లలతోసహా ఆఖరుకి స్కూలు టీచర్నికూడా పేర్లతోనే పిలుస్తారు. నాకు అదే అలవాటయింది" అన్నాడు. విశాల్ వారిజను మిసెస్ వారిజ అని, నందాను 'డాక్టర్ నందా' అని సంబోధిస్తూ ఉంటాడు.

"వారి పద్ధతులు మనకెందుకులే"

"నేను చాలావరకూ వారి పద్ధతులనే ఫాలో అవుతున్నాను కదా! లేదంటే ఇలా రెబెల్‌తో ఉండగలనా?"

"విశాల్! చనువుగా అడిగానని ఏమీ అనుకోవద్దు. నీవు విడిగా ఉండలేవా? ఆ అమ్మాయితో ఎందుకు చెప్పు. అనవసరంగా నీమీద ఆశలు పెట్టుకుంటుందేమో"

"ఇంకా ఏమిటండి నన్నిప్పుడే తన ఇంట్లోను, పెట్లోను పేట్టేసుకుంది. ఆమెకేమీ అభ్యంతరం లేదు"

"అయితే నీకూ లేనట్లేనా"

"భలేవారే. నాకు చాలా అభ్యంతరం ఉంది"

"మరి ఎందుకు ఆ అమ్మాయితో కలిసి ఉంటున్నావు"

"పెళ్ళిమాట ఎత్తవద్దు. ఎంత డబ్బయినా ఇస్తాను అన్నాను. సరేనంది ఆమెకు లేని అభ్యంతరం నాకెందుకు"

"నీవు ఇండియన్‌లా ప్రవర్తించడం లేదు."

"నిజమే, ఇడియట్‌గా ప్రవర్తిస్తున్నాను"

"ఇండియన్స్‌లో ఇడియట్స్ లేరంటావా?"

"నన్ను ఎదురుగా చూస్తూ కూడ ఏమిటండీ ఈ ప్రశ్న."

"చాలా చక్కగా ఒప్పేసుకున్నావే. అది సరే నీవు మా పోర్షనులోకి వచ్చేయి"

"వచ్చేసినంతలో నా కేరక్టర్ మంచిది అయిపోతుందా"

ఆ మాటలకు పకపకా నవ్వాడు విశాల్. "బాధలు పీల్చడానికి బ్లాటింగ్ పేపర్ లాంటిది ఉంటే బావుంటుంది కదండీ. అయినా కల్పనకు నేనంటే చాలా ప్రాణం. ఆమె అన్నింటికి ఒప్పుకుంది"

"అంటే?"

"అంటే ఏముంది. కల్పన నన్నే కావాలని కోరుకుంది. నేను పెళ్ళి చేసుకోనన్నానని స్లీపింగ్ పిల్స్ మింగేసింది. చివరికి ఎలాగైతేనేం బ్రతికింది. అందుకే పెళ్ళికి ఒప్పుకున్నాను. కొన్ని కండిషన్స్ పెట్టాను. సరేనంది"

"నీవు ఎలా తిరిగినా పట్టించుకోదు."

"ఎంత మాత్రమూ పట్టించుకోదు. దానికి ప్రతిఫలంగా నన్ను ఇల్లరికం రమ్మంది. సరేననక తప్పలేదు"

"ఇల్లరికం వెళతావా? కల్పనను ఇక్కడికే రప్పించేసుకో"

"ఊహు. తను అక్కడినుండి కదలదట. నేను ఇక్కడ మరొక్క సంవత్సరం మాత్రమే ఉంటాను. అది కాగానే కల్పన దగ్గరకు వెళ్ళిపోయి పెళ్ళి చేసికుంటాను."

"నీ సంగతి ఆమెకు ఉత్తరం వ్రాస్తాను. నీవు రెబెల్‌ని పెళ్ళి చేసికుంటున్నావని వ్రాస్తాను" బెదిరిస్తూ అంది వారిజ. అతను రెబెల్‌తో రూమ్‌లో ఉండడం అసలు ఇష్టం కావడం లేదామెకు.

"కల్పన సతీసుమతి పుట్టిన దేశంలో పుట్టిందండి"

"నీవు శ్రీరామచంద్రుడు పుట్టిన దేశంలో పుట్టావుగా"

"నేను శ్రీలంకలో పుట్టానట, అక్కడ మా నాన్నగారు వ్యాపారం చేసేవారు."

"మొండికెత్తినవాడు రాజుకంటే బలవంతుడు" కోపంగా అంది వారిజ. నందాకి హాస్పిటల్ నుండి ఫోన్ రావడంతో వెళ్ళిపోయాడు.

"మీరుండండి. ఆదిత్య ఏడుస్తున్నాడు చూడండి" అంటూ గబగబ వంట గదిలోకి వెళ్ళి వంట మొదలు పెట్టాడు విశాల్. చక చకా వంట చేస్తున్న అతన్ని విచిత్రంగా చూసింది వారిజ.

ఆ రాత్రి భోజనాల దగ్గర 'ఈ పూట వంట విశాల్ చేసాడు' అంది వారిజ.

'తెలుస్తూనే ఉంది' నందా అన్నాడు.

"నాకు వంట చేయడం చాలా ఇష్టమండి. మీ ఆడవారు ఏమిటీ మరీ వంటగదిలో

అలా మగ్గిపోతారు. మా అమ్మగారూ అంతే. రోజంతా వంటగదిలో ఉన్నా వంట సరిగా చేయడంరాదు''

"వంట వాళ్ళు చేస్తారా మీ ఇంట్లో వంట'' వారిజ అంది.

"అవును. పెళ్ళయిన కొత్తలో మా అమ్మే వంట చేసి 'వంట ఎలా ఉంది' అని అడిగేదట, 'ఏడిసినట్లుంది' అని తిట్టడానికి కూడా వీలులేక పోయేదట. మా నాన్నగారికి.''

"అంత బావుండేదా వంట?''

"నా మొహం. వంటకాలన్నీ నోట్లో అంటుకుపోయి నోరు తెరవడానికి తిట్టడానికి కూడా అవకాశం ఉండేది కాదట మా నాన్నగారికి''

విశాల్ మాటలకు నందా, వారిజ పడి పడి నవ్వారు. నవ్వి నవ్వి ఆమెకు కళ్ళల్లో నీళ్ళు వచ్చాయి.

"సారీ మెసెస్ వారిజ. మిమ్మల్ని ఏడిపించానా? ముందు ముందు ఇలాగే చాలా ఏడిపిస్తాను. మీరు అలవాటు పడిపోవాలి నాతో.''

"ఇలాంటి ఏడుపులు రోజుకి ఎన్నిసార్లు ఏడవమన్నా ఇష్టమే నాకు. నవ్వించే వాళ్ళంటే మహా ఇష్టం''

"అయితే నన్ను ఇక్కడినుండి వెళ్ళిపొమ్మనరన్న మాట''

"ఎప్పుడూ అలా భావించకు. మేమున్నంతకాలం నీవు మా దగ్గరే తినాలి.''

"థాంక్యూ డాక్టర్ నందా'' ఆనందంతో ఈసారి విశాల్‌కు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏయ్ ఏమిటది చిన్న పిల్లాడిలా'' ఓదార్పుగా అన్నాడు నందా.

"నన్ను ఎక్కువ ప్రేమించకండి. ప్రేమించేవాళ్ళంటే నాకు భయం. ఆ భయంతోనే నా తల్లిదండ్రులను వదలి పారిపోయి వచ్చేసాను.''

"పారిపోయి వచ్చావా?''

"అవును వారు వద్దంటున్నా వచ్చేసాను.''

"ఎందుకు, ఎకనమికల్ ప్రోబ్లమ్సా?''

"కాదు. ఇక్కడ కూడ నేను డబ్బు కోసమే వచ్చానని చాలామంది అన్నారు. మా కొలీగ్ ఒకతను ఇండియా నుండి వచ్చి ఇంత చలిలో కష్టపడడమెందుకు? మీ ఇండియన్స్‌కి డబ్బు అంటే ఆశ. మీది పేద దేశం కదూ. డబ్బు కోసమే వస్తారు ఇక్కడకు'' అన్నాడు.

"మరి నీవేమన్నావు?''

“నేను తలచుకోవాలేగాని మీ దేశంలో సగం కొనేయగలను - అన్నాను. నోరు ఆవళించాడు. ఐర్లాండు కాబట్టి బ్రతికిపోయాడు. అదే ఇండియా అయితే నోట్లో ఎన్ని దోమలు దూరేవో. అయిదు నిమిషాలవరకూ నోరు మూయనే లేదు. నేనే బలవంతంగా మూసాను.''

“అవునుకదూ, అసలు ఇక్కడ దోమలు, నల్లులు, ఈగలు లాంటివి లేవు'' అంది వారిజ.

“అవేకాదు. ఈ దేశంలో పాములుకూడ ఉండవు. ప్రపంచంలో పాములు లేని దేశం ఇదే.''

“నిజంగా' ఆశ్చర్యంగా అడిగింది వారిజ.

“నిజంగానే ఆడమ్ అండ్ ఈవ్‌ని ఏపిల్ పండు తినమని పాము సలహా ఇచ్చిందట. అది తిన్న తరువాతే కోరికలు తద్వారా బాధలు కలిగాయనే కోపంతో సెయింట్ పేట్రిక్ పాములన్నిటినీ సముద్రంలో స్టిక్ సహాయంతో వేశాడట. అప్పటినుండి ఈ దేశంలో పాములు లేవట. దానితోపాటు మనుషులలో కూడా విషం, అసూయ అనేది తక్కువ. నూటికి కోటికి ఎవరికో ఉంటుంది అంతే. ఆ ఉన్న వారినే మనం పాముగా భావించాలి.''

“మన దేశంలో కూడా పాములూ క్రూర జంతువులూ లాంటివి లేకుండా ఉంటే బావుండును'' వారిజ అంది.

“కొంతకాలం పోయిన తరువాత ఉండవులెండి'' విశాల్ అన్నాడు.

“ఎలా చెప్పగలవు అంత ఖచ్చితంగా''

“చెప్పగలను, డైనసోర్స్ లాంటివి చనిపోయి మనుషుల అవతారం ఎత్తి కోడళ్ళను కాల్చిచంపడాలు, రేప్‌లు, హత్యలు చేస్తున్నాయి. అలాగే మిగిలిన క్రూర జంతువులు కూడ చనిపోయి అన్నీ మనిషి అవతారం ఎత్తేస్తాయి. ఇప్పటికే చాలావరకూ ఎత్తేసాయి''

“చాలా బాగా చెప్పావు. మన దేశం రాను రాను చాలా అధ్వాన్నంగా అయి పోయింది'' నందా అన్నాడు.

“అసలు కేన్సర్‌కి ఎయిడ్స్‌కి వేక్సినేషన్ కనిపెడుతున్నారు గాని మనుషులలోని క్రూరత్వానికి కనిపెట్టి టీకాలు, ట్రిపిలాంటిజెన్, పోలియో డ్రాప్స్‌తోపాటు చిన్నప్పుడే దానికి ఏదైనా మందు వేసేస్తే ఎంత బావుణ్ణు!'' బాధాకరంగా అన్నాడు విశాల్.

“ఇంతకీ అసలు విషయం చెప్పలేదు నీవు'' నందా అడిగాడు.

“ఏమిటది అసలు విషయం, వడ్డీ విషయం?''



"ఎందుకు ఈ దేశం వచ్చావు?"

"ఏం సార్. నేను రాకూడదా? ఈ దేశానికి రావడానికి నాకు అర్హతలేదా?"

"ఎందుకు లేదూ, బ్రహ్మాండంగా ఉంది. కాని కావలసినంత డబ్బు పెట్టుకొని ఎందుకు ఇక్కడ ఒంటరిగా కష్టపడడం"

"ఒంటరిగా కష్టపడడం లేదండి. మా ఆఫీసులో చాలామంది ఉన్నారు"

"చాల్లే. మాట మార్చవద్దు"

"మరి మనసు మార్చుకొని ఇండియా వెళ్ళిపొమ్మంటారా! అది నావల్లకాదు. అమ్మ, నాన్న: వెళ్ళవద్దన్నా వచ్చేసాను. మరలా మీ గడప తొక్కను అని దెబ్బలాడి వచ్చాను. నేను పౌరుష వంతుణ్ణండి. ఆడినమాట తప్పను. నాకు పట్టుదల ఎక్కువ"

"తల్లిదండ్రుల దగ్గరా నీ పట్టుదలా?"

"తల్లిదండ్రులు కాబట్టే. వేరే ఎవరితో ఎందుకు పంతం పడతాను"

"పాపం వారెంత బాధపడుతూ ఉంటారో కదా. తప్పుకదూ"

"తప్పుకాదండి. తప్పుకాదు. కల్పనను చేసికోవద్దని వాళ్ళు, చేసికుంటానని నేను. అక్కడే వచ్చింది గొడవ."

"ఎలాగోలా ఒప్పించాలిగాని తల్లిదండ్రులతో గొడవ పెట్టుకుంటారా విశాల్, ఎవరైనా?"

"ఈ ఐరిష్ సముద్రాన్ని మొత్తం నాకు ఈత రాకపోయినా ఈదేయగలను గాని నా తల్లిదండ్రులను ఒప్పించడం నా తరంకాదు."

"పోనీ నన్ను వెళ్ళి ఒప్పించమంటావా? వారి అడ్రసు ఇవ్వు. ఈసారి నేను ఇండియా వెళ్ళినప్పుడు వారితో మాట్లాడతాను."

"నిజంగా ఒప్పిస్తారా? మీరు ఆ సహాయం చేస్తానంటే చచ్చి మీ కడుపున పుడతాను."

"అది పాత డైలాగు. పైగా ఇప్పుడు మనదేశంలో ఫామిలీ ప్లానింగ్ విపరీతంగా ఉంది. నీవు నా కడుపున పుట్టనక్కరలేదు. నీ తల్లిదండ్రులను ఒప్పించే బాధ్యత నాది."

"నొప్పించే బాధ్యత నాదంటారా?" విశాల్ మాటలకు నవ్వాడు నందా.

"అలాగే ఒప్పిద్దురుగాని. మీరు నాకు రెండు వరాలు ఇవ్వాలి. అతి చనువు తీసికుంటున్నానని అనుకోవద్దు. ప్లీజ్"

"ఏంటి మరీ కైకేయిలాగ అడిగేసావు."

"కైకేయిలాగ అమాయకంగా అడగనులెండి. నేనంత తెలివి తక్కువవాణ్ణికాదు. నేనడగబోయేవి ఘోరమైన వరాలు" సరదాగా అన్నాడు విశాల్.

"సరే చెప్పు, ఏమి కావాలో"

"ఇప్పుడు ఒక కోరిక కోరతాను; మిగిలినది తరువాత"

"గొప్ప సస్పెన్సులో పెట్టేసావే"

"నేను నా తల్లిదండ్రులకు ఒక్కణ్ణే కొడుకుని. బోల్డంత ఆస్తి ఉంది. బిర్లా తరువాత మా నాన్నగారిని చెప్పుకున్నా తప్పులేదు. లేకలేక ముసలి వయసులో పుట్టానట నేను. నన్ను చూసి చాలమంది మీ మనుమడా అని అడుగుతారు మా అమ్మనీ, నాన్ననీ. నేను ఒక్కణ్ణే కావడంవలన నాకు తోడూ నీడా ఎవరూ లేరు ఇంట్లో."

"ఈ సంగతి ఇదివరకు ఒకసారి చెప్పావు" వారిజ అంది.

"టేప్ రికార్డర్‌లోని కేసెట్‌లాగా ఎన్నిసార్లయినా చెబుతాను. నాకు నీడనివ్వడానికి మా ఇంటినిండా చాలా చెట్లున్నాయి. కాని తోడుగా ఎవరూ లేరు."

"అందుకని నన్నేం చేయమంటావు?" నందా అడిగాడు.

"నాకొక తోడు నిమ్మంటాను"

"నేనెలా ఇవ్వగలను"

"మీరు ఇవ్వగలరు కాబట్టే అడుగుతున్నాను."

"నీవు చెప్పేది నాకు అర్థం కావడంలేదు."

"తెలుగు అర్థం కావడం అంటే ఐరిష్ లాంగ్వేజిలో చెప్పవలసిందే"

"ఐర్లాండ్‌లో పుట్టినవారే ఐరిష్ లాంగ్వేజ్ మాట్లాడరు. ఇంగ్లీషే మాట్లాడతారు. ఇక నీవేమి ఐరిష్ భాషలో చెప్పగలవు. నేను ఎలాగోలా చెబుతాను. మీరు అర్థం చేసుకుంటారా? వద్దులే, మాతృభాషలోనే చెప్పు, నీ ఘోష"

"ఇక్కడ ఆవులకు, కాకులకు తెలుగు వచ్చు తెలుసా?" విశాల్ అడిగాడు.

"తెలుగు వచ్చా? ఆశ్చర్యంగా అడిగింది వారిజ.

"అవును. ఆవులు అంబా అని తెలుగులో అరుస్తుంటే, కాకులు కూడా కావు, కావుమని తెలుగులోనే గోలపెడుతున్నాయి" విశాల్ అన్నాడు.

"చాల్లేవయ్యా నీ జోక్స్"

"అయితే రేపటి నుండి జోక్స్ వద్దంటారా?"

"ప్రస్తుతం అసలు సంగతి చెప్పమంటున్నాను" నందా అన్నాడు.

"ఆ. ఆ. వస్తున్నా, ఎయిరిండియాలో, నాకు నాలాంటి తమ్ముడో అన్నయ్యో ఉంటే బావుణ్ణు అని చిన్నప్పటినుండి అనిపిస్తుంది. అందుకని మీరు ప్లాస్టిక్ సర్జను కదా, నాలాంటి మనిషిని తయారుచేయగలరా?"

"నీలాంటి మనిషినా? నేనా!"

"మీరే, నాలాంటి మనిషినే. జీవితంలో ఆ కోరిక నన్ను వదలడం లేదు. నాలాంటి మరో మనిషిని చూసికోవాలని ఉంది"

"వెళ్ళి అద్దం ముందు నిలబడు."

"నిజమైన మనిషి కావాలి నాకు"

"నీవున్నావుగా, నిజమైన మనిషివి"

"ఉహూ నాలాంటి మరో మనిషి కావాలి."

"నిజంగానే కైక అడిగిన దానికంటే ఘోరమైన వరం ఇది"

"నా అంత ఒడ్డూ పొడుగూ, రంగూ ఉన్న మనిషిని తీసుకొని వస్తాను. మీరు ఎలాగైనా నాలా తయారుచేయాలి"

"ఆ సంగతి తరువాత ఆలోచిద్దాం. నాకు నిద్రవస్తుంది" అంటూ లేచాడు నందా.

సెప్టెంబర్ నెలరాగానే వర్షాలు, మంచుపడడం మొదలయ్యాయి. చలి విపరీతంగా వణికించేస్తోంది. ఎలక్ట్రిక్ హీటర్, గాస్ హీటర్ రాత్రిళ్ళు వాడుతున్నారు. పగలంతా ఫైర్ ప్లేస్ దగ్గర ఫైర్ వెలిగిస్తే రోజంతా ఆ మంట ఉండి ఇల్లు వేడిగా ఉంటుంది. ఫైర్‌ప్లేస్ సిటింగ్ రూమ్‌లో ఉన్నందువలన ఆ వేడి బెడ్‌రూమ్స్‌కి అందడంలేదు. అది వెలిగిస్తే ఆ వేడి ట్యూబ్స్ గుండా వెళ్ళి నీళ్ళటాంక్‌కి కనెక్షన్ ఉండడం వలన నీళ్ళు వేడెక్కుతాయి. అందుకే ఇంకా పగలంతా నీళ్ళు కరెంటు ద్వారా వేడి చేయాల్సిన అవసరం లేదు. ఆఖరికి బట్టలు ఉతకడానికి కూడా వేడి నీళ్ళే వాడుతుంది వారిజ, చన్నీళ్ళలో చేయిపెట్టలేక.

ఆ రోజు కొంచెం జ్వరంగా ఉందని విశాల్ ఆఫీసుకి వెళ్ళలేదు. వెదర్ మారేసరికి ఇంట్లో అందరికి దగ్గొ రొంపలు, జ్వరాలు మొదలయ్యాయి. అంతకుముందే వారిజ రెండు రోజులు పక్కవేసి లేచింది. ఆ తరువాత పిల్లలు, ఆ తరువాత విశాల్ మంచం ఎక్కాడు. రేబెల్ ఆఫీసుకి వెళ్ళిపోతే వచ్చి వారిజ వాళ్ళింట్లోనే పడుకున్నాడు విశాల్.

"విశాల్, ఇదిగో ఈ టేబ్‌లెట్ వేసుకొని కాఫీ తాగు" అంది.

"మిమ్మల్ని చాలా ఇబ్బంది పెడుతున్నాను కదూ."

"భలేవాడివే, మొన్న నాకు జ్వరం వస్తే పిల్లల పని, ఇంటిపని, వంటపని అంతా నీవే చూసావుగా. మావారికి పని చేతకాదు"

"రేబెల్ శలవు పెడతానంది, నేనే వద్దన్నాను"

"నీవంటే ఆ అమ్మాయికి చాలా ఇష్టం అనుకుంటాను"

"నేనంటే కాదు, నేనిచ్చే డబ్బంటే"

"డబ్బెందుకు ఇస్తున్నావు"

"నా అవసరం మరి"

"ఆమెతో అంత అవసరం పెంచుకోవాల్సిన అవసరం ఏముంది. త్వరగా పెళ్ళిచేసుకొని కల్పనను తీసుకొని వచ్చేయ్"

"కల్పన కూడా తొందరపడుతుంది. నేనే ఆలస్యం చేస్తున్నాను. ఈలోపుగా నా తల్లిదండ్రులను ఒప్పించగలనేమోననే ఆశ"

"ఒప్పించి చేసుకుంటే మరీ మంచిది. ఆ బాధ్యత మావారి మీద వదిలెయ్యి" ఫైర్‌లో మరింత టర్ఫ్ వేస్తూ అంది వారిజ.

"టర్ఫ్ కొన్నారా?" అడిగాడు. "అవును మొన్న లారీడు వేయించుకున్నాము. ఆ రోజు నీవు ఇంట్లో లేవు. బయట అవుట్ హవుస్‌లో ఉంది. మన పిడకల లాగ బలే కాలుతుంది ఇవి మంటలో వేస్తే" అంది.

"అది నిజానికి పిడకలాంటిదేగాని, నేలనుండి తవ్వుతారు దాన్ని"

"నేలనుండా? నేల మీద మట్టి కదా ఉండేది?"

"కొన్ని కొన్ని స్థలాలలో ఇదివరకు చెట్లు భూమిలో కప్పబడిపోయి ఆ నేలంతా గుల్లగా అయిపోయింది. అక్కడకు వెళ్ళి ఆ నేలను ఎవరికి ఎంతకావాలో వారే తవ్వి తెచ్చుకోవచ్చు. అలా అందరూ చేయలేము కదా, కొందరు సమ్మర్‌లో లారీలలో తెచ్చి అమ్ముతారు. సంవత్సరానికి సరిపడా దాచుకోవచ్చు" అన్నాడు.

"గాడిదల మీద కూడా చిన్న చిన్న మూటలు వేసి తెచ్చుకున్నారు కొందరు" అంది వారిజ.

"అవును మన చాకలి బట్టలలాగే అవీ మోస్తాయి టర్ఫ్‌ను అందుకే వాటని 'టర్ఫ్ డాంకీస్' అంటారు."

ఆదిత్య నిద్రలేచి ఏడవడం మొదలుపెట్టాడు. "మీ అబ్బాయి తెలుగులో ఏడుస్తున్నాడా, ఇంగ్లీషులో ఏడుస్తున్నాడా?"

"రెండూ కాదు. ఐరిష్‌లో ఏడుస్తున్నాడు" అంది. "ఒకరోజు స్టవ్ మీద మిల్క్ బాయిలర్ పెట్టాను. ఆదిత్య ఏడుస్తుంటే కుయ్‌మని రాగం తీస్తుంటే అది మిల్క్ బాయిలర్ శబ్దం అనుకొని పాలు ఆపేసాను" అన్నాను. నవ్వింది వారిజ.

"మనం పాలు కాస్తున్నామని రేబెల్ ఆశ్చర్యపోయింది"

"అవును ఇక్కడి వాళ్ళు పాలు కాచరు. పచ్చిపాలే తాగేస్తారు. అలాగే కాఫీలో వేసుకుంటారు. ఇక్కడ పాలల్లో కల్తీ ఉండదుగా"

"పాలల్లోనే కాదు ఎందులోనూ కల్తీలేదు, ఆఖరికి మనుషుల్లో కూడా. ఏదీ శుభ్రం చేసుకోవాల్సిన పని ఉండదు. బజారునుండి తెచ్చిన ప్రతీది కళ్ళు మూసుకొని వండేయవచ్చు"

"కాని నోరు మూసికొని తినలేము సుమా" మరోసారి నవ్వింది వారిజ. థర్మామీటరు పెట్టి జ్వరం అంతగాలేదు.

"రేపు ఆఫీసుకి వెళతావా? జ్వరం అంతగాలేదు" అంది. "నేను వెళ్ళినా వాళ్ళు రానివ్వరు. మనం ఒంట్లో కొంచెం నలతగా ఉన్నా, పిల్లల్ని స్కూలుకి పంపేస్తాము. అలా పంపితే ఇక్కడ తప్పు. ఆ డిసీజ్ పక్క వాళ్ళకి అంటుకుంటుందని, వాళ్ళే శలవు ఇచ్చేస్తారు" చాలా మంచి పద్ధతి.

"అవును, ఇంకా చాలామంచి పద్ధతులున్నాయి. రేపటి కోసం దాచుకోరు. తరతరాల గురించి వారు అసలు ఆలోచించరు. అందుకే ఇక్కడ మోసం, స్వార్థం తక్కువ. మన ఇండియాలోనా, ఉగ్గుపాలతోనే అన్ని అవలక్షణాలు ఒంటబట్టేస్తున్నాయి.

మా ఊరిలో ఒక ఆవిడ ఉంది. ఆవిడ ఇద్దరి కోడళ్లని కాల్చి చంపేసింది. ఆవిడ జీవిత చరిత్ర చూస్తే ఆవిడ చిన్నప్పుడే అమ్మ, అత్తకు బదులు "అగ్గి అగ్గి' అనే మాట మొదట పలికిందట. ఆఖరుకి కోడల్ని అగ్నికి వేసేసారు.

అయినా పోయిన వారి ప్రాణాలు తేలేరుగా. ఇంతలో కాలింగ్ బెల్ మ్రోగింది. వారిజ వెళ్ళి మెల్లగా తలుపు తీసింది. తలుపు తెరిచీ తెరవకుండానే చల్ల గాలి మొహాన్ని చెళ్ళున కొట్టింది. మొహం అంతా సెకండ్స్‌లో తిమ్మిరెక్కిపోయింది.

"మిసెస్ వారిజా, ఎందుకు చలిగాలితో దెబ్బలు తింటారు. ఇక్కడ చలిగాలి ఇండియాలోని అత్తగార్లకంటే క్రూరమైనది జాగ్రత్త" అన్నాడు.

"విశాల్! ఎవరో ఇద్దరాడవాళ్లు వచ్చారు, వాళ్ళ చేతిలో చిన్న అబ్బాయి ఉన్నాడు. కొంచెం పాలు, పది పెన్నీలు కావాలిట" మంచంమీదనుండే. వారిజ వారికి పాలు ఒక హాఫ్ పౌండు ఇచ్చి పంపింది. వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత అన్నాడు "వాళ్ళని 'టింకర్స్' అంటారు. అంటే అడుక్కునేవాళ్ళు. అలాగే వచ్చి అడుగుతుంటారు. ఎక్కువగా ఇవ్వద్దు. మరలా వాళ్ళు వెళ్ళిపోయి ఇంకొకళ్లను పంపుతారు డబ్బులకోసం. ఈ దేశం వాళ్ళయితే భిక్షం వెయ్యరని మనం వేస్తామని మన వెనకాల పడతారు."

"ఇక్కడ కూడా అడుక్కునే వాళ్ళున్నారన్నమాట"

"మంన చంద్రమండలానికి వెళితే అక్కడా ఉంటారు. వీళ్లకి ఒక ఊరు అంటూ ఏమీ ఉండదు. 'కారవాన్స్'లో అలా తిరుగుతుంటారు దేశమంతా."

"కారవాన్స్ అంటే?" అడిగింది.

"అవి మినీ సైజు బస్‌ల లాగా ఉంటాయి. అందులోనే ఇల్లు ఉంటుంది. వంట, నిద్ర, తిండి అన్నీ అందులోనే. వారికి ఇంకో ఇల్లు అక్కరలేదు. అందుకే ఆ కారవాన్ లాంటి ఇల్లుతోనే ఇక్కడిబడితే అక్కడకు వెళ్ళిపోతారు."

"భలే ఆశ్చర్యంగా ఉందే!"

మరలా కాలింగ్ బెల్ మ్రోగింది. మరో టింకర్స్ గ్రూప్ వచ్చింది. వాళ్ళకు డబ్బులు వేసి పంపించేసరికి మరో పావుగంటలో మరికొందరు. విశాల్ చెప్పినట్లే జరిగింది. ఆఖరుకి విశాల్ మంచంమీదనుండి లేచివచ్చి వాళ్ళను భయపెట్టాడు. పోలీసులకు ఫోన్ చేస్తానని. అప్పుడుగాని రష్ తగ్గలేదు. ఆ తరువాత మరెవ్వరూ రాలేదు.

"వాళ్ళకు ప్రభుత్వం ఇళ్ళు ఇస్తామన్నా ఇంట్లో ఉండరు. వారికి ఈ జీవితమే బావుంటుందేమో" అన్నాడు.

"మనదేశంలో ఇల్లు కనీసం నిలువ నీడ లేనివారు ఎందరో ఉన్నారుకదా!"

"ఇక్కడ ప్రభుత్వం పిల్లలకు, ముసలివారికి, నిరుద్యోగులకు అందరికీ ఎంతో కొంత ఆలవెన్సు ఇస్తుంది. అందుకే ఇక్కడ ఆకలి చావులు లేవు. మనదేశంలో అయితే ఆకలి చావులతోపాటు, అజీర్తి చావులూ ఎక్కువే."

"అజీర్తి చావులా, ఎక్కడా వినలేదే?"

"మనవాళ్లు ఎక్కువ తినేసి గుండెపోటులు, బి.పిలు తెచ్చుకుంటారుగాని, పేదవారిని కన్నెత్తిచూడరు"

"అలా చేస్తే మన దేశం ఎప్పుడో బాగుపడిపోవును." వారిజ అంది.

"అయినా దేశం బాగుపడిపోతే ఎలాగ. ప్రోబ్లమ్స్ లేకపోతే కష్టం. ప్రాబ్లమ్స్ లేకపోతే దేశాన్ని పరిపాలించే వాళ్ళందరూ అర్జెంటుగా గోళ్లు పెంచాలి"

"గోళ్ళా! ఎందుకు?"

"ఎందుకేమిటి, గిల్లు కోవటానికి"

డాక్టర్ నందా హాస్పిటల్ నుండి వచ్చాడు. అతని చేతిలోని ఉత్తరం ఆత్రంగా అందుకొని విప్పేసింది వారిజ. ఇండియానుండి వచ్చిన ఉత్తరం అంటే అంత సంతోషం. ఈమె ఎంత హుషారుగా విప్పిందో అంత నీర్సంగాను ఏడవడం మొదలుపెట్టింది.

నందా, విశాల్ కంగారుపడ్డాడు. నందా ఉత్తరం తీసి చదివాడు. అతను దిగాలుగా కూర్చుండిపోయాడు.

"ఏం ఇంటిదగ్గర ఎవరికైనా బావుండలేదా?" అడిగాడు.

"వారిజ వాళ్ల అన్నయ్య కొడుకు కేన్సర్‌తో చనిపోయాడట. హాస్పిటల్‌కు తీసికొని వెళ్ళేసరికే బాగా ముదిరిపోయిందట."

ఆ వార్త వినగానే విశాల్ మొహంలోకూడా నీలినీడలు కదలాడాయి. దూరంగా ఉన్నారు. వెళ్ళాలన్నా త్వరగా కుదిరే పనికాదు. నందా, విశాల్ కలిసి వారిజను కొంచెంసేపు ఓదార్చారు.

"ఆ అబ్బాయి వయసు ఎంత?" అడిగాడు విశాల్.

"పదిహేను సంవత్సరాలు"

"పాపం జీవితంమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాడో. ప్రపంచంలో రానురాను కేన్సర్ చావులు ఎక్కువయిపోతున్నాయి. దానికి మందు కంటే ముందు వాక్సినేషన్ కనుక్కుంటే బావుణ్ణు" విశాల్ అన్నాడు.

"అది ముదిరిపోయే వరకూ బయటపడక పోవడం దురదృష్టకరం. పిల్లవాడు డల్‌గా ఉంటే ఏదో నీరసం అనుకున్నారట."

"అసలు పాశ్చాత్యులలో లాగే మనదేశంలోకూడా ఆరునెలలకొకసారైనా జనరల్ హెల్త్ చెకప్ చేయించుకుంటే మంచిది."

"ఇక్కడ చేయించుకున్నంత మాత్రాన కేన్సర్‌ని అరికట్ట గలుగుతున్నారా? చాపకింద నీరులా మనిషిని ముంచేస్తుంది ఇది" బాధగా అన్నాడు నందా. వారిజ ఇంకా ఏడుస్తూనే వుంది.

"నాకు చాలాకాలంగా హైదరాబాద్‌లో మంచి కేన్సర్ హాస్పిటల్ కట్టి, మోడ్రన్ ఎక్విప్‌మెంట్ అంతా అందులో పెట్టాలని ఉంది."

"చాలా మంచి ఐడియా. ఆ పనిచేసి పుణ్యం కట్టుకో. పోయిన ప్రాణాల్ని ఎలాగూ తీసుకొని రాలేం. కనీసం ముందు తరాలవారికైనా అది ఉపయోగపడుతుందేమో మాలాంటి మధ్యతరగతి వాళ్ళం అటువంటివి ఏమీ చేయలేం. మీలాంటి వారైనా అలాంటి మంచిపనులు చేస్తే ప్రజలకు మహోపకారం చేసినవారవుతారు.

"నాకేం అభ్యంతరం లేదుగానీ, భారత ప్రభుత్వం నామీద చర్య తీసుకుంటుందని భయంగా ఉంది" అన్నాడు విశాల్.

"ఎందుకు చర్య తీసుకుంటుంది. అదేం తప్పు పనికాదే"

"తప్పు పనికాకపోవచ్చు. కాని జనాభా తగ్గింపు పథకానికి నేను అడ్డు వెళతానేమో" విశాల్ తన సహజ ధోరణిలో మాట్లాడేసరికి అంత విచారంలోనూ, చిన్నగా నవ్వాడు నందా. "ఆయనకు, పాపం కొడుకొక్కడే, ఇంకో కూతురుంది. ఆ అబ్బాయి పోయేసరికి అందరూ ఎలా ఉన్నారో, ఏమో" నందా అన్నాడు.

"ఫామిలీ ప్లానింగ్ వలన దేశానికి చాలా లాభమైనా, కుటుంబాలకు యిలాంటి నష్టాలు మాత్రం చాలా ఉన్నాయి. ఎక్కువ మందైతే పెంచడం కష్టం. ఎవరైనా చనిపోతే ఇంక పిల్లలను పొందడమూ కష్టమే."

"జీవితమే లాభనష్టాల, సుఖదుఃఖాల కలయిక. మనిషి పుట్టగానే కేవలం చావడానికే పుట్టాడు అని అనుకొని తృప్తిపడి బంధుత్వాలు, బాంధవ్యాలు, ప్రేమలు పెంచుకోకూడదు."

"అది కుదరని పని కదా"

"మనిషి బ్రతకడమూ కుదరని పనే మరి."

ఆ షాకింగ్ న్యూస్‌తో ఆరోజు మరింత జ్వరం వచ్చింది విశాల్‌కి. వారిజ తన బాధ మరిచిపోయి అతనికి పరిచర్యలు చేసింది.

మరో వారంరోజులయ్యేసరికి వాతావరణం మామూలుగా అయిపోయింది. కాలాన్ని మించిన మందు లేదు. మనసుకి అయిన గాయాన్ని మాన్పడానికి ఆ కాలాన్ని

ఏ శాస్త్రజ్ఞులూ కష్టపడి కనుక్కోలేదు. శాస్త్రజ్ఞులు అహోరాత్రులు కష్టపడి కనిపెట్టిన మందైనా కాలంముందు బలాదూరే.

వారిజ వాళ్ళ అన్నయ్య కొడుకు గుర్తుకొచ్చినప్పుడల్లా బాధపడుతూనే ఉంది. కాని ఇదివరకటి అంత ఎక్కువ కాదు. మానుతున్న గాయంలా ఉంది ప్రస్తుతం, ఆ మరణ వార్త.

"పూర్వం రంగూన్లోనో, మరెక్కడో మనుషులు చనిపోతే ఏడ్చేవారు కాదట. ఆ పద్ధతి చాలా బావుంది కదూ" విశాల్ అన్నాడు.

"ఏడవక ఏం చేసేవారట. డాన్స్‌చేసే వారా?" వారిజ అడిగింది.

"ఆ అదే చేసేవారట. శవాల్ని మూడు రోజులు ఇంట్లోనే ఉంచి దానిని రోజుకో రకంగా అలంకరించి శవం చుట్టూ ఆ చనిపోయిన వాని తాలూకు డబ్బుతో విందులు, వినోదాలు చేసుకుని, తాగుతూ డాన్స్ చేస్తూ ఆనందించేవారట. మన దేశంలో కూడా ఆ ఆచారం వస్తే బాగానే ఉంటుంది కాని..."

"ఊ... కానీ... ఆగిపోయావేం చెప్పు" నందా అన్నాడు.

"మన వాళ్ళు తాగడానికి డబ్బులులేకపోతే ఎవరో ఒకర్ని హత్య చేసేస్తారు. అలా మూడురోజులకో హత్య జరుగుతుంది"

"నిజమే సుమా." నవ్వుతూ అన్నారు నందా, వారిజ.

"డాక్టర్ నందా, మీరు అసలైన సంగతి చెప్పడం లేదు. రోజూ మీరు చెబుతారని ఎదురుచూస్తున్నాను."

"ఏ సంగతి, నీ పెళ్ళి సంగతా?" ఏమీ తెలియనట్లు అడిగాడు.

"నా పెళ్ళి సంగతి పాతదే. అది ఎప్పుడో నిర్ణయం అయిపోయింది. ఎంగేజ్‌మెంట్ కూడా అయిపోయింది."

"మీ అమ్మా నాన్నలకు తెలుసా?"

"తెలియదు"

"నీవు చాలా చెడ్డవాడివి"

"మొన్న ఏదో సందర్భంలో నన్ను మంచివాడివి అని మీరు అన్నట్లు గుర్తు"

"అది అప్పటి మాట."

"పాశ్చాత్యుల ఆడవాళ్ళు మగవాళ్ళను మార్చినట్లు మీ అభిప్రాయాలను వెంటవెంటనే మార్చేస్తే ఎలాగ"



"అయితే వారి సంగతి తెలిసే రేబెల్‌తో కలిసి ఉంటున్నావా?"

"తెలుసు కాబట్టే ఉండగలుగుతున్నాను. అదే ఇండియాలో ఏ అమ్మాయితోనైనా కలిసి ఉన్నట్లయితే, ఈసరికి నాశరీరంలో చాలా చెప్పుల జతలు తయారై ఉండేవి. అది సరే నాడూప్ సంగతి ఏం చేసారు"

"ఇంకా ఆలోచించలేదు"

"ఎప్పుడు ఆలోచిస్తారు. మరుగుజ్జులు పుట్టేనాటికా. వరల్డ్ ఎండ్ అయ్యేనాటికి ప్రపంచంలో మరుగుజ్జులు పుట్టి మూడడుగుల చెట్టుకి నిచ్చెన వేసుకొని ఎక్కుతారట. అప్పటికి ఆలోచించగలరా?"

"అప్పటివరకూ నేను బ్రతికుంటే అలాగే"

"కాని, నేను బ్రతికుండనే"

"నీవు లేకపోయినా నీ కోరిక తీరుస్తాను"

"మీరు బ్రతికుండగా లేంది మీ కంటే బాగా చిన్నవాడు విశాల్ బ్రతికుండడా? వారిజ అంది.

"చావు దగ్గర చిన్నా పెద్ద, కులం గోత్రం, మంచి చెడు, పేదా గొప్పా, అలాంటి

తేడాలు లేవు విశాల్'' అన్నాడు.

"నిజమే. అందుకేగా మా అన్నయ్య కొడుకు చనిపోయాడు" విచారంగా అంది.

"మీరు ఎప్పుడు ట్రీట్‌మెంట్ మొదలు పెడుతున్నారు?"

"ఎవరికి?"

"నా డూప్!"

"సరే, ప్లాస్టిక్ సర్జరీ చేసి నీలాంటి మనిషినే తయారు చేస్తాననుకో. అప్పుడు ఏంచేస్తావు?"

"అతనిని చూసి నాలాగే ఉన్నాడు, నా తమ్ముడిలాగున్నాడు అని చూసి సంతోషిస్తాను."

"పోనీ నన్ను మీ అన్నయ్య అనుకోకూడదూ?"

"అనుకోకూడదు."

"ఏం, అనుకోడానికి నేను తగనా?"

"తగరు. మీరు అన్నయ్యకంటే తల్లిదండ్రులకంటే, దైవంకంటే ఎక్కువవారు."

"గొప్ప డైలాగే వేసావు"

"నా మాటలు నోటిలోనుండి వచ్చినవి కావు. హృదయంనుండి వచ్చినవి. మీరు నాలాంటి మనిషిని తయారు చేస్తే అతనిని నా తల్లి దండ్రుల దగ్గరకు పంపుతాను."

"అతని బదులు నీవే వెళ్ళవచ్చుకదా."

"వెళ్ళనని ఒట్టు పెట్టుకున్నాను"

"ఇది త్రేతాయుగం, ద్వాపరయుగం కాదు కలియుగం. ఈ యుగంలో ప్రసిద్ధిచెందినవి అధర్మం, అసత్యం, హత్యలు చేయడం. మనం మన యుగ ధర్మాన్ని అనుసరించి బ్రతకాలి. నీవు ఆ ఒట్టు గట్టున పెట్టేసి మీ అమ్మనాన్నల దగ్గరకు వెళ్ళిపో"

"కలియుగంలో పుట్టిన హరిశ్చంద్రుడుగా గిన్నిస్‌బుక్ ఆఫ్ వరల్డ్‌లోకి ఎక్కుతానంటే మీరేమిటి అడ్డు పడతారు. అయినా మా అమ్మ నాన్నలకు నాకూ ఇంక సరిపడదు."

"నోటికి, నాలుకకు సరిపడదు. అంటే ఎలా కుదురుతుంది చెప్పు"

"ప్రస్తుతం సాధ్యంకానిదంటూ ఏమీలేదు"

"అయితే ఇంక నీ పేరెంట్స్ దగ్గరకు వెళ్ళ దలచుకోలేదు నీవు"

"ఊహు!"

"ఏటిలోని కెరటాలు ఏరువిడిచిపోవు. ఎదలోపలి మమకారం ఎక్కడికీ పోదు. ఏరు విడిచి ఊరు విడిచి ఎంతదూరమేగినా కన్నవారి జ్ఞాపకాలు అంతరాన ఉండునోయ్" అన్నాడో కవి.

"అది నేనలేదు. నాకు వర్తించదు."

"సరే నీలాంటి మనిషిని తయారు చేస్తాను. నాకేమిస్తావు"

"నా ప్రాణాలైనా ఇస్తాను"

"అవి నేనేం చేసుకోను. పెన్నీ విలువ చేయవు"

"అని మీరనుకుంటున్నారు. నేను మా అమ్మ కడుపులో పడింది మొదలు నన్ను చంపాలని ఎంతమంది ఎన్ని విధాల ప్రయత్నాలు చేసారో మీకేం తెలుసు."

"నిన్నా! ఎందుకు?"

"ఆస్తికోసం"

"ఏమిటో మనుషుల వింత మనస్తత్వాలు. చనిపోయిన తరువాత ఆస్తి సంగతి అలా ఉంచి తన అస్తికలు కూడ పట్టుకెళ్ళలేడు ఎవడూ."

"నా జాతకం ఎలాంటిదో మరి. మా అమ్మ కడుపులో పడిన దగ్గరనుండి అన్నీ గండాలే. నా ప్రాణాలతో చెలగాటాలే"

"ఇంక ఇప్పుడేం గండాలు లేవుగా. నిశ్చింతగా ఉండు"

"ఎలా ఉంటాను, పెద్ద గండం మీరు పెట్టారుగా"

"నేనా?" ఆశ్చర్యంగా అన్నాడు నందా.

"మరి మీరు నాలాంటి మనిషిని తయారు చేయకపోతే అదే పెద్ద గండం నాకు."

"ఇందిరాగాంధిలు కూడా ఇద్దరుండేవారట. వదంతి ఉంది. అది వదంతో, నిజమో మన కనవసరంగానీ నీ బదులు నీ డూప్‌ని ఇండియా పంపి అతనిని చంపిస్తావా ఏమిటి?"

"అబ్బే నేను అన్ని ఆటలు నేర్చుకున్నాను గాని ప్రాణాలతో ఆడే ఆట ఇంకా నేర్చుకోలేదు. అంతగా అవసరం అయితే నా ప్రాణాన్ని పణంగా పెడతాను గాని మరెవ్వరినీ బలిచెయ్యను. నేను నాలాంటి మనిషిని ఇండియా పంపిస్తే నేను అనుకొని మా అమ్మా నాన్నా సంతోషిస్తారు."

"అయితే నీకు వాళ్ల సంతోషం కావాలన్నమాట"

"నా శరీరానికి ఊపిరి ఎంత అవసరమో, వారి సంతోషం కూడ అంతే అవసరం నాకు."

"అయితే అన్నీ మరచి నీవే..."

"అదుగో నన్ను అస్తమానూ అరిగిపోయిన గ్రామ్‌ఫోన్ రికార్డ్‌ని చేయవద్దు"

"నీ మనసు మార్చుకోవన్నమాట"

"అది మనం ధరించే బట్టకాదు"

"నీవు తల్లిదండ్రులకంటే ఆ కల్పన ఎక్కువన్నమాట"

"అవును, అక్షరాలా నిజం. నేను చవటను, చేతగాని భర్తను, ఇల్లరికపుటల్లుడిని, పెళ్ళాం కొంగు (ఇక్కడైతే గౌను) పట్టుకు తిరిగేవాడిని, గాడిదను. ఆ గాడిదంటే గుర్తుకొచ్చింది ఇక్కడేమీ ప్రస్తుతం గాడిదలు లేవుకదా."

"లేవులే. అసలు సంగతి చెప్పు"

"గాడిద ఉంటే, నన్ను గాడిదతో పోల్చుకున్నందుకు అది బాధపడుతుంది. నాలాంటి వెధవను ఎవరో "గాడిదకొడకా" అని తిడితే అటు వెళ్ళే గాడిద 'వీడా నాకొడుకు' అని ఓండ్ర పెట్టి ఏడ్చిందట"

"గాడిద కాదుగాని నీ తల్లిదండ్రులు నిన్ను కన్నందుకు ఏడుస్తారేమో ప్రస్తుతం"

"వారు ఏడవ కూడదనేగా నా ప్రయత్నం. మరి మీ ప్రయత్నం మీరు త్వరలో చేయాలి"

అప్పుడే వంట ముగించుకొని కూర్చుంది వారిజ. పిల్లలిద్దరూ పడుకున్నారు. డాక్టర్ నందాకి ఆరోజు డ్యూటీ. కాలింగ్ బెల్ మ్రోగడంతో ఇండియాలో విహరిస్తున్న ఆలోచనలనుండి ఉలిక్కిపడి తలుపు తీసింది. ఎదురుగా సాధన, రేబెల్ ఉన్నారు. 'రండి' అంటూ ఆహ్వానించింది.

"మీరిద్దరూ ఎలా కలిసారు!, సాధనా, ఆరోజు కంగారులో మీ ఇంటి అడ్రసు నీకు చెప్పలేదు, మీ అడ్రసు తీసుకోలేదు." అంది.

"అవును, నేనూ అదే పొరపాటు చేసాను. అయినా మీ ఆయన డాక్టరు కదా హాస్పిటల్‌లో ఎంక్వయిరీ చేసి రావాలనుకున్నాను." అంది.

"సాధన హజ్బెండ్ ప్రభాకర్ మా ఆఫీసులోనే పనిచేస్తున్నాడు. అదీ మా పరిచయం" రేబెల్ అంది.

"ప్రభాకర్ మీ ఆయనా?" ఆశ్చర్యంగా వారిజ.

ప్రభాకర్ అనే ఇండియన్ 'డ్రగ్స్'కి అలవాటు పడ్డాడని, అతని భార్య వచ్చి అతనిని మార్చడానికి అన్నివిధాల ప్రయత్నిస్తోందని, అతను హాస్పిటల్‌లో ఉన్నాడని నందా చెప్పడం గుర్తుకి వచ్చింది వారిజకు.

"అవును ఆ మహానుభావుడు నా మొగుడే" ఏడవలేక నవ్వుతూ అంది సాధన.

"మిసెస్ సాధన, ఆడవాళ్ళతో సంబంధాలు పెట్టుకొని డ్రగ్స్‌కి అలవాటుపడిన భర్తతో మీరుకాబట్టి కాపురం చేస్తూ అతని బాగుకోసం తాపత్రయపడుతున్నారుగానీ, మేమైతే భరించలేం. వెంటనే విడాకులిచ్చేస్తాం" అంది రేబెల్.

"మీ సాంప్రదాయాలకు, మా సాంప్రదాయాలకు చాలా తేడా ఉంది రేబెల్. మీరు ఎంతమంది భర్తలనైనా పెళ్ళి చేసుకుంటారు. మేము స్త్రీ శీలానికి ఎక్కువ విలువ ఇస్తాం. మేము మరీ ప్రాణాంతకం అయితేగాని విడాకుల గురించి ఆలోచించం. మగవాళ్ళు త్వరగా వ్యసనాలకు బానిస అవుతారు. మా దేశంలో మేము పసిపిల్లలనే కాదు, భర్తలనుకూడా కంటికి రెప్పలా చూసుకుంటాం. అలా చూసుకోకపోతే ఏం సంసారం సరిగా ఉండదు. మేము ఒకే భర్తకు కట్టుబడి ఉంటాం కాబట్టి భర్తలను మా కనుసన్నలలో మెలిగేలా కట్టుదిట్టం చేసుకుంటాం. ఒకవేళ భర్తలు చేజారిపోయినా అలా వదిలేయక, ఇదిగో చూడు నేను ఎలా వచ్చానో అలాగే వచ్చి పాతాళ లోకంలో ఉన్నా, ఆకాశ మార్గంలో ఉన్నా వలవేసి పట్టుకుంటాం."

"మేమైతే మా భర్తలతో కుదరకపోతే ఇంత తాపత్రయ పడం. మర్యాదగా విడిపోతాం' రేబెల్ అంది.

"ప్రభాకర్ నీ భర్త ని ఇప్పుడే తెలిసింది" వారిజ అంది.

"నాన్నగారు ఎంతో కష్టపడి మా పెళ్ళిచేసారు. తనకి క్రికెట్ అంటే ఇష్టమని, క్రికెట్ ప్లేయర్ అని అభిమానపడి ప్రభాకర్‌ని ప్రేమించాను. ప్రభాకర్ తల్లిదండ్రులు కట్నం అడిగారు. నాన్నగారు నా మనసు బాధ పెట్టలేక చాలా అవస్థలుపడి ఈ పెళ్ళి చేసారు. ఒక సంవత్సరం బాగానే ఉన్న ప్రభాకర్ గొర్రెకు బెత్తెడు తోకలాంటి ఈ జీవితం ఏమిటి అంటూ ఉద్యోగానికి, క్రికెట్‌కి గుడ్‌బై చెప్పి ఈ దేశానికి వచ్చాడు. ఒక సంవత్సరంలో తిరిగి ఇండియా వచ్చేస్తానన్నాడు. తరువాత డ్రగ్స్‌కి అలవాటుపడ్డాడని తెలిసి, విజిటర్స్ వీసా మీద నేనే వచ్చాను.

"చాలా బాధగా ఉందే, సాధనా; వింటుంటే"

"నాకేమీ బాధగా లేదు. ప్రతిదానికి బాధపడుతూ కూర్చోకూడదు. జీవితంలో సాధ్యమైనంత వరకు అన్నీ మనకు అనుకూలంగా సాధించడానికే ప్రయత్నించాలి.

నేను ప్రభాకర్‌తో విడిపోతే మరలా నాన్నగారికి నాతో ప్రాబ్లమ్స్. అందుకే నేను ఇష్టపడి కష్టంతో కొనుక్కొని పెళ్ళి చేసుకున్న ప్రభాకర్‌ని నేను బాగుచేసుకున్నాను. అతనిలో లోపాలు ఉన్నాయి ఒప్పుకుంటాను. కాని లోపాలున్నాయని అతన్ని వదిలేయలేను, ఇంకో పెళ్ళి చేసికోలేను. ఇంట్లో ఖరీదైన వస్తువులు పాడైతేనే పారేయలేక రిపేరు చేయించుకుంటాం. అటువంటిది ప్రాణమున్న మనిషి, పైగా భర్త; అలవాట్లలో చిన్న రిపేరు వచ్చింది; బాగు చేయించుకున్నాను. ప్రభాకర్ ఇప్పుడు చాలావరకు మామూలు మనిషి అయిపోయాడు. వచ్చేనెలలో ఇద్దరం ఇండియా వెళ్ళిపోతున్నాం'' సంతోషంగా అంది సాధన.

వారిజ ముగ్గురికీ కాఫీలు తెచ్చింది.

'మిసెస్ వారిజా; క్రిందటివారం నేను, విశాల్ లండన్ వెళ్ళాముగా. విశాల్ నాకు చీరలు కొన్నాడు. జాకెట్లుకూడా ఉన్నాయి. ఇదిగో బొట్టు, గాజులు. నన్ను మీ ఇండియన్‌లా తయారు చేయరా?' అంది, రేబెల్.

"చూడు రేబెల్, ఇప్పుడు సాధన చెప్పింది విన్నావుగా. భారతీయ స్త్రీలం. భర్త అంటే ప్రాణం పెడతాం. ఆఖరికి యమధర్మరాజు దగ్గరనుండి భర్త ప్రాణాలు లాక్కున్న పతివ్రతలు కూడా ఉన్నారు మా దేశంలో. రేపు విశాల్ పెళ్ళి అయితే కల్పనకూడా సాధన లాగే ప్రవర్తిస్తుంది, మరచిపోకు' చిన్న లెక్చర్ ఇచ్చింది వారిజ.

'అలాగే తీసికెళ్ళిపోనీండి. నాకేమీ అభ్యంతరం లేదు. నేను విశాల్ వెనుక పడడం లేదు. అతనే నా వెనుక పడుతున్నాడు' అంది రేబెల్.

"నేను కడతాను, రా, చీర అంటూ సాధన రేబెల్‌ని బెడ్‌రూమ్‌లోకి తీసికెళ్ళి పావుగంటలో ఇండియన్ అమ్మాయిలా తయారుచేసింది. తెల్లటి ఆమె శరీరానికి ఎర్రటి ఆ చీర ఎంతగానో నచ్చింది. అయినా అలవాటు లేని దుస్తుల వలన కాస్త ఎబ్బెట్టుగా అనిపించింది. రేబెల్‌ని చూస్తుంటే వారిజకు కోపం వచ్చేస్తుంది. విశాల్, కల్పనకు అన్యాయం చేస్తున్నాడని ఆమె బాధ. మరో భారత స్త్రీ అన్యాయం అవుతుంటే సహించలేకపోతుంది.

రేబెల్ జారిపోతున్న చీరను సర్దుకుంటూ అవస్థపడుతూ అద్దం ముందు నిలబడి, తనను తానే చూసుకొని మురిసిపోతోంది. రేబోల్ ముహానికి బొట్టు, కాటుక, చేతులకి గాజులు వింతగా ఉన్నాయి.

కొంచెంసేపు పోయిన తరువాత రేబెల్ ఆ బట్టలు మార్చేసి గౌను వేసేసికొని హాయిగా ఊపిరి పీల్చుకుంది. తరువాత హేండ్‌బేగ్‌లోనున్న ఫోటోలు తీసి చూపించింది.

లండన్ సిటీలో విశాల్, రేబెల్ భార్యాభర్తల్లా కలిసి తీయించుకున్న ఫోటోలు చూస్తుంటే ఒళ్ళుమండిపోయింది వారిజకు. ఒక్కోఫోటో చూపిస్తూ వాటి గురించి వివరిస్తోంది రేబెల్.

'నేను పుట్టి పెరిగింది ఐర్లాండులోనే అయినా పక్కనున్న ఇంగ్లాండుకి ఎప్పుడూ వెళ్ళలేదు. విశాల్ పుణ్యమా అంటూ ఇప్పుడు చూసాను. షిప్‌లో అయితే ఐరిష్ సముద్రం దాటి ఆరుగంటల్లో వెళ్ళిపోవచ్చు. ఫ్లయిట్‌లో గంటపడుతుంది. ఆ లండన్ సిటీ వదిలి రాబుద్ధికాలేదనుకో.'

అన్నీ ఎలాగున్నా అండర్ గ్రవుండ్ ట్రయిన్స్ చూడవలసిందే. వాటిని ట్యూబ్ ట్రయిన్స్ అంటారు. మనం ట్రయిన్‌కి టికెట్ తీసికొని లిఫ్ట్‌లో కిందికి వెళ్ళిపోతే లోపల ట్రయిన్స్ తిరుగుతాయి. స్టేషన్ స్టేషన్‌కి లోతు ఒకేలా ఉండదు. వంద అడుగుల లోతునుండి ఇంకా రెండు వందలు దాటి ఉంటుందట. భూగర్భంలో ఎంతో చక్కగా ఉంది రైల్వేస్టేషన్. ఒక్కో ట్రయిన్ కొన్ని సెకండ్సు మాత్రమే ఆగుతుంది. ఆటోమేటిక్ డోర్స్. ట్రయిన్ మిస్ అయినా వెంటనే మరో ట్రెయిన్ ఉంటుంది. మనం దిగవలసిన స్టేషన్‌లో దిగి లిఫ్ట్‌లో పైకి, నేలమీదకు వచ్చేయవచ్చు. లోపల మంచి గాలి ఉంది.

ప్రపంచం మొట్టమొదట లండన్‌లోనే కట్టారట భూగర్భ ట్రయిన్‌లు 1863లో. పైన నగరం. భూమి లోపల సిటీ అంతకూ ట్యూబ్ ట్రయిన్స్. శరీరంలోని లోపలి భాగాలు పైకి కనబడకుండా తమ పని తాము చేసికొని పోతునట్లు ఈ ట్రయిన్స్ ఎన్నో అడుగులలోతులో చక్కగా తిరుగుతాయి. ఎంతో మంది ప్రజలను రోజూ తిప్పుతాయి.''

రేబెల్ చెబుతుంటే సాధన, వారిజ శ్రద్ధగా వింటున్నారు. ఫోటోలు ఆసక్తిగా చూస్తున్నారు. అన్ని ఫోటోల్లోనూ రేబెల్, విశాల్ మేడ్‌ఫర్ ఈచ్ అదర్‌లా చక్కగా ఉన్నారు. రకరకాల గౌనులతో, బాబ్డ్ హెయిర్‌తో, తలమీద అందమైన టోపీతో, నీలి కళ్ళతో రేబెల్ చాలా అందంగా ఉంది. మరీ మరీ చూడాలనిపిస్తోంది.

మళ్లీ కామెంటరీ మొదలుపెట్టింది రేబెల్. లండన్ జూలో దాదాపు ఆరు వేల వరకూ జంతువులు ఉన్నాయి. అందులో పోలార్ బేర్, మంచు గుడ్లగూబలు, తెల్లని ఎలుకలు, తెల్ల చిలుకలు ఉన్నాయి. ఆ జూ 1847లో ప్రారంభించారట.

సిటీలోని అన్ని బిల్డింగులలోకి ఎత్తయినది పోస్టాఫీస్ టవర్. ఇది 620 అడుగుల ఎత్తు. ఒకేసారి 1,50,000 టెలిఫోన్లు ట్రంకాల్స్ దేశం మొత్తం అంతా చేయవచ్చుట. పైన మంచి రెస్టారెంట్ ఉంది.

ఇదిగో ఇది ప్లానిటోరియం. ఇది చాలా బావుంది. ప్లానిటోరియం ప్రక్కనే మేడమ్ టుస్సాద్ మ్యూజియం ఉంది. ఇదిగో ఈ ఫోటో చూడండి, ఎవరిదో!'' అంటూ ఫోటో చూపించింది రేబెల్.

'మహాత్మాగాంధీ' టక్కున చెప్పింది వారిజ.

"అందులోని అన్నీ లక్క విగ్రహాలు. అసలు మనుషులో, బొమ్మలో చెప్పడం చాలా కష్టం. అంత నేర్పుగా విగ్రహాలు చెక్కారు లక్కతో. ప్రపంచ ప్రసిద్ధిచెందిన మహనీయుల విగ్రహాలు ఎన్నో ఉన్నాయి. మహమ్మద్ అలిజిన్నా, ఆర్మ్‌స్ట్రాంగ్, హిట్లరు, కోజాక్‌ల లాంటివారు, మహరాజులు, రాణులు ఎందరో ఉన్నారు. స్లీపింగ్ బ్యూటీ ఉంది. బాటిల్ ఆఫ్ ట్రఫాల్గర్‌రెప్లికా చూస్తుంటే ఇంకా అక్కడ యుద్ధం జరుగుతున్నట్లే ఉంటుంది" అంది.

'నిజమే, ఈ ఫోటోల్లో వాళ్ళు మామూలు మనుషులలాగే ఉన్నారు విగ్రహాల్లా కాదు' అంది ఆశ్చర్యంగా సాధన.

'బకింగ్‌హోమ్ పేలస్ దగ్గర 'ఈమన్ ఆఫ్ ది గార్డ్స్' చేసే బీజింగ్ చూడడానికి బలే బావుంది. హైడ్‌పార్క్ దీని ప్రక్కనే ఉంది. దీని విస్తీర్ణం 340 ఎకరాలు.

గ్రీనిడ్జ్ మీన్‌టైమ్ ఎత్తయిన కొండమీద ఉంది (జి.ఎమ్.టి). ఇది ప్రపంచంలోని అన్ని దేశాల టైము చూపిస్తుంది. ఇక్కడ ఒక లావు పాటి గీతగీసి ఉంటుంది. అది ప్రైమ్ మెరిడియన్. ప్రపంచానికి మధ్యలో ఉందట. మేప్‌లోకూడ కనబడుతుంది. బిగ్‌బెన్, కూడలా వుంది.

అన్నీ ఎలా ఉన్నా లండన్ సిటీకి థేమ్సు రివర్ (కాలువ) చాలా అందంగా ఉంది. దీనిమీదే టవర్ బ్రిడ్జ్ ఉంది. ఈ బ్రిడ్జి ఓడలు వచ్చేటప్పుడు తెరచుకొని వెళ్ళిపోగానే మూసుకుంటుంది." అంటూ ఫోటోలన్నీ చూపించింది రేబెల్.

ఆరోజు ఆదిత్యకు స్నానాలు చేయిస్తుంటే వచ్చింది రేబెల్. చీర ఆరోజు సరదాకి కట్టుకుంది అనుకుంది వారిజ. కాని మరలా కట్టుకుంది. బాబ్డ్ హెయిర్‌ని పోనీటైల్‌గా చేసి గులాబి పెట్టుకుంది.

'మీరు రోజూ స్నానం చేస్తారు కదూ, విశాల్ నాకూ నేర్పించాడు రోజూ స్నానం చేయడం. లేదంటే మేము ఒకోసారి నెలవరకూ స్నానం చేయం. సెంట్స్ ఎక్కువ వాడతాం. మీది వేడి ప్రదేశం కాబట్టి రోజూ స్నానం చేస్తారనుకుంటాను" అంది.

"ఎవరి పద్ధతులు వారివి" అంది వారిజ.

"ఎవరి పద్ధతులు వారివి అయినా మీ దేశ పద్ధతులు చాలా నచ్చాయి నాకు. కొన్ని మంచి పద్ధతులు ఎక్కడినుండైనా గ్రహించడం తప్పులేదుగా. మిసెస్ వారిజా చీరలతో డాన్స్ చేస్తే బావుంటుందా?" అంది.

"బావుండడమేమోగాని మీ డాన్స్‌కి చీర సూట్‌కాదు. పడతావు" అంది వారిజకు రేబెల్ అంటే కోపం ఉన్నా బాగానే మాట్లాడుతుంది. మన బంగారం మంచిది కాదు అని సరిపెట్టుకుంది. నిజానికి అబ్బాయిలను వలలో వేసికోవడం వారికి తప్పుకాదు

ఆచారం. పెద్దలు పిల్లల విషయం పట్టించుకోరు. నైట్ డాన్స్‌లకు టీనేజ్ అబ్బాయిలు, అమ్మాయిలు వెళ్ళి అక్కడే తమ పార్టనర్స్‌ని ఎన్నుకుంటారు.

తిరిగి అంది వారిజ. "మీ అక్కకు ఎంగేజ్‌మెంట్ అయిందన్నావు, ఎప్పుడు పెళ్ళి? మేమూ వస్తాం సరదాగా"

'అప్పుడేనా? మరో రెండు సంవత్సరాలు పడుతుంది. ఇద్దరూ ఇల్లు కొనుక్కొని ఫర్నిచర్ అంతా సంపాదించిగాని పెళ్ళి చేసికోరట.' అంది.

రెండు సంవత్సరాల తర్వాత వారిద్దరిలోనూ ఇంకా ప్రేమ ఉంటే పెళ్ళివరకూ వెళుతుంది. లేదా ఎవరి దారివారిదే. మరలా తమ తమ కొత్త భాగస్వాములను వెతుక్కోవడం మొదలు పెడతారు. పెళ్ళికి ముందు పుట్టిన పిల్లలను దత్తత ఇచ్చేసి, పెళ్ళయిన తరువాత చాలవరకు నీతిగానే ఉంటారు ఆ దేశస్తులు.

"పెళ్ళి మీ తల్లిదండ్రులు చేయరా?"

"ఊహు చేయరు. ఎవరి పెళ్ళి వారే చేసుకోవాలి. మీ ఇండియాలో అయితే అంతా తల్లిదండ్రుల బాధ్యతేనటగా."

"అవును, మీలాగ మావి ఇండిపెండెంట్ ఫామిలీస్ కావు. అందరం కలిసి ఉంటాం కలిసి కష్ట సుఖాలు పంచుకుంటాం."

"అందుకే మీరు లైఫ్ ఎంజాయ్ చేయలేరు. మీ ఆడవారు ఎక్కువగా మగవారిమీద ఆధారపడతారు కాబట్టి మీ స్త్రీలకు ప్రాబ్లమ్స్ ఎక్కువ"

"ఏం, మీ దేశంలో స్త్రీలు హాయిగా ఉంటున్నారా" కోపంగా అడిగింది వారిజ. "ఆఫ్‌కోర్స్. మాకూ చాలా ప్రాబ్లమ్స్ ఉంటాయి. పెళ్ళికి ముందు పుట్టిన పిల్లలను సవతి తండ్రులు చాలా బాధపెడతారు."

"మా దేశంలో సవతి తల్లులే ఉంటారు. తండ్రులుండరు. మీరు శీలానికి ఎక్కువ విలువనిస్తారు కాబట్టి, మీ దేశపు స్త్రీలంటే ప్రపంచంలో చాలా గౌరవముంది" నిజాయితీగా అంది రేబెల్.

ఇంతలో ఫోన్ మ్రోగింది. బెల్‌ఫాస్ట్‌నుండి మైథిలి ఫోన్ చేసింది. 'ఈ వారం మీ దగ్గరకు వెక్స్‌ఫర్డ్ వస్తున్నాం' అంటూ. వారిజకు చాలా సంతోషం అనిపించింది. విదేశాలలో స్వదేశస్తులు కలుసుకుంటే ఎంతో ఆనందంగా ఉంటుంది. అప్పుడే విశాల్ వచ్చాడు.

"ఏమిటి విశేషం. ఈ రోజు దీపావళా?" అన్నాడు వారిజను చూస్తూ. "కాదే ఇంకా దసరా వెళ్ళందే" అంది.

"మీ మొహం చూస్తుంటే నాకు కనబడకుండా దీపావళి మతాబులు కాలుస్తు న్నారేమో. నాకెందుకివ్వ లేదబ్బా అనుకున్నాను."

"ఈ వారం మైథిలి, కిషోర్ వస్తారట. మన ఊరు."

"అయితే నేను మరలా ఐరిష్ తిండి తినాలా?"

"ఏం అంత అవసరం ఏమొచ్చింది. అందరం కలిసి ఉపవాసాలు చేస్తాం అనుకుంటున్నావా?"

"అబ్బే, మీ మధ్యలో నేను" నసిగాడు.

"ఏం నీవు పరాయి వాడివా, వాళ్ళు వస్తున్నారని ఆముక్తను. ఆదిత్యను ఎక్కడికైనా పంపేస్తున్నావా?" నిష్ఠూరంగా అన్నా ఆ మాటలో ఎంతో ఆప్యాయత ధ్వనించింది.

"ఏమో, మీరు పంపినా పంపకపోయినా ఈ దేశస్తులు తమ ఇంటికి కూతురు, అల్లుడు వచ్చినా, వారికి హోటల్లో రూమ్ బుక్ చేస్తారు, వారికి మరో బెడ్ రూమ్ లేకపోతే."

"నీలాంటివారికి, రేబెల్ లాంటి వాళ్ళున్నంత కాలం బెడ్‌రూమ్స్ ప్రాబ్లమ్స్ ఉండదులే" కోపంగా అంది.

ఆ మాటలు అర్థంగాక "ఇంక వెళతాను" అంటూ లేచింది రేబెల్. "కొంగు ఇలా కప్పుకోవాలి" అంటూ రేబెల్‌కి చూపించాడు విశాల్, "కొంగు జారిపోతోందే రేబెల్!"

"కొంగుచాటున అన్యాయపు పనులు చేసి కొంగు కప్పుకుంటే తప్పు కప్పడు తుందా?" కసిగా అంది వారిజ.

"దానికోసం కాదులెండి. మేచింగ్ బ్లవుజ్ లేదుగా, మన టి.వి. ఎనౌన్సర్స్ కూడా మేచింగ్ బ్లవుజ్ లేకపోతే కొంగు కప్పుకుంటారు."

విశాల్ సరదాగా అన్న మాటలకు ఫక్కున నవ్వింది వారిజ. "అబ్బ ఆకలేస్తుంది, ఏమైనా ఉందా తినడానికి?" అన్నాడు.

"ఫ్రిజ్‌లో ఉప్మా ఉంది వేడిచేయనా?" అంది.

"వంటకు నేనుండగా ఆ మహెంజొదారో, హరప్పా రోజుల్లో వండుకున్నవన్నీ వేడిచేసి పెడతారెందుకు" అంటూనే ఉప్మా తీసి చల్లటిది తినసాగాడు.

"చల్లగానే తింటున్నావా? ఎలా వుంది?"

"అన్నం ఫ్రిజ్‌లో నుండి అయిస్‌క్రీమ్ ఓపెన్‌లోనుండి తీసినట్లుంది" అన్నాడు.

రేబెల్ వెళ్ళిపోబోయింది. విశాల్ బలవంతంగా కూర్చోబెట్టాడు. కొంచెంసేపుండి అంది. "ఈ ఊరిలోనే నాకు తెలిసిన మరో ఇండియన్ ఫామిలీని చూశాను. ఆ ఇంట్లో ఒక పెద్దావిడ ఉంది. మీలా రంగు చీరలు కట్టకుండా బొట్టుపెట్టకుండా..."



"ఓ, అదా! మా దేశంలోని విడోస్ అలాగే తయారవుతారు. స్త్రీకి భర్తపోతే మరలా కోరికలు పెరగకుండా, మరో వివాహానికి తావివ్వకుండా ఆ తెల్ల దుస్తులు ధరిస్తారు."

"ఓహో!"

"మిసెస్ వారిజా, మన దేశంలో ఆ పద్ధతి పోవాలి. మరీ ఏమిటి? వితంతువులకు ఆ పనిష్మెంట్. నేనైతే దానికి అంగీకరించను. అలాంటి వారిని చూస్తే మనసు విలవిల లాడుతుంది. స్త్రీలకు ఇష్టమైన బొట్టు, పూలు, గాజులు తీయించేసేకంటే సతీసహగమనమే మేలు, నా దృష్టిలో. రోజూ చచ్చేకంటే, ఒక్కసారే చావచ్చు." ఆవేదనగా అన్నాడు. 'నిజమే' అని ఊరుకుంది వారిజ.

మరికొంచెంసేపు కూర్చుని రేబెల్ వెళ్ళిపోయింది.

కాసేపటికి నందా స్కూలు నుండి ఆముక్తను తీసికొని వచ్చాడు. స్కూలునుండి వచ్చిన ఆముక్త ఏడుస్తూ కూర్చుంది. కారణం ఆ అమ్మాయిని స్కూల్లో 'బ్లాకీ' అని టీజ్ చేస్తున్నారట.

'ఏమిటో మనల్ని మరీ చాలా తక్కువగా చూస్తుంటారు, ఒక్కోసారి వీళ్ళు" ఆవేదనగా అన్నాడు నందా.

"ఫారినర్స్‌కి మన ఇండియన్స్ కులం తక్కువ వాళ్ళమే. ఈ భేదం మన దేశంలో

మనలో మనకి ఉన్నట్లే, ఇక్కడి వాళ్ళకూ ఉంది" అంటూ, "రా ఆముక్తా, నీకు కథ చెబుతాను" అంటూ ఆముక్తను ఎత్తుకొని మొదలు పెట్టాడు. "ఒక రాజుగారికి ఇద్దరు భార్యలున్నారట. మొదటి భార్యకు ఒక వెంట్రుక ఉందట. రెండవ భార్యకు రెండు వెంట్రుకలున్నాయట రెండు వెంట్రుకలున్న భార్యను చూసి ఒక వెంట్రుక ఉన్న భార్యను ఇంట్లో నుండి వెళ్లగొట్టాడట."

కథ చెబుతుంటే వారిజ, నందా ఫక్కున నవ్వారు.

తరువాత విశాల్ అన్నాడు. "నా ఫ్రెండ్ ఇండియా నుండి వస్తున్నాడు. అనాథ. ఎవరూ లేరు. నా రంగు, నా ఎత్తు ఉంటాడు. మీరు అతనిని ప్లాస్టిక్ సర్జరీ చేసి నా స్థానంలో అతనిని ఇండియాకు పంపాలి."

"అయితే నీ అభిప్రాయం మారదా?"

"రోజురోజుకి అభిప్రాయాలు మార్చుకునే వాడు మూర్ఖుడు, నేను మూర్ఖుడిని కాను."

"అవును. పరమ మూర్ఖుడివి. తల్లిదండ్రులను మోసగిస్తున్నావు కదూ. ఆడదాన్ని అదుపులో పెట్టగలవాడు దేశాన్ని పాలించగలడట. నీవు దేశాన్ని పాలించవద్దుగాని, కల్పనను అదుపులో పెట్టు. నీ తల్లిదండ్రులను సుఖపెట్టు."

"వారిని నొప్పించకూడదనేగా నా ప్రయత్నం."

"నీవు కోరినట్లే అతనికి నేను ప్లాస్టిక్ సర్జరీ చేస్తాననుకో. నీ తల్లిదండ్రులను హతమార్చి పెళ్ళి చేసికొని పిల్లల్ని కని నీ ఆస్తి అతను అనుభవిస్తే."

"అతను చాలా మంచివాడు."

"కన్నకొడుకే తల్లిదండ్రులను మోసం చేస్తుంటే అతను చేయడా? ఎంత అమాయకుడివి!" నందా అన్నాడు.

"నేను అమాయకుడినని మిసెస్ వారిజకు చెప్పండి. నేను రేబెల్‌తో కలిసి ఉంటున్నానని ఆవిడకు కోపం."

"ఆవిడకే కాదు, నాకూ కోపమే."

"భార్యాభర్తలు అభిప్రాయాల్లో రైలు పట్టాలలాగ ఉండాలి గాని, ఇదేమి అన్యాయం, రైలు పట్టాలు కలిస్తే రైలుకి ప్రమాదం మరి."

"ఈ విషయంలోనైనా మీ అభిప్రాయం ఒకటిగా ఉండనివ్వు. కాని విశాల్. ఇది సినిమా కాదు. నీ డూప్‌ని ఇండియా పంపడానికి. ఇది ఇండియా కాదు. డబ్బుకి లోబడి ప్రైవేట్ ప్రాక్టీసుతోనో, కొన్ని దుష్టశక్తుల బలవంతమైన కారణాల వలనో నీలాంటి మరో మనిషిని తయారుచేయడం ఇక్కడ కుదరదు."

"మరి ఇన్ని రోజులు ఎందుకు చెప్పలేదు? ఈ వంకనైనా నా తల్లిదండ్రులను తృప్తిపరచాలనుకున్నాను."

"ఇంక ఎప్పటికీ నీ తల్లిదండ్రులను కలవవా?"

"వారు నా దగ్గరికి రావలసిందే. నేను మాత్రం వారి గడప తొక్కను."

మైథిలి, కిషోర్ వచ్చి వెళ్ళిపోయిన తరువాత ఇల్లంతా శాంతిగా అయిపోయింది. ఆ రోజు మంచు విపరీతంగా పడడం వలన స్కూల్స్‌కి, ఆఫీసులకు శలవు ఇచ్చేశారు. హాస్పిటల్స్ మూయడానికి కుదరదుగా. మంచు కురిసిందంటే చాలా చాలామంది మంచులో చిక్కుకుపోయేవారుంటారు. డ్రింక్ చేసి స్వర్గంలో ఉన్నట్లు కలలు కంటూ ఏ రోడ్డుమీదో పడిపోతే, నిజంగానే స్వర్గానికి చలి పుణ్యమా అంటూ వెళ్ళిపోతారు. మంచు దెబ్బతో చావులు ఎక్కువే.

స్కూల్స్, ఇళ్ళు కూడా చాలా వరకూ మంచుతో కప్పడిపోయాయి. వాతావరణం అంతా తెల్లగా, పాల సముద్రం పొంగి ఊరిమీదికి వచ్చేసినట్లుంది. చెట్లు తాము చేయని నేరానికి శిక్ష అనుభవిస్తూ మంచుని మోయక తప్పడం లేదు. ఫల భారంతో కాక అవి మంచు భారంతో వంగిపోయి ఉన్నాయి. మంచులో కప్పబడిన ఇళ్ళు, చెట్లు, నేల అదేదో వింత గ్రహంలా ఉంది. వారిజ వాళ్ళు ఇళ్ళంతా కళ్ళు చేసుకొని చూస్తున్నారు. ఆ సన్నివేశం. నందాకు డ్యూటీ తప్పలేదు.

మంచుతో పిల్లలందరూ స్నోమెన్స్‌ని తయారు చేస్తుంటే, ఆముక్త బయటకు వెళతానని పేచీపెట్టింది. విశాల్ ఆమెకు ఓవర్‌కోటు, వెల్లింగ్‌టన్స్ (మోకాలి వరకూ ఉండే బూట్లు) టోపి, గ్లవ్స్ వేసి బయటకు తీసికెళ్లాడు. కాని ఆమె స్నోలో ఎక్కువ సేపు ఉండలేకపోయింది.

భోజనాల దగ్గర స్వీట్ తెచ్చిపెట్టాడు విశాల్.

"ఏమిటి విశేషం బర్త్‌డేనా?" నందా ప్రశ్నించాడు.

"నా బర్త్‌డే కాదు. వేరేవాళ్లకు బర్త్ నివ్వబోతున్నాను.,"

"అంటే?"

"ఇంతకాలం నా తల్లిదండ్రులకు నేను ముద్దుల కొడుకుని. ఈ ముద్దుల కొడుకు త్వరలో తండ్రి కాబోతున్నాడు."

"రేబెల్ ప్రెగ్నెంటా?" వారిజ అడిగింది.

"చాలా బాగా చెప్పారే. మీకెలా తెలుసు?" సరదాగా అన్నాడు.

"ఇందాక అన్నం వండుతూ కునికిపాట్లు పడితే కల వచ్చింది" కోపంగా అంది.

"అంత కోపమైతే ఎలా మిసెస్ వారిజ. నాకు కంగ్రాట్స్ చెప్పండి."

"కంగ్రాట్స్ కాదు. నీ ప్రవర్తనకు కర్రపెట్టి వాయించాలి."

"కర్రపెట్టి వాయించడం కాదు. కాల్చి వాతలు వేయాలి." విశాల్ అన్నాడు.

"అలాగే వేయాలని ఉంది."

"నన్ను ఏమైనా అనండి గాని, రేబెల్‌ని ఏమీ అనకండి. ముందుగా డేటింగ్స్ వద్దు అని ఆంక్ష పెట్టిన నేనే చాలా తప్పు చేశాను."

"ఈ సంగతి తెలిస్తే, నీ తల్లిదండ్రులు ఉరిపెట్టుకుంటారు."

"వారికి తెలియదుగా నా సంగతి."

"ఇలాంటి సంగతులు ద్రవ పదార్థాల్లాంటివి. చేతుల్లోను, జేబుల్లోను దాచడం కుదరదు. ఇవి ఇంగువ లాంటివి. ఎంత జాగ్రత్తగా మూతతీసినా వాసన గుప్పు మంటుంది. కనుక, రేబెల్‌కి అబార్షన్ చేయించు."

"ఈ రోమన్ కాథలిక్ దేశంలో అబార్షన్ చేయరు. సంవత్సరం క్రితం రేబెల్ పీటర్ ద్వారా వచ్చిన ప్రెగ్నెన్సీకి ఇంగ్లండ్ వెళ్ళి అబార్షన్ చేయించుకుంది. మరి ఇప్పుడు అలా కుదరదు. పైగా నాకు పిల్లలంటే చాలా ఇష్టం. మా ఇంట్లో నేను ఒక్కడినే గాని, నాకు కౌరవుల లాగ వందమంది పిల్లలు కావాలి."

"ఆ వందమందిని ఇండియాలో అమ్మాయిని పెళ్ళి చేసుకొని పొందు. ఇలా అక్రమంగా కాదు." వారిజ అంది.

"ఈ దేశంలో ఇది అక్రమం కాదు. సక్రమమే. ఎంతోమంది పెళ్ళి కాని తల్లులు, ఎంతోమంది తమ తండ్రి ఎవరో తెలియని పిల్లలూ ఉన్నారు. అది తప్పు కాదు కాబట్టే రేబెల్‌తో కాపురం చేస్తున్నాను."

"పోనీ అయిందేదో అయింది. రేబెల్‌ని పెళ్ళి చేసుకో."

"మరి కల్పన సంగతో? పైగా పీటర్ ఒప్పుకోడుగా."

"కల్పన మెడలో మూడుముళ్ళు వేయలేదుగా."

"ఊహు. మూడు ముడులు వేయకపోయినా కల్పన నన్ను వదలదు."

"రేబెల్ తల్లి కాబోతోంది రేపు ఆమెకూడా నిన్ను వదలదు."

"అటు సూర్యుడు ఇటు ఉదయించినా అలా అనదు."

"ఎలా చెప్పగలవు. ఆడదాని ప్రేమను తక్కువ అంచనా వేయిగాని, తల్లి ప్రేమను తక్కువగా తలవకు."

"రేబెల్‌కు, పీటర్‌కు కావలసింది డబ్బు. అతను అమెరికాలో చదువుతున్నాడు. అందుకే ఒప్పుకున్నాడు. నాకు కావలసింది పిల్లలు."

"పీటర్ కూడా ఒప్పుకున్నాడా, రేబెల్ పిల్లలను కనడానికి."

"డబ్బుకు లోకం దాసోహం. పిల్లల కోసమే నేను ఆమెతో ఉంటున్నాను."

"ఆ పిల్లలనే భారతీయ వనిత ద్వారా పొందు."

"మన దేశస్తులు, పెళ్ళి కాకుండా తల్లులు కావడానికి ఒప్పుకోరు. పెళ్ళిచేసేసుకో. అంతగా అయితే నీకు అడ్డేమిటి?"

"ఊహు. మరో ఏడాది పోతేగాని పెళ్ళిచేసుకోను."

"పిల్లలకు తండ్రి మాత్రం అవుతావన్నమాట. ఈ విషయం కల్పనకు తెలిస్తే."

"కల్పనకు నా విషయంలో ఏ అభ్యంతరాలూ లేవు."

"ఆమె నిజంగా భారత స్త్రీయేనా, ఇండియన్స్ ఎప్పుడూ అలా అనరు."

"కాని -"

"ఆమెకు ఏ మంత్రం వేశావో."

"ఆమె నాకు మంత్రం వేసింది. నా అవలక్షణాలన్నీ ఒప్పుకుంది. అవన్నీ పెళ్ళయ్యే వరకే. ఆ తరువాత ఆమె ఎలా చెబితే అలా నేను వినాలి. నా తల్లిదండ్రులను కలవకూడదని కండిషన్ పెట్టింది."

"నీవు ఆ షరతులకు ఒప్పుకున్నావా?"

"ఒప్పుకున్నాను కాబట్టే టర్ఫ్ (పిడకలు మేసే గాడిద)ని అని చెప్పుకుంటున్నాను. ఒప్పుకోకపోతే ఆత్మహత్య చేసుకుంటానంది.

"ఇలాంటి అమ్మాయిల మాటలకు అబ్బాయిలు లొంగిపోతే మనదేశంలో ఆడపిల్లలకు కట్నాల సమస్య ఉండదేమో. అన్నీ బెదిరింపుల పెళ్ళిళ్ళు అయిపోతాయి. ఇదో కొత్తరకం వరకట్న సమస్యా పరిష్కారమన్నమాట."

"రేబెల్‌కు పుట్టిన బిడ్డను ఏంచేస్తావు."

"మీరు ఒక సంవత్సరంలో ఇండియా వెళతారుగా. మా తల్లిదండ్రుల కిచ్చేయండి. రేబెల్ పని పిల్లను మోయడమే పుట్టిన తరువాత బిడ్డకు రేబెల్‌కు ఏ సంబంధం ఉండదు."

"ఇప్పుడు ఆవేశంలో అలా అన్నా తరువాత తల్లిగా కోర్టుకి వెళ్ళవచ్చు. తల్లి ప్రేమను ఈజీగా తీసుకోకు."

"అన్ని ఒప్పందాలు, వ్రాసి ఇవ్వడాలు అయిపోయాయి. నా కోరిక మీద, నా కోసం డబ్బుకోసం ఒప్పుకుంది."

"డబ్బుతో చాలా ఘోరాలు చేయవచ్చు. ఆఖరికి తల్లిని, పిల్లను కూడా వేరుచేయ వచ్చున్నమాట" వేదనగా అంది వారిజ.

సాధన, ప్రభాకర్ ఇండియా వెళ్లిపోతుంటే రేబెల్‌తో సహా అందరూ ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లారు. భారతీయ స్త్రీలు తమ భర్తకోసం అంత ప్రేమ పెట్టడం, ఒకే భర్తతో కాపురం చేయడం ఆమెకెంతో నచ్చాయి. విశాల్ ముందే తనను కలిసి ఉంటే అసలు పీటర్‌కి శరీరం అర్పించి ఉండేదాన్ని కాదు కదా అనుకుంటుంది ఇప్పుడు రేబెల్. ఇకపై జీవితంలో విశాల్‌ని తప్ప మరెవ్వరినీ, ఆఖరికి పీటర్ని కూడా తలవకూడ దనుకుంది.

రేబెల్‌కి కవలలు పుట్టారు. వారిని చూసి ఎంతో పొంగిపోయాడు విశాల్. కారణం తన తండ్రికి తనొక్కడే. తనకు మాత్రం ఇద్దరు. కొడుకులు పుట్టిన దగ్గర నుండి ఎందుకో డల్‌గా తయారయ్యాడు విశాల్. వారిని అసలు విడవడం లేదు.

తనకి పిల్లలు పుట్టారని, త్వరలో వారిని నందకుమార్ వారిజ - లతోపాటు ఇండియా పంపిస్తున్నానని, అలాంటి తప్పు చేసిందుకు తనని క్షమించమని ఆ కోపం పిల్లలపై చూపవద్దని తల్లిదండ్రులకు ఉత్తరం వ్రాశాడు.

ఈ మధ్య నందకుమార్‌కి చాలా డబ్బు పెట్టుబడి పెడుతున్నాడు. వద్దన్నా వినడం లేదు. ఇండియాలో నా పిల్లల్ని మీరే చూడాలి. అని వారికి మరీ మరీ చెబుతున్నాడు. రేబెల్ పిల్లలను ఇండియా పంపడానికి అభ్యంతరం చెప్పలేదు. తనకి విశాల్ ఉన్నాడు చాలనుకుంది. విశాల్ తనని మోసపుచ్చి వెళ్ళిపోతాడని ఆమెకు తెలియదు. ఆమె ఏదో ట్రయినింగ్ కోసం ఆరునెలలకు స్కాట్లండ్ వెళ్ళింది.

మరో పది రోజులలో నందకుమార్, వారిజల ప్రయాణం. ఆ కవలలను విశాల్ తల్లిదండ్రులకు అప్పగించాలని ఒప్పందం. ఈ మధ్య విశాల్‌కి తరచుగా పిల్లలకు దూరంగా ఉండాలి అన్న బెంగతో జ్వరం వస్తోంది. మందులు వాడడు. పిల్లల విషయం నాకు బెంగలేదు. మీరున్నారుగా. రేబెల్ పీటర్‌ని, నేను కల్పనను పెళ్ళిచేసుకుంటాం. నా తల్లిదండ్రులకు ఎలా నచ్చచెబుతారో అంటూ పదే పదే నందకుమార్‌తోను, వారిజతోను అనసాగాడు.

విశాల్ ఆఫీసుకి శెలవు పెట్టేశాడు. పిల్లలను అసలు విడవడం లేదు. ప్రయాణం పెట్టుకున్న దగ్గరనుండి పిల్లల పనులు వారిజను చేయనివ్వడం లేదు.

వీళ్ళను, నీ తల్లిదండ్రులకు కాదు, కల్పనకు అందజేస్తాను. అప్పుడు కల్పన మనసు విరిగిపోతుంది. నీవు రేబెల్‌ని పెళ్లిచేసుకో అంది వారిజ ఏడిపిస్తూ.

"కల్పనకు మాత్రం వద్దు." కళ్ల నీళ్లతో వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నాడు. "ఛ, అదేమిటి. అంత పిల్లల్ని విడిచి ఉండలేని వాడివి, ఇండియా నీవే వెళ్లవచ్చుగా. మాతో పంపడం ఎందుకు వాళ్లను. నీవు కల్పనను పెళ్లి చేసుకుంటే ఇన్ని ప్రాబ్లమ్స్ ఇన్ని కన్నీళ్లు ఉండవుగా'' ఓదార్పుగా అంది వారిజ.

"మనదేశపు స్త్రీలు పెళ్లి కాకుండా తల్లులవడానికి ఇష్టపడరని మీకు చాలాసార్లు చెప్పాను." వేదనగా అన్నాడు.

"అందుకే పెళ్లి చేసుకోవలసింది అంటున్నాను" అంది.

"ఇక్కడి స్త్రీలను వితంతువులను చేయడం అంత సులభంకాదు. వారు మరలా పెళ్లి చేసుకుంటారు. కాని మనదేశపు స్త్రీలు వితంతువులుగా బ్రతకడానికి ఇష్టపడతారు గాని, మరో పెళ్లికి ఒప్పుకోరు. నా భార్య తెల్లచీరలో బోడి నొసటితో పూలు లేని తలతో, గాజులు లేని చేతులతో ఉండడం నాకు ఇష్టం లేదు.''

"అంటే.'' అశ్చర్యంగా అడిగింది వారిజ.

"అది అంతే. విశాల్ ఎక్కువ కాలం బ్రతకడు. అతనికి కాన్సర్ ముదిరిపోయింది. అందుకే చివరలో ఏమీ అనలేకపోయాడు. విశాల్‌కు తెలియదు, నాకు తెలుసని. విశాల్ ఆరోగ్యంలో తేడా మాత్రం కనబడేది. విశాల్‌కు ట్రీట్ చేసిన డాక్టర్ చెప్పాడు. విశాల్ తల్లిదండ్రులకు ఈ విషయం తెలియడం ఇష్టం లేక ఇక్కడకు వచ్చేశాడు. వాళ్లతో పోట్లాడి, వాళ్ల మనసు విరిచేసి. కల్పన విశాల్ కాబోయే భార్య పేరు కాదు, రాబోయే మృత్యువు పేరు. అతను ఎంతో కాలం....''

"ఎంతో కాలం కాదు నందా, ఎన్నో గంటలు బ్రతకడు. నా పిల్లలను, ఆస్తిని, ఆ కాన్సర్ హాస్పిటల్‌ను మీకు అప్పజెప్పాను. మీరు నాకు కలవకుండా ఉంటే, అసంతృప్తితో చనిపోయేవాడిని, ఇప్పుడు తృప్తిగా చనిపోతాను'' అంటూ పకపక నవ్వుతూ, పిల్లల వైపు చూస్తూ ప్రాణం వదిలేశాడు.

అంతా గుర్తుకు రాగానే, విశాల్ మరణం తాలూకు విచార రేఖలు వారిజ మొహంపై కదలాడసాగాయి. మనసంతా వేయి మణుగులు మోస్తున్నంత బరువుగా అయింది. ఎగిరిపోయిన ఉత్తరాన్ని పట్టుకుని నందా వచ్చి, వారిజ వీపు తట్టాడు.

మళ్లీ ఉత్తరం వెంట కళ్లు కదలాడాయి.

"మీరు ఇండియా రావడం, మీతో పరిచయం కావడం ఓహ్ ఎంత అద్భుతం. విశాల్ నాకు తాళి కట్టకపోయినా, నా పిల్లల ద్వారా భర్త అయ్యాడు. మీరు తెలుగు నేర్పించారు కొద్దిగా. గౌనులు మానేసి పూర్తిగా చీరలు కట్టాలనుకున్నాను. సాధన మీ సంస్కృతి, మీ ఆచారాలు, మీ స్త్రీల మనస్తత్వాలు అన్నీ చెప్పింది. యధాలాపంగా

అన్నీ విన్నా, ఆ సంగతులన్నీ నా నరనరాల్లోను నిండిపోయాయి. ఇప్పుడు నేను వాటిని బయటకు లాగలేను.

ఫారినర్స్ రెండో భర్తకోసం పిల్లల్ని దూరం చేసుకుంటారు అనే అపోహతోనే విశాల్ నన్ను తల్లిని చేశాడు. మిగిలిన విషయాలు ఎలా ఉన్నా ఏ దేశంలో నైనా తల్లి తల్లే. ఆమె ఎక్కడున్నా, ఎలా ఉన్నా తన కడుపు చించుకుపుట్టిన పిల్లలపై ప్రాణం పెడుతుంది.

మీరుండగానే, నా బోయ్ ఫ్రెండ్ పీటర్ చనిపోయాడుగా. అతని సమాధిలో అతని జ్ఞాపకాలు పూడ్చేశాను. ఇప్పుడు నా ఆలోచనలలో విశాల్, నా పిల్లలు తప్ప మరెవ్వరూ లేరు.

నా పిల్లలకు నేనే దూరంగా ఉండలేను. పిల్లలలో విశాల్‌ని చూసుకుంటూ, ఆ హాస్పిటల్‌లో రోగులకు సేవచేసుకుంటూ భారతీయ భార్యగా నా జీవితం అక్కడే గడిపేస్తాను. భార్యాభర్తల సంసార జీవితానికి సెక్స్ ఒక్కటే ప్రధానం కాదని, ప్రేమ, పిల్లలు, త్యాగం, ఆరాధన వంటివి కూడా భాగాలేనని మీద్వారా గ్రహించుకున్నాను.

విచ్చలవిడి సెక్స్ తప్పులేదు అనుకున్న మాకు ఎయిడ్స్ కళ్ళు తెరిపించింది. మీ భారతీయ పద్ధతి ఎంతో మంచిది అనిపించింది. విశాల్ నన్ను భార్యగా కాక, తన పిల్లలకు తల్లిగానే చూశాడు. విశాల్ నాకు ఎంతో డబ్బు పెట్టుబడి పెట్టినా, పిల్లలు పుట్టిన సంతోషంలో నాకు డైమండ్ రింగ్ ప్రజంట్ చేశాడు. అప్పుడే నాకు విశాల్ భర్త అయిపోయిడు.

నేను పర్మనెంట్‌గా ఇండియా వచ్చేస్తున్నాను నా భర్తను వెదుక్కుంటూ. ఎయిర్ పోర్ట్‌కి వస్తారుగా. ఉంటానిక-రేబెల్.

☆ ☆ ☆

ఆరోజే రేబెల్ వచ్చే రోజు. డాక్టర్ నందా, వారిజ, పిల్లలను తీసుకొని ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళారు. తండ్రిలేని, తల్లెవరో తెలియని ఆ కవలలు తమ తల్లి రాకకై చిరునవ్వుతో స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉన్నారు.

విమానం రాగానే వచ్చే వారికోసం ఆతృతగా ఎదురుచూస్తున్న నందా, వారిజ మెల్లగా మెట్లు దిగుతున్న రేబెల్‌ని చూసి అమ్మయ్య అనుకున్నారు. రేబెల్ దగ్గరకు వచ్చిన తరువాత వారికి మతిపోయింది. రేబెల్ తెల్ల చీరలో, నుదుటను బొట్టు, కళ్లకు కాటుక, చేతికి గాజులు లేక బోడిగా భారతీయ విధవలా ఉంది. ఒక్కసారి మనసు బాధగా మూలిగింది.

పిల్లలను చూసి ఆత్రం పట్టలేక గుండెలకు హత్తుకుంది. రేబెల్ ఆమె కళ్లల్లో



కన్నీరు వరదలా, భర్త విలువ, పిల్లలపై ప్రేమ తెలియని విదేశీ వనిత రేబెల్ అసలైన హిందూ వనితలా, పొరపాటున దేవుడు మరిచిపోయి ఇండియా స్త్రీని, ఐర్లాండ్‌లో పుట్టించి, చేసిన పొరపాటు దిద్దుకోడానికి వెనక్కి రప్పించినట్లుగా ఉంది.

ఇంటికి వచ్చి స్నానాదులు ముగించిన తరువాత రేబెల్ అంది. "విశాల్ చనిపోయాడు అనుకోవడం పొరపాటు. నా పిల్లల రూపం నా మనస్సులో బ్రతికేవున్నాడు" అంది.

అందుకే, నీవు రంగు చీరలు కట్టుకుని, బొట్టు, గాజులు ఇదివరకటిలాగే వేసికో రేబెల్. విశాల్ ఏ ఉద్దేశంతో అయితే ఆ దేశం వచ్చి నిన్ను తల్లిని చేశాడో ఆ ఆశ నెరవేరనివ్వు."

భారత స్త్రీ అయితే విడోలాగా బ్రతుకుతుంది అని, మీరైతే భర్తపోయినా దానికి విలువ నివ్వక, అలంకరణ మార్చక, మరో మగాడిని చేసుకుంటారని, అందువలన తాను చనిపోయినా ఫరవాలేదని తన నాటకంలో పాత్రగా నిన్ను ఎన్నుకున్నాడు. తాను చనిపోయినా తన పిల్లల తల్లి విధవగా ఉండకూడదనేది విశాల్ కోరిక.

అతని కోరికను మన్నించు, భర్తపోయిన స్త్రీలు, బొట్టు, పువ్వులు, గాజులు తీయనక్కరలేదు. మంగళసూత్రం తీస్తే చాలు అనేవాడు. అతను నీ దృష్టిలో ఎలాగూ బ్రతికే ఉన్నాడు. మరి ఎందుకు అలంకరణలు త్యజించావు." అంటూ పువ్వులు, గాజులు, బొట్టు రంగుచీర అక్కడ పెట్టింది వారిజ. వాటిని ధరించమని అవి స్వీకరిస్తూ వారిజ, నందాల కాళ్లకు సమస్కరించింది రేబెల్. ఆమె కళ్లలోని నీళ్లు వారు ఆప్యాయంగా తుడిచారు.



# లండన్ మహానగరం



ఇంగ్లీషు వారి రాజధాని నగరమైన లండన్ బొంబాయినుండి 5,080 మైళ్ళదూరంలో ఉన్నది. ఇది చాలా అందమైన నగరం. చారిత్రాత్మకంగా ఎంత ప్రసిద్ధి కెక్కిందో, కళాత్మకంగా అంత కన్నుల విందైనది, ఎప్పుడూ నిమిషం తీరిక లేనిదానిలా రణగొణ ధ్వనితోను, దుమ్ము, ధూళితోను, ఫ్యాక్టరీల పొగతోను ఉంటుంది. దుమ్ము, ధూళితో నిండి ఉన్నా, చాలా వరకూ నీట్‌గా కనపడుతుంది. ఇది ఎంత పెద్ద నగరమైనప్పటికీ ఇచ్చటి గాలి మాత్రం చాలా స్వచ్ఛమైనది. పూర్వపు రోజుల్లో ఇది మరీ అంత ఎక్కువ వైశాల్యం కలిగి ఉండక పోయినప్పటికీ, జనాభా పెరిగే కొలది, వ్యాపార సంస్థలు ఎక్కువ అయిన కొలదీ, ఈ సిటీ అటూ ఇటూ పెద్దగా సాగిపోయింది. ఇచ్చటి వాతావరణం మాత్రం మనం వూహించినట్లుండదు. ఎప్పుడూ ఒక రీతిగా ఉండదు. ఇది పేరు గాంచిన రాజులకు పుట్టినిల్లు. లండన్‌ని చూడవచ్చిన వారికి అన్ని విధాలయిన సౌకర్యాలు ఉన్నాయి. అన్ని దేశాల డబ్బు మార్చుకునే రకరకాల బాంకులు, సైట్ సీయింగ్ బస్సులు, లండన్ గైడులు, మాప్‌లు, ట్యూబ్ ట్రెయిన్ మాప్‌లతోపాటు అడుగడుగునా సిటీబస్సులు, అయిదునిమిషాలకు ట్యూబ్ ట్రెయిన్స్‌తో పాటు అన్నిచోట్ల టాక్సీలు - ప్రయాణికులకు సౌకర్యంగా ఉంటాయి. టాక్సీలకు, హోటల్‌బిల్‌కు టిప్పింగ్ చాలా ఉంది.

ఇచ్చటి ఇంగ్లీషు వారి గురించి చెప్పాలంటే, వాళ్ళు తామెంతో అధికుల మని భావిస్తారు. 'మాది సూర్యుడు అస్తమించని రాజ్యం' అనే భావన వీరికి ఎక్కువ. అంతా 'మా తాతలు నేతులు తాగారు' అనే పద్ధతి. వీరికి ఏ దేశస్థులయినా అంతగా ఇష్టం ఉండదు. ఆఖరుకి బ్రిటన్‌లోని భాగాలయిన వేల్స్, స్కాట్లండు వారయినా పెద్ద మక్కువ లేదు. సెక్స్‌కి ప్రాధాన్యం ఎక్కువ. ఎచ్చటచూసినా రకరకాల సెక్స్ పుస్తకాలుంటాయి. ఇవి నిమిషాల మీద అమ్ముడయిపోతాయి. వేసవి కాలంలో ఏ పార్కు వైపు వెళ్ళినా, లాన్‌లోని ప్రేయసీ ప్రియుల పబ్లిక్ శృంగారము, వాళ్ళకు బెడ్ రూమ్ - మనకు టిక్కెట్టు అవసరం లేకుండా తిలకించవచ్చు. కొన్ని సెక్స్ పుస్తకాలలో 'భర్తలను మార్చుకుందాం' అనే రకం భార్యాభర్తల ఎడ్వర్‌టైజుమెంట్స్ ఉంటాయి. ఏ అమ్మాయి

అయినా నడిరోడ్డుమీద నగ్నంగా నడిచినా ఆశ్చర్య పడనక్కర లేదు. 'అమ్మా, అయ్యా' అనకుండానే కోటు, బూటు, సూటులతో దర్జాగా గిటార్ పుచ్చుకుని కొందరు, ముందు చిన్న గుడ్డ పరుచుకుని నిశ్శబ్దంగా కొందరు అడుక్కునే వాళ్ళు చాలా చోట్ల దర్శనమిస్తారు.

లండన్‌లో అన్ని రకాల దేశస్థులతోపాటు భారతీయులు చాలామంది ఉన్నారు. రెండు రాధా కృష్ణ గుడులు ఉన్నాయి. ఇండియన్ వై.ఎమ్.సి.ఎ.లో మహాత్మాగాంధిహాల్ ఉంది. ఇందులో అప్పుడప్పుడు తెలుగు సినిమాలు చూడవచ్చు. భరతనాట్యం, కథకళి, సంగీత కచేరీలు ఎక్కడో ఓచోట ఉంటాయి. ఇండియన్ హోటల్సు చాలా ఉన్నాయి. కాని వాటిలోనికి వెళ్ళినప్పుడు మన వాళ్ళు మన కిచ్చే గౌరవం కంటే మన ముందు ఇంగ్లీషు కస్టమర్లకి ఇచ్చే గౌరవం చూస్తుంటే మనకే చిన్నతన మనిపిస్తుంది. టేవిస్టాక్ అను ప్రదేశంలో చిన్న పార్కులో మహాత్మా గాంధి విగ్రహం ఉంది. గాంధీజీ ఇంగ్లండులో గడిపిన రోజులలో ఆ చుట్టు పక్కల ఎక్కడో ఉండేవారట. లండన్‌కి చివర సౌథాల్ ఉంది. దీనినే 'మిని ఇండియా' అని చెప్పవచ్చు. అచ్చట ఎంతోమంది ఇండియన్సు, ఎన్నో రకాల ఇండియన్ షాప్స్ ఉన్నాయి. లండన్‌లోని భారతీయుల హిందూ పెళ్ళిళ్ళు మన ఆచార ప్రకారంగా చేసికుంటారు. ముఖ్యంగా దీపావళి ఎంతో చక్కగా చేస్తారు. ప్రతి ఆదివారం టెలివిజన్‌లో ఉదయం ఒక అరగంట సేపు "నయా జిందగీ, నయా జీవన్" అనే హిందీ ప్రోగ్రామ్ వస్తుంది. ఇందులో కొంత చర్చ, ఒక పాట ఉంటాయి.

లండన్‌లోని మొదట రోమన్స్ పరిపాలించినప్పుడు ఒక పెద్ద గోడ కట్టారు. ఆ రోమన్ వాల్ అంతాపోగా, కొంత బార్బికన్ దగ్గర మనం చూడవచ్చు. జూలియస్ సీజరు కాలం నుండి ఇప్పటివరకు లండన్ నగరానికి ప్రసిద్ధి కెక్కిన చరిత్ర ఉంది. 'ఏ మనిషయితే లండన్ జీవితానికి విసుగెత్తితే, అతను జీవితానికే విసుగెత్తాడని చెప్పవచ్చు' అని సామ్యూల్ జాన్సన్ అన్నారు. దీనినిబట్టి ఈ సిటీ జీవితం మనం వూహించవచ్చు. నాగరికతలోను, ఫేషన్లలోను, అన్ని రకాల విలాసాల లోను అందివేసిన చెయ్యి ఈ నగరం.

లండన్‌లో చూడవలసిన స్థలాల గురించి చెప్పే ముందు మొదట మనం భూగృహంలోని ట్యూబు ట్రెయిన్స్ గురించి చెప్పుకోవాలి. వీటిని 'అండర్ గ్రౌండ్స్' అని సాధారణంగా అంటారు. లండన్‌లోని అండర్ గ్రౌండ్ ప్రపంచంలోని మొట్టమొదటిది. ఈ భూమి లోపలి కరెంటు ట్రెయిన్స్ మొత్తం లండన్ అంతా నాలుగు వైపులా ప్రయాణిస్తాయి. దీని ఆపరేషన్ చాలా బాగుంటుంది. స్టేషన్‌కి రాగానే డ్రైవరు బటన్ నొక్కుతాడు. ఆటోమేటిక్‌గా అన్ని పెట్టెల తలుపులు ఒకేసారి తెరుచుకుంటాయి. మరలా అన్నీ మూసుకుంటాయి. ఒక్కొక్క స్టేషన్‌లో 20 లేక 25 సెకండ్ల కంటే ఎక్కువ సేపు ఆగదు ట్రెయిన్. ఎక్కేవారు ఎక్కడం, దిగేవారు దిగడం - అంతే. ఇది

పోతే మరలా దొరకదు అనే భయం లేదు. మళ్ళీ అయిదు నిమిషాల లోపుగానే వేరొకటి వస్తుంది. ఈ ట్యూబ్ ట్రెయిన్స్ ఉదయం 5 గంటల నుండి రాత్రి ఒంటి గంట వరకూ ఉంటాయి. తరువాత స్టేషన్స్‌ని బలంగా మూసివేస్తారు. మొత్తం లండన్ అండర్ గ్రౌండ్‌లో 276 స్టేషన్స్ ఉన్నవి. ప్రతి రోజు 15, 20 లక్షల మంది వరకూ ఈ ట్రెయిన్స్‌లో ప్రయాణం చేస్తారు. మనం భూమి నుండి అండర్ గ్రౌండ్‌లో చేరుకోవడానికి లిఫ్టులుగాని, ఎస్కలేటర్లుగాని ఉంటాయి. స్టేషన్స్‌లో లిఫ్టులు నిముషానికి 800 అడుగుల స్పీడులో నడుస్తుంది. ఎస్కలేటర్సు అంటే ఇవి కరెంటు మెట్లు. మనం ఒక మెట్టు మీద నిలబడితే ఆటోమేటిక్‌గా కిందకు వెళ్ళిపోతాం నడవనక్కర లేకుండా. నిరంతరం ఆ మెట్లు అలా తిరుగుతూనే ఉంటాయి. భూమి నుండి స్టేషన్‌లోకి లోతు లైను లైనుకి వేరు వేరుగా ఉంటుంది. 80 అడుగుల లోతు లైన్ల నుండి 221 అడుగుల లోతు వరకూ ఉన్నాయి. ఈ ట్రెయిన్స్ అన్నీ ఒన్‌వే ట్రాఫిక్.

భూమి లోపల రైళ్ళు అంత పద్ధతిగా పని చెయ్యడం అంటే సామాన్య విషయం కాదు. లోపలికి ఆటోమేటిక్‌గా చక్కని గాలి ప్రసారం ఉంటుంది. మొట్టమొదట 1863లో మెట్రో పాలిటన్ లైను కట్టారు. తరువాత 1890లో సరయిన ట్యూబ్‌లైను రివర్ థేమ్స్ క్రిందనుండి కట్టారు. కాని అప్పుడు ఎక్కువ దూరం నడిచేవి కావు ట్రెయిన్స్. 1890లో కేవలం మూడు మైళ్ళు నడిస్తే, చివరగా 1900లో పూర్తిగా తయారుచేశారు. మొదటి ప్రపంచయుద్ధంలో ఈ అండర్‌గ్రౌండ్ చాలా ఉపయోగపడింది తలవని తంపుగా. రెండవ ప్రపంచ యుద్ధంలో ఒక రాత్రి 1,77,000 మంది ప్రజలు దీనిలో తలదాచుకొనడమే కాకుండా బ్రిటీష్ మ్యూజియంలోనివస్తువులన్నీ ఇచ్చటే దాచారు. ఈ రైలు స్టేషన్స్ అన్నీ ఉక్కుతో చెయ్యబడ్డాయి. ఒక్కొక్క ట్రెయిన్‌కి 6 నుండి 8 వరకు కంపార్ట్‌మెంట్స్ ఉంటాయి. ఒక్కొక్క దానిలో 32 నుండి 44 మంది వరకూ కూర్చోవచ్చు. రోజుకి ఈ ట్రెయిన్స్ నడవడానికి లండన్ సిటీనుండి కరెంటు 3,000,000 యూనిట్స్ ఖర్చవుతుంది. 1969లో విక్టోరియా లైను నిర్మించారు. అది అంతా అన్ని విషయాల్లోను ఎడ్వాన్స్‌గా ఉండి ఆటోమెటిక్‌గా పనిచేస్తుంది.

లండన్ నగరం రెండు భాగాలుగా విడి, మధ్యలో నుండి రివర్‌థేమ్స్ మనోహరంగా ప్రవహిస్తుంది. ఇది సముద్రంలోనుండి వస్తుంది. మనం అయితే దీనిని పెద్దకాలువ అంటాము. వీరు నది అంటారు. ఇది రెండు వేల సంవత్సరాల క్రితం తవ్వబడినప్పటికీ పురాతనంలా కనపడదు. ఈ కాలువ అవతలి ఒడ్డున ఇవతలి ఒడ్డున ప్రసిద్ధి కెక్కిన ఎన్నో స్థలాలు, భవనాలు ఉన్నాయి. ఈ కాలువమీద ఎన్నో బ్రిడ్జిలున్నాయి. వేసవికాలంలో బోటు షికారు వెళ్ళే సౌకర్యం ఉంది. ఈ బోటింగు చాలా బాగుంటుంది. డ్రైవరు పక్కన మరొకతను సూటులో ఠీవిగా కూర్చుని మనకు అన్ని స్థలాల గురించి వివరించి

చక్కగా చెబుతాడు. బోటు ఒడ్డుకు చేరగానే అంత సేపు తను పెట్టుకున్న టోపీ తిరగేసి బ్రహ్మాండంగా అడుక్కుంటాడు.

రకరకాలయిన లండన్ బ్రిడ్జిలలో వాటర్లూ బ్రిడ్జి, వెస్ట్‌మినిస్టర్ బ్రిడ్జి, ఆత్మహత్యల వంతెన ప్రసిద్ధికెక్కిన టవర్ బ్రిడ్జి ఉన్నాయి. ఈ టవర్ బ్రిడ్జి టవర్ ఆఫ్ లండన్ దగ్గర ఉంటుంది. దీనిస్థానంలో పూర్వం మరొక బ్రిడ్జి ఉండేదట. ఆ బ్రిడ్జిలో ఏదో గొప్పతనం ఉందని తలిచి వాటి రాళ్ళమీద నంబర్లు వేసి, దానిని విరగ్గొట్టి అమెరికావాళ్ళు, తీసుకునిపోయి, అదే నంబర్ల ప్రకారంగా కాలిఫోర్నియాలో కట్టారట. తీరా చూస్తే అమెరికన్సు వూహించిన గొప్పతనం అందులో ఏమీ లేక నిరుత్సాహ పడ్డారు. తరవాత ఆ స్థానంలో టవర్ బ్రిడ్జి కట్టారు. దీని కింద నుండి ఓడలు వెళ్ళాలంటే దీనిని ఓపెన్ చేసుకునే అనుకూలం ఉంది. ఓడ వచ్చే ముందు ఒక బెల్ కొడతారు. అప్పుడు ట్రాఫిక్‌ని ఆపేస్తారు. తరవాత బ్రిడ్జికి మధ్యలో నున్న లింకు తొలగించి పైకి ఎత్తుతారు. ఈ బ్రిడ్జి క్రిస్మస్ టైమ్‌లో ఎన్నో లైట్లతో చూడచక్కగా ఉంటుంది.

## లండన్ జూ

ప్రపంచంలో ప్రసిద్ధి కెక్కిన జూ. ఎక్కువ జంతువులు కలిగి ఉన్న జూ. దీనిని 1847లో ప్రారంభించారు. కాని చాలా వరకు కృత్రిమంగా కనపడుతుంది. ప్రకృతి సిద్ధంగా కనిపించదు. ఇందులో దాదాపు 6 వేల వరకూ జంతువులు ఉన్నాయి. మనకు ఎక్కువగా ఇందులో కనిపించేవి ఇండియా, ఆఫ్రికా జంతువులు. అన్ని రకాల జంతువులతోపాటు పోలార్ బేర్, మంచు గుడ్లగూబలు, తెల్ల ఎలుకలు, తెల్ల చిలుకలు ఉన్నాయి.

## పోస్టాఫీస్ టవర్



ఇది లండన్‌లోని అన్ని బిల్డింగుల కంటే ఎత్తయినది. ఎంతో ఉపయోగకారి. దీని ఎత్తు 620 అడుగులు. ఇది టెలిఫోను, టెలిప్రింటు, టెలివిజను, కంప్యూటరు, కమ్యూనికేషన్స్‌కి నిలయం. ఒకేసారి 1,50,000 టెలిఫోనులు ట్రంక్‌కాల్సు మొత్తం దేశమంతా చేయవచ్చు. ఇది 625 టెలివిజను ఛానల్సు కలిగి ఉంది. ఇంత ఎత్తయిన బిల్డింగు మినిస్ట్రీ ఆఫ్ పబ్లిక్ వారితో డిజైన్ చెయ్యబడింది. పైకి వెళ్ళడానికి లిఫ్టు ఉంటుంది. ఆ లిఫ్టు నిమిషానికి వెయ్యి అడుగుల స్పీడుతో పైకి ఎక్కి ఎవరయినా లండన్ సిటీ అంతా చూడవచ్చు.

అప్పుడు నగరంలోని ఎత్తయిన భవనాలు మనకు అస్తవ్యస్తంగా, పేర్చిన అగ్గిపెట్టెల్లా కనబడుతాయి. ఇది చూడడానికి చాలా బాగుంటుంది. పైన ఖరీదయిన రెస్టారెంట్ ఉంది. ఒకేసారి వందల, వేల రేడియో లింక్సు పని చేస్తాయి.

## ప్లానిటోరియమ్

లండన్‌లో రెండు ప్లానిటోరియమ్స్ ఉన్నవి. మనం తెల్లని ఎత్తయిన డోమ్ (ఎత్తయిన కొప్పారం) కింద కూర్చుని అరగంట సేపు ప్రపంచంలోని అన్ని రకాల నక్షత్రాలను చూడవచ్చు. మనం లోపలకు వెళ్ళికుర్చీలో కూర్చోగానే మన కళ్ళ ముందే, మనకు నమ్మశక్యం కాకుండా మెల్లగా చీకట్లు అలుముకుంటాయి. చీకటి పడుతుంది. పైనతారలు దర్శనమిస్తాయి. అది చూస్తున్నంత సేపు మనం ఆకాశం కింద నిలబడి తారలను చూస్తున్నా మనే అనుభూతి తప్ప మనకు మరేదీ తెలియదు. దీనిలో సూర్యుని అస్తమయం దగ్గర నుండి చంద్రుని, తారల యొక్క కదలికలను, మెర్క్యురీ, వీనస్, మార్స్, జూపిటర్, శాటర్న్‌వంటి గ్రహాలను, వాటి కదలికలను చాలా బాగా చూపిస్తారు. ఏ దేశం నుండి నక్షత్రాలు ఏయే విధంగా కనపడతాయి, అవి ఏ దిక్కుగా ప్రయాణం చేస్తాయి. అన్నీ మనం చూస్తూ వినవచ్చు. రెండు ప్రొజెక్టర్ల ద్వారా ఇవి మనకు చూపిస్తారు. పాల పుంతను కూడా చూడవచ్చు. ఈ ప్రొజెక్టర్ ఖరీదు 70 వేల పౌనులు.

ఈ ప్లానిటోరియమ్ పక్కనే మేడమ్ తుస్సాద్ ఉంది. మొదట పారిస్‌లో మేడమ్ తుస్సాద్‌తో మనిషి యొక్క ఫుల్ సైజు లక్క విగ్రహాలు తయారు చెయ్యబడ్డాయి 1770లో. తరవాత 1802లో ఇంగ్లండు, స్కాట్లండులకు టూర్‌కి వచ్చినప్పుడు ఆ విగ్రహాలు ఇచ్చటకు తెచ్చారు. అప్పటినుండి అవి ఇంగ్లండు వారి పరమయ్యాయి. ఇందులోని విగ్రహాలు నిజమైన మనుషులే అనెడి భ్రమను మనకు కలిగిస్తాయి. అవి అంత నేర్పుగా చెయ్యబడ్డాయి. ఆ బొమ్మల చుట్టూ మనుషులు తిరుగుతున్నప్పుడు, అందులో ఎవరు బొమ్మలో, ఎవరు మనుషులో అని మనకే అనుమానం వస్తుంది. ప్రపంచంలో ప్రసిద్ధి కెక్కిన మహనీయుల విగ్రహాలు ఉన్నాయి. ఖద్దరు పంచెతో, చేతిలో కర్రతో, కొద్దిగా వంగిన నడుముతో మన మహాత్మాగాంధి హాలు నడుమ భాగంలో ఉన్నారు. ఇంకా మహమ్మద్ ఆలిజిన్నా, నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, హిట్లరు, కోజాక్‌లతో పాటు ఈ దేశాన్ని పరిపాలించిన రాజుల విగ్రహాలు ఇంకా రాజకీవిలో ఉన్నాయి. విక్టోరియా మహారాణి, ఎనిమిదవ హెన్రీ, అతని ఆరుగురు భార్యలు, పోపులు ప్రస్తుతం ఈ దేశాన్ని పాలిస్తున్న ఎలిజబెత్ ది సెకండ్, ఆవిడ కుమార్తె మార్గరెట్ ఉన్నారు.

ఇందులో ఒక చెరసాల ఉంది. అందులో జైలులో పూర్వం బంధించబడిన వీరులు ఇప్పటికి విగ్రహాల రూపంలో బంధించబడి ఉన్నారు. తలను తీసి కోట

గుమ్మానికి కట్టినట్లుండే దృశ్యాలు, మనుష్యులను క్రూరంగా నరికి వేసిన సన్నివేశాలు, పూర్వం వారి శత్రువులను హింసించిన ఆయుధాలు (ఇనక చక్రాల బండిలోని చక్రానికి మనుషులను కట్టి ఆ చక్రాన్ని తిప్పేవారట) అన్నీ ఉన్నాయి. వీటితో పాటు ఇద్దరు అన్నదమ్ములున్నారు. వీరి పేర్లు హేర్ అండ్ బర్క్. వీరు పూర్వం రోజులలో ఎడింబరో మెడికల్ కాలేజికి శవాలను సరఫరా చేసి, ఒక్కొక్క శవానికి పది పౌనుల చొప్పున పొందేవారు.

ఎవరినయినా ఇంటికి ఆతిథ్యానికి ఆహ్వానించి, వారిని పీకల వరకూ తాగించి, వారికి ఒళ్ళు తెలియని స్థితిలో రెండు కర్రలు వారి పీకల మీద పెట్టి ఇద్దరూ చెరొక పక్క నుండి అదిమి పట్టి నొక్కి చంపేవారట. ఆ విధంగా శవాలను మెడికల్ కాలేజికి ఇచ్చేవారు.

దీనిలోనే మరొక ప్రక్కన బేటిల్ ఆఫ్ ట్రఫాల్గర్ ఉంది. దీనిలోనికి ప్రవేశిస్తే నిజంగా మనం యుద్ధభూమిలో ఉన్నామా అనెడి సంశయం వస్తుంది. ఆనాడు నెల్సన్ చేసిన యుద్ధాన్ని కన్నులకు కట్టినట్లు విగ్రహాలతో తయారుచేశారు. బాంబులతోను, మెషీన్‌గన్స్ పొగతోను, భయంకరమైన శబ్దంతోను మనం యుద్ధభూమిలోని అనుభూతి పొందవచ్చు. నెల్సన్ యుద్ధానంతరం గాయాలతో బాధపడుతూ చనిపోయిన దృశ్యం కూడా ఉంది. ఇందులోనే ఒక అందమైన స్లీపింగ్ బ్యూటీ బొమ్మ ఉంది.

## బకింగ్‌హామ్ పేలస్

ఇది ప్రస్తుతపు రాణి అయిన ఎలిజబెత్ ది సెకండ్ నివసించే భవనం. దీనిని బకింగ్‌హామ్ అను ఆయన కట్టించి నందుకు దీనికా పేరు వచ్చింది. దీని నిర్మాణానికి 12 సంవత్సరాలు పట్టిందట. దీనిని 4వ జార్జి ఆర్డరు ప్రకారం మొదలు పెట్టారు. ఇది చాలా వరకు పూర్తి అయిన తరువాత ఆయన చనిపోయాడు. తరవాత నాలుగవ విలియం రాజుగా నున్నప్పుడు భవనం సరిగా పూర్తయిన సమయానికి ఆయన కూడా మరణించాడు. చివరికి మొదట ఇందులో నివసించే యోగం విక్టోరియా మహారాణికి కలిగింది. అప్పటి నుండి అది రాజ భవనం అయింది. ఈ భవనం లండన్‌కి మధ్య భాగంలో ఉంది. దీని ఎదురుగా విక్టోరియా రాణి మెమోరియల్, గోల్డెన్ ఈగిల్ ఉన్నాయి. క్వీన్ ఎలిజబెత్ 1953లో పదవికి వచ్చింది. అప్పటి నుండి ఇప్పటి వరకుఆవిడ ఒక సెలవు రోజయినా తీసుకోలేదట. రాణి భవనంలో ఉన్నప్పుడు దీనిపై జండా ఎగురుతుంది.

ముఖ్యంగా ప్రతిరోజు ఇచ్చట ఉదయం పదకొండున్నరకి జరిగే గార్డు ఛేంజింగ్ చూడవలసింది. ఇది చూడడానికి వేసవిలో వేల కొలది ప్రజలు వస్తారు. ఎర్రబట్టలు,

నల్లటోపీ ధరించిన గార్డులు మ్యూజిక్ వినిపిస్తుండగా, బేండ్ వాయిస్తుండగా చూడ ముచ్చటగా భవనం ముందు భాగం నుండి మార్చింగ్ చేసుకుంటూ భవనం దగ్గరకు చేరుతారు. వీరు రాత్రంతా డ్యూటీ చేసిన గార్డులను విడుదల చేసి, డ్యూటీలో జాయిన్ అవుతారు. వీరిని 'ఈమన్ ఆఫ్ ది గార్డు' అంటారు. ఈ గార్డులు బకింగ్‌హామ్ పేలస్‌కు బాడీగార్డులన్నమాట. ఈ భవనం కట్టక ముందు రాజకుటుంబాలు కెన్సింగ్‌టన్ పేలస్‌లో ఉండేవారు. ఈ కెన్సింగ్‌టన్ భవనాన్ని ఆనుకొని చాల పెద్ద పార్కు ఉంది. ఇది 275 ఎకరాలు. దీనికంటే పెద్దది 340 ఎకరాల స్థలం కలిగి ఉన్నది హైడ్ పార్కు. లండన్‌లో మరొక ముఖ్యమైన పార్కు రీజెంట్ పార్కు, ఇంకా చిన్న చిన్నవి ఎన్నో రకాలయిన పార్కులున్నవి. ఇవి వేసవి కాలంలో అందరికీ ఆహ్లాదకరంగా ఉంటాయి.

## హౌస్ ఆఫ్ పార్లమెంట్ : బిగ్ బెన్

ఇది పూర్వం రాజుల నివాస స్థలంగాను, పార్లమెంటుగాను కూడా వాడేవారు. 1512లో ఎనిమిదవ హెన్రీ క్రొత్త రాజభవనంలోనికి మారిపోవడంతో, దీనిని పూర్తిగా పార్లమెంటు సభ్యులు ఆక్రమించుకున్నారు. ఇందులో రెండు హౌసెస్ ఆఫ్ పార్లమెంటులు సమావేశాలు జరుపుతాయి. ఇందులో సమావేశం జరుగుతున్నప్పుడు జండా ఎగురుతుంది పైన. రాత్రి సమయంలో సమావేశం జరిగితే లైటు వెలుగుతుంది. దీనిని ఆనుకొని బిగ్ బెన్ టవర్ (క్లాక్ టవర్) ఉంది. ఈ బిల్డింగు చూడచక్కనిది.

ఇంక ఈ నగరంలోని చర్చిల గురించి చెప్పాలంటే చాలా రకాలయినవి ఉన్నవి. అందులో వెస్ట్ మినిస్టర్ కెతడ్రల్ చాలా ప్రసిద్ధి కెక్కిన రోమన్ కేతలిక్ చర్చి. సెయింట్ జేమ్స్ చర్చి కూడా చూడదగినది. అన్ని చర్చిలలోనూ ముఖ్యంగా చెప్పుకోతగినది సెయింట్ పాల్ కెతడ్రల్. ఇది బాప్టిస్టు చర్చి. మొదటి చర్చి లండన్ అగ్ని ప్రమాదంలో నాశనమయిపోగా, 1667కి, 1710కి మధ్యలో ఇది కట్టారు. ఈ చర్చి 366 అడుగుల ఎత్తుగల తెల్లని పెద్ద డోమ్ కలిగి ఉంది లోపల. ఇది ఎంతో పేరుగాంచిన నిపుణులతో కట్టబడింది. ఈ చర్చిలోని కళానైపుణ్యం చూడడానికి కన్నులు చాలవనిపిస్తుంది. అంత బాగుంటుంది. ఈ చర్చిలో 166 మెట్లు పైకి వెళ్ళితే పైన గేలరీ ఉంది. ఈ గేలరీ నుండి మనం ఏదయినా మాట్లాడితే ఆ మాటలు కెతడ్రల్ అంతా వినిపిస్తాయి. ఈ చర్చిలో సెయింటులను, పోపులనే కాకుండా ఫ్లారెన్స్ నైటింగేల్, నెల్సన్, క్రిస్టోఫర్‌రెన్, వెల్లింగ్‌టన్ మొదలగు వారిని సమాధి చేశారు. దీని అండర్ గ్రౌండ్‌లో వారిని సమాధి చేసిన స్థలాలలో వారి వారి విగ్రహాలు ఉన్నవి. భూమి తనచుట్టూ తాను తిరిగే కదలికలో ఈ కెతడ్రల్ రోజుకి ఒకఅడుగు పైకి, క్రిందికి కదులుతుందని అంటారు. అది ఎంతవరకూ నిజమో తెలియదు.

ఈ నగరంలో పలురకములయిన మ్యూజియమ్‌లు ఉన్నవి. అందులో బ్రిటిష్ మ్యూజియమ్ ఒకటి. ఇది ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన మ్యూజియమ్. ఇందులో ఒక భాగంలో మన రాజస్థాన్ పెయింటింగులు, ఎత్తయిన బోధిసత్త్వుని విగ్రహం ఉన్నాయి. ఈజిప్షియనుల నిత్య జీవితచరిత్ర, వారి కళానైపుణ్యం, టూంబ్ పెయింటింగ్, పిరమిడ్స్‌లో సమాధి చేసిన వారి విగ్రహాలు మొదలగు ఈజిప్షియనుల శిల్పాలు ఒక పక్కన ఉన్నాయి. గ్రీకు, రోమనుల పురాతన వస్తువులు, బ్రిటీషు, రోమనుల యొక్క పురాతన వస్తుప్రదర్శనం ఒక్క పక్క, మధ్యయుగం వారు ఉపయోగించిన గడియారాలు, శిల్పాలు, నాణాలు వంటివి వేరొక భాగంలో ఉన్నవి. ప్రపంచంలోని ఎన్నో రకాలయిన పురాతన వస్తువులను మనం ఇందులో చూడవచ్చు. బ్రిటీష్ మ్యూజియం తరవాత సైన్సు మ్యూజియమ్, నేచురల్ హిస్టరీ మ్యూజియమ్, నేషనల్ ఆర్మీ మ్యూజియమ్ వంటి ఎన్నో రకాలయిన మ్యూజియమ్స్ ఈ నగరంలో ఉన్నాయి.

అన్ని మ్యూజియమ్స్ ఒక ఎత్తు, టవర్ ఆఫ్ లండన్ మరొక ఎత్తు. ఈ టవర్ ఆఫ్ లండన్ పూర్వం రాజుల నివాసం. ఇది రాజకోట. ఇది చూడగానే రాజుల చరిత్ర కళ్ళ ముందు కదిలినట్లుంటుంది. ఇది 1708లో విలియంచే కట్టబడింది. ఇందులో రాజుల యుద్ధం చేసినప్పటి కవచాలు, కత్తులు, తుపాకులు, మరెన్నో పురాతన వస్తువులతో పాటు, శత్రువులను క్రూరంగా హింసించే ఆయుధాలు, మనుష్యులను ఘోరంగా నరికే పెద్దరాయి, కత్తిని మనం చూడవచ్చు. దీనిని అంతటిని కలిపి 'లండన్ టవర్' అంటారు. లోపల మాత్రం చాలా టవర్స్ ఉన్నాయి. అందులో చెప్పుకోతగ్గవి మిడిల్ టవర్, బైవార్డ్ టవర్, బ్యూచాస్ టవర్, బెల్ టవర్ (ఏదయినా ప్రమాదం సంభవించినప్పుడు బెల్ మోగుతుంది) బ్లడీ టవర్ (ఇందులో శత్రువులను, రాజకీయ ఖైదీలను, వారికి అడ్డు తగిలిన రాజులను క్రూరంగా పరికేశారు కాబట్టి దీనిని బ్లడీ టవర్ అంటారు) పచ్చపచ్చగా ఉండేది గ్రీన్ టవర్. ఈ టవర్‌లోనే బ్రిటీషువారు కొన్ని బొంత కాకులను పెంచుతారు. ఇవి ఈ దేశానికి ఆయువు పట్టు అని వీరి నమ్మకం. ఒకవేళ ఈ కాకులన్నీ చనిపోతే బ్రిటీష్ రాజ్యం నాశనమైపోతుందనే భయంతో వాటిని ఎంతో జాగ్రత్తగా, మరింత శ్రద్ధగా పెంచుతారు.

ఈ టవర్‌లో రహస్య మార్గాలు, కోట చుట్టూ రివర్ థేమ్స్‌లోని నీటిలో కందకాలు, అన్ని ప్రక్కల పెద్ద పెద్ద గుండు తుపాకులు ఉండి నిజంగా రాజుల కాలాన్ని తలపింపచేస్తాయి. అవన్నీ చూస్తే రాజులు శత్రువులను ఎంత ఘోరంగా హింసించారో ననిపిస్తుంది. ఇందులో అతి ముఖ్యాతి ముఖ్యమైనది భూగృహంలోని వెలలేని నగలు, కిరీటాలు. 'కళ్ళు మిరుమిట్లు గొలిపే నగలతో నున్న ఈ భూగృహాన్ని మనం విలువ కట్టలేము. ఇది చూస్తుంటే మన దేశం తప్పక గుర్తుకి వస్తుంది. అందులో ఎన్ని విలువయిన వజ్రాలు మన దేశం నుండి తరలించారోననే భావం రాక మానదు.

ఇందులో ఎనిమిది కిరీటాలు ఉన్నవి. అందులో ఒక కిరీటంలో 'కోహినూరు నీ జడలో పువ్వట' అని మన కవులు మన భరతమాతను పొగిడినా, అది ప్రస్తుతం ఈ కిరీటంలో ఉంది. దీనిని చూస్తుంటే బ్రిటీషు వారిపై నిజంగా కోపం వస్తుంది. ఈ కోహినూర్ వజ్రం ధరించిన మగవారికి చెడు ఫలితాన్ని, ఆడవారికి మంచి అదృష్టాన్ని ఇస్తుందంటారు. 1850లో అప్పటి ఇండియా గవర్నర్ - జనరల్ అయిన డల్‌హౌసీ ఈ వజ్రాన్ని విక్టోరియా మహారాణికి కానుకగా పంపించాడు. దీనిని మొదట ఎగ్జిబిషన్‌లో పెడితే, అది అందరినీ ఆకర్షించింది. తరవాత విక్టోరియా మహారాణి ఆ వజ్రాన్ని మంచి ఆకారానికి వచ్చేలా కోత కోయించి, తన ముంజేతి కంకణంలో ధరించింది. మరికొంత కాలానికి క్వీన్ అలెగ్జాండ్రా, క్వీన్ మేరీ దానిని కిరీటంలో పెట్టించారు. ఈ కిరీటాన్ని విక్టోరియా రాణి తన ముసలి వయసులో పెట్టుకునేది. ఈ కిరీటాలు, విలువయిన నగలు దొంగల చేత బడకుండా విద్యుత్ సరఫరాతో రక్షించబడుతుంటాయి. ఇందులోనే గోల్డెన్ ఈగిల్ అడుగు భాగంలో పవిత్రమైన ఒక ఆయింట్‌మెంట్ లాంటిది ఉంటుంది. రాజులు చనిపోయే ముందు ఆ స్పూనులో హోలీ వాటర్ వేసి తాగిస్తారు. ఈ పక్షి వీరి జాతీయ పక్షి.

ప్రతి రోజు ఈ టవర్ యొక్క తాళపు చేతుల అప్పగింత బాగుంటుంది. రాత్రి ఏడు నిమిషాల తక్కువ పది గంటలకు ఇది మూసివేస్తారు. అన్నింటికి తాళాలు వేసి చీఫ్ వార్డరు ఒక చేతిలో లాంతరుతోను, మరొక చేతిలో తాళాలతోను బైవార్డ్ టవర్ గుండా ఇవతలికి వస్తాడు. అతని కోసం కొందరు గార్డులు ఎదురు చూస్తుంటారు. బ్లడీ టవర్ దగ్గర - లాంతరు ఒక గార్డుకి ఇచ్చి, మార్చింగ్ చేస్తూ తిరిగి టవర్ గేటులో నుండి వస్తారు. వాళ్ళు వస్తున్నప్పుడు అక్కడ ఉన్న మరికొందరు గార్డులు తాళాలకి సెల్యూట్ చేస్తారు. తాళాలు పట్టుకున్న వారు టోపీలు ఎత్తుతారు. టవర్ గేటు లాక్ చేసిన తరవాత అందరూ కలసి వచ్చి బయట నున్న మిడిల్ టవర్, బైవార్డ్ టవర్ల బలమైన వోకు చెక్కలతో చేసిన గేట్‌లు లాక్ చేస్తారు. వాళ్ళు బయటకు వస్తుండగా ఆర్చ్‌దగ్గర వీరిని కాపలా కాస్తున్న సోల్జరు 'ఎవరక్కడ? ఆగండి' అనగానే ఛీఫ్ వార్డరు 'తాళాలు' అని సమాధానం చెబుతాడు. తిరిగి వారు 'ఎవరి తాళాలు' అని అడిగితే 'ఎలిజబెత్ మహారాణి తాళాలు' అని వార్డరు చెబుతాడు. 'ఊం. రాణిగారి తాళాలు తీసుకెళ్ళండి' అంటూ దారి ఇవ్వగానే అందరూ ఇవతలకు వస్తారు. చివరగా చీఫ్ వార్డరు 'దేవుడు రాణిగారిని రక్షించుగాక' అంటే అందరూ 'ఆమె'నే అంటారు. అప్పటికి సరిగా 10 గంటలు కొడుతుంది గడియారం. తాళాలు రాణిగారి భవనానికి తెచ్చి అచ్చట నున్న రెసిడెంట్ గవర్నర్‌కి జాగ్రత్తగా అందచేస్తారు.

లండన్‌లో తప్పనిసరిగా చెప్పుకోవలసింది మరొకటుంది. అది గ్రీనిడ్జ్ మీన్ టైమ్. దీని స్పెల్లింగు గ్రీన్‌విచ్ అయినప్పటికీ దీనిని గ్రీవిడ్జ్ అంటారు. ఈ ప్రదేశంలో

చిన్న ఎత్తయిన కొండమీద ఒక గడియారం (జి.ఎమ్.టి) ఉంది. దీని ద్వారా ఒక్క లండన్‌లోని టైమే కాకుండా ప్రపంచంలోని అన్ని దేశాల టైమింగ్స్ మనం తెలుసుకోవచ్చు. ఈ గడియారానికి కొద్దిగా వెనుక భాగంలో ఒక లావయిన గీత ఉంటుంది. ఇది ఉత్తర ధృవాన్ని, దక్షిణ ధ్రువాన్ని కలిపే గీత. దీనిని 'ప్రైమ్ మెరిడియన్' అంటారు. ఈ గీత సరిగా ప్రపంచానికి మధ్యలో ఉంది. దీనినే 'లాంగిట్యూడ్ జీరో' అని కూడా అంటారు. మనం ప్రపంచ పటం తీసుకొని చూస్తే అందులో మనకు ఉన్న ఎన్నో లాంగిట్యూడ్స్‌లో సరిగా లండన్ మీద నుండి ఒకటి ఉంటుంది. ఆ గీత గ్రీనిడ్జ్‌లలో చూడవచ్చు ప్రత్యక్షంగా. మనం లండన్‌లోని టైమ్‌ని తీసుకుని తూర్పుకి వెళ్ళే కొలది ఒక్కొక్క లాంగిట్యూడ్‌కి ఒక్కొక్క గంట తీసివేసుకుంటూ వెళ్ళితే ఏ దేశపు టైమ్ అయినా తెలుస్తుంది.

ఇంకా ఇందులోనే కొన్ని గేలరీలు ఉన్నవి. అవికూడా చూడదగినవే. ఇందులో పూర్వం నావికులు ఉపయోగించే టెలిస్కోపులు ఉన్నవి. ఈ టెలిస్కోపుల ద్వారా వారు ఏ వైపుగా ప్రయాణం చేస్తున్నది, ఏ సమయంలో ప్రయాణం చేస్తున్నదీ తెలుసుకొనే వారు.

ఇవి కాకుండా ఈ నగరంలో చూడవలసినవి చాలా ఉన్నవి. అందులో ముఖ్యమైనది డికెన్స్ హౌస్. ప్రఖ్యాతరచయిత ఛార్లెస్ డికెన్స్ ఇందులోనే ఆలివర్ ట్విస్ట్, నికొలస్ నికల్బీ రచించాడు. హిత్రూ ఎయిర్ పోర్టులోని రూఫ్ గార్డెన్స్, క్యూ గార్డెన్స్ లోని ఎన్నో రకములయిన పుష్పములు, వెస్ట్ మినిస్టర్ అబ్బి (ఇందులో చాలా మంది రాజులు పదవిని అధిష్ఠించారు. ఎంతో మందిని సమాధి చేశారు. ఇందులోనే జార్జి ఫ్రెడరిక్ హేండిల్, సర్ వాల్టర్ స్కాట్, ఆలివర్ గోల్డ్ స్మిత్‌ల పద్య రచనలు ఉన్నాయి. మరొక చోట షేక్స్పియర్‌ని, అతని సోదరుని సమాధి చేసిన స్థలం ఉంది. నెల్సన్ టవర్, ఈ టవర్ దగ్గర తిరిగే పావురాలు చూడదగినవి. లండన్‌లో భయంకరమైన డంజన్ (చీకటి గయ్యారం) ఉంది.

ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్ ప్రపంచంలోని వివిధ రకములయిన వస్తువులకు విక్రయస్థానం. ఈ నగరంలో ఎన్నో ఖరీదయిన షాపులతోపాటు ఆల్డ్ గేట్‌లో చవక బజారు ఉంది. ఇది ఆదివారం బజారు. అన్ని రోడ్ల పక్క ఫుట్‌పాత్ మీద పెట్టి చవగ్గా అమ్ముతారు. ఇది మన దేశంలోని సంతకు ఏమాత్రం తీసిపోదు. ఎక్కడయినా ఒక పెన్నీకి చవకగా ఏ వస్తువయినా దొరుకుతుంది. అంటే మైలు దూరమయినా నడిచి వెళ్ళి తెచ్చుకునే వారున్నారు. ఇచ్చట చిన్న చిన్న దొంగతనాలు, పెద్ద పెద్ద దొంగతనాలు తరుచు జరగుతుంటాయి. ఏ దేశస్థుల కయినా లండన్ సిటీ ఆహారం, దుస్తులు, వస్తువుల విషయంలో సౌకర్యంగా ఉంటుంది. అందుచేత ఈ నగరమంటే చాలావరకూ అందరూ ఇష్టపడతారు. ప్రపంచంలో ప్రసిద్ధికెక్కిన నగరాలలలో లండన్ ఒకటి.



# కొత్త బావ

బావా బావా పన్నీరు
బావకు మరదలు బంగారు
అక్కా బావ వచ్చేరు
అందరి మనసులో కంగారు

అప్పులకు పరుగెత్తారు
ధగధగలాడే కొత్త స్కూటరు
అది చూసి బావగారు
తగదది నాకని అలిగేరు
ఇంకా కావాలి కాబోలు వి.సి.ఆరు
బావా బావా పన్నీరు
నాన్న బండి క్రింద నల్లేరు

పంచభక్ష్య పరమాన్నం తిన్నారు
పంచదార తక్కువన్నారు
పొంచి పొంచి ధరలు విన్నారు
తుంచి తుంచి మాటలు ఆడేరు
బావా బావా పన్నీరు
అమ్మ మనసులో హోరు

తెచ్చిన బట్టలు చూసారు
మెచ్చక దిగ్గున లేచారు
నీళ్ళు నములుతూ అందరూ
ఖరీదైననే అన్నారు
బావా! బావా! పన్నీరు
అన్నగుండెలో బేజారు

అడుగుల మడుగులు ఒత్తేరు
సకల మర్యాదలు చేసేరు
కలలో కూడ జడిసారు

అయినా అల్లుడుగారు మొహం ముడిచారు
బావా! బావా! పన్నీరు
అక్క కళ్ళలో కన్నీరు
తాను లంచగొండిని, బిచ్చగాడిని
కాలేనన్నారు

పిండి కొలది రెట్టె చాలన్నారు
ఎంత చెట్టుకు అంత గాలన్నారు
ఆడంబరాలు ఇచ్చగించ
వీలవదన్నారు

అంబరానికి నిచ్చెన వలదన్నారు
బావా! బావా! పన్నీరు
బావ మనసే బంగారు
అక్కా బావ వచ్చేరు
పండగ సరదా తెచ్చేరు
పండగ పరదా ఎత్తేరు
వీధి వీధి తిప్పేరు
వీపున శాలువ కప్పేరు

☆ ☆ ☆

# మోడ్రన్ అత్తా కోడళ్ళు

అత్తాలేని కోడలాయుష్మంతురాలు ఓయమ్మా!
కోడల్లేని అత్తనిరుపేదరాలు ఆ.హు.... ఆ.హు...
కోడలా! కోడలా! కొడుకు పెళ్ళామా ఓయమ్మా
ఫ్రిజ్‌లో పెట్టిన ఐస్‌క్రీమ్ ఏమైందమ్మా

అత్తమ్మ, అత్తమ్మ నా మొగుడి అమ్మా, ఓయమ్మా
కరెంటుపోతే కరగక ఉంటుందా
పక్కింటి కోడలు లక్షలు తెచ్చింది ఓయమ్మో ఆ.హు.
ఈ ఇంటి కోడలు ఏమి తేలేదమ్మా ఆ.హు....

ఎదురింటి అత్తమ్మ కట్న మడగలేదట ఓయమ్మో
డబ్బు తెచ్చిన కోడలు పక్కలో బల్లెమట
దీపావళి పండుగ వచ్చింది సరదాలు తెచ్చింది ఓయమ్మో
నేతి గారెలు వండవే ఓ కోడలమ్మా

బి.పి. షుగరు అంటూ మూలుగుతుంటారు ఓయమ్మో
గారెలు, బూరెలు నేనెట్టా చేతు?
ఫైటింగు సినిమా ఈరోజే వచ్చింది ఓయమ్మో
నలుగురంపోదాము పదవే కోడాలా!

అందరమెళితేను ఇంటి కాపలా ఎవరు ఓయమ్మో
మేమెళ్ళివచ్చి కథ వినిపించి వేస్తాము
మిక్సీలు, మేక్సీలు, మనకెందుకులేదే ఓయమ్మో
చీర నిండుగ కట్టి, పప్పు రుబ్బిపోవే ఆ.హు.

ఆ రెండూ లేకుంటే, అమ్మమ్మ లాగుండే ఓయమ్మో
నన్ను చూసి మరి నలుగురు నవ్విపోరా!
బ్యూటి క్లినిక్కెందుకే డబ్బు దండగ కాదా ఓయమ్మో
పసుపు, గంధాలు, నీకు వన్నె తేవా?

శంఖంలో పోస్తేనే తీర్థమవుతుంది ఓయమ్మో
అంకమ్మ శివాలు మానవే ఓ అత్తా!
ఆడబడుచొచ్చింది అన్నము వండవే ఓయమ్మో
ఆనక ఆమెకు మంచి చీర కొనితేవే

ఆసుపత్రిలో డాక్టరు రెస్టు రాసారు ఓయమ్మో
నే చీరపెడతాను, చిరకాలం బతకరు... అ.హు
ఏడు వారాల నగలు బీరువాలో ఉన్నాయి ఓయమ్మో
రోజుకొకటి నీవు పెట్టి చేసికోవే

నగల గోల ఏమి, అవి నాకే కాదా ఓ అత్తా
ఈ యిల్లు నా పేర ఎప్పుడు పెడతావు?
ఏడాది కొకర్ని, మనుమల్ని ఈయవే ఓయమ్మో
కూతుర్లు అసలొద్దు కొడుకులనే కనవే

ఇద్దరు లేక ముగ్గురు చాలని వినలేదా
సృష్టికి మూలం ఆడదే కదా అత్తమ్మా
నీవు చెప్పిన మాట నిజమే నంటాను ఓయమ్మా
నీవు నేను కూడ పడతులమే కదా

అత్తా కోడళ్ళంటే బద్ధ శత్రువులు కాదని ఓయమ్మో
నీవు, నేను కలిసి చాటి చెబుతాము...

☆ ☆ ☆

# నాడు-నేడు
# వినుడు-వినుడు

దంపుడు బియ్యం సన్నమాయె
తవుడులేని తెల్ల అన్నమాయె
పంటలకు మందులాయె
ఆ వంటతోనే నిందులాయె

సాంబ్రాణి పొగపోయె
కృష్ణవేణి సగమాయె
హెయిర్ డ్రయర్ మోజులాయె
పొట్టి పిలక ఫోజులాయె

పులిహోర చేదాయె
పలావు ప్రియమాయె
శరీరం లావాయె
రోగాలకు నెలవాయె

చవకధరలు తిరిగి రాకపోయె
చావలేని ఆకలి కేకలాయె
సంచులతో రూకలాయె
జేబులలో నూకలాయె

దేవుడొక్కడను పేరాయె
కొలవడంలో దేవుళ్ల వేరాయె
మత కలహాలతో పోరాయె
సంఘమే పురుగుత్తిన్న వేరాయె

నలుగు పిండి రాలిపోయె
వెలుగు లేక మొహం నలిగిపోయె
బ్లీచింగులు పెరిగిపోయె
మేకప్ లేకున్నా అందాలు తరిగిపోయె

నేలమీది భోజనంబు మారిపోయె
బల్లమీదికి ఆహారం చేరిపోయె
మనిషికి వ్యాయామం కరువాయె
అన్యాయంగా శరీరం బరువాయె

దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మర-మనసురోయ్
తిండి తింటే కండ కలదోయ్
కండ కలవాడే జబ్బు మనిషోయ్

బావులు పోయి, పైపులు వచ్చి
నీళ్ళకోసం కళ్ళు కాయలు కాచేలా వేచి
కుళాయిలో నీరు, కళాయిలో నూనె మాదిరి తూచి
కొనుక్కోవడమే దాహానికి మోహం వాచి

ఉమ్మడి కుటుంబాలు కల్తీలేని పాలు
ఎక్కువ సుఖాల పాళ్ళు
వేరింటి కాపురాలు, రెక్కలొచ్చిన పావురాలు
భద్రతకే గురిపెట్టిన తుపాకి గుళ్ళు

వంటగదిలో మడిబట్ట చిరిగి పోయి
వంటిమీద నైలెక్సులు చెలరేగిపోయి
అగ్నికి ఆజ్యం పోసినట్లయి
ప్రమదల ప్రమాదాలు పెరిగాయి

తాజా పళ్ళరసాలు పోయె
మజాల్లాంటివి మజాలాయె
పని ఏమో సువాయె
పర్సు మాత్రం తేలికాయె

☆ ☆ ☆

# దేశభక్తి

ఎక్కడుంది దేశభక్తి
గడచిన చరిత్రపుటల్లో
గోడకున్న చిత్రపటాల్లో
పెద్దల అనుభవాల్లో

వారి అంతరంగ భావాల్లో
అలానాటి పుస్తకాల్లో
అమరవీరుల కాటి అస్తికల్లో
నీతి శతకంలో

ఊరి ఊరిలో
ఉరికి బెదరని ఊపిరిలో
వాడవాడలో
త్యాగధనుల అడుగుజాడల్లో

ఆతరంలో నరనరంలోనే
అంతరించిపోయింది
అంతా కాకున్నా కొంతయినా
మిగిలితే
ఆనందించాల్సిన సంగతి

# మృత్యువు

మనిషితో పాటే మరొక్కటి కూడా పుడుతుంది.
మనిషిని నీడలా వెంటాడు తుంది
సమయం చూసి వేటాడుతుంది
చివరికి ఎవరికి చెప్పకుండా ఎగిరిపోతుంది
అదే మృత్యువు

★ ★ ★

# సాధించు

మానవుడా నీవు సాధించలేనిది
లేదంటూ మురిసిపోకు
సముద్రాన్ని తాగవద్దు
చందురుడిని తాకవద్దు

ఆకాశాన్ని అందుకోకు
ఆకలి మంటలకు ఆర్పబోకు

నేలనంతా ఏకధాటిని ఏలవద్దు
పేదలకు పిడికెడు అన్నం పెట్టవద్దు

కొండలను పిండి చేయబోకు
కోడళ్ళ చావులను అదిరట్టబోకు

వరదలను ఆపవద్దు
దౌర్జన్యాలకు రూపుమాపవద్దు
పోయిన ప్రాణాన్ని తీసికొని రావద్దుగాని
గడచిన క్షణాన్ని ఒక్కటితే చాలుపోని

☆ ☆ ☆

# భరత మాత బాధ

భారత మాత
తన తనయులు

తప్పిపోయారంటూ
తల్లడిల్లి పోతుంది

కన్నీరు మున్నీరుగా
విలపిస్తుంది

గోడు గోడున ఏడుస్తుంది
వాడవాడలా వెతుకుతుంది

నింగిని, నేలను
గాలిని, ధూళిని ఆ

కొండల్ని గుట్టల్ని
సముద్రాల్ని, స్మశానాన్ని,
వేటిని వదలకుండా
వేదనతో వెతుకుతుంది

నాకుమారులా ఎక్కడ
దాగున్నారయ

న్యాయం, ధర్మం, సత్యం, శాంతి
రండి బాబురండి
మీ తల్లిని చూసి పొండి
అంటూ ఆవేదనతో అరుస్తుంది

☆ ☆ ☆

# రాజకీయ నాయకులు

(ద్వితీయ బహుమతి పొందిన కవిత)

ఓట్ల కోసం నోట్లు పట్టుకొని - వాగ్దానాల బరువును మోయలేక

వంగి వంగి నడుస్తూ వస్తున్నారు. రాజకీయ నాయకులు వారు...

ఆకలి మంటలను ఆర్పేస్తారట - ఫైరింజను పెట్టి

"రేప్"లను రూపుమాపుతారట - రేపటి నుండి

నిరుద్యోగాన్ని నిర్మూలిస్తారట - వారి బంధు మిత్రులలో

ఆడదానికి రక్షణ కల్పిస్తారట - పోలీసుల సహకారంలో

అంటరానితనం అరికడతారట - ఊరి చివర యిల్లు కట్టించి

కట్న పిశాచాన్ని కాలరాస్తారట - కొత్త చెప్పులతో

శాంతిని దేశంలో నెలకొల్పుతారట - పావం ఆ అమ్మాయి కోసం వెతుకుతున్నారు

వస్తున్నారు. వస్తున్నారు రాజకీయ నాయకులు అయిదేళ్ళ తదుపరి

అరచేతిలో స్వర్గం చూపిస్తామంటూ -

☆ ☆ ☆

# భారతీయ కుటుంబ వ్యవస్థ

మర్రిచెట్టులా మొదట్లో మనది
ఉమ్మడి కుటుంబం.
ముంగిట్లో మల్లె పొదల్లా స్వతంత్రంగా విడిపోయింది.

పటంలోనున్న దేవుడు మనలో ఓసభ్యుడు
కపటంలేని కష్టపడే పనికుర్రాడు
జనాభా లెక్కల్లో మనింట్లోని వాడుకాడు.

అమ్మ కమ్మగా వండి, దేవతలా ఉండి
కలతలు తప్పిస్తుంది.
అత్తగా మారి, సరికొత్త పాత్రలోచేరి
కలహాలు తెప్పిస్తుంది.

ఆడపిల్ల పెళ్ళితో ఇల్లంతా గుల్ల
అయినా అత్తవారింట్లో సుఖపడడం కల్ల
ఆడబడుచు అర్ధ మొగుడు
ఎప్పుడూ ఏదోసణుగుడు.
ఇల్లు దోచిన అల్లుడు ఎల్లప్పుడూ అథితిదేవుడు.

పెద్దకొడుకుది సవారిబ్రతుకు
చివరివాళ్ళు సిరికోసం వెతుకు
ఒకానొకప్పుడు మనతాతేపెద్ద
ఇప్పుడో రెక్కలు తెగినగెద్ద

ఏది ఏమైనా
మనం పెళ్ళికి యిచ్చేవిలువ
ఒళ్ళంతా విచ్చుకున్న సంతోషపుకలువ
స్త్రీ సహనం పూలవాహనం

చిన్న చిన్న లోపాలు, చిట్టి చిట్టి కోపాలు
కొన్ని కొన్ని ఉన్నా వాటిని, కొట్టి కొట్టి తరుముతున్నాం

కష్టసుఖాల్లోపాలు పంచుకునే తత్వం
మనసంస్కృతికే దివ్యత్వం

కుటుంబవ్యవస్థకు కట్టుబడే గుణం - భారతీయులకు కంచుకోటబలం.

(విజయవాడ భారతీయ సాహిత్య పరిషత్‌వారు నిర్వహించిన ఉగాది కవితల పోటీలో 1994లో రెండవ బహుమతి వచ్చిన కవిత.)

☆ ☆ ☆

# నేనెవర్ని?

నేను మేలిముసుగు తొలగిస్తే చాలు
వేలకొలది విరగబడతారు ప్రజలు
నిర్మానుష్యమైన అన్ని వీధులు
నిమిషంలో పరుచుకుంటాయి నిగనిగలు

నా కౌగిలికోసం నా వాడి వేడిచూపులకోసం
అర్ధనగ్నంగా అందరూ వస్తారు బయటకు పాపం
నేను మాయమయ్యానంటే విచారం
వస్తే మరలా పోతానేమోనని ఆరాటం

ప్రతి కవి కలంలోను నామాటే
ప్రతి గాయకుని గళంలోనూ నా పాటే
ఏ యిద్దరి నోట విన్నా నా మాటే
వాళ్ల పెదవుల మధ్య నాకెప్పుడూ అలవాటే

నన్ను చూసి అందరూ కొడతారు కేరింతలు
నేను వస్తే ప్రకృతికే ఎన్నో పులకింతలు
నేను తొంగిచూస్తే వుండవు చెట్ల కదలికలు
పవనుడి పదనిసలు ఇంతకీ నెనెవర్ని?
ప్రాశ్చాత్యుల 'లవ్లీ' సూర్యుణ్ణి

(క్రిస్మస్‌కి ముందు రోజుల్లో క్రిస్మస్ తాత అన్ని ఊరులకు వెళ్ళి పిల్లలకు బొమ్మలు పంచిపెడతాడు. తారను చూపించి, 'నేను తరువాత యింకా మంచి బొమ్మలు పంపుతాను' అని చెబుతాడు. క్రిస్మస్ తాత పంపినట్లుగా తల్లిదండ్రులే బొమ్మలు కొని శాంతాక్లాజ్ పంపాడని పిల్లలకు ఇస్తూ వుంటారు, ఆ తరువాత.)

★ ★ ★

# మీకు తెలుసా?



మామిడి చెట్టు పూతలో,

కాయలుగా మారే, చిగురులెన్నో?

పట్టువస్త్రాల నేతలో,

నేసిన వాళ్ళ బట్టల చిరుగులెన్నో?

రాజకీయ నాయకుని చేతలో

ప్రజలకు ఉపయోగపడే పథకాలెన్నో?

తాగుడు సీసాల మూతలో,

తెగిన సంసారపు పతనాలెన్నో?

కోయిల కూసే కూతలో

తీయలేని రాగాలు, పాడలేని గీతాలెన్నో?

నుదుటను రాసిన రాతలో

కుదురుగా, నిశ్చింతగా బ్రతికే గీతలెన్నో?

రచయిత(త్రి) రాసే రాతలో

మంచిగా, సంఘానికి పనికివచ్చే కాగితాలెన్నో?

మన దేశపు భారతమాతలో

మనసురగిలే, గుండె పగిలే, కారణాలెన్నో?

☆ ☆ ☆

# మన దేశంలో



మనదేశంలో

ఆకలి మంటలు తీర్చేకంటే

ఆకాశానికి నిచ్చెన వేయచ్చు

కుల తత్వాలను కూలద్రోసేకంటే

గాలిలో మేడలు నిజముగా కట్టవచ్చు

దౌర్జన్యాలను ఆపేకంటే

సూర్య మండలం వెళ్ళచ్చు

దొంగతనాలను రూపూమాపేకంటే

కొండను గోటితో ఎత్తచ్చు

సమానత్వం నెలకొల్పేకంటే

శవానికి ప్రాణం పోయొచ్చు

రేప్‌లను రూపుమాపేకంటే

తుపానులను తుపాకితో ఆపచ్చు

ఉద్యోగాలందరికిచ్చే కంటే

ఉప్పెనకే ఎదురీదచ్చు

వరకట్నపు సమస్య తీర్చేకంటే

రాత్రిని పగలు చేయొచ్చు

శాంతిని దేశంలో నెలకొల్పేకంటే

సూర్యకాంతిని చేతితో సులువుగ ఆపచ్చు

☆ ☆ ☆



రచయిత్రి ప్రముఖుల చేతుల మీదుగా
పొందిన పురస్కారాలు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
విజ్ఞాన భవన్, హైదరాబాదు - 500 001.

తేది : 11-1-2002

గౌరవనీయులైన శ్రీమతి రాధిక గారికి,

నమస్కారాలు.

తెలుగు కథ పుట్టి 90 ఏళ్లు దాటింది. 2001లో మనం కొత్త శతాబ్దిలోకి ప్రవేశించాము. గత శతాబ్దిలో వచ్చిన తెలుగు కథ వెలుగులను ఈ శతాబ్దిలోకి ప్రసరింపచేసుకొనే ఉద్దేశంతో, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ "**విశాలాంధ్ర తెలుగు కథ 1910 - 2000**" పేరుతో 100 కథలతో ఒక బృహత్ సంకలనాన్ని తెస్తున్నది. ఈ కథా సంకలనాన్ని వ్యాపార దృష్టితో కాక కేవలం గత శతాబ్ది తెలుగు కథను వెలుగులోకి తేవాలన్నదే మా ఆకాంక్ష. ఈ కథా సంకలనానికి శ్రీయుతులు కేతు విశ్వనాథరెడ్డి, సింగమనేని నారాయణ, పెనుగొండ లక్ష్మీనారాయణ, సదానంద్ శారద గార్లు సంపాదక బాధ్యతలు వహించారు.

ఈ సంకలనంలోకి మీ కథ "**నలుగురు కలసి నవ్వేవేళ**"ను స్వీకరిస్తున్నామని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము. ఇందుకు మీ అనుమతిని కోరుతున్నాం. ఈ ఉత్తరం అందిన 10 రోజులలోగా మీ అంగీకారం తెలుపగోర్తాము. మీ అనుమతి మాకు 10 రోజుల్లోగా అందనిచో మీ మౌనాన్ని కూడా అంగీకారంగానే భావిస్తాము.

మీరు మీ అనుమతి లేఖతోపాటు, ఈ సంకలనంలోకి స్వీకరించిన మీ పై కథ ప్రచురణ సంవత్సరాన్నీ, పత్రిక పేరును దయచేసి తెలియచేయండి. మీ సాహిత్య వ్యక్తిగత విశేషాలను (బయోడేటా) 10 వాక్యాలు మించకుండా రాసి పంపండి.

పుస్తకం వెలువడగానే గౌరవ పురస్కారంగా మీకు కాంప్లిమెంటరీ కాపీని పంపగలమని, ఇంతకు మించి నగదు రూపేణా రాయల్టీ ఏమీ చెల్లించలేమని మనవి చేస్తున్నాము. మీరు పై కథా సంకలనానికి మీ పూర్ణ సహకారాన్ని అందించి మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ...

అభినందనలతో,

(పి. రాజేశ్వరరావు)
మేనేజరు.

To

SMT. RADHIKA,
C/o DR. G. V. RAJENDRA PRASAD,
70-3-33, VIDYA NAGAR,
RAMANAYYA PETA,
KAKINADA.